# తత్త్వ సూక్తి సాహస్రి

శ్రీ ప్రత్యానందస్వామి ప్రణీతము

44/132



# అభ్యర్థన

మా నాన్నగారు వ్రాసిన అశేష గ్రంథాలలో "ఋగ్వేద-దిగ్దర్శనము" ప్రథమ భాగము ప్రతులు ఇప్పుడు లభ్యము కావడం లేదు. 2వ భాగము, 3వ భాగము ప్రతులు ఇప్పుడు లభ్యమగుచున్ననూ, ప్రథమ భాగము లభ్యము కాకపోతే అది అసంపూర్తిగానే ఉంటుంది. అందు వల్ల ప్రథమ భాగాన్ని పునర్ముద్రించవలసిన అవసరము ఎంతేని ఉన్నది.

అలాగే 1995లో ప్రచురించబడిన శ్రీ ఆచార్యుల వారి చివరి గ్రంథము "విశ్వకర్మ విశ్వరూపము" ప్రతులు కూడా ఇప్పుడు లభ్యము కావటం లేదు. కనుక వదాన్యులు, తాత్త్విక చింతనాపరులు, ఆర్థిక సహాయము అందిస్తే మరలా ఆ గ్రంథాలు పునర్ముద్రించటానికి అవకాశముంటుంది. భావితరాలకు ఉపయోగపడే ఈ గ్రంథాల పునర్ముద్రణకు ఆచార్యులవారి అభిమానులు గాని, వదాన్యులు గాని ఆర్థికంగా చేయూత నివ్వవలసినదిగా అభ్యర్థిస్తున్నాను.

హైదరాబాదు
7-3-1996

ఆనందవర్ధన
(జర్నలిస్టు)

శ్రీ వీరరాఘవ వ్యాఖ్యావః :

# తత్త్వ సూక్తి సాహస్రి


## శ్రీ ప్రత్యానంద స్వామి

దర్శనాచార్య, కళాప్రపూర్ణ

(డా॥ కొండూరు వీరరాఘవాచార్య)

ప్రణీతము.



ప్రకాశకులు :

**అత్తలూరి నాగభూషణమ్**

రిటైర్డ్ స్పెషల్‌గ్రేడ్ డిప్యూటీ కలెక్టరు,

తెనాలి - 522 201.





This book is published
with the financial assistance of
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS
under the scheme
"Aid to publish Religious Books".

మూల్యము : రు. 45.00

ప్రాప్తి స్థానము :
శ్రీ అత్తలూరి నాగభూషణమ్
1-27-68 టంకసాలవారి వీధి,
నాజరుపేట,
తెనాలి - 522 201.

ప్రథమ ముద్రణ
ధాతృ వసంతము
మార్చి, 1996

ప్రతులు : 1,000

ముద్రణ :
వాణీ ఆర్ట్ ప్రింటర్స్, షరాఫ్‌బజారు, తెనాలి.

# ముగ్గురు పుణ్యాత్ములు

మా నాన్న (ప్రజ్ఞానంద) గారి విరచితమైన "తత్త్వ సూక్తి సాహస్రి" అనే గ్రంథం వెలువడటానికి ముగ్గురు పుణ్యాత్ములు కారణం. ఒకరు చిరకాలంగా ఆధ్యాత్మిక సాధనలను, భగవద్గీతా ప్రవచనమును చేస్తూ, 'భగవద్గీతా మామ్మ' గారని ప్రసిద్ధి పొందిన జ్ఞాన వృద్ధయే కాక, వయో వృద్ధ (70) కూడా అయిన పెదపులివర్రు వాస్తవ్యురాలు (ప్రస్తుతము తెనాలి నివాసము) సాధ్వి అయిన శ్రీమతి గ్రాప భ్రమరాంబగారు. ఈమె

"తారకంబు మనః శుద్ధి కారకంబు
సాంఖ్యమాత్మ స్వరూప విచారంబు
అనుభవజ్ఞాన మమనస్కము"

అనే మాట ప్రకారము సాంఖ్య, తారక యోగములను కొంతవఱకు నేర్చి, అమనస్కయోగ సాధనాభిలాషతో దాదాపు 10, 11 సంవత్సరముల నాడు తెనాలి వచ్చి గురూపసదనం చేసినారు. ఆమె యోగ్యతను బట్టి సాంఖ్య, తారక, అమనస్క బోధవలనూ, వాటికి తగిన సాధనను ప్రారంభించడమైనది. ఆమె నెలకొక్కసారి అయినా తెనాలి వచ్చి రెండు రోజులుండి, శ్రవణం చేస్తూ, సాధన కూడా కొనసాగిస్తూ ఉండేవారు. ఈ సూక్తులలో అనేకం ఆమె నుద్దేశించి, ఆమె ప్రశ్నలకు సమాధానాలుగా వెలువడి నట్టివే.

ఇక రెండవ వారు తెనాలి వాస్తవ్యులు, రిటైర్డ్ తహశీల్దారూ అయిన బ్రహ్మశ్రీ గోసూరి వేంకట సుబ్బారావుగారు. మా నాన్నగారి తాత్త్విక జీవితంలో ఆ యా గ్రంథాలు చదివేటప్పుడు, ఆ యా సాధనలు చేసే టప్పుడు, ఆ యా భూములను మెట్టేటప్పుడు తోచిన వివిధ భావాలను వెంటనే వారి దినచర్యా గ్రంథము (Diary) లలో వ్రాసుకొనేవారు. ఇలా వ్రాసుకొనిన వ్రాటిని బ్రహ్మజిజ్ఞాసువులైన శ్రీ గోసూరి వేంకట సుబ్బారావుగారు ఒకప్పుడు గమనించారు. వారు వీటి విలువను గుర్తించి వీటిని ఒక గ్రంథంగా ముద్రిస్తే బాగుంటుందని సూచించినారు. వారి సంకల్పము మా నాన్నగారికి నచ్చినందువల్ల మరికొన్ని సూక్తులను కూడా కలిపి చెప్పారు. ఈ సూక్తులు గ్రంథ రూపం దాల్చాలనేది వారి సంకల్పము. కాబట్టి వారినే మొదటి గ్రంథానికి ప్రకాశకులుగా ఉండమని మా నాన్న గారు కోరారు. అందువల్ల శ్రీ సుబ్బారావుగారే తత్త్వ సూక్తులు మొదటి భాగానికి ప్రకాశకులుగా ఉన్నారు. ఈ విధంగా "తత్త్వ సూక్తులు" మొదటి భాగం వెలుగులోనికి రావటానికి కారకులయ్యారు.

అంతేకాదు "తత్త్వ సూక్తులు" రెండవ భాగం కూడా మా నాన్నగారు చెప్పుతుంటే శ్రీ సుబ్బారావు గారు వ్రాసినట్టివే. రెండవ భాగమును శ్రీ సర్వేశ్వరానంద స్వామి (తెనాలి)వారు 1987 సం॥లో అచ్చు వేయించి ప్రచురించారు.

ఇక తత్త్వ సూక్తులలో చివరిది మూడవది అయిన ఈ "తత్త్వ సూక్తి సాహస్రి" గ్రంథాన్ని కూడా, మా నాన్నగారు చెప్పుతుంటే శ్రీ సుబ్బారావుగారే చక్కగా వాటి నన్నింటినీ సాపు వ్రాసినారు. ఇందులో కొన్ని సూక్తులు శ్రీ సుబ్బారావుగారి నుద్దేశించి, వారి ప్రశ్నలకు సమాధానాలుగా వ్రాసినట్టివేనని మానాన్నగారు అంటుండేవారు. ఈవిధంగా యీ మూడవ సంపుటం వెలువడటానికి కూడా శ్రీ సుబ్బారావుగారు ముఖ్యకారకులలో ఒకరైనారు.

ఇక మూడవ వారు తెనాలి వాస్తవ్యులు, 40 సం॥లు ప్రభుత్వోద్యోగం చేసి స్పెషల్ గ్రేడ్ డిప్యూటి కలెక్టరుగా పదవీ విరమణ చేసిన శ్రీ అత్తలూరి నాగభూషణంగారు. ఒకప్రక్క ప్రభుత్వోద్యోగం చేస్తూ, ప్రవృత్తిగా చిన్నతనం నుండి సంగీత, సాహిత్యాలను స్వయంకృషితో కొనసాగిస్తున్న ఔత్సాహికుడీయన. బ్రహ్మంగారంటే భక్తి తాత్పర్యాలు వీరి తల్లిదండ్రుల కాలం నుండే ఉండేవన్న విషయం మా నాన్నగారికి బాగా తెలుసు. వీరు శ్రీ వీరబ్రహ్మ చరిత్రము (బుఱ్ఱకథ), అధ్యాత్మ ఈశ్వరీదేవి చరిత్రము, చరితార్థుడు (సిద్ధుని జీవిత చరిత్ర పద్యకావ్యము) చరితార్థుడనే మఱొకటి ఏకాంకిక మొదలైన పుస్తకాలు వ్రాశారు ఇందులో చరితార్థుడు అనే గ్రంథాలను, మా నాన్నగారి చేత వ్రాయబడిన 'సిద్ధ చరిత్ర' అనే గ్రంథాన్ని పలుమార్లు

పఠించి, రచించినట్లుగా శ్రీ నాగభూషణంగారు చెప్పారని మా నాన్నగారంటుండేవారు. అంతే కాకుండ మా నాన్న గారి విరచితమైన 'శ్రీ వీరబ్రహ్మ (సంస్కృత) సుప్రభాతమ్' స్వయంగా గానం చేసి కాసెట్ రూపంలో వెలువరించారు. వీరికి మా నాన్నగారంటే ఎనలేని అభిమానము. భక్తి, గురు భావము. ఆ దృష్టితో ఎంతో శ్రమించి, ఖర్చుకు కూడ వెనుకాడకుండ మా నాన్నగారిపై మూడు గంటల పాటు సాగే డాక్యుమెంటరీని కూడా నిర్మించారు. అనారోగ్యంతో బాధపడుతున్న మా నాన్నగారు కోరినదే తడవుగా ఈ "తత్త్వ సూక్తి సాహస్రి" గ్రంథ ముద్రణ ప్రచురణ భారాలను స్వీకరించి కృతకృత్యులైన సహృదయులు శ్రీ నాగభూషణంగారు.

మా నాన్నగారు జీవించి యుండగనే ఈ పుస్తక ముద్రణ ప్రారంభమైనది. కాని దీనికి ముందుగా ప్రారంభమైన "విశ్వకర్మ విశ్వరూపము" అనే గ్రంథము ముందుగా ముద్రణ కావాలని మా నాన్నగారు కోరినందువలన, ఆ పుస్తకాన్ని ఆయన జీవితకాలంలోనే శ్రీ కోసూరి వేంకట సుబ్బారావుగారు ముద్రింపించి ప్రచురించారు. నాన్నగారు 1995 జనవరి 19న తనువు చాలించటానికి రెండు రోజులు ముందుగా ముద్రణ పూర్తిఅయిన "విశ్వకర్మ విశ్వరూపము" అనే గ్రంథ రూపాన్ని చూచుకొని ఆనందభరితులైనారు. ఒక అపూర్వ పరిశోధన గ్రంథంగా ప్రశంస లందు

కొన్న ఆ గ్రంథం శ్రీ ఉబ్బారావుగారి కృషివల్ల నాన్నగారి జీవిత కాలంలోనే వెలువడి ఆయనకు ఆత్మ సంతృప్తి కలిగించింది. ఇక "తత్త్వ సూక్తి సాహస్రి" ఇప్పుడు శ్రీ నాగభూషణంగారి కృషి, పట్టుదల వల్ల వెలుగు చూస్తున్నది. ఈ గ్రంథావతరణం గురించి మా నాన్నగారే వ్రాయటం తటస్థించి ఉంటే, ఎన్నో విషయాలు వ్రాసి యుండేవారు. విధి బలవత్తరమైనది కదా! అందువలన నాకు తెలిసిన కొన్ని విషయాలు మాత్రమే ఇందులో ఉటంకించాను.

ఈ తత్త్వసూక్తులు మా నాన్నగారి అతీత పూర్ణ సాధనలో వారి బుద్ధికి తట్టినవి ఇందులో కొన్ని ఉన్నాయి. అవి అతి రహస్యములు. ఏ తాత్త్విక విషయాలైనా ఒకరికి తోచినది మరొకరికి తోచవనడానికి వీలు లేదు. చింతన చేసేవారికే ఇలాంటివి అసంఖ్యాకంగా తోచే వీలున్నది. అందుకే మా నాన్నగారు మిత్ర సాహస్రిలో

పూర్వ కవులు చెప్పనేర్వని క్రొంగ్రొత్త
పలుకు వాడనంచు ప్రతిన బూన,
వ్రాత లెడద నరుగ ఫలియించె నీకృతి......

అనడమైనది. తనుక పాత్రను జీర్ణింపచేసుకొని, క్రొత్తని మననం చేసినందువల్లనే ఈ సూక్తులు వెలువడటానికి కారణం. "భావ మొక్కటైన పలుకు తీరులు పెక్కులు" అనే సంగతిని కూడా మరువరాదు.

ఈ శ్లోకములుగాని, మిత్రసాహస్రి పద్యాలు గాని, ఆత్మ దర్శనాదులు కానీ లోకానికి తత్త్వబోధ పెట్టాలని వ్రాసినవి కావని, కుటి ఆత్మసిద్ధి కోసమే వ్రాసావని, మా నాన్నగారు తరచుగా అంటూ ఉండేవారు. అందుకే

బ్రతుకు పండి సిద్ధి ప్రాపించునని బుద్ధి
దలచి, తలపులిట్లు పలుకుచుంటి,
ఉపకరించెనేని, ఒరులకున్ మేలగు

అని అన్నారు మా నాన్నగారు. ఈ రచనా వ్యాసంగమంతా ఆత్మ సాక్షాత్కారం కోసమేనని మా నాన్నగారి భావన. అయినా ఇతరులు కూడా ఉపయోగించుకొని కృతకృత్యులయితే ఎంతో సంతోషించేవారు మా నాన్నగారు.

ఈ "తత్త్వ సూక్తి సాహస్రి" వెలువడటానికి కారణభూతులైన ముప్పురు పుణ్యాత్ములకు, మా నాన్నగారి తత్త్వ సూక్తులపై హిత వచనము పలికిన మా నాన్నగారికి సాత్త్విక మిత్రులైన 'హితశ్రీ' గారికి నా వినయపూర్వక నమస్సులు. వారికి, తక్కినవారికి అక్షయ ఆత్మానంద శాంతులు చేకూరాలని ఆకాంక్షించే చరాచర శ్రేయః కాంక్షి శ్రీ ప్రజ్ఞానంద పుత్రుడు

హైదరాబాద్
7-3-1996

— ఆనందవర్ధన
(జర్నలిస్ట్)

# ప్రకాశకుల విజ్ఞప్తి

దర్శనాచార్య, కళాప్రపూర్ణ డా॥ కొండూరు వీర రాఘవాచార్యులు గారు సంస్కృతాంధ్ర సాహిత్య వినీలా కాశంలో ధ్రువతారగా వెలుగొందుచున్న మహామనీషి. ఆయన ఒక్క సాహిత్యంలోనే కాదు; శిల్పం, యోగం, తాత్త్వికం, వేదం మొదలైన శాస్త్రాలను కూడా ద్రష్టగా పరిశీలించి, నిర్విరామ కృషితో సాగర మథనాన్ని గావించి, దర్శనాలను రచించిన ఋషి పుంగవుడు. ఇతఃపూర్వము వెలువరింపబడిన శాస్త్ర భావాలకు విస్తృతీకరణయే కాక, ఇంతవరకు వెలువరింపబడని నూత్న విషయాలనేకం పుంఖాను పుంఖాలుగా, శాస్త్ర సమ్మతంగా ప్రవచించిన మహానుభావుడు.

తన చివరి దశాబ్దంలో వేదాలకు విలువైన భాష్యాలు వ్రాయుటమే కాకుండ, విశ్వకర్మ విశ్వరూపము అనే విశిష్ట గ్రంథాన్ని నభూతో న భవిష్యతి అనునట్లుగా రచించారు. డా॥ ధూళిపాళ అర్కసోమయాజి, భాగవతుల కుటుంబ రావు, డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, సాహిత్య బ్రహ్మ డా॥ వి. వి యల్. నరసింహారావు, డా॥ అమరేంద్ర, డా॥ శోభిరాల సత్యనారాయణ మొదలగు పండిత ప్రకాం డులు వారి రచనలను సమీక్షించి, ప్రశంసా వర్షాన్ని కురి పించారు. అంతే కాదు. హింది, ఆంగ్ల భాషలనే కాకుండ, సంస్కృత సాహిత్యాన్ని పుక్కిట పట్టిన నేటి భారత రిపబ్లిక్ అధ్యక్షుడు అయిన శ్రీ శంకర్‌దయాళ్ శర్మగారు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గవర్నరుగా ఉన్నప్పుడు (ది. 4-8-1985) న హైదరాబాద్ రాజభవన్‌లో డా॥ ఆచార్యుల వారి ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగాన్ని ఆవిష్కరించటమే కాకుండ, రచయిత కృషిని బహుధా శ్లాఘించారు.

సాహిత్యంలో శ్రీ రాఘవాచారిగారు త్రొక్కని ప్రక్రియ అంటూ లేదు. ఖండ కావ్యాలు, సమీక్షా వ్యాసాలు, నవలలు, నాటికలు, నాటకాలు, దర్శనాలు, దిగ్దర్శనాలు మొదలగునవి ఎన్నెన్నో ఆయన రచించిన వాటిలో వున్నవి. ఆయన రచించిన పుస్తకాలను విశ్వవిద్యాలయాలు పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించడం ఒక విశేష మైతే, ఆయన 'లేపాక్షి' నవల కన్నడ భాషలోనూ అనువదింపబడి, ఆ భాషా ప్రపంచంలో కూడా విశేష ప్రాచుర్యాన్ని, ప్రశంసలనూ పొందటం మరొక ప్రత్యేకత. ఈ విధంగా శిల్ప, సాహిత్య, సాంఘిక, తాత్త్విక, వేద, వేదాంత విషయాలలో విశేషానుభవం సంపాదించి, విశిష్ట మైన సాహిత్యాన్ని భారతీయుల కందించిన శ్రీ వీర రాఘవాచార్యులుగారు ఒక కారణ జన్ముడంటే అతిశయోక్తి కాదనుకుంటాను. ఎవ్వరికీ అభ్యంతరం కూడ ఉండదనుకుంటాను.

మరొక విషయం. సాధారణంగా విద్వత్తు అనేది అనువంశికంగా రావటం కూడ అరుదుగానే చూసుంటాము.

శ్రీ రాఘవాచారిగారి సంతానంలో ఇద్దరు కుమార్తెలు ఆంధ్ర భాషోపన్యాసకులు కాగా, కుమారుడు శ్రీ ఆనంద వర్ధన్ ప్రఖ్యాత జర్నలిస్టు. మిగిలిన సంతతి కూడా తండ్రి గారి వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని అంతో ఇంతో కృషి చేసినవారే. ఇది వారి పూర్వపుణ్య విశేష మనక తప్పదు.

ఇక ప్రకృతానికి వస్తే, ఇంతకుముందే శ్రీ ఆచార్యుల వారు 'తత్త్వ సూక్తులు' రెండు భాగాలుగా ప్రచురించారు. అందులో మొదటి భాగానికి శ్రీ కోసూరి వెంకట సుబ్బా రావుగారు (Retd. Tahasildar) ప్రకాశకులు కాగా, రెండవ భాగాన్ని శ్రీ సర్వేశ్వరానంద స్వామివారు ప్రచురించారు. అంతేకాకుండా ఆ రెండు భాగాలకు ప్రఖ్యాత రచయితలు, విమర్శకులు అయిన 'హితశ్రీ' గారు రచయిత కృషిని అభి నందిస్తూ, తత్త్వసూక్తి సారాన్ని అమృత బిందువులని వర్ణిస్తూ తమ యభిప్రాయాన్ని వెలువరించారు.

ఈ మూడవ భాగము 'తత్త్వ సూక్తి సాహస్రి' అనే పేరుతో వెలువడడానికి శ్రీ ఆనందవర్ధన్ గారు తెలిపినట్లుగా శ్రీ కోసూరి వేంకట సుబ్బారావుగారు, శ్రీమతి ప్రాప భ్రమరాంబగారు ముఖ్యులు. ఏ కారణం వల్లనైతేనేమీ ఈ పుస్తకాన్ని ప్రచురించే అవకాశం నాకు సంక్రమించటం ఎంతో భాగ్యంగా నేను భావిస్తున్నాను. నా ఉద్యోగ

ప్రవేశ విషయంలో సహాయపడిన శ్రీ రాఘవాచారిగారు, సాహిత్య సముపార్జనలో నాకు గురుతుల్యులు. వారి సిద్ధయ్య చరిత్రను ఎన్నోసార్లు పఠించి దాని ఆధారంగా నేను చరితార్థుడు అనే చిన్న పద్య కావ్యాన్ని, చరితార్థుడు అనే ఏకాంకికను రచించడమే కాకుండ, వారి శ్రీ వీరబ్రహ్మ సంస్కృత సుప్రభాతాన్ని గానం చేసి క్యాసెట్ రూపంలో వెలువరించే భాగ్యం నాకు కలిగింది. వారి ఋణాన్ని ఈ విధంగానైన తీర్చుకుంటున్నాననే సంతృప్తి నాకు మిగిలి పోయింది. ఈ సదవకాశాన్ని నాకు కలిగించిన శ్రీ ప్రశాన్నానంద గారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

ఈ పుస్తక ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి, ప్రత్యేకంగా ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ ఎన్. రమేష్‌కుమార్, I. A. S. గారికి కృతజ్ఞతాపూర్వక వందనాలను సమర్పించుచున్నాను. ఈ పుస్తకాన్ని చక్కగా ముద్రించిన వాణీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ టి. శివ శంకరరావుగారికి నమస్కృతులర్పిస్తూ, ముద్రణలోని స్ఖాలిత్యాలను సరిదిద్దే కార్యక్రమంలో తోడ్పడిన చి॥ కోసూరి శివకుమార్‌ను ఎల్లప్పుడూ కాపాడాలని పరమేశ్వరుని ప్రార్థించుతూ సెలవు తీసుకుంటాను.

— ప్రకాశకులు

# సుందర కమలం

(తత్వ సూక్తుల మొదటి భాగముపై హితశ్రీ గారి అభిప్రాయము)

భగవంతుడికో రూపం కల్పించి, ఆ సాకార ఈశ్వరుడిని అనేక మార్గాలలో సేవించవచ్చు. ఇది సగుణోపాసన. అలా కాక నిర్గుణ నిరాకార పరమాత్మని భావన చేసి ఆత్మోపాసన ద్వారా తదనుభూతి పొందవచ్చు. ఇది నిర్గుణ బ్రహ్మోపాసన. ఇది జ్ఞానులకే సాధ్యం.

అశబ్దం, అస్పర్శం, అరూపం, అవ్యయం అయిన భగవత్ తత్వాన్ని సాక్షాత్కరింప చేసుకోవటమే జ్ఞానసిద్ధి. అందుకే మానవుడి మహాప్రస్థానం. శిల్ప సాహిత్యాలు జీవగర్రలై, ఔపనిషదవనాలు విహారవీధులుకాగా, చరాచరాత్మక జగద్ధితం కోసం అచంచలంగా, నిర్విరామంగా, నిరంతరంగా తత్వజ్ఞాన యాత్రలో దూసుకుపోతున్నవారు దర్శనాచార్య, కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారు.

అన్ని సంశయాలు నశించటానికి తత్వజ్ఞానం ఒక్కటే సరైన సాధనం. నేడు విజ్ఞానశాస్త్రం అనేక సత్యాలను తెలుపుతోంది. ఈ విజ్ఞానానికి ఆత్మజ్ఞానం తోడైనప్పుడే విశ్వమానవ కల్యాణం జరుగుతోందని ఆచార్యులుగారి విశ్వాసం. అది నిజంకూడా. కేవలమైన జ్ఞానాభివృద్ధి ఎలాంటి పరిణామాలకి దారులు తీస్తోందో తెలిసిందే.

జగద్భ్రాంతుల్ని అణచివేసే తత్వజ్ఞానాన్ని వెదజల్లటానికే శ్రీ ఆచార్యులుగారు అవిరళ కృషితో అనేక ఉద్గ్రం

థాల్ని రచించారు. దర్శనాల్లో, ఇతర శాస్త్రాల్లో ఆచా ర్యులు గారికి గల కూలంకష పాండిత్యంతో జోడై, వారి తత్త్వానుభూతి ఈ రచనలకి గొప్ప విలువ నిస్తోంది. తాత్త్విక ప్రపంచం లోని కొన్ని విషయాల్ని మాత్రమే ఎవరైనా బయటికి చెప్పగలరు. వాక్కుకి సరిగా అందని తత్త్వరహ స్యాన్ని అనుభూతి ద్వారానే తెలుసుకోవాలి. ప్రజలకి ఇలాంటి అనుభూతి కలగటానికి తోడ్పడాలనే గాఢమైన తహతహ ఆచార్యులుగారి రచనలలో ప్రస్ఫుటమై వాటికి అనిర్వచనీయమైన శోభను కలిగిస్తుంది.

"తత్త్వసూక్తులు" గ్రంథం ఒక విశిష్టమైన, అపూర్వ మైన ప్రయోగం. ఎన్నో తత్త్వవిషయాల్ని ఇందులో చిన్న చిన్న పేరాలలో క్లుప్తంగా, ఆకర్షణీయంగా వివరించటం జరిగింది. సత్తు, చిత్తు, బ్రహ్మ, ఆత్మ, జీవాత్మ, మనస్సు, జగత్తు, బంధం, మాయ, మోక్షం. ఇలాంటి భావనలు మనందరికీ చిరపరిచితమైనవే. అయితే వీటిని గురించి వ్యాసాలు గాని, పుస్తకాలుగాని రాస్తే అవి చదవటం, అర్థం చేసుకోవటం అందరికీ సాధ్యమయే పనులు కావు. అందువల్ల ఆచార్యులుగారు వీటన్నిటిని గురించీ ఒక క్రమంలో కాకుండా, తోచినట్టుగా రాశారు పుస్తకంలో ఏ పేజీ నించైనా చదవవచ్చు. ఏ పేరా అయినా చదవవచ్చు. ఒకటి చదివితేనేగాని రెండోది అర్థంకాదనే అనుమానం అక్కర్లేదు. గుర్తులు పెట్టుకోనవసరం లేదు. ఈ పద్ధతివల్ల పాఠకుడికి, ఏ మాత్రం విసుగు లేకుండా, పుస్తకం పూర్తయ్యేసరికి తత్త్వజ్ఞాన

విషయాలన్నీ సుబోధ మవుతాయి. ఇందులో వివరించిన తత్త్వానుభూతి పొందటానికి, సాధన ప్రారంభించాలనే గట్టి కోరిక కలుగుతుంది.

ఆచార్యులుగారి క్లుప్తీకరణ అసాధారణమైంది. ఉదాహరణకి, పేరా 110లో అద్వైత సిద్ధాంతానికి మూలకందమైన మాండూక్యోపనిషత్తులోని భావాల్ని అన్నిటిని కేవలం నాలుగు వాక్యాలలో ప్రతిభావంతంగా క్లుప్తీకరించారు. 'నీవు' అనే భావనని గురించి 198వ పేరాలో రాస్తూ వేదాంత సారాన్నంతా రెండు పేజీల్లో కుదించారు. ఇలా ఎన్నో భావనల్ని పాఠకులు త్వరగా, తేలిగ్గా, క్లుప్తంగా తెలుసుకొనటానికి ఆచార్యులుగారు చేసిన కృషి అనన్యసామాన్యం. ఇందుకు వారికి తెలుగువారి కృతజ్ఞతాభివందనాలు.

ఆచార్యులుగారు భారత సంస్కృతి మూర్తీభవించినవారు కనుక, వారిది కవి హృదయం కనుక ఈ పుస్తకంలో 'కమలం' గురించి ఉత్తేజితంగా ప్రస్తావించారు. అవును. భారతీయ సంస్కృతిలో ఉత్తమ వస్తువులు కమలాలతో పోల్చబడ్డాయి. తత్త్వ సరోవరంలో కొత్త అందాలతో విరిసిన కమలం ఈ పుస్తకం.

సుందరమైన ఈ కమలం తెలుగు ప్రజల మనస్సుల్ని సహస్రదళ పద్మంవైపు మళ్ళించగలదని నానమ్మకం. ప్రజల్లో తత్త్వజ్ఞానం వ్యాపింపజేసే ఇలాంటి మంచిరచన చేసినందుకు ఆచార్యులవారికి నా అభినందనపూర్వక నమస్కారాలు.

తెనాలి
25-5-1985

— హితశ్రీ

# హిత వచనం

(తత్త్వ సూక్తులు రెండవ భాగముపై హితశ్రీ గారి అభిప్రాయము)

ఇదివరలో "ప్రజ్ఞానంద" గారి "తత్త్వ సూక్తులు" మొదటి భాగం వెలువడి విశేష ప్రాచుర్యం పొందింది. విజ్ఞుల ప్రశంసలను అందుకొంది. అశేష సాధకులకు జ్ఞాన జ్యోతిని వెలిగిస్తున్నది. ఇది రెండవ భాగం.

ఈ తత్త్వజ్ఞానం ఒక వజ్ర వైఢూర్యాల గని. తవ్విన కొద్దీ మణిదీపాలవంటి అమూల్యమైన తాత్త్విక సత్యాలెన్నో దివ్యదీప్తులతో దర్శన మిస్తాయి. అలాంటి తాత్త్విక సత్యాల్నీ, భావనల్నీ, తోచినవి తోచినట్టుగా, క్లుప్తంగా, తళుక్కుని భావం మెరిసేట్టుగా ప్రోదిచేసిన ఉద్గ్రంథం "తత్త్వ సూక్తులు".

ఈ సూక్తులలోని భావనలు చాలా పూర్వపరిచితాలే అయినా, వాటిని ప్రదర్శించిన తీరు, వ్యాఖ్యానంలోని విశాల దృక్పథం, ప్రవచనంలోని అనుభూతిపరమైన అధికారం ఈ పుస్తకానికి గొప్ప విలువను చేకూర్చుతున్నాయి.

ఆచార్యులుగారు ఈ సూక్తులలో అతీత మార్గ సాధనా విధానాలను ఎన్నింటినో సూచించారు. ఇవన్నీ అమనస్క యోగానికి చేర్చే త్రోవలే. ఇవి కేవలం గ్రంథస్థ విషయాలు కావు. వీటిలో ఆచార్యులుగారి తాత్త్విక, దార్శనిక, ఆధ్యాత్మిక విశిష్ట వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది.

1983లో భార్యావియోగానంతరం ఆచార్యులుగారు సంన్యసించదలచికూడ బాహ్యసంన్యాసంకంటె మన

స్సన్యాసమే క్రియాశీల జీవితానికి తగినదిగా భావించి, మహాసన్యాసిగానే ఉండి, అతీత ఆధ్యాత్మిక సాధనలను తీవ్రంగా చేస్తూ, ఆధ్యాత్మిక గ్రంథ రచనలతోనే కాలక్షేపం చేస్తున్నారు. ఈ దశలో వారు "ప్రజ్ఞానంద" నామం స్వీకరించారు. రెండు దశాబ్దాలుగా సాగుతున్న ఋగ్వేద పరిశోధనా ఫలితంగా 1984లో ఆచార్యులుగారు ఋగ్వేద దిగ్దర్శనిని ప్రకటించారు. ఈ పుస్తకాన్ని అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్- ప్రస్తుత భారత ఉప రాష్ట్రపతి డాక్టర్ శంకర్ దయాల్ శర్మ ఆవిష్కరిస్తూ ఆచార్యులుగారి కృషిని ఎంతగానో ప్రశంసించారు. కేంద్రప్రభుత్వ మానవ వనరుల అభివృద్ధి శాఖవారు ఆ గ్రంథాన్ని పరిగణించి ఆచార్యుల వారికి "నేషనల్ కల్చరల్ ఫెలోషిప్" అవార్డు ప్రకటించి, వారిని ఋగ్వేద పరిశోధన కొనసాగించ మన్నారు.

ఋగ్వేదంలోని మంత్రాలలో కుండలినీ యోగం ఉందనేది ఆచార్యులవారు ప్రతిపాదించిన కొత్త సిద్ధాంతం. ఇది పండితుల దృష్టిని విశేషంగా ఆకర్షించింది. ఢిల్లీలోని విశ్వాత్మ అనే హిందీ మాసపత్రిక వీరి కుండలినీ యోగ వ్యాసాల్ని ప్రకటించి తన హర్షాన్ని వెలిబుచ్చింది. ఋగ్వేదంలోని కొన్ని ఇతర మంత్రాలకి కూడా వీరు విశేషార్థాలున్నాయంటున్నారు. ఈ కృషి అంతా వేద విజ్ఞానానికి "ప్రజ్ఞానంద" గారు సమకూర్చే కొత్త మెరుగులు అనవచ్చు.

ఈ నేపథ్యం ప్రజ్ఞానందగారి తత్త్వసూక్తులకి విశేష ప్రాధాన్యత కల్పిస్తున్నది. అందువల్ల అతీత భూమికల్లో విహరించదలచే సాధకులకి ఇది ఎంతో ఉపయుక్తమైంది.

అతీత ఆధ్యాత్మిక సాధన మార్గాల్లో ఆచార్యులుగారు ఎన్నో ఉజ్జ్వల కాంతి కిరణాలు ప్రసరింప చేస్తారు.

ముఖ్యంగా మా(త్ర)సిద్ధి అంటే ఏమిటో, మొదటి చెరుల, విష్ణ: యోగంలో పూర్ణ బుద్ధి, ఏలా అతీతమూర్తగ్గానికి చెందిన బోధ భావన, అనుభూతి అవుతుందో ఆచార్యులుగారు సాధికారంగా ప్రతిభాపూర్వకంగా వ్రాసిన వ్యాఖ్యలు అందరూ మననం చేసుకోదగ్గవి.

అయితే ఆచార్యులుగారు ఈ పుస్తకాన్ని కేవలం గంభీర విషయాలతోనే నింపలేదు. అక్కడక్కడ చమత్కారాలు కూడా తొట్లుతూ మందహాసాలు కలిగిస్తాయి.

ఒకచోట ఆచార్యులుగారు వ్రాస్తారు-

ఒకాయన 'దేవుడు లేడూ' అన్నాడు. వెంటనే ఇంకొకాయన 'దేవుడు ఎక్కడికి పోయినాడు? ఎక్కడికీ పోవటానికి వీల్లేదు. ఆయన లేకుండా అసలు ఖాళీ లేనే లేదే!' అన్నాడు. అంటే దేవుడు అంతటా నిండి ఉన్నాడన్న మాట!

ఇంకోచోట 'ధనరాశులను సంపాదించి దాచిపెట్టుకొన్నవాడు ధనవంతుడు కాడు' అన్నారు ఆచార్యులగారు. వినియోగం కాని ధనం అతనిని ధనవంతుణ్ణి చేయదు అన్న మాట.

గంభీరమైన శాస్త్రీయ విజ్ఞానంతో చమత్కారాలతో కూడా విలసిల్లే ఈ పుస్తకం ప్రజల్లో తత్త్వభావనలు రేకెత్తించి, తత్త్వచింతనకి దోహదమిచ్చి, సమైక్యదృష్టి కలిగించటానికి ఎంతగానో తోడ్పడుతుందని నా నమ్మకం.

తెలుగు ప్రజలకి నిర్విరామంగా శాస్త్రీయ, ఆధ్యాత్మిక రచనల ద్వారా ఎంతో సేవ చేస్తున్న ఆచార్యులవారికి అభినందనలు సమర్పిస్తున్నాను. వారి సేవలను జిజ్ఞాసులోకం ఉపయోగించుకుంటుందని నమ్ముతున్నాను.

# తత్త్వ సూక్తి సాహస్రి

1

నీవు నీ స్వరూపంతో ఉండటమే "ముక్తి" అంటే. నీ స్వరూపము నుండి జారిపోయి నిమ్న మనస్సుగాను, ఆ మనస్సు చేసే సంకల్పాలుగాను, ఆ యా పనులుగాను, తలంచటమే "బంధం" అంటే. ఆత్మకంటె భిన్న భావాన్ని చేయుటమే బంధము; సంసారము అంటే. ఈ రెంటిలో 'ముక్తి'ని "తద్జ్ఞత" అనీ, రెండవ దానిని (బంధమును) "అజ్ఞత". అజ్ఞానమనీ అన్నారు.

2

ఎవరైతే తమ సచ్చిదానంద స్వరూపము నుండి కామ, క్రోధాదుల వలన చలించకుండా ఉంటారో, వారియందు 'అజ్ఞానము' ఉండలేదు.

3

నీవు నీ స్వరూపము నుండి జారిపోయి దృశ్య (జగత్తు) రూపాన్ని పొంది అందులో చిక్కుకొనటమే అజ్ఞానమంటే. దీనికి మించి 'అజ్ఞాన' మనేది లేనేలేదు.

4

స్వ స్వరూపములో ఉండటం ఏమిటని సందేహం కలుగవచ్చు. ఒక విషయాన్ని గూర్చి మననం చేసే నీ చిత్తం దాన్ని విడిచిపెట్టి, ఇంకొక విషయం మీదికి పరుగులెత్తుతుంది కదా! ఆ రెంటికి మధ్యకాలంలో ఉంటే నీ స్వ స్వరూప

మంటే. దీనివల్ల తేలిందేమిటి! సంకల్పానికి, సంకల్పానికి మధ్య నీవు నిస్సంకల్పంగా "బ్రాహ్మీస్థితిని" పొందుతున్నావన్నమాట! అయితే అది అతి సూక్ష్మకాలం. ఆ కాలాన్ని పెంచుకుంటూపోతే నీవు నీ యందే, నీ స్వరూపంలోనే ఉంటావు. యోగులు, జ్ఞానులు చేసే సాధన ఇదే!

5

అన్ని సంకల్పాలను, శమింపచేసుకొని రాతిగర్భంలాగ, నిశ్చలంగా ఉండేదే స్వ స్వరూప స్థితి. అయితే, ఆ స్థితిలో నీలో జడత్వంకాని, నిద్రగాని ఉండకూడదు. ఆ స్థితినే తురీయమనీ, సమాధి అనీ అంటారు. అప్పుడు నీ స్థితి యిలా ఉంటుంది: లోపల అహంకారం తారాడదు. వెలుపలనున్న పదార్థముల భేదాలు గోచరించవు. ప్రమాణ, విపర్యయ, నిద్రా, స్మృత్యాది సర్వవృత్తులు శాంతిస్తవి. అప్పుడు నిష్పందమయిన స్వప్రకాశ మొక్కటే శాంతంగా వెలుగుతూ ఉంటుంది. అదిగో, అలాంటి అనంతత్త్వమే నీ స్వరూపం!

6

అట్లాంటి కేవలాత్మ స్వరూపం మీదనే అజ్ఞానం ఆరోపింపబడుతూ ఉన్నది. దానికే 1) బీజ జాగ్రత్తు, 2) జాగ్రత్తు, 3) మహా జాగ్రత్తు, 4) జాగ్రత్స్వప్నము, 5) స్వప్నము, 6) స్వప్న జాగ్రత్తు, 7) సుషుప్తి అని పేర్లు. వీటినే "అజ్ఞాన భూమిక" లంటారు.

7

అవిద్య! అనాత్మ! అజ్ఞాన మన్నా ఒకటే. నీ స్వరూ

పం కేవల చిత్తు మాత్రమే. ఆ చిత్తు చేతనంగా తోచి, "చిత్తము-జీవుడు" అనే పేర్లతో పిలువబడుతుంది. అది ఆ యా సంకల్పాలకు నిలనైన జాగ్రత్తగానికి హేతువవుతుంది. జాగ్రత్తులో నీ వనుభవించే జగత్తునకు అది బీజంకాబట్టి దాన్ని 'బీజజాగ్రత్తు' అన్నారు. ఇదే అవిద్యయొక్క మొదటి రూపం.

8

ఈ "బీజ జాగ్రత్తు" అనే దశ కలిగిన తరువాత, 'శరీరమే తాను' అనే భ్రాంతి, చుట్టూ ఉన్న పదార్థాలు 'తనకు అనుభవింపతగినవి' అనే భావం ఏర్పడుతాయి. ఈవిధంగా కలిగే భావాన్ని "జాగ్రత్తు" అంటారు. అంటే ఇక్కడ అజ్ఞాన మనేది జీవునియందు జన్మాంతరవాసనా-రూపముగా ఉంటుందని తెలుసుకోవాలి.

9

జన్మాంతరగతమై ఏర్పడియున్న ఈ జాగ్రత్తు వృద్ధి పొందుతూ- "నేను, నాది, నావి" అనే భావాలను బలపరచుతూ ఉంటుంది. అలా బలపడిన జాగ్రత్తునే "మహా జాగ్రత్తు" అంటారు.

10

మేల్కొంచి ఉన్న వరుడు, మనోరాజ్యంలో ఏయే భావనలు, పనులు చేస్తూ ఉంటాడో, అవన్నీ మనఃకల్పితాలే అని తలంచకుండా, సత్యములే అని తలంచటమే "జాగ్రత్ స్వప్నము" అనే భూమిక. ఈ దశ శుక్తి రజత భ్రాంతి వంటిది.

11

స్వప్నకాలంలో స్వప్నరాజ్యం నిజం అని తలంచటానికీ, మేల్కొంచి అది కల్ల అని భావించటానికీ ఏది కారణమో, ఏది హృదయాన్ని ఆశ్రయించుకొని ఉంటుందో అదే- ఆ అవిద్యయే "స్వప్నమనే" భూమిక.

12

మనం కాంచే కల దీర్ఘకాలం అనుభవించినట్లు తోచి, కేవల జాగ్రదవస్థగానే ఉన్నట్లయితే, దాన్నే- ఆ దీర్ఘ స్వప్నాన్నే "స్వప్నజాగ్రత్తు" అన్నారు.

13

ఈ ఆరు దశలను దాటి, గాఢంగా- అంటే ఏమీ తెలియకుండా కలిగే నిద్రనే "సుషుప్తి" అంటారు. అది అజ్ఞానంతో నిండిన స్థితి. రాబోయే సుఖ, దుఃఖాలన్నీ అందులోనే ముడుచుకొని ఉంటవి. ఇవే "సప్త అజ్ఞాన" భూమికలు అంటే.

14

ఈ ఏడు భూమికలలోను, ఒకదానిలో ఇంకొకటి కలుస్తూ ఉండడంవల్ల అజ్ఞాన భూమికలు అనేకం కూడ అవుతాయి. ఇదంతా అజ్ఞానం యొక్క విలాసమే అనుకో. మూఢులు (అజ్ఞానులు) అందరు ఈ "అజ్ఞాన భూమికల" లోనే పడితిరుగుతూ, సుఖ దుఃఖాలను పొందుతూ ఉంటారు.

15

ఇలాంటి వాటి నన్నిటినీ దాటి- శాంత్యానంద స్థితిని

పొందాలంటే 'నీ' యందే 'నీవు' ఉండటంకంటే వేరే ఉపాయం లేదు.

16

పరిశీలించి చూచినట్లయితే ఏది నిలువజాలదో, అంటే విచారణచేస్తే నిలువదో- అదే మాయ, అవిద్య, అజ్ఞానము.

17

<u>జ్ఞాన భూమికలు</u> : 1) శుభేచ్ఛ, 2) విచారణ, 3) తనుమానసి, 4) సత్వాపత్తి, 5) అసంసక్తి, 6) పదార్థ భావన, 7) తుర్యగ అనేవే సప్తజ్ఞాన భూమికలు. ఇవి సాధకులు అలవరుచుకోదగినవి. లోకంలో మోక్షానికి మించిన సుఖం ఏదీలేదు. సంసారము యొక్క భయంకరత్వాన్ని భావించి, "ఈ సంసారము నుండి; నేనెలా ముక్తి పొందుతానా" అని మోక్షము నందు కోరికను కలిగి ఉండటమే శుభేచ్ఛ.

18

శాస్త్రం శాసించే సత్య, ధర్మ, అహింసాదులను ఆచరించుతూ- శ్రవణ, మననములను చేయడమే విచారణ.

19

ఈ శుభేచ్ఛా విచారణలు పట్టుబడినతర్వాత, ఇంద్రియ విషయాలమీద ఆసక్తి తగ్గుతూ ఉంటుంది. దానివల్ల మనస్సు ధ్యానాదులకు అనువైనదై, బాహ్య విషయాల నుండి విడవడి శుష్కిస్తుంది. (సన్నబడుతుంది.) ఈ స్థితినే "తను మానస" అంటారు.

20

ఈ మూడు భూమికలను ఆచరించటం వల్ల మనస్సు, ప్రాపంచిక విషయాలకు దూరమై స్వచ్ఛమై, సత్త్వ గుణం మీదనే నిలకుంటుంది. దీనినే "సత్త్వాపత్తి" అంటారు. అంటే మనస్సు, రజస్తమో గుణాల సంపర్కము లేకుండా సత్త్వగుణంతో నిండిపోవటమన్నమాట. ఈ సత్త్వ గుణంవల్ల కలిగే ఫలితాలను మనం భగవద్గీతాది గ్రంథము లలో చదువవచ్చు.

21

"సత్త్వాపత్తి" కలిగిన తర్వాత, ప్రాపంచిక విష యాలతో సంబంధం క్రమ క్రమంగా తగ్గుతూ ఉంటుంది. అలా తగ్గి, 'సత్త్వం' పెరుగుతున్న కొలదీ ఆత్మ సుఖమనేది అనుభూతికి వస్తూ వుంటుంది. దీనినే "అసంసక్తి" అంటారు.

22

ఇంతవరకు ఈ అయిదు భూమికలను ఆచరించటం వల్ల, తన ఆత్మయందే. అంటే తన స్వరూపము నందే, తాను రమించటం సాధ్యమౌతుంది. అప్పుడు, బాహ్య పదార్థా లను గాని, అంతరికములయిన సంకల్ప, వికల్పాదులను గాని భావించే స్థితి నశిస్తుంది. దీనినే పదార్థాభావన అంటారు. దీనికి గట్టి ప్రయత్న మవసరము.

23

ఈ ఆరు భూమికలను చిరకాలం అభ్యాసం చేసి నందువలన, ఆత్మయందు రమించటం అలవాటవుతుంది. అప్పుడు సాధకుడు, సమస్త బాహ్యాంతర విషయాలకు దూరుడై తన స్వరూపమునందే, తన స్వభావముతోనే ఉండి

పోతాను. దీన్నే 'తురీయ స్థితి' అంటారు. అంటే ఇది జాగ్రత్స్వప్న సుషుప్తులను దాటిన పరమానంద స్థితి అన్నమాట. ఇదే ఏడవ భూమిక. దీన్ని జీవన్ముక్తులు, శరీరము ఉండగానే, ఆ శరీరములోనే అనుభవిస్తారు. ఇక, దీని కవ్వలిదైన తురియాతీతము సాక్షాద్బ్రహ్మ స్థితియే గాన దానిని భూమిక అనరు. అది పారమార్థిక దశ. అట్టివారిని, "ఆత్మారాములని, భూమానంద" స్థితులని అంటారు. వీరు రాజపాలెం అమ్మ వంటివారు.

## 24

"తురీయ" మనే సప్తమ భూమికను పొందినవారిని 'ఆత్మారాములనీ, భూమానంద పదస్థులనీ' అనాలి. వారి స్థితి సామాన్యమైనది కాదు. వారు ఆశ్రమ ధర్మాలను ఆచరించినా, ఆచరించకపోయినా లోటులేదు. వారికి సుఖ దుఃఖాది ద్వంద్వాలు, సంతోష దుఃఖాలను కలిగించలేవు.

## 25

పూర్వపు రాజభవనాలు, సప్త ప్రాకారములను కలిగి ఉండేవి. ఈ సప్త ప్రాకారాలను దాటిపోతేనే కాని, మహారాజభవనము, అందులోని మహారాజ దర్శనము అయ్యేది కాదు. అలాగే సుప్రసిద్ధ దేవాలయాలు కూడ, ఏడు ప్రాకారాలతో చుట్టబడియుండాలని శిల్పశాస్త్ర మంటున్నది. అంటే ఏడు ప్రాకారాలను దాటివెళ్ళితేనేగాని, దైవదర్శనం అయ్యేది కాదన్న మాట! ఈ ఏడు ప్రాకారాలు ఆధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారము లనెడి సప్త చక్రాలకు సంకేతాలన్న మాట.

జీవుడు షట్చక్రాలను దాటి సహస్రారానికి చేరుకుంటేనే కాని, పరబ్రహ్మ దర్శనము, పరబ్రహ్మ సాయుజ్యము సిద్ధించదని సప్త ప్రాకార సంకేతము చాటుతున్నది. సప్త జ్ఞాన భూమికల సంకేతము కూడ ఇదే. భారతీయ ఆధ్యాత్మికార్థాలు ఎంతటి సంకేతార్థములతో (సింబలుగా) కూడుకొని యున్నవో ఆలోచించండి.

26

నిద్రలో ఉన్నవాడికి, ఒక అందగత్తె ఆలింగనం, వికారాన్ని కలిగించనట్లు, ఆత్మారాములను (తత్త్వవేత్తలను) ప్రాపంచిక భోగాలు ఆకర్షించలేవు.

27

"జ్ఞానభూమిక" లనేవి సాధన చతుష్టయ సంపత్తి గలవారికే, అలవాటుపడతాయిగాని, అజ్ఞానులకు పట్టుపడవు.

28

"జ్ఞానభూమిక" లనేవి కొందరికి, ఒక జన్మలో ఒక్కొటిగాని, రెండుగాని, నాలుగుగాని, అన్నిగాని అంవడవచ్చు. ఒక్కొక్కరికి ఏడవదైన "తురీయగ" అనే భూమిక అలవడ వచ్చు. ఇదంతా వారి వారి పూర్వజన్మ కర్మలను బట్టి కలుగుతూ ఉంటుంది.

29

బ్రహ్మాత్మైక్య జ్ఞానము పట్టుబడ్డవాడు చండాలుడైనా, మ్లేచ్ఛుడైనా, ఎవడైనాసరే జగత్పూజ్యుడే. అందుకే శంకరుడు, "బాపడగును గాక, పంచముండగు గాక, బ్రహ్మవేత్త నాకు పరమ గురుడు" అన్నాడు.

30

'మాయ' అంటే అహంకారమే. 'అహంకార'మంటే చిత్తు యొక్క చలనమే. చిత్తు యొక్క చలనమంటే చిత్తు ఘనీభావాన్ని వీడి పలచబడటమే. కనుక నీవు చిద్ఘన స్వరూపుడవుగా ఉండగలిగితే మాయ నీదరికి రానేరాదు. దానికి రూపాన్ని కల్పించుకొని, భ్రాంతిపాలయి, సంసార దుఃఖాలను సృష్టించుకొనేది అసలు నీవే.

31

లేనిది ఉన్నట్లుగా కనబడటానికి కారణము నీకు 'సమ్యగ్ దృష్టి, సమ్యగ్ జ్ఞానము' లేకపోవటమే. విచారగాత్మక వివేక దృష్టి ఏర్పడితే అసలు ఉన్న వస్తువుయొక్క సత్యము, సాక్షాత్కార మవుతుంది.

32

శాంతము, నిష్క్రియము అయిన పరబ్రహ్మమునందు ఆ బ్రహ్మమే సృష్టి రూపంగా గోచరిస్తున్నది. అంతేకాని, బ్రహ్మమునకు భిన్నంగా సృష్టి అనే పదార్థమేదీ లేదు. కనుక సృష్టిని నీవు బ్రహ్మంగానే సంభావించి అనుభూతి పొందడం నేర్చుకోవాలి.

33

నీటి కంటె భిన్నంగా, తరంగాలు, నురుగులు సుడిగుండాలు లేవు. అవి అన్నీ నీటి నుండి కలిగిన వికారాలే. విజ్ఞుడైనవాడు వాటిని నీటికంటె భిన్నంగా చూడడు. అలాగే చిదాకాశ స్వరూపుడయిన ద్రష్టయే, దృశ్యంగా మారు

తున్నాడనుకో. ద్రష్టను వదిలితే దృశ్యాలకు ఉనికియే ఉండదు. తరంగాదులకు, నీటి కంటె వేరైన వస్తుత్వము లేనట్లు, దృశ్యాలకు ద్రష్ట కంటె వేరైన దృశ్య రూప వస్తుత్వము లేదు.

34

చిత్తమనే ఆకాశం మీద, చిత్తు అనే ఆకాశము యొక్క విలాసమే నానా విధాలైన విశ్వంగా భాసిస్తున్నది. ఆ చిత్తమనేది చిత్తు యొక్క విలాసమేగాని వేరుగాదు. అయినప్పుడు దానిమీద తోచే జగత్తు గూడ చిత్తు యొక్క విలాసమేగదా మరి! ఈ భావాన్ని సునిశితంగాను, వివేక దృష్టితోను భావించి అనుభూతి పొందాలి.

35

జ్ఞానులైనవారికి, విశ్వమనేది సూక్ష్మాతి సూక్ష్మ పర బ్రహ్మమేగాని, భిన్నం కాదు. అజ్ఞుల కేమో ఆ విశ్వం స్థూలంగాతోచి, బాధపెట్టే దవుతుంది.

36

విశ్వమును గూర్చి ఒకసారి నీకు "ఇది ఆత్మయే" అని అనుభూతి కలిగినట్లయితే ఇక ఎప్పుడుగూడ దానిమీద ఇతర వస్తువుల అనుభూతి కలుగదు. ఎలాగంటే చల్లని నీడను విశ్రమించేవారికి ఎండ యొక్క అనుభూతి కలుగదు గదా! అలాగే ఎండలో నిలబడినవారికిన్నీ, చల్లదనము అనుభవానికి రాదుగదా!

37

నీ యొక్క జ్ఞానం ఎలాంటిదిగా యుంటే నీ చిత్తము

అలాంటిదే అవుతుంది. నీ చిత్తం ఎలాంటి దయితే నీవు చేసే కర్మలు, కలిగే ఫలాలు అలాంటివే అవుతాయి. కనుక అన్నింటికి "సంవిత్" అనబడే నీలోని జ్ఞానమే ముఖ్య కారణం.

38

"సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః, ప్రయాణకాలేపిచ మాం తే విదుర్యుక్త చేతసః" అని గీత సప్తమాధ్యాయాంతములో భగవానుడు చెప్పినాడు. దీనినిబట్టి అధిభూత, అధిదైవతములతో గూడిన భగవత్తత్త్వమును మానవుడెరిగి ప్రవర్తింపవలసియున్నట్లు తెలుస్తున్నది.

39

జీవన్ముక్తి సుఖము కలుగవలెనంటే, "వైరాగ్యము, బోధ, ఉపరతి" అనేవి మూడు పూర్ణంగా ఉండాలి. కేవల జీవబ్రహ్మైక్య బోధవల్ల ముక్తి కలిగేమాట వాస్తవమయినా దానితోపాటు, "వైరాగ్యము, ఉపరతి" అనేవి లేకపోతే, జీవన్ముక్తి సుఖము మాత్రము కలుగదు.

40

"బోధ" అంటే జ్ఞానమే. కూటస్థనిత్య చిత్స్వరూపుడనే, "నేను"నే నిశ్చయమన్న మాట. ఇక 'వైరాగ్య' మంటే విషయాలమీద రక్తి లేకుండా ఉండటము. 'ఉపరతి' అంటే లోకవ్యవహారాలకు దూరంగా ఉండటము. వాటితో సంబంధము పెట్టుకుంటే వాటిమీద ఆసక్తి కలగటం, క్రమంగా జారిపోవడము సంభవించవచ్చు గదా!

41

అజ్ఞాని "దేహమే నేను" అనుకొన్నంత దృఢంగా

జ్ఞాని "ఆత్మయే నేను" అనుకుంటాడు. అదే నిశ్చయమైన జ్ఞానమంటే. అజ్ఞాని ప్రతి చిన్న విషయము తనకు కావాలనీ అనుకుంటుండగా, వైరాగ్యము కలిగిన జ్ఞాని బ్రహ్మలోకాధి కారము లభించినా, తృణీకరిస్తాడు. అదే నిజమైన "వైరాగ్య" మంటే.

42

గాఢనిద్రలో ఉన్న వాడికి ఏ విషయాల మీద కోరిక పుట్టదు. అలాగే జ్ఞానికికూడ ప్రాపంచిక విషయాల మీద కోరికలు కలగకుండా యుంటే అతడు "ఉపరతి"ని పొందిన పూర్ణజ్ఞాని అని చెప్పవచ్చు.

43

పరమజ్ఞాన సిద్ధిని పొందినవారంతా ఒకే నడవడిక కలిగి ఉంటారని నియమం లేదు. వారివారి ప్రారబ్ధ కర్మలు, భిన్న భిన్నాలుగా ఉంటాయి కనుక, వారి నడవడులున్నూ భిన్న భిన్నాలుగానే ఉంటాయి. ఇందుకు వేమన, వీరబ్రహ్మ గురులను ఉదాహరణగా తీసుకోవచ్చు. "రాజుపాలెం అమ్మ" ప్రపంచాన్ని చూడకుండా పరమ సమాధిలోనే ఉంటున్నది. ఇంకొక జ్ఞాని తత్త్వబోధ చేసుకుంటూ గ్రంథ రచన కొనసాగిస్తూ, జ్ఞానప్రచారంతో శిష్యులను ఉద్ధరిస్తూ, లోకశ్రేయస్సాధకుడుగాను ఉండవచ్చు. మరొక తత్త్వవేత్త, ఆ రెండు రీతులు లేకుండా, మౌనవంతుడై సంచరించనూవచ్చు. ఆహార పానీయాలను స్వీకరించనూవచ్చు. ఈ వెలుపలి నడవళ్ళలోని భేదాలు వారి ఆత్మజ్ఞానమును ఎంతమాత్రమును

అరికట్టలేవు. శరీర పతనానంతరము, వీరందరు మోక్షమును పొందలేరు. ప్రతి సాధకుడు ఈ మర్మాన్ని తెలిసికొని యుండాలి.

44

నీవు "నేను భోక్తను" అనుకొన్నంతవరకు భోగ్యాల కోసము వెదకుతూనేయుంటావు నీలోని 'భోక్తృ భావము' నశిస్తే భోగ్యాల కోసం వెంపరలాడే గుణం పోతుంది. అలానే 'నేను కర్త' ననుకొన్నంతవరకు కార్యలంపటుడవు కాక తప్పదు. కార్యాలను, అహంకారముతో చేస్తున్నంతవరకు, ఆ కర్మపాశాలు నిన్ను బంధించకమానవు. గనుక కర్తృత్వ, భోక్తృత్వాలు లేని, కేవలాత్మను, "నేను"నే జ్ఞానము కలిగిన నాడే ముక్తి. స్వచ్ఛమయిన ఆత్మ, కర్తా గాదు, భోక్తా గాదు. "అనీశశ్చాత్మా బధ్యతే, భోక్తృభావాత్" అని ఉపనిషత్తు అంటున్నది.

45

బుద్ధిలో, కారణ శరీరములో ప్రతిబింబించిన చిదాభాసునికే అహంకారం ఉంటుందికాని, ఆ చిదాభాసునికి మూలమయిన, కూటస్థునికి అహంకారముండదు. "ఆ బ్రహ్మమే నేను, చిదాభాసుడు మాయాకల్పితుడు" అని జ్ఞాని తెలుసుకుంటాడు. అందుకని, జ్ఞాని అహంకారముతో ఏ పనులు చేయడు.

46

అండ పిండ బ్రహ్మాండముల యొక్క సృష్టి ఈశ్వరుడు చేసేది. జాగ్రద్దశ నుండి మోక్షము కలిగేటంతవరకు జరిగే

సంసారము జీవుడు కల్పించుకొనేది. కనుక సంసారమును పెంపొందించుకొనేదిగాని, మోక్షాన్ని సంపాదించేదిగాని, నీ ప్రయత్నమే అని గ్రహించాలి. నీవు నీ ప్రయత్నాన్ని బట్టి సంసారాన్ని వృద్ధి చేసుకుంటే దుఃఖాల (జన్మల) పాలవుతావు. మోక్షమార్గాన్ని అనుసరిస్తే ఆనంద మయుడ వవుతావు.

47

నీలోవున్న దివ్య చైతన్యమే "జాగ్రత్, స్వప్న, సుషుప్తి" లనెడి మూడు దశలను ప్రకాశింపచేస్తున్నది. ఈ దశలను లోకాలని కూడ అనుకోవచ్చు. ఆ లోకాలను, అందలి అనుభవాలను వదలిపెట్టి వాటిని గ్రహించే దివ్య శక్తియే, పరబ్రహ్మమే, "నేన"ని తెలిసికొనడమే ముక్తి అంటే.

48

కూటస్థ చైతన్యంతో కూడిన చిదాభాసుడే సంసారాన్ని సృష్టించుకుంటాడు. వాడే మోక్షముకోసం కూడ ప్రయత్నిస్తాడు. అంతేగాని, కేవల కూటస్థ చిదాత్ముడు మాత్రము ఏమిచేయడు. వాడు అకర్త, అభోక్త అసంగుడున్నూ!

49

ఎముకల గూడు, మాంసపు ముద్ద అయిన స్థూల శరీరము (అన్నమయ కోశమును) కర్మేంద్రియాలతోను, పంచ ప్రాణాలతోను గూడిన ప్రాణమయ కోశమును జ్ఞానేంద్రి

యములతోను, మనస్సుతోను కూడిన మనోమయ కోశ
మును, శబ్ద స్పర్శాది విషయ పంచకముతోను, బుద్ధితోను
గూడిన విజ్ఞానమయ కోశమునూ, అంతేకాదు- అంతర్ముఖ
మైన, బుద్ధీంద్రియానికి గోచరించే ఆనందమయ కోశమును
దాటి కేవల కూటస్థ చైతన్యమునందు నిలిచే అతీత స్థితి
మిక్కిలి విచిత్రమయినది. అది భావనకు అంది అనుభూతికి
రావటమే సాధకుని సాధనకు పరాకాష్ఠ! ఈ సాధన మిక్కిలి
మెలకువతో సాధించవలసియున్నది.

50

ఈ అతీత సాధనను మెట్టు తర్వాత మెట్టెక్కినట్లు
క్రమంగా చేస్తూపోవచ్చు. కొన్నాళ్ళు, అన్నమయకోశాన్ని;
తన స్వరూపం కాదనీ, మరికొన్నినాళ్ళు ప్రాణమయ కోశం
తాను కాదని, ఇంకా కొంతకాలము మనోమయకోశము
తాను కాదని, చివరకు విజ్ఞానమయ కోశముకూడ తన స్వరూ
పము కాదని, చిట్టచివరకు నిశ్చలబుద్ధికి గోచరించే ఆనంద
మయకోశము గూడ తన స్వరూపముగాక, దానికి గూడ
ఆధారమయిన సర్వాధిష్ఠాన శుద్ధ చైతన్యమే "తాన"ని అను
భూతి పొందాలి. ఈ అనుభవాన్ని పొందినవాడే సాధన
పూర్తిచేసుకొన్న సిద్ధ పురుషుడు. ఇది అతి సూక్ష్మతరమైన
నిశ్చల, నిర్మల సాధన. అంటే పంచ కోశాతీత పరమార్థ
స్థితి అన్నమాట. దీన్ని సాధించడం చెప్పుకొన్నంత తేలిక
మాత్రం కాదు.

51

ప్రాణాయామము, ఆరోగ్య సాధన మాత్రమే అని

కొందరు భావిస్తారు. అది ఆరోగ్యానికి సాధన అనే మాట నిజమేకాని, మనశ్చాంచల్యాన్ని అణచటానికి గూడ అది గట్టిసాధనే అని గ్రహించాలి. ప్రాణాయామం వల్ల చిత్తచలనం కట్టుబడి చిత్తం ఏకాగ్రమవుతుందని ఉత్తమ సాధకులకే తెలుస్తుంది.

52

"యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు" అనే అష్టాంగాలు కూడ సాధకులకు గొప్ప ప్రయోజనాలను చేకూర్చేవని తత్త్వ సాధకులు మరువకూడదు. వాటిని చక్కగా అనుష్ఠించ కలిగితే, కలిగే లాభాలు అనేకం. యమ నియమాలవల్లనే, మానవుడు మానవోత్తముడవుతాడు. ఇక తక్కినవన్నీ ఆచరిస్తే పురుషోత్తముడు కావటంలో సందేహము లేదు. అట్టి వానినే "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అని పదిహేనవ అధ్యాయాంతంలో గీత చెప్పినది. ఇది స్వానుభవవేద్యం కాదగిన రహస్యం.

53

ధ్యానమువల్ల కలిగే ఆనందం, అనిర్వచనీయమయినది. ధ్యానం చేత నీవు పరమాత్ముని ఒడిలోనికి చేరినట్లు ఆనందాన్ని పొందుతావు. ధ్యానమంటే మనస్సులోనికి ఇతర విషయాలను రానీయకుండా ఆత్మదర్శనం చేసికొనడమే! అదే నరుడు పొందవలసిన అమూల్య ప్రయోజనం. అంతిమ పురుషార్థం.

54

అసలు నీ నిజ స్వరూపమును, నీకు పట్టి ఇచ్చేది "సుషుప్తి" మాత్రమే. ఆ సమయంలో జాగ్రత్ జగత్తులోని అలజడులుగాని, స్వప్న ప్రపంచములోని వింతలుగాని నీదరికి రావు. చివరకు నీ మనస్సుకూడ పనిచేయకుండా కదలక పడియుంటుంది. ఆ మనస్సును చూచే "నీవే" అప్పుడు మిగిలి యుండేది. అదే "నీ" నిజరూపము. స్వప్న జాగ్రద్ దశలలో మనస్సు కల్పించే జగత్తులను, వాటి విశేషాలను చూచేది, సుషుప్తిలో తోచే ఆ నీవే! ఆ "నీ" మీద నిలకడగా ఉండ గలిగితే నీవు ధన్యుడవవుతావు. కాని నీవు అలా ఉండవుగా. జాగ్రత్ స్వప్నంలోని విలాసాలకు దాసుడవై నిన్ను నీవు మరచిపోయి సుఖ దుఃఖాలను పొందుతావాయె. సుషుప్తిలో చూడు. నీకు దుఃఖ స్పర్శ అనేది ఉండదు. కనుక, దుఃఖ రహితమయిన పరమబ్రహ్మానందమే నీవన్నమాట! ఇదే నిన్ను నీవు తెలిసికోవడమంటే.

55

యోగులు, బ్రహ్మవేత్తలు అయినవారు సుషుప్తిలో మెలకువ కలిగియుంటారు. తమ నిత్యానంద స్వరూపాను భవంలో తేలి ఆడుతూ యుంటారు. వారికి అజ్ఞాన స్పర్శ ఉండనే ఉండదు. వారు జ్ఞానఘనులు. సదానందమూర్తులు!

56

తత్త్వవేత్తలది సుషుప్తిని దాటిన నాలుగో దశయే. వారు ఆ నాలుగో దశను మొదటిదైన జాగ్రద్త్సమయ

ములో కూడ అనుభూతికి తెచ్చుకొని ఆనందించగలుగుతారు. ఎందుకనంటే, అదే శాశ్వతమైనది గనుక. అసలు మూడు దశలుకూడ దానిమీదనే- దాన్ని ఆధారంగా చేసుకునే ప్రవర్తిస్తాయి. జాగ్రత్తులో స్వప్నదశ, స్వప్నంలో జాగ్రద్దశ, అలాగే సుషుప్తిలో స్వప్న జాగ్రత్తులు ఉంటే ఉండవచ్చు లేక పోతే లేకపోవచ్చు. కాని, ఆ 'చతుర్థదశ' మాత్రం, ఈ మూటికి ఆధారభూతమై ఎల్లవేళల ప్రకాశిస్తూనే యుంటుంది. అయితే జాగ్రత్ స్వప్నాల సమయములో అవి తురీయానందస్థితిని, ఆక్రమించి తోచనీయవు ఒక కాగితము మీద చిత్తరువును రంగులతో వేస్తే. ఆ రంగులు కాగితము యొక్క తెల్లదనాన్ని ఆక్రమించుకొని అగపడనీయవు కదా! అంతే ఇది కూడా!

57

ఆత్మయోగి మాత్రమే జాగ్రదాదులలో కూడా, తన తురీయ స్వరూపదర్శనం చేస్తూ, ఆనందించగలుగుతాడు. అతని విషయములో జాగ్రత్ స్వప్నాలు ప్రవర్తిస్తున్నా ఏమీ చేయలేవు. వాటికి సాక్షిగా ద్రష్టయై అతడు ఉండగలడు. ఇది ఒక అద్భుత విచిత్రయోగము. అనుభవించిన వారికే దాని మహిమ తెలుస్తుంది. రమణ మహర్షి ఈ సాధనలో కృతకృత్యుడయినాడు.

58

బద్ధుడైనవాడు బ్రతికియున్నప్పుడూ, మరణించేవేళ కూడ ఆ యా కోరికలను పెట్టుకొని, వాటి కోసమే ఆరాట

పడుతూ మరణించి, వాటిని అనుభవించటానికి మరలా జన్మి స్తాడు. ముక్త పురుషుడేమో సర్వ వ్యాపక పరిపూర్ణ బ్రహ్మమే "తాన"ని తలచి తాను పొందవలసినది, కోరవలసి నదీ, ఏదీ లేనందున నిష్కాముడై అఖండ ఆత్మభావముతో సముద్రంలో నీటి చుక్కలాగా, అఖండ బ్రహ్మములో కలసి పోతాడు. అట్టివాడు మరల జన్మము ఎత్తవలసినపనే లేదు. అతడు అఖండా ద్వితీయ బ్రహ్మమే. ఈ విషయాన్నే ఉప నిషత్తు "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" బ్రహ్మవేత్త బ్రహ్మమే అవుతాడు అన్నది.

59

బద్ధజీవులు, ప్రాపంచిక సౌఖ్యాల కోసము, కీర్తి ప్రతి ష్ఠల కోసము పడేపాట్లు ఇన్నీ, అన్నీ కావు. ఆ సౌఖ్య సంపా దనలో ప్రాణాలను గూడ అర్పిస్తారు మళ్లిమళ్లీ పుట్టి వాటిని నెరవేర్చుకోటానికి కృషిచేస్తూనే యుంటాడు. ఈ విధంగా కోరికల వల్ల వారి జన్మ పరంపర (సంసారము) సాగిపోతూనే ఉంటుంది. ఇలాంటివారిని గూర్చే గీత "ఆశాపాశ శతైర్బ ద్ధాః కామక్రోధ పరాయణాః" (16-12) "ఆశల" త్రాళ్ళ చేత కట్టబడి కామక్రోధాలకు వశులై తిరుగుతారని చెప్పింది.

60

ఆశలను కోరికలను జయించ గలిగితే నీవు ఆత్మకు దగ్గర పడుతున్నట్లే లెక్క. ఆ ఆశలు, కోరికలు నిన్ను ఆత్మ నుండి దూరంచేసి సంసారంలో కూల్చుతాయి. కోరికలు తగ్గిన కొలదీ నీవు నీ స్వరూపం మీదనే ఉండగలుగుతావు.

61

ముక్త పురుషుల నడవడి అతి విచిత్రంగా ఉంటుంది. వారుకర్మలను చేస్తున్నా, వాటిచేత కట్టుబడరు. కర్మ బంధాతీతులై మెలగ గలుగుతారు. ఇందుకు కారణం, ఆ చేసే పనులను గూర్చి, వారికి అహంకారము లేకపోవటమే అహంకారంతో చేసే పనులు బంధానికి, నిరహంకారంతో చేసే పనులు ముక్తికి త్రోవ చూపుతాయి.

62

ప్రతి సాధకుడుకి (జీవునికి) 1) అజ్ఞానము 2) ఆవరణము 3) విక్షేపము 4) పరోక్షబుద్ధి 5) అపరోక్ష జ్ఞానము 6) దుఃఖ నివృత్తి 7) అఖండానందప్రాప్తి - అనే ఏడవస్థలుంటాయి. వీటిలో అజ్ఞానమనేది సరేసరి. అది అందరకు ఉండేదే. "దీనిని గూర్చినాకేమి తెలియదు, నేనేమీ ఎరుగను" అనే రూపంగా ఉంటుంది అజ్ఞానమనేది. ఇది ఆత్మ విచారణ చేయటానికి పూర్వం ఉండే స్థితి సక్రమంగా విచారించనందువల్ల, ఆత్మ తత్త్వము బోధపడక దాన్ని లేదనటమే "ఆవరణ" మంటే స్థూల సూక్ష్మ శరీరాలతో గూడిన జీవుని చర్యలన్నీ "విక్షేపము" అవుతాయి. ఈ "అజ్ఞాన, ఆవరణ, విక్షేపము" లనే మూడవస్థలు బంధానికి మూలాలే !

63

గురు, శాస్త్రాదుల ద్వారా విచారణచేసి, శరీరాదుల కంటె వేరైన, ఆత్మ ఉన్నదని తెలిసికొనుటమే, "పరోక్ష బుద్ధి" అంటే. పరోక్షబుద్ధి కలవానికి, ఆత్మ సాక్షాత్కా-

రము కాలేదన్నమాట. గురుమహాదేవుడు చెప్పిన "తత్త్వమసి" మహా వాక్యాన్ని అనుభూతికి తెచ్చుకొనటమే "అపరోక్ష జ్ఞాన" మంటే. ఇది "అహం బ్రహ్మాస్మి" అనే అనుభూతికి మూలమవుతుంది!

64

అపరోక్ష జ్ఞానము కలిగిన తరువాత తనయందు (జీవుయందు) మిథ్యారోపితాలైన కర్తృత్వ; భోక్తృత్వాదులు నశించగా కలిగేదే, త్రివిధ దుఃఖముల నివృత్తి. ఆ దుఃఖ నివృత్తికి పిమ్మట కలిగేదే 'అఖండానంద' మంటే. ఈ పేర్కొన్న "సప్తావస్థలు" ఉపాధి వలన ఏర్పడిన చిదాభాసునికే (జీవునికే) గాని, కూటస్థ నిత్య చిదాత్మకు కావు.

65

<u>వివర్తదృష్టి</u> : ఏ వస్తువయినా సరే, ఉన్నది ఉన్నట్లే దాని స్వరూపంతోనే కనబడటం సామాన్య విషయమే. అందులో విశేషమేమీ లేదు. కాని, ఉన్న వస్తువు తనకు ఉన్న స్వరూపంతో గాక, మరొక రూపంతో కనబడుటమే 'విశేష' మంటే. బంగారం ఉన్నదనుకోండి. అది బంగారంగా కనబడటంలో విశేషమేమీ లేదు. అది సామాన్య విషయమే. ఆ బంగారమే ఒక నగయొక్క ఆకారాన్ని పొంది, ఒక ప్రత్యేకమయిన పేరుతో గోచరించడం 'విశేష' మవుతుంది. అప్పుడు దాన్ని కంకణమనో, కంఠహారమనో అంటారే కాని, బంగారమని అనరు. ఈ దృష్టితో చూచినట్లయితే బ్రహ్మమనండి, భగవంతుడనండి- బ్రహ్మంగాను, భగవంతునుగాను కనబడితే

అది సామాన్య విషయమే. ఘటము, ఘటముగా కనపడటం సామాన్యమనీ, ఏదో పాత్రరూపంగా కనపడటం విశేషమనీ ఈ సందర్భంలో గ్రహించవలె. "బ్రహ్మము" అనేది ప్రకృతి మహదాది పరిణామరూప జగత్తుగా తోచడమే విశేషము. "విశేషేణ వర్తతే ఇతి వివర్తః" అనే వ్యుత్పత్తి ప్రకారం ఉన్న వస్తువు, మరొకటిగా తోచటమే "వివర్త" శబ్దాని కర్థము

అయితే ఇక్కడ, భిన్నావస్థలో పూర్వరూప పరిత్యాగం ఉండదని, అద్వైత సిద్ధాంతం అంటుంది. పూర్వరూప పరిత్యాగం కలిగిందా లేదా అనే విషయం అనుభవజ్ఞులకు మాత్రమే తెలుస్తుందిగాని, అజ్ఞానులకు అనుభవశూన్యులకు తెలియదు. ఈ సందర్భములో అనేక ఉపమానాలను శాస్త్రాలలో మనం చూస్తాము. నీరు ఉన్నదనుకోండి; అది ఒక్కటే తరంగాలుగా, బుడగలుగా, మరుగులుగా, సుడిగుండాలుగా గోచరిస్తున్నది. ఎన్ని రీతులుగా వివర్తించినా, అవి అన్నీ 'నీరే' కాని భిన్నం కాదు. జగద్బ్రహ్మలను గూర్చి కూడ సాధకులు ఇలాగే భావించాలి. మట్టి- దానితో తయారైన వస్తువులు, లోహం- దానితో చేసిన వస్తువులు ఇలాంటి వన్నీ ఇక్కడ ఉదాహరణలే!

"విపరీతేన వర్తతే ఇతి వివర్తం" అనే వ్యుత్పత్తిని ఆశ్రయించి చూచితే- సత్తు, చిత్తు, ఆనందమే స్వరూపంగా గల బ్రహ్మము, తనకు విపరీతమయిన అసత్తుగాను, జడముగాను, దుఃఖముగాను, గోచరించడం వివర్తం. ఈ 'అసజ్జడ

దుఃఖములు' మూడు బ్రహ్మస్వరూపానికి, విపరీతరూపములు. జగత్తుయొక్క రూపములు గనుక, ఈ వ్యుత్పత్తి గూడ తగినదే అనుకోవచ్చు. అప్పుడిది కూడ వివర్త మవుతుంది. కనబడే జగమునందు ఇలాంటి విపరీత బుద్ధి నశించి, సచ్చిదానందాత్మక భావన నిలవడమే "బ్రాహ్మీస్థితి" అన్నారు పెద్దలు. కొందరేమో జగత్తునందు మిథ్యాత్వ బుద్ధి కలగా లంటారు. మరికొందరు జగత్తుమీద బ్రహ్మభావన కలగటమే "బ్రాహ్మీ స్థితి" అని భావించారు. ఆ పక్షంలో "బ్రహ్మ సత్యం - జగన్మిథ్యా" కాక, "జగద్బ్రహ్మ" అవుతుంది.

66

నీకు జీవభావమున్నంత వరకు, జగత్తు అనేది ఉండనే ఉంటుంది. ఆ జీవ భావము శమించితే జగమూ శమిస్తుంది. అయితే ఇక్కడ 'జీవభావ' మంటే ఏమిటో తెలిసికోవాలి. జీవ భావమంటే కేవలమయిన చిత్తు, ప్రకృతితో - అంటే మనస్సు (అహంకారము) తో కలవడమన్నమాట. అంటే చిత్తు మనస్సులో ప్రతిబింబించి మనోధర్మాలన్నీ తనవే అని భ్రాంతిపడడ మన్నమాట! దానికే "అధ్యాస" అని గూడ పేరు. చిత్తును, చిత్తుగా మాత్రమే చూచేవారికి జగదధ్యాస, జగద్భ్రాంతి ఉండదు. వారు కేవలము చిన్మయమూర్తులే !

67

అయితే కేవల చిత్తుకు అచిత్తయిన మనస్సుతో సంబంధం ఎలా కలిగిందని ఒక సందేహము కదూ! 'సమ్యగ్' దృష్టితోను, ప్రగాఢమయిన అనుభూతితోను చూస్తే, 'చిద

చిత్తు' లనేవి రెండూ లేనే లేవు. 'చిత్తు' అనేది ఉండవలసినంత గట్టిగా లేక, ప్రవిభవించటమే (పలచబడటమే) 'అచిత్తు' కావటమంటే. నీవు చిద్ఘనత్వమును భావించి, దాని స్వరూపం కాగలిగితే, అప్పుడు "అచిత్తు" (అంటే మహదాది వికారాలు) కలుగనే కలుగవు. అవ్యక్త మహదాకాశాదులే లేనప్పుడు ఇక వాటి పరిణామమైన జగమనేది ఎక్కడ నుండి వస్తుంది !

68

'జగత్తే'నేది పుట్టనూ లేదు, నశించనూ నశించదు. పుట్టితేనే కదా నశించటం. దీన్ని "అజాత" వాద మంటారు. ఒకవేళ జగత్తనేది ఉన్నట్లు నీకు తోచినా, దానివల్ల నీకు బాధ లేకపోతే నీవు ధన్యుడవే అనుకో! జగత్తును బ్రహ్మముగా చూచే తెలివి (జ్ఞానము) కలిగితే, దానివల్ల నీకు ఏ బాధా ఉండదు. ఇంతవరకు వెలసిన జ్ఞానులందరు జగమువల్ల తమకు బాధ లేకుండా చేసుకున్నవారే. అయితే జగమువల్ల కలిగే బాధలు ఏమిటని మీరడుగవచ్చు. అవి సుఖ, దుఃఖ, జనన, జరామరణాదులే !

69

పంచభూతముల సత్వగుణాంశలతో ఏర్పడినట్టిది "అంతఃకరణ" మని వేదాంతం చెప్పుతున్నది. ఆ అంతఃకరణములో ప్రతిబింబించిన, ఆత్మచైతన్యానికే "జీవుడు-చిదాభాసుడు" అని పేర్లు. అంతఃకరణము నశిస్తే, చిదాభాసుడు తనకు కారణమైన ఆత్మలోనికే చేరుకుంటాడు. ఈ 'చిదాభాసు'డనే

ప్రతిబింబానికి ఆధారమైన బింబమే 'ఆత్మ' అంటే. అతనిని వేదాంత పరిభాషలో "ప్రత్యగాత్ముడు, కూటస్థుడు కేవలాత్ముడు" అని తెలిసికోవాలి. ఆ ఆత్మయే తన స్వరూపంకాని, చిదాభాసుడు తన స్వరూపం కాదని జ్ఞాని యొక్క నిశ్చయం.

70

"నేను బ్రహ్మమును - నేను బ్రహ్మమును" అన్న అనుభూతిని పొందినప్పుడు కర్తృత్వ, భోక్తృత్వ జనన, మరణ, సుఖదుఃఖాదు లుండవు. 'నేను జీవుడను' అనుకొన్న ప్పుడు అవన్నీ ఉండి, తనను బాధిస్తవి.

71

చిదాభాసునికి, దేహేంద్రియాదులతో తాదాత్మ్యము ఉంటుంది. (తాదాత్మ్య మనగా అదే నేనని అనుకోవడము). ఆ చిదాభాసునికి మూలమయిన, చిద్బింబమునకు, వీటితో సంబంధముండదు. అందుచేత చిదాభాసునికే కర్తృత్వ, భోక్తృత్వాదు లుంటవికాని, ఆ చిదాభాసునికి ఆధారమయిన కూటస్థునికి ఆ కర్తృత్వాదు లుండవు. నీవు కూటస్థ నిత్యా త్మవే కాని, చిదాభాసుడవు కావు గదా !

72

పరమ నిర్గుణ సమాధిలో నీవు చిదాభాస ధర్మమును విడిచి కూటస్థ నిత్య చిదాత్ముడవై ప్రకాశించగలవు. ఆ స్థితి కలిగితేనే గాని నీకు మోక్ష స్వరూపము సిద్ధించినట్లుగాదు.

73

నిజామాలోచించితే, కర్తృత్వ, భోకృత్వాదులు, బుద్ధి ధర్మములేకాని, చిదాభాసుని ధర్మములుకావు. అయినా బుద్ధితో తాదాత్మ్యాన్ని పొందినందువల్ల చిదాభాసుడు, కర్తృత్వాదులు తనవిగా భావించి బద్ధుడగుతున్నాడు. ఆత్మ యొక్క ధర్మము ప్రకాశించటమేకాని, సంకల్ప వికల్పాదుల నొనరించుట కాదు. అట్టి వాటిని, ఆత్ముడు తన యందారోపించుకొని భ్రాంతి పడుచున్నాడు.

74

"బుద్ధి అంటే ఏమిటి ? ఆత్మ అంటే ఏమిటి ? చిదాభాసుడు ఎవరు ? ఈ జగత్తునకు రూపమేమిటి ? బంధమేమి ? మోక్షమేమి ?" అనే విషయాలు విచారించనంతవరకు అగమ్య గోచరాలుగానే ఉంటాయి. సూక్ష్మబుద్ధితో విచారణ చేసేటట్లయితే ఒక్కొక్క దాని రహస్యం, బోధపడి సంసార బంధ మోక్ష సుఖ దుఃఖాల తత్త్వం విదితమవుతుంది.

75

కామంతో సమానమయిన వ్యాధి, మోహంతో సమానమయిన ద్రోహి, క్రోధంతో సమానమయిన శత్రువు ఆత్మ జ్ఞానంతో సమానమయిన సుఖము- లేదంటారు పెద్దలు.

76

వెలుగు, చీకటిని పోగొట్టడం అబద్ధమయితే, జ్ఞానం, అజ్ఞానాన్ని పోగొట్టడం అబద్ధమవుతుంది.

77

పంచీకృత పంచభూత సమ్మేళనమయిన కర్మ సంచిత 'స్థూల దేహము' భోగాయతనము. అపంచీకృత భూతాల

నుండి కలిగే, పంచ పంచ జ్ఞానేంద్రియాలతో కూడిన, 'సూక్ష్మ శరీరము' భోగసాధనం. అనాది సిద్ధమయిన అవిద్యయే 'కారణ శరీరము'. ఈ మూడూ కాకుండా వీటిని ద్రష్టయై చూచేదే 'ఆత్మ'.

78

వడ్లను దంచి, పొట్టు తీసి వేసి, లోపల బియ్యమును పొందినట్లు, స్థూల సూక్ష్మ, కారణ దేహాలను తొలగించి 'ఆత్మ దర్శనము'ను పొందాలి.

79

దీపాన్ని చూపడానికి ఇంకొక దీపం అవసరములేనట్లు 'ఆత్మ'ను దర్శించటానికి అన్యవస్తువు లక్కర లేదు.

80

ఇంద్రియముల మీద ఆసక్తిని వీడి 'ఆత్మ' యందే యుండగలిగిన యోగి,కుండలోని దీపంలాగ ప్రకాశించగలడు.

81

నిద్రించేవారే కలలు కంటారుగాని మేల్కొన్న వారు కలలు కనరు. అలాగే అజ్ఞానావస్థలోనే జీవునికి జగద్భ్రాంతి, సంసారమున్ను. జ్ఞానదశ కలిగితే, జగత్తు-సంసారము అతనిని బాధించవు. భోగి కర్మలంపటుడై ఉంటాడు. యోగికి దేహాభిమాన ముంటుంది. జ్ఞానికి మోక్షేచ్ఛ ఉంటుంది. ఏ అభిమానము లేనివాడు తత్త్వజ్ఞుడొక్కడే!

82

"ప్రారబ్ధ కర్మ" మనేది 1) ఇచ్ఛాప్రారబ్ధము 2) అనిచ్ఛా ప్రారబ్ధము 3) పరేచ్ఛా ప్రారబ్ధమని మూడు

విధాలుగా ఉంటుంది. ఆ యా కర్మలు జరిగేటప్పుడు మనకు కోరిక పుట్టించేది "ఇచ్ఛా ప్రారబ్ధము". దీనిని "స్వేచ్ఛా ప్రారబ్ధ"మని కూడా అనవచ్చు. తనకు ఇష్టము లేకున్నా పరిస్థితుల ప్రాబల్యము వల్ల కర్మలయందు ప్రవేశపెట్టేది "అనిచ్ఛా ప్రారబ్ధము". కొందరేమో ఆ యా కర్మలను తమ కిష్టము లేకపోయినా, అన్యుల యొక్క ప్రీతి కోసము, వారి వత్తిడి చేతను, కర్మలను చేస్తుంటారు. దానిని "పరేచ్ఛా ప్రారబ్ధ" మంటారు. ఒకానొకప్పుడు జ్ఞానికూడ, విషయ వాంఛలు లేనివాడైనా, ఇలాంటి ప్రారబ్ధాలకు లొంగిపోయి ఆ యా కర్మలకు పూనుకోవచ్చు.

83

'ప్రాపంచిక దుఃఖా'లంటే ప్రపంచము మీద బ్రహ్మ భావన కలుగనప్పుడు కలిగే దుఃఖాలు, ప్రపంచం మీద 'బ్రహ్మదృష్టి' యే గనుక కలిగితే నీకు సంసార (ప్రపంచ) దుఃఖాలు లోచవు. బ్రహ్మానందమే కలుగుతుంది.

84

"ఇది ఆత్మ వస్తువు, ఇవి అనాత్మ వస్తువులు" అనే జ్ఞానం కలిగిననాడు, నీకు ఇంద్రియ విషయాల మీద కోరికలు తగ్గుతాయి. అట్టి ఆత్మానాత్మ వివేకము లేనివానికి, ఎంతగా విషయ సుఖాలను అనుభవిస్తున్నా 'ఇక చాలులే' అని తృప్తి కలుగదు.

85

ప్రారబ్ధ కర్మను అనుభవించే విషయంలో- జ్ఞానికి, అజ్ఞానికి బాహ్యంగా భేదమనేది ఉండదు. అయితే జ్ఞాని,

దాన్ని అనుభవిస్తున్నా దుఃఖించడు. అజ్ఞాని దుఃఖపడతాడు. అనర్థాలను గూడ పొందుతాడు. ఈ సందర్భములో జ్ఞాని అనాసక్తుడని, అజ్ఞాని సక్తుడని తెలిసికోవాలి. అంటే మొదటి వాడు విరాగి. రెండవవాడు రాగి.

86

జ్ఞానికి తాను కాంచే కలమీద నిత్యత్వ బుద్ధి ఎలా యుండదో, అలాగే తన జాగ్రత్ ప్రపంచ వ్యవహారాల మీదకూడ నిత్యత్వ బుద్ధి యుండదు. కనుక అతడు స్వప్న దుఃఖాలకు చలించనట్లు, జాగ్రత్ సుఖ దుఃఖాలకున్నూ పొంగడు క్రుంగడు.

87

జ్ఞాని లక్ష్యం- నిర్వికారము, నిరంజనము, నిత్యము! అయిన తన తురియ స్వరూపమునందేకాని, జాగ్రత్, స్వప్న, సుషుప్తుల మీద కాదని, తన యొక్క చతుర్థ రూపం మీదే ఈ మూటియొక్క క్రీడ అని- జ్ఞానియొక్క దృఢ నిశ్చయము.

88

నీకు తత్త్వ జ్ఞానం దృఢపడిన కొలదీ ప్రపంచం అనిత్యమనే భావం, గట్టిపడుతుంది. అంతేకాని, నీ తత్త్వ జ్ఞానంవల్ల ప్రపంచమనేది నశించదు. తత్త్వ జ్ఞానం మనేది జగత్తు అశాశ్వతమని చెప్తుందేకాని, దానిని స్వరూపం లేకుండా నశింప చేయులేదు. దానివల్ల బాధ లేకుండా మాత్రం చేస్తుంది. ఇందుకు నిదర్శనం తత్త్వజ్ఞులందరు జగత్తు వల్ల బాధ పొందకుండా, అనంత స్వరూపులై యుండటమే

89

ఆత్మానాత్మ వివేకం కలవారు తమ స్వప్న రాజ్యమెలాంటిదో, జాగ్రద్రాజ్యం కూడా అలాంటిదేయని భావన చేస్తూ విషయముల చేత ఆకర్షితులు గాకుండా బ్రహ్మనిష్ఠులై ఉంటారు.

90

జీవుడు లేక చిదాభాసుడంటే బుద్ధిలో ప్రతిబింబించి ఆ బుద్ధికి లోబడి ప్రవర్తించే ఆత్మ ప్రతిబింబమే. గనుక అతనికి బుద్ధి యొక్క కర్తృత్వాది వికారలన్నీ ఉంటాయి. అయినా అతడు తనకు మూలమయిన అధిష్ఠానమును (ఆధారము) విడచియుండడు.

91

సుషుప్తిలోను, సమాధిలోను, చిదాభాసుడు యుండడు. అతడు లేకపోవుటను- సాక్షిచైతన్యము చూస్తూ ఉంటుంది. అందుకని చిదాభాసుని "మాయామయుడే" అని వేదాంతులన్నారు.

92

ప్రతిజీవునికి- స్థూల, సూక్ష్మ, కారణములని మూడు శరీరాలుంటాయి. స్థూలంతో జాగ్రదవస్థను, సూక్ష్మంతో స్వప్నావస్థను, కారణంతో సుషుప్తిని- జీవుడనుభవిస్తాడు.

93

ఈ మూడు దేహాలకు తాపములనేవి ఉన్నవి. స్థూలానికి రోగాలు, వృద్ధిక్షయములు, జననమరణాదు ఉంటవి.

సూక్ష్మానికేమో, కామ, క్రోధ, లోభ, మోహ, దంభ, దర్ప, మద,మాత్సర్యాదులు, శమ, దమ, దయా, దాక్షిణ్యాది సద్గుణాలు కాపాలై ఉంటాయి. సుషుప్తిలో తనను, ఇతరుని ఎరుంగని అజ్ఞానరూపమైన కాపమున్నది. ఈ కాపత్రయమనేది లేకుండా శరీరాలే ఉండవు. శరీరమే నేననుకొనే జీవుడు శరీరాలతోపాటు అవి పొందే కాపాలనుగూడ తానూ అనుభవించవలసినదే. ఇందుకు చిదాభాసునకు (జీవునకు) గల శరీర తాదాత్మ్యమే (అధ్యాస) హేతువు.

94

"నేను ఈ మూడు శరీరములకు భిన్నమయిన కేవలాత్మ స్వరూపుడను" అనే అరూఢ జ్ఞానమున్నట్లయితే అతనిని ఈ శారీరక కాపము లేమి చేయలేవు. వాడు ఏటిని చూచే ద్రష్టగా, సాక్షిగా మాత్రమే ప్రకాశిస్తాడు.

95

ఆత్మజ్ఞాని ప్రారబ్ధము నశించిందనటానికి ప్రాపంచిక వ్యవహారాలు కట్టువడటమే నిదర్శనము. ప్రారబ్ధము నశించనంత కాలము ఎన్నాళ్లో ధ్యానాదులు చేసినా- వ్యవహారం నశించదు.

96

ఒకానొక తత్త్వజ్ఞుడు ప్రాపంచిక వ్యవహారాలు నడుపుతున్నా అతనికవేమీ బాధాకరాలు, బంధకాలు కాకపోవచ్చు. తత్త్వజ్ఞుని లోకవ్యవహారం అతని ఆత్మసిద్ధికి భంగం కాబోదని సారాంశము. ఇవి వారి వారి ప్రారబ్ధమును బట్టి ఉంటవని లోగడ చెప్పుకున్నాము.

97

నీవు నిర్వికార చిదాత్ముడవు. అనే జ్ఞానం కనుక నిశ్చయంగా కలిగితే నీకు జగద్విక్షేపాలు కలుగవు. అప్పుడు నీవు సమాధిలో ఉన్నా ఇతరత్రా ఉన్నా ఇబ్బంది లేదు. విక్షేపము, సమాధి అనేవి, వికారమయిన మనస్సుకేగానినిర్వికార కూటస్థ చిన్మాత్రుడవయిన నీకు గాదు.

98

మాయయొక్క స్వరూపమేమిటో తెలిసి ఉండటం అవుసరం. దాని స్వరూపము తెలిసిన వారు దాని వలలో పడకుండటానికే ప్రయత్నించవచ్చు. మాయ అంటే పరమాత్మ మీద కలిగే ఒక స్ఫూర్తిస్ఫూర్తి సూక్ష్మ స్పందనం అన్నమాట. ఇందుకే దానిని అవ్యక్తమనిగూడ అంటారు. ఆ సూక్ష్మ చలనాన్నుండి అనేక చలనాలు, వికారాలు బయలుదేరుతాయి. వాటిలో నానా విధములయిన జగత్తులు సిద్ధమవుతాయి. ఆజగత్తుయొక్క వైచిత్రి నిన్ను తనవైపునకు మరల్చుకొని నీకు ఆత్మదర్శనం కాకుండా చేస్తుంది. గనుక బ్రహ్మ పదార్థాన్ని నిశ్చలంగా చూడ నేర్చితే నీకు ఏ బాధా ఉండదు.

99

నీకు మాయామర్మము తెలిసిననాడు దాని జోలికి పోకుండా నీవు బ్రహ్మ స్వరూపంతోనే ఉంటావు. అప్పుడు కేవల సచ్చిదానందాలు, సత్యజ్ఞానానందతత్త్వాలు నీస్వరూపమయి నిలుస్తాయి. ఆ సమయంలో నీకు సమాధిలోనికి వెళ్లా

లని సంకల్పం గూడ కలుగుతుంది. నీవు చూచేది వినేది, భావించేది, చేసేది అంతా తురీయ స్వరూప పరబ్రహ్మంగానే ప్రకాశిస్తుంది. ఈ దశ ఎంతో విచిత్రమైనది సుమా!

100

నిత్యానుభవ స్వరూపుడైన వాడికి, చేయదగినదీ, చేసిన దాని చేత పొందదగినదీ ఏదీ యుండదు. అతడు శరీరాన్ని ప్రారబ్ధ కర్మకు అప్పగించి, తాను పరంధాముడై ప్రకాశిస్తూ ఉంటాడు.

101

తత్త్వజ్ఞునియొక్క దేహేంద్రియాలు. విగ్రహారాధన, యోగాభ్యాసాది క్రియలలో ప్రవర్తించినా, బ్రహ్మానందంలో మునిగియున్నా, అతడు వాటన్నిటిని చూచే సాక్షిమాత్రుడుగానే ఉంటాడుగాని, "ఇది చేస్తున్నాను" అనే భావనకు లోనుగాడు.

102

ఆ యా పనులుచేసే దేహేంద్రియాలు సంగములేనివి, నిర్లిప్తములు కావు వాటిని, వాటి క్రియా కలాపాన్ని చూచే సాక్షికి సంగముకాని, కర్మలను చేసే బాధ్యతగాని, లేనే లేదు. ఈ రహస్యము తత్త్వజ్ఞులకు తెస్సగా తెలుస్తుంది.

103

ఆ యా పనులు చేయాలని కాని, చేయరాదని కాని, (ప్రవృత్తి, నివృత్తులు) కోరనివాడే మహాజ్ఞాని. ప్రవృత్తి,

నివృత్తి అనేవి ద్వంద్వాల క్రిందకు వస్తవి. జ్ఞానిస్థితి, ద్వంద్వాతీతమయినట్టిది. అతడు ఆ రెంటినీ దాటి నడచుకుంటాడు.

104

ప్రవృత్తిగాని, నివృత్తిగాని, జ్ఞానం కలగటానికి సాధనాలేగాని, జ్ఞానం కలిగిన తరువాత వాటివల్ల సిద్ధించే ప్రయోజనము ఏమీ లేదు. బ్రహ్మాత్మైక్య పరోక్ష జ్ఞానం కలిగిన తరువాత, అజ్ఞానం దేహాంపడిపోయేటందవరకు దృఢంగానిలిచే ఉంటుంది. కాని దేనిచేత నశింప చేయబడదు. కనుక ప్రవృత్తి, నివృత్తి లనేవి- జ్ఞాని విషయంలో ప్రారబ్ధాన్ని అనుసరించే ప్రవర్తిస్తాయి.

105

తత్త్వజ్ఞానం కలుగగానే, అవిద్య (అజ్ఞానము) దాని కార్యమయిన జగత్తు బాధింపబడుతాయి. ఒకసారి బాధింప (చంప) బడినది మళ్లీ బ్రతకడము, బ్రతికి జ్ఞానిని తిరిగి బాధించటము అంటూ జరుగదు. అజ్ఞానావస్థలోనే వాటి ప్రభావము.

106

జ్ఞానం కలిగినప్పటికీ, దృశ్యాలు అనేవి- అప్పుడప్పుడు తత్త్వజ్ఞుని బాధిస్తాయేమో అనికూడ శంకించకూడదు. ఎలుక బ్రతికి ఉన్నప్పుడే పిల్లిని చంపలేదు. చచ్చిన పిమ్మట ఎలా చంప గలుగుతుంది. అలా తత్త్వజ్ఞాన బాధితమయిన అవిద్య, దాని కార్యాలయినదృశ్యాలు, జ్ఞానికి కీడుచేయలేవు అంటే అతని బ్రహ్మజ్ఞానాన్ని నశింపచేయ లేవన్న మాట.

107

నీవు బ్రహ్మవేత్తవయినా, బ్రహ్మవేత్తలు కాని వారితో కలసి వారు చేసే పనులలో భాగస్వామివి అయిన ప్పుడు, దానివల్ల నీకు కలిగే నష్టమేమీ లేదు. అది లోకానుగ్రహము కోసం చేసే సత్కార్యమే అవుతుంది. దానివల్ల నీకు లాభనష్టా లేమీ ఉండవు.

108

అజ్ఞానులకు జ్ఞానం కలిగే రీతిగా, జ్ఞాని ప్రవర్తిస్తాడు. ఆ ప్రవర్తనవల్ల అతనికి బంధ మనేది ఏది కలుగదు.

109

"త్వం" అనే పదానికి, వాచ్యార్థ మయినవాడు- చిదా భాసుడు (జీవుడు), లక్ష్యార్థమయినవాడు- కూటస్థుడు.

110

చిత్తు అనే మాటకు ప్రకాశము, జ్ఞానము అనే అర్థ ములున్నా, చిత్తు యొక్క ప్రతిబింబము (చిదాభాసుని) తో గూడిన చిత్తవృత్తికి గూడ, జ్ఞానమనే మాట చెల్లుతుంది.

111

"అంతఃకరణ తద్వృత్తి సాక్షీ చైతన్య విగ్రహః ఆనందరూప స్సత్యస్సన్ కింనాత్మానం ప్రపద్యసే" అంతః కరణానికి, దాని యొక్క, కామ క్రోధ శమ, దమ, సంకల్ప వికల్పాది వృత్తులకు ప్రకాశకుడవు, (ప్రకాశము లేక జ్ఞానము) సత్యానంద స్వరూపుడవు అయికూడ- నిన్ను నీవు ఎందుకని ఎఱుంగ లేకున్నావు! అని శ్లోకార్థము. దీనిని ప్రతిపాదకుడు

చక్కగా భావన చేసి అనుభూతి పొందితే బ్రహ్మ సాక్షా త్కారము సులభమవుతుంది ఇందులో బ్రహ్మము యొక్క సత్యము, జ్ఞానము, ఆనందము అనే స్వరూపము సుస్పష్టంగా పేర్కొనబడినవి.

## 112

లోకంలో- ముఖము, అద్దము, అద్దములోని ప్రతిబింబ మున్నట్లే తత్త్వంలో కూడ; కూటస్థుడు, అంతఃకరణోపాధి చిదాభాసుడు అనేవి ఉన్నవి. 'అద్దాన్ని' ఉపాధి అని, 'ముఖాన్ని' బింబమని, అద్దంలోని 'ముఖాన్ని' ప్రతిబింబమని అంటారు. అలాగే బుద్ధ్యుపాధి లేక అంతఃకరణోపాధిలోని ఆత్మ ప్రతిబింబాన్ని 'చిదాభాసుడని', దానికి మూలమయిన ఆత్మ బింబాన్ని 'కూటస్థుడనీ' అంటారు. జన్మ జరామరణ, సుఖదుఃఖాలు ఉపాధి సహితుడయిన చిదాభాసునకే గాని, కూటస్థాత్మకు లేవు. జ్ఞాని తనను, కూటస్థునిగానే అనుభూతి పొందుతాడుగాని, చిదాభాసుడని అనుకోనడు.

## 113

కొద్దిగా ప్రకాశించే దానికి ఆభాసమని పేరు. ఆభా సకు- అంటే ప్రతిబింబానికి,ఉపాధిలోని గుణదోషాలు సంక్ర మిస్తాయి. బింబానికి అవి సంక్రమించవు. అందుకనే ఉపాధిని పొందియున్న కర్తృత్వాదులు చిదాభాసునికి సంక్రమిస్తు న్నాయి. కూటస్థునికి అవి సంక్రమించటం లేదు. ఒక్కొక్క అద్దాన్ని బట్టి అందులోని ప్రతిబింబము పొడుగుగాను, వెడల్పుగాను, మురికిగాను, స్వచ్ఛంగాను కనబడుతుందిగదా!

అలాగే ఉపాధినిబట్టి జీవులలోని దేవ, మనుష్య, జంతు, పతంగ, క్రిమి, కీటకాది భేదాలు. వాటిలోని అంతర్భేదాలు ఏర్పడుతాయి.

114

ఒక్కటే అయిన సత్యవస్తువు బ్రహ్మము, కూటస్థుడు, చిదాభాసుడు అనే పదాలచేత చెప్పబడినది. శరీరేంద్రియా లతో తాదాత్మ్యమును పొందిన చిదాభాసునికి మూల మయిన చైతన్యమే కూటస్థుడు. సమస్త విశ్వములకు ఆధార భూతమై సర్వ వ్యాపకమయిన మహా చైతన్యమే బ్రహ్మము. అంతఃకరణోపాధియందు చిత్తు ఆభాసించినది గాన, అది చిదాభాసుడని చెప్పబడినది. తత్త్వాన్ని విచారిస్తే బ్రహ్మమన్నా, కూటస్థుడన్నా ఒక్కటే.

115

సమస్త జగత్తులు కల్పింపబడటానికి, ఆధారమయిన అఖండ బ్రహ్మమునే, "తత్" అనే పదానికి అర్థమన్నారు. ఆ జగత్తులోని అంతఃకరణోపాధి కల్పనకు ఆధారమయిన చైతన్యాన్ని "త్వం" అనే పదానికి అర్థమన్నారు. ఈ కల్పి తాలయిన జగత్తులను అంతఃకరణోపాధులను వదలిపెట్టి చూచితే మిగిలేది అఖండ చైతన్యమైన పరబ్రహ్మమే!

116

నీ ఆత్మ అనేది అంతఃకరణములో సంకల్ప వికల్పాదు లయిన వృత్తులు పుట్టినప్పుడు వాటిని తెలిసికొంటున్నది. ఆ యా వృత్తులు పుట్టకుండా ఉన్నప్పుడుకూడ, వాటి అభా

వాన్ని తెలిసికుంటున్నది. నా కేమీ తెలియదు అనుకొంటున్న ప్పుడు 'దాన్ని' తెలిసికొంటున్నది. నా కిది తెలిసినది అను కొంటున్నప్పుడు. దాన్ని కూడ తెలిసికొంటుంది. ఇవ్విధంగా అన్నిటిని తెలిసికొనుటవల్లనే ఆత్మ వాటికన్నిటికి ప్రకాశకము, సాక్షి అవుతున్నది. ఇక్కడ అన్నిటిని ప్రకాశింపచేయుటయే సాక్షిగా ఉండటమంటే అని గ్రహించాలి. సాక్షిని సాక్షిగా చూడలేక, అజ్ఞానంవల్ల జీవుడు ఆ వృత్తులతో తాదాత్మ్యన్ని పొంది సుఖదుఃఖాలకు గురి అవుతున్నాడు

117

మాయలో ప్రతిబింబించిన బ్రహ్మము ఈశ్వరుడు. అవిద్యలో ప్రతిబింబించిన బ్రహ్మము జీవుడు. కనుక జీవేశ్వరులనే జంటను ఒక మాయయే కల్పించుకుంటుంది. రజస్తమో గుణాల కలయిక లేని మూల ప్రకృతిని మాయ అని, వాటి కలియిక కలదాన్ని అవిద్య అని గ్రహించాలి. ఈశ్వరునికి జీవునికీ మాయ, అవిద్య అనేవి రెండూ ఉపాధులు గనుక వారుభయులు మాయచే కల్పితులైన మాయికులు. ఆ ఉపాధులను వదలి చూస్తే జీవేశ్వరు లిద్దరు ఉపాధికి అతీతమయిన అఖండ బ్రహ్మ పదార్థమే! ఇదే అసలు తత్త్వజ్ఞాన మంటే.

118

జీవేశ్వరులు మాయ చేత కల్పింపబడినవారైనా కూటస్థుడు మాత్రము మాయికుడుగాదు. అతనికి మాయతో

సంబంధము రవ్వంతకూడ లేదు. వాడు శుద్ధ సత్యస్వరూపుడు-అసంగుడు. బంధ మోక్షాదులు కూడ అతనికి లేవు.

119

స్థూల శరీరం అన్నం వల్ల కలుగుతుందని అందరకు తెలుసు. లోపలి ఇంద్రియమైన మనస్సు కూడ అన్నం వల్లనే కలిగిన సూక్ష్మ వికారమని శాస్త్రమంటున్నది. ఈ రెండూ అన్నసంభవాలైనా, స్థూల మయిన దేహం కంటె మనస్సు-సూక్ష్మము, నిర్మలమును. అలాగే మాయవల్ల కలిగిన జీవేశ్వరులలో కూడ జీవుని కంటె ఈశ్వరుడు శక్తిమంతుడు!

120

మనస్సుకు వాక్కులకు అందని ఆత్మ తత్త్వమును గూర్చి బోధించాలంటే గురువులకుగాని, శాస్త్రిలకుగాని జీవ, ఈశ్వర, జగత్తులనే మూడింటిని ఆశ్రయించక తీరదు.

121

జీవేశ్వర జగత్తులనేవి మాయచేత కల్పింపబడినట్టివి. శుద్ధ బ్రహ్మమే మోక్షము-. నిరుపాధికము, నిరపేక్షము, నిర్గుణము.

122

బ్రహ్మమునుగూర్చి బోధించటానికి ఎన్నెన్నో బోధనా పద్ధతులను అవలంభింపవచ్చు. ఎవరెవరు ఏ యే పద్ధతులను స్వీకరించినా ప్రతిపాదించబడే బ్రహ్మ పదార్థము మాత్రము ఒక్కటే!

123

గురువు తనకు "నాయనా నీవు బ్రహ్మమురా" (తత్త్వమసి) అని చెప్పినంత మాత్రాన ఎవరికీ బ్రహ్మ సాక్షాత్కా-

ర్థము కలుగదు, ప్రతి సాధకుడు తనకు తానై, తాను దేహేం ద్రియ, ప్రాణ, మనో, బుద్ధ్యాదులు కాదనీ, సచ్చిదానంద స్వరూప ప్రత్యగాత్మ్మదనీ, నిరంతరం శ్రవణ, మనన, నిది ధ్యాసములను చేస్తేగాని బ్రహ్మ సాక్షాత్కారము కాదు.

124

శాస్త్రములో సంవాది భ్రమ, విసంవాది భ్రమ అని రెండు భ్రమలున్నాయి. వాటిలో సంవాది భ్రమ వల్ల ప్రయోజనం కలుగుతుందిగాని, విసంవాది భ్రమ వల్ల కలుగదు. ఒకడు సన్నిపాత జ్వర ప్రభావమువల్ల కోరుకొన కుండానే భగవన్నామ స్మరణ చేశాడనుకోండి. వాడికి దాని ఫలం కలిగి తీరుతుంది. నిప్పుని తెలియక తాకినా కాలు తుంది కదా!

125

యథార్థ జ్ఞానంవల్ల కూడ తాత్కాలీయంగా గాని, దైవికంగా గాని ప్రయోజనం చేకూరితే దానిని సంవాది భ్రమ అంటారు. ఇందుకు పై సన్నిపాత రోగి కదే ఉదాహరణ.

126

కన్నులతో చూడటానికి, అది రాయిగాఉన్నా, దాని యందు దైవత్వారోపణ చేసి, దాన్ని దైవమనుకొని పూజించడం, లోకసిద్ధమయిన విషయము. దీనిని గూర్చి విచారణ చేయవలసిన పని లేదు. "అహం బ్రహ్మాస్మి" అనే వాక్యం అనుభవానికి రావాలంటేనే చిరకాలం గురువులను, శాస్త్రాలను ఆశ్రయించి, విచారణ చెయ్యాలి. అలా చేస్తేనే కాని, నీకు ఆత్మ సాక్షాత్కారం కలుగదు.

127

మట్టి, కొయ్య, రాయి మొదలయిన వాటితో చేసిన మూర్తులయందు దేవతా బుద్ధి కూడ ఈ సంవాదిభ్రమ క్రిందకే వస్తుంది. అందుకనే శిలాది నిర్మితమూర్తులు కోరికలను తీర్చేవి, మోక్షాన్ని ఇచ్చేవి అవుతున్నాయని శాస్త్ర నిర్ణయము.

128

ఒకటి, రెండు, మూడుసార్లు విచారించి నాకు బ్రహ్మ సాక్షాత్కారము కాలేదని నిరుత్సాహ పడకూడదు. అది కలిగేటంతవరకు విసుగు చెందకుండా శ్రద్ధతో శ్రవణ, మననాదులు చేయవలసినదే. అలా చేస్తుంటే ఈ జన్మలో కాకపోయినా, వచ్చే జన్మలోనయినా నీకు బ్రహ్మ సాక్షాత్కారమవుతుంది.

129

బ్రహ్మ సాక్షాత్కారము కాకపోవటానికి హేతువులు- కొన్ని ప్రతిబంధకాలే. ఇవి, పూర్వ పూర్వ జన్మల నుండి వెంటాడుతున్న ప్రారబ్ధ కర్మ ఫలితాలు. అవి తొలగినవాడు తప్పక బ్రహ్మ సాక్షాత్కారము కలుగుతుంది.

130

వామదేవుడనే మహర్షికి, ఆ యా జన్మలలో విచారం చేసినా ఆత్మసాక్షాత్కారము కలుగలేదు. ఒక జన్మలోని శరీరమనే ప్రతిబంధకం పోయి ఇంకొక శరీరం స్వీకరించగానే (ఆ జన్మలో) తామ తల్లి గర్భంలో ఉన్నప్పుడే బ్రహ్మ సాక్షా

త్కారమయినదని ఋగ్వేదము చెప్పుతున్నది. కనుక ప్రతి
బంధకాలనేవి ఈ సాక్షాత్కారానికి అడ్డంకులు.

131

నీవు చూస్తున్న దేహమూ నీ స్వరూపం కాదు.
నీవు చూచేవన్నీ కర్మ (object) స్థానంలో ఉంటాయి.
నీవేమో చూచేవాడుగా కర్త (subject) స్థానంలో
ఉంటావు. నీవు ప్రపంచములోని వస్తువులన్నిటినీ, చివరకు నీ
శరీరాన్నీ, దాని అవయవాలను గూడ చూస్తూనే యున్నావు.
కనుక అవి నీ స్వరూపాలు కావనుకో! అలాగే, నీవు తెలిసి
కొనే వస్తువులుకూడ నీవు కావు. అవి గూడ నీచేత. తెలిసికో
బడుతూ కర్మస్థానంలోనే ఉంటున్నాయికదా! అప్పుడు, నీ
ప్రాణం, మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు వాటిలో పుట్టే
సంకల్ప వికల్పాలు, కామక్రోధాలు, దయాదాక్షిణ్యాలు,
ఇవి అన్నీ నీచే తెలిసికోబడుతున్నాయి గనుక అవి నీ స్వరూ
పాలు కావు. వాటిని తెలిసికొనే స్వభావం కల నీవే నీవంటే!
తెలిసికొనే స్వభావం, జ్ఞానాని కొక్క దానికే ఉంటుంది.
దాన్ని చిత్తు అనే పదంతో వ్యవహరిస్తారు. ఆ చిత్తు తాను
స్వయంగా ప్రకాశిస్తూ, స్వయంగా ప్రకాశించలేని, జడ వర్గ
మును, ప్రాపంచిక వస్తువులను, మనో బుద్ధ్యాదులను, సంకల్ప
వికల్పాదులను, అంతరింద్రియ విషయాల నన్నింటినీ ప్రకా
శింప చేస్తుంది. కనుక అదే నీవన్నా నీ స్వరూపమన్నా.
దానిలో తరతమ భేదాలుకాని, గొప్ప-కొద్దులు కాని, ఏమీ
లేవు. అది ఏకరసం. సుషుప్తిలో అజ్ఞానమే మిగులుతుంది.

దాని స్వరూపం- ఆనందం కూడా అని అక్కడ తెలిసి కొంటావు. అది నిత్యానందమయినా, జాగ్రత్ స్వప్నము లలో జగద్విషయాల సంబంధమువల్ల ఆ ఆనందం గోచ రించటం లేదు. అది, మనస్సు శాంతంగా ఉన్నప్పుడే గోచ రిస్తుంది. కనుక నీవు ఆనంద స్వరూపుడవు కూడా.

ఇంకొకటి, నీ స్వరూపం శాశ్వతంగా ఉండటం. నిన్న, మొన్నా గడచిపోయినా, నీవు మాత్రం ఉండనే ఉన్నావు. రేపూ, రాబోయేకాలంలోను నీవు ఉంటావు. ఇంత ఎందుకు. ఈ స్థూల దేహం నశించినా, నీ వనేవాడు- ఇంకొక జన్మలో, ఇంకొక శరీరములోకి చేరి తీరుతాడు. గనుక నీవు శాశ్వతుడ వని తేలిపోతుంది. అంటే సత్తు అన్నమాట. కాగా నీకు సత్తు, చిత్తు, ఆనందమే స్వరూపము. నీవు చిన్మయుడవు. సచ్చిదానందాత్మకుడవు. ఈ సంగతని నిత్యం మననం చేస్తూ అనుభవానికి తెచ్చుకుంటే దుఃఖంగాని, జడత్వంగాని, నీ తత్త్వంకాదని తెలుస్తుంది. అవి మూడు నీకు భిన్నమయిన జగత్తు యొక్క లక్షణాలు. నీవు నిన్ను జడ జగత్తుగాను, జడ శరీరంగాను భావించటం వల్లనే సర్వదోషాలు, సర్వ దుఃఖాలు నిన్ను చుట్టుముట్టుతున్నాయి. నీవసలు సచ్చి దానంద విగ్రహుడవు, శాంతుడవు, శివుడవు, తెలిసిందా!

132

సగుణోపాసనవల్ల ఈశ్వరానుగ్రహం కలిగి, అది నిర్గుణో పాసనకు దారితీస్తుంది. ఆ నిర్గుణోపాసన వల్లనేమో, బ్రహ్మ

సాక్షాత్కారము కలుగుతుంది. బ్రహ్మ సాక్షాత్కారం అన్నా, ఆత్మప్రాప్తి అన్నా, మోక్షమన్నా ఒక్కటే.

133

సగుణోపాసకునికి, కోరికలుంటే ఉండవచ్చును. కాని, నిర్గుణోపాసకునికి అట్టి వాంఛలేమి ఉండవు. అతడు కేవలము బ్రహ్మ సాక్షాత్కారం కోసమే యత్నిస్తాడు.

134

'పరం' అంటే నిర్గుణం. 'అపరం' అంటే సగుణం. పర బ్రహ్మము అన్నప్పుడు "నిగుణ బ్రహ్మమని"యే భావం కదా. అపరబ్రహ్మ మంటే "సదుణ బ్రహ్మమని" తాత్పర్యము. బ్రహ్మ, విష్ణు, రుద్ర, శక్తి, సూర్య గణపత్యాదుల రూపాలు సగుణాలే.

135

సాధకుడికి, బ్రహ్మానుభూతి కలుగకపోయినా, "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మమును అని, బ్రహ్మానుభవం కలిగే వరకు ధ్యానం చేస్తూ ఉండవచ్చు. ఇలా చేస్తూ ఉండగా ఎప్పుడో ఒకప్పుడు ప్రతిబంధ నివృత్తి కలిగి బ్రహ్మానుభూతి సిద్ధిస్తుంది. కేవల ధ్యానము వల్లనే అనేక సిద్ధులు కలుగుతూ ఉండగా సిద్ధవస్తువైన ఈ బ్రాహ్మీస్థితి ఎందుకు కలుగదు?

136

నేను బ్రహ్మమును- అనిధ్యానించుటవల్ల కొన్నాళ్లకు తాను శరీరం కాదని, మనోబుద్ధ్యాదులు కాదని జ్ఞానం కలుగుతుంది. ఇక అప్పుడు వాటికి సాక్షిగా ఉన్న ప్రత్య

గాత్మ తాననే జ్ఞానము, దాని వెంటనే బ్రహ్మజ్ఞానము కలిగి తీరుతుంది.

137

అసలు ఆత్మకాని, బ్రహ్మముకాని ఒక్కటే. ఆ ఆత్మ దేవతాదుల సాత్విక ఉపాధులలో ప్రవేశించి ఉపాసింపబడు తున్నది. మానవాదుల రాజస ఉపాధులలో ప్రవేశించి ఉపాసన (పూజ) చేస్తున్నది. ఈ ఉపాధులను విడిచి చూస్తే మిగిలేది ఏక రూపమగు అఖండ బ్రహ్మమే.

138

రెండో వస్తువు లేని తనకు రెండో వస్తువయిన దేహాదులతో సంబంధం ఉన్నదను కొనడమే బంధమంటే. అలా కాక ఏక మాత్రుడయిన తన యందు తాను నిలచి, రెండవ దానిని, శాశ్వతం కాదని తెలుసుకొనటమే ముక్తి.

139

అద్వైతమును, లేదనటానికి వీలులేదు. అద్వైతము కానిది ద్వైతము కావాలి. కాగా ద్వైతమునకు పూర్వము ఉన్నదేదో చెప్పవలె. ద్వైతానికి పూర్వం ద్వైతమే ఉన్న దనటం తగదు. ద్వైతంనుండి, ద్వైతం పుట్టడానికి వీలులేదు. ఏ వస్తువుగాని, తననుండే తాను పుట్టదు గదా! కనుక ద్వైతానికి పూర్వం అద్వైతం ఉండి తీరాలి. ద్వైతా ద్వైత మనేది పరస్పర విరుద్ధము గనుక అట్టిదసలు ఉండటానికి వీలే లేదు. కనుక అద్వైత మనేది సిద్ధవస్తువే. ఈ సంగతినే "నాసదాసీత్ - నోసదాసీత్" అనే ఋక్కు చెప్పుతున్నది.

140

ప్రతివాడు సుషుప్తిలో అద్వైత స్థితిని, అంటే పదార్థ భావ రూపమయిన కేవల స్థితిని అనుభవిస్తున్నాడు గనుక అద్వైతం అనుభవసిద్ధమేకాని, వేరుగాదు. సుషుప్తిలో లాగానే, మూర్ఛావస్థలోను, సమాధిలోను అద్వైతం వ్యక్త మవుతూ ఉన్నది.

141

సుషుప్తిలో అనుభూతమయ్యే అద్వైతానికి ఆనందమే స్వరూపము. గ్రుడ్డికి, కుంటికి తాను గ్రుడ్డినని గాని, కుంటి నని గాని, ఆ దశలో తెలియదు. రోగికి రోగ బాధా ఉండదు. దుఃఖాలన్నీ ఆ సమయంలో శమించి కేవలానందమే మిగులుతుంది. అప్పటి దుఃఖ భావమే ఆనందమంటే.

142

ప్రాపంచిక సుఖదుఃఖాలన్నీ, మనస్సుతోగూడ అజ్ఞానంలో లీనం కాగా, జీవుడప్పుడు బ్రహ్మంతో జతపడి, ఆనందరూపుడై యుంటాడు. ఈ సంగతిని, నిద్రనుండి లేచిన వాడు "నాకేమి తెలియలేదు, ఆనందంగా ఉన్నది" అని చెప్పటం వలన అప్పుడు అజ్ఞానము, ఆనందము ఉన్నాయని తెలుస్తుంది.

143

చిత్తు చలించుట అనగా పేరుకొన్న నేయి, ద్రవమగుట వంటి స్థితి. అది పేరుకొన్నను, ద్రవీభావము చెందినను, నేయియేకాని భిన్నము కాదు. పేరిన నేయి చలించదు. ద్రవీభవించినది ప్రవాహ రూపముగా గూడ సాగిపోగలదు.

144

బుద్ధి వృత్తులు సూక్ష్మములయినా, విస్పష్టంగా తెలుస్తాయి. అజ్ఞానవృత్తులు అతి సూక్ష్మములై విస్పష్టములు కాకపోవటంవల్ల, వాటిని తత్త్వవేత్తలు తప్ప అజ్ఞానులు తెలిసికోలేరు. సుషుప్తిలోని అజ్ఞాన వృత్తులు అలాంటివి.

145

మనము ఒకసారి చూచిన వస్తువులను, అవసరమయినప్పుడెల్లా జ్ఞప్తికి తెచ్చుకోగలము. అలాగే స్వయంగా ప్రకాశించే చైతన్య స్వభావము గల ఆత్మ ఎల్లప్పుడు జ్ఞప్తిలో ఉండాలి అది తక్కిన వస్తువుల వలె జడ పదార్థముగాక నీ స్వరూపమయిన చైతన్యమే గనుక, దాన్ని గుర్తుంచుకోవటము తేలికకూడ.

146

తత్త్వ జ్ఞానమంటే బ్రహ్మమును కనుకింప చేసే చిత్తవృత్తి (మనో వ్యాపారము). ఆ చిత్త వృత్తి, క్షణ క్షణానికి మాయం కావచ్చు. కనుక సాధకునికి చిత్తైకాగ్రతతో కూడిన బ్రహ్మాకారవృత్తి ఎల్లప్పుడు నిలచి ఉండటము అవసరము.

147

ఒకసారి నీకు బ్రహ్మ సాక్షాత్కారమయితే, దాన్ని గూర్చి నీవు ఇష్టమయినప్పుడెల్లా చెప్పనూవచ్చు. ధ్యానించనూవచ్చు. దానికోసము లోక వ్యవహారము లేమీ మానుకోనక్కరలేదు.

148

ధ్యానమనేది చిత్త విక్షేపము (క్షోభ, చలనము) పోవడానికి సాధనమే కాని, మోక్షమునకు హేతువు కాదు. మోక్షానికి హేతువు జ్ఞాన మొక్కటే. కైవల్య మనేది జ్ఞానం వల్లనే కలుగుతుంది. కనుక జ్ఞాని ధ్యానానుష్ఠానము చేసినా చేయకపోయినా అతనికి దానివల్ల కలిగే ప్రయోజన మేమీ ఉండదు. ఇందుకు రమణ మహర్షి, రాజాపాలెం అమ్మారే ఉదాహరణము.

149

శారీరకంగా కాని, మానసికంగా కాని, కుటుంబ సంబంధముగా కాని, ఏదో ఒక ఇబ్బంది కలిగితేనే కాని మానవులకు తత్త్వ జిజ్ఞాస కలుగదు. ఏ ఎదురు దెబ్బ తగలకుండానే, సహజంగా తత్త్వ జిజ్ఞాసకు పూనుకొనేవారు చాల తక్కువగా ఉంటారు. ఉదాహరణకు చూడండి. తనకో, భార్యకో, బిడ్డకో, ఏదో రోగమో, ఆపదో కలిగితేనే కాని తిరుపతి వెంకన్న గుర్తుకురాడు. అప్పుడు కాని ఆయన మ్రొక్కుబడులు కొనసాగవు. ఈ కష్టాలు ఒక్కొక్కసారి వ్యక్తుల సంస్కారాన్ని బట్టి ఆత్మ జిజ్ఞాసకు కూడ దారి తీస్తవి. అందుకే కుంతీదేవి తనకు ఎప్పుడు ఆపదలు కావాలని శ్రీకృష్ణుని కోరుకొన్నది.

150

నీకు ప్రపంచ విషయాల మీద కలిగే విరక్తినిబట్టి (అంటే దాని హెచ్చు తగ్గులను బట్టి) కాని తత్త్వజ్ఞాన మనేది

బోధపడదు. నీ వైరాగ్యాన్ని బట్టి, నీకు ఆత్మాదుల తత్త్వము బోధపడుతుందని దీని సారాంశము. తీవ్ర వైరాగ్యము కల వాడు తత్త్వాన్ని గాఢంగా అర్థం చేసుకుంటే, మంద వైరాగ్యపరుడు మందంగానే తత్త్వాన్ని గ్రహిస్తాడు.

151

సాధారణంగా ప్రతి సాధకుడు కర్మలను వదలిపెట్టాలని (సంన్యసించాలని) అనుకుంటూ ఉంటాడు. కాని అందులో గొప్పతనమేమీ లేదు. కర్మలే తనను వదలిపెట్టి పోయే స్థితి కలగటమనేది ఎంతో గొప్ప. నీకు పరిపక్వస్థితి కలుగుతున్న కొద్దీ, కర్మలే నిన్ను వదలిపెట్టి పోతాయి.

152

తత్త్వజ్ఞానముయొక్క రుచి మరిగినవాడు, ఇక దాన్ని వదలి పెట్టలేడు. ప్రపంచ విషయాలే మధురాలు అనుకునే వాడు కూడ వాటిని వదలి, తత్త్వజ్ఞానం యొక్క జోలికి రాలేడు. తత్త్వజ్ఞానపు రుచి నీకు తెలియటానికి లోక విషయాలపై మొగం మొత్తడమే జరుగవలసిన పని. లోక విషయాల అరుచుకి, తత్త్వజ్ఞానపు రుచికి చాలా తేడా ఉంటుంది.

153

బోధ వేరు, ఉపాసన వేరు. బోధ అనేది వస్తుతత్త్వ విచారణవల్ల కలిగే వస్తుస్వరూప జ్ఞానం. ఉపాసన అంటే ఉపాసకుని యొక్క భావనను బట్టి ఏర్పడేది. మొదటిదేమో

వస్తు స్వరూపాధీనం కాగా, రెండవది పురుష భావనకు అధీన మయి ఉంటుంది. సాల్గ్రామమును చూచి అది రాయియే అనుకొనడం జ్ఞానం. అలాకాక అది సాక్షాత్తు శ్రీ మహా విష్ణువు యొక్క స్వరూపమనుకొనడం ఉపాసన లేక భావన. వీటిలో రాయి అనే భావం, వస్తు స్వరూపమును బట్టి ఏర్ప డగా- విష్ణువనే భావము, ఉపాసకుని భావనను బట్టి ఏర్పడినది. కాని అసలు వస్తువు మాత్రం రాయే.

154

ప్రపంచ విషయాల మీాద ఆసక్తి కలవారు, కర్మలు చేసి, చిత్తశుద్ధిని పొందాలి. విషయముల మీాద విరక్తి కలవారు ధ్యానము, ఉపాసనా చేసి బ్రహ్మాత్మైక్య జ్ఞానమును పొందాలి. ముక్తికి- కర్మలు, భక్తి పరంపరా సాధనాలు. జ్ఞానమే మోక్షానికి సన్నిహిత సాధనం. అంటే కర్మల వల్ల, భక్తి వల్ల, జ్ఞానంకలిగి అది మోక్షానికి దగ్గరి సాధనము అవుతుందన్న మాట.

155

యోగమంటే ఆసన, ప్రాణాయామాదులే కాదు. యమ నియమములలోని సత్యం, అహింస, శౌచము, సంతోషము ఇత్యాదుల యొక్క సమాయోగమని కూడ అర్థమే. కనుక సత్యాన్ని గాని, అహింసనుగాని, మరొక సద్గుణాన్ని కాని అలవరచుకొని, ఆచరించటం కూడ యోగమే అవుతుంది తనలో ఇంతవరకూ లేని ఏ సద్విషయాన్ని కాను సంపా దించుకొన్నా, అది యోగమే. నిన్ను ఉద్ధరించే పారమార్థి

కాంశములో కలుసుకోవడమనేదంతా యోగమే అనుకో. అప్పుడే 'యోగ' శబ్దానికి వ్యాపకమయిన సంపూర్ణార్థము లభించినట్లు.

## 156

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనే పంచకోశములను వేరుచేసి, వాటికంటె భిన్నమయిన, ఆత్మను పొందటమే- ఆత్మవిచారణ అన్నా విచారణ అన్నా.

## 157

ప్రతి మానవుడు పగటివేళగాని, రాత్రులందుగాని, జాగ్రత్తు, స్వప్నమూ, సుషుప్తి అనే దశలను అనుభవిస్తూనే ఉంటాడు. ఈ మూడవస్థలు, వస్తూ పోతూనే ఉంటాయి. ఈ మూటికి ఆశ్రయమైనవే స్థూల, సూక్ష్మ, కారణదేహాలు. ఈ మూడు దేహాలను, వాటి అవస్థలను తెలిసికొంటూ ప్రకాశింప చేసే చైతన్యమే, జ్ఞానమే, ఆత్మ అంటే!

## 158

దీపమునకు వెలుగు, వేడిమి- స్వభావాలైనా, దీపము యొక్క వెలుగే ఇంట్లో వ్యాపిస్తుందికాని, వేడిమి వ్యాపించదు. అలాగే ఆనందము, జ్ఞానము, ఆత్మకు సహజాలైనా బుద్ధి వృత్తులలో జ్ఞానం వ్యాపించినట్లు, ఆనందం వ్యాపించదు. ఎలాగంటే, అగ్నిలోని వేడిమి-వెలుగు అది కొయ్యను ఆశ్రయించినప్పుడే ప్రకాశిస్తాయి. కాగబెట్టిన నీటిలో ఉష్ణమే ఉంటుందికాని, వెలుగు ఉండదు. అవగా నీరు అగ్నిలోని

ఉష్ణమును మాత్రమే ఆకర్షిస్తుంది గాని, వెలుగును ఆకర్షించలేదు. అలాగే బుద్ధి యొక్క సత్త్వగుణ వృత్తిలో మాత్రమే, ఆనందం వ్యాపిస్తుంది. రజస్తమో వృత్తులలో ఆనందం వ్యాపించదు. వాటిలో జ్ఞానం మాత్రమే ప్రకాశిస్తుంది. ఇందుకు నీళ్లనే గాకుండా, ఇంకొక ఉదాహరణను గూడ చెప్పుకొందాము.

ఒక వస్తువులో, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే గుణాలున్నప్పటికీ, 'కన్ను' రూపాన్ని మాత్రమే గ్రహిస్తుంది. తక్కినవి గోచరించటానికి తక్కిన ఇంద్రియాలను ఉపయోగించాలి. అట్లాగే, కొన్ని బుద్ధి వృత్తులేమో చైతన్యాన్ని, మరికొన్ని బుద్ధి వృత్తులేమో ఆనందాన్ని గ్రహిస్తాయని తెలిసికోవాలి.

159

బుద్ధికి సాత్త్విక వృత్తులు కలిగినప్పుడు, అందులో చిత్తు ఆనందము, రెండూ ప్రతి ఫలిస్తాయి. రజ, స్తమో వృత్తులు కలిగినప్పుడు వాటిలో చిత్తు (జ్ఞానం) మాత్రమే ప్రతి ఫలిస్తుంది కాని, ఆనందం ప్రతి ఫలించదు.

160

బ్రహ్మము, జగత్తుగా తోచటంవల్లనే, నీకు బ్రహ్మమనే పదార్థ మొకటి ఉన్నదని తెలిసికొనడానికి, అవకాశము కలిగింది జగత్తే లేకపోతే బ్రహ్మమును గూర్చి విచారించవలసిన పనే యుండదు. జగత్తు ఏర్పడ్డ తరువాతనే, ఆ జగత్తులో ఒకదవ్వుగా, నీవు బయలుదేరి జగద్బ్రహ్మములనుగూర్చి

విచారణ ప్రారంభించావు కనుక, ఈ మాటికి, బ్రహ్మము నందు తోచిన మాయాశక్తియే కారణమనుకో.

161

సర్వవ్యాపకమయిన ఆత్మ, ఎప్పుడు 'తాను-ఇతరుడు' (ఇతరము కూడ) అని మననము చేసే శక్తిగా రూపొందు తుందో, అప్పుడే దానిని మనస్సని అంటున్నాము. అంటే ఆత్మయే, మనన శక్తిని చూపే మనస్సవుతుందన్నమాట.

162

పిల్లలను అన్నము తినిపించటానికి, తల్లులు చెప్పే కట్టు కథలను, వివేకములేని ఆ పిల్లలు నమ్మినట్లే, అజ్ఞానులు కూడ మాయనుండి కలిగిన ఈ జగత్తును నిజమే అని నమ్ము తున్నారు. వస్తు విచారణ చేసే జ్ఞానులు ఆత్మయే సత్యమని నమ్ముతారు.

163

ఏ వస్తువు ఆదియందు, అంతమందు ఉండదో అది మధ్యలో కొంతకాల మున్నప్పటికీ, లేనట్లే లెక్క. మూడు కాలములయందు ఉండేదే శాశ్వత వస్తువుకాని ఆదిలోను, అంతములోను లేకుండా, వర్తమానములో మాత్రమే ఉండే దాన్ని "మిథ్య"అంటారుకాని, శాశ్వతమనరు. కుండ తయారు కాకముందునూ లేదు - నాశనమయినాకనూ లేదు. మధ్యలో కొంతకాలము మాత్రము ఉంటుంది. కనుక నామరూపాలతో తయారయినకుండ అశాశ్వతము. కాని "మట్టి" అనేది కుండగా రూపొందనప్పుడూ ఉన్నది, కుండ తయారైనతరువాతనూ

దానికి ఆధారమయ్యేయూ ఉన్నది. కుండ పగిలిపోయిన తరు వాతకూడామట్టి ఉంటుంటున్నది. కనుక మట్టిశాశ్వతము.అలాగే జగత్తుపుట్టక పూర్వము బ్రహ్మపదార్థమున్నది. జగత్తురూపొం దినప్పుడునూ దానికి- లోపల, వెలుపల, అంతటా ఆధారమై బ్రహ్మ పదార్థమే యున్నది. జగత్తు బ్రహ్మలో లీనమయి, తన నామరూపాలను కోల్పోయినప్పుడు కూడ బ్రహ్మము ఉండనే ఉంటుంది. కనుక భూత, భవిష్యత్, వర్తమానాలనే మూడు కాలాలలో శాశ్వతముగా ఉండే వస్తువు బ్రహ్మము. మధ్యలో మాత్రము తోచి, నశించేది జగత్తు. కనుక బ్రహ్మము సత్యమని, జగత్తు మిథ్య అని, వేదాంతాలు చెప్పుచున్నాయి.

164

'మట్టి శాశ్వతము- కుండ అశాశ్వతము' అనే జ్ఞానం కలగటం చేత కుండ వెంటనే నశించవలసిన పనిలేదు. అది ఉన్నా యథార్థ జ్ఞానం కలగటమే మనకు ప్రయోజనం. మట్టియే కుండగా వివర్తించినది. మట్టి లేకుంటే కుండలేనే లేదు. అజ్ఞానం, నీకు- బ్రహ్మము యొక్క- నిత్యత్వాన్ని, జగత్తు యొక్క- అనిత్యత్వాన్ని బోధించి మోక్ష హేతువవు తుంది. కుండయందు మట్టి కంటే భిన్న పదార్థము లేనట్లు, జగత్తులో కూడ, బ్రహ్మము తప్ప తద్భిన్నమయిన పదార్థ మేమీా లేదనే జ్ఞానానుభవాలు కలగటమే జీవిత పరమార్థం.

165

సత్తు, చిత్తు, ఆనందము అనేవి బ్రహ్మమునందే కాక బ్రహ్మమునందు తోచిన జగత్తులోని వస్తువులయందు కూడ

తోస్తూనే ఉన్నవి. ఎలాగంటారా? "కుండ ఉన్నది" అన్నప్పుడు ఉనికి రూపంగా 'సత్తు' తోస్తున్నది. కుండ ప్రకాశిస్తున్నది అన్నప్పుడు 'చిత్తు' ప్రకటమవుతున్నది. "నాకు కుండ కావాలి" అన్నప్పుడు ఆనందము వ్యక్తమగుచున్నది. ఈ విధంగా భావించి చూచితే సచ్చిదానందములనేవి సర్వవస్తువుల యందు వ్యాపించి ఉన్నవని తేలికగానే గ్రహించవచ్చు.

166

ఒక వస్తువు నీకు అనుకూలమయితే, ఆనందం కలుగుతున్నది అదే ప్రతికూలమయినట్లయితే దుఃఖ ద్వేషాదులు కలుగుచున్నవి. అవి రెండూ కలుగనప్పుడు, నీ ఆత్మానందం వ్యక్తమగుతున్నది. దాన్నే నిజానందమని అంటారు. లోకంలోని వస్తువులు, విషయములు- అనుకూల ప్రతికూల భావాలతో నీ ఆనందాన్ని వ్యక్తం కానీయడం లేదన్న మాట. అందుకే యోగులు మనస్సును ప్రాపంచిక వస్తువుల మీదకు పోనియకుండా నిగ్రహించి, సంకల్ప రహితం చేసికొని, ఆత్మానందమును అనుభవిస్తారు.

167

వస్తువుల యొక్క, అనుకూలత్వ, ప్రతికూలత్వముల వల్ల కలిగే సంతోష దుఃఖాలు మనస్సువందే కలుగుతాయి. అవి లేనప్పుడు కలిగే, స్వచ్ఛమయిన ఆనందము మనస్సంబంధము లేనట్టిది. అది, మనస్సు ఏ విషయాలను చింతించకుండా ఉన్నప్పుడు కలిగే ఆత్మ యొక్క నిజానందమే. మాన

సితానందాలు, అశాశ్వతాలైతే, ఆత్మానందమే మో శాశ్వత మయినది.

168

ఇష్ట వస్తువులను స్మరించి, సంపాదించినందువల్ల కలిగేదే, మానసికానందమంటే. దానికి వస్తువుల యొక్క అపేక్ష యుంటుంది. నిజానంద మనేది మనస్సంకల్పముల స్పర్శ లేనట్టిది గనుక, అది అతిమానసానందము, ఆత్మానందము, అవుతుంది.

169

సచ్చిదానందాఖండాద్వితీయ పరిపూర్ణ బ్రహ్మము, సాక్షాత్కారమయిన వాడికి, నామ రూపాత్మక జగత్తుమీద అభిమానం నశిస్తుంది. ఆ జగత్తు, బ్రహ్మమునందుతోచే విలాసమని అతడు భావిస్తాడు.

170

నామ రూపాత్మక జగత్తు మీద అభిరుచి తగ్గిన కొలదీ, నీకు అఖండాద్వితీయ బ్రహ్మముమీద రుచి పెరుగుతూ ఉంటుంది. అది కొనసాగితే, క్రమంగా నీవు బ్రహ్మమవే అయిపోతావు.

171

మనస్సులోని నిద్రాశక్తి నిన్ను స్వప్న జగత్తులోనికి తీసుకొని వెళ్ళి, అక్కడ వింత, వింత జగత్తులను చూపుతుంది అనుభవింప చేస్తుంది కూడా. అలాగే, బ్రహ్మము నందలి మాయాశక్తి కూడ, అనేకాలయిన, స్థూల జగత్తు

లను, దోషింపచేసి, జీవులను బాధ పెడుతుంది. సత్యదృష్టితో చూచినప్పుడు, స్వప్న జగత్తు ఎంత నిత్యమో, ఈ స్థూల జగత్తూ అంతే నిత్యము. స్వప్న జగము మేల్కాంచగానే మాయమవుతుంది. స్థూల జగము సుషుప్తి, సమాధులలో మాయమవుతుంది. వాటిని చూచే నీవు మాత్రము ఎల్లప్పుడూ ఉంటావు.

172

ఉత్తముడయిన సాధకుడు, కల్పితములు, అశాశ్వతములూ అయిన, నామ రూపాలను ఉపేక్షించి, వాటికి ఆధారమయిన సచ్చిదానందముల మీదే లక్ష్యము ఉంచి, అదే తన స్వరూపమని ప్రవర్తించవలె. ఇదియే పరమోత్తమమయిన ఆధ్యాత్మిక యోగము.

173

జగత్తును ఉపేక్షించుట మంటే, దానిని నిరాదరించుటయని అర్థం కాదు. అది శాశ్వతం కాదనే నిశ్చయం కలిగి, జగద్ధర్మాల నన్నింటిని ఆచరిస్తూనే, బ్రహ్మమునందు నిత్యత్వ బుద్ధితోను, అదే తన స్వరూపమనే భావంతోను, ప్రవర్తించటమని అర్థం.

174

నీవు ఒంటరిగా కూర్చున్నప్పుడు. అనేక సంకల్పాలు చేసికొంటూ, ఏవేవో వస్తువులను సృష్టించుకుంటున్నావు. ఆ సంకల్పిత వస్తువులు నీ ఊహాలతోటే నశించి, మళ్లీ పుట్టడం

లేదు. అలాగే జాగ్రద్దశలో కూడ, పరించిన వస్తువులు, మళ్లీ తిరిగి రావడం లేదు. కనుక వాటికి శాశ్వతత్త్వము లేదన్న మాట. ఆ స్వప్న, జాగ్రద్వస్తువులను కల్పించే మనస్సుకు ఆధార భూతమయిన ఆత్మ మాత్రము శాశ్వతంగా ఉంటూనే ఉన్నది. అదే ఆత్మనిత్యత్వమన్నా, జగత్తు యొక్క అని త్యత్వమన్నా.

175

జగత్తు కాని, అందులోని వస్తువులు కాని సృష్టికి ముందు లేవు. సృష్టి ముగిసిన తరువాత గూడ ఉండనూ ఉండవు. మధ్యలో కొంత కాలము మాత్రమే వాటి నాటకం. భగవంతుడుగాని, బ్రహ్మ పదార్థం కాని, అలా కాక, ఈ జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయాదులను చూస్తూ శాశ్వతంగానే ఉంటాయి.

176

రంగస్థలం (stage) మీద ఉన్న దీపం, నటులు పాత్ర ధారణ చేసి, రాకముందూ వెలుగుతూనే ఉన్నది. వారు వచ్చి నాటకం ఆడుతున్నప్పుడూ, వారిని ప్రకాశింప చేస్తూ వెలుగుతూనే ఉన్నది. వారు, ప్రేక్షకులు, అందరూ వెళ్ళిన తరువాత కూడ వెలుగుతూనే ఉంటుంది. ఈ ఉదాహరణంలోని దీపంవంటివాడే పరమాత్మ. రంగస్థలము, నటులు, ప్రేక్షకులు మొదలయిన వారివంటివే జగత్తు, జగత్తులోని చరాచరములు. ఒకటి ప్రకాశిస్తూ ప్రకాశింపచేస్తుంది. తక్కినవి ప్రకాశ రహితాలై పుట్టి నశిస్తూ ఉంటాయి.

177

నటుడు, తన స్వరూపమును, స్థితిని మరువకుండగనే రామకృష్ణాదుల పాత్రలను ధరించేటట్లు, బ్రహ్మజ్ఞాని తన ఆత్మస్వరూపాన్ని మరువకుండానే, లోకనాటకంలో, ఆ యా పాత్రల స్థితి గతులను అనుకరిస్తూ ప్రవర్తిస్తాడు.

178

నదిలో ఉన్న పెద్ద పెద్ద బండల మీద ఎంతగా నీరు ప్రవహిస్తున్నా, అవి కదలక, మెదలక నిశ్చలంగానే ఉంటవి. అలాగే, జ్ఞాని కూడ ప్రపంచ వ్యవహారాలు, తనను నిమిత్త మాత్రునిగా చేసికొని, కొనసాగిపోతున్నప్పటికీ, తాను మాత్రం నిర్వికారుడై, నిశ్చలంగా ఆ వ్యవహారాలకు సాక్షి మాత్రుడయి, నిస్సంగుడుగానే ఉంటాడు.

179

చిత్తమునకు, శాంత వృత్తులు, ఘోరవృత్తులు, మూఢ వృత్తులు అని మూడు రకాలయిన వృత్తులుంటాయి. క్షమ, వైరాగ్యం, దయ, దాక్షిణ్యం, సంతోషం మొదలయినవి శాంతవృత్తులు. కామ, క్రోధ, లోభ స్నేహాదులు ఘోర వృత్తులు. సమ్మోహ భయాదులు మూఢవృత్తులు. ఇవి వరుసగా సత్వ, రజ, స్తమస్సులనే గుణాల నుండి పుట్టు తాయి. వీటన్నింటిలోను ఆత్మ యొక్క చైతన్య స్వభావం ప్రతిఫలిస్తూనే ఉంటుంది. శాంత వృత్తులలోనేమో, చిత్తుతో పాటు, ఆనందం కూడ ప్రతిఫలిస్తుంది. కనుక నీవు ఆనందంగా ఉండాలను కుంటే శాంతవృత్తులతోటే నీ చిత్తాన్ని నింపు కోవాలి.

### 180

బ్రహ్మమునకు సత్తు, చిత్తు, ఆనందమనేవి మూడు స్వరూపములని, మనం చెప్పుకుంటూనే ఉన్నాము. మాయచే ఆవరింపబడిన, ఈ బ్రహ్మము యొక్క స్వరూపములలోని 'సత్తు' అనేది మట్టి, రాళ్ళు మొదలయినవాటిలో మాత్రమే గోచరిస్తుంది. జ్ఞానానంద స్వరూపములు గోచరించవు. రజస్తమో వృత్తులలో సచ్చిద్రూపములు రెండూ తోస్తాయి. శాంత వృత్తులలో సచ్చిదానంద రూపములు మూడు తోస్తవి.

### 181

సచ్చిదానందబ్రహ్మోపాసనము, సోపాధికము, నిరుపాధికము అని రెండువిధాలు. ఉపాధులతో గూడిన బ్రహ్మోపాసనము, 'సోపాధిక'మని, ఉపాధులు లేని సర్వవ్యాపకాఖండబ్రహ్మోపాసనము 'నిరుపాధిక'మని తెలుసుకోవాలి.

### 182

మట్టి, రాళ్ళు మొదలయిన్న వాటి యందు నామరూపాలను వదిలిపెట్టి, కేవల సద్రూప బ్రహ్మమునే ధ్యానించాలి. మానసికములయిన, ఘోర, మూఢ వృత్తులలో నేమో బ్రహ్మము యొక్క, సద్రూప, చిద్రూపములు రెంటినీ ధ్యానించాలి. ఇక సాత్త్వికము లయిన శాంతవృత్తుల యందు బ్రహ్మము యొక్క సచ్చిదానంద స్వరూపములు మూటినీ లెస్సగా ధ్యానించాలి. ఈ మూడింటి ఉపాసననే "సోపాధిక బ్రహ్మోపాసన" అంటారు.

## 183

ఏ ఉపాధులు లేని నిరుపాధిక బ్రహ్మము యొక్క స్మరణ, ధ్యానోపాసనలు 'నిరుపాధిక బ్రహ్మోపాసన' అవుతుంది. ఈ ఉపాసనలో కేవల సచ్చిదానందములు మాత్రమే ఉపాసింపదగినవై యుంటవి. ఆ సచ్చిదానందము తన స్వరూపమే కనుక ఈ ఉపాసనను, "బ్రహ్మాత్మైక సిద్ధి" అనీ అనవచ్చు.

## 184

ఇంకొక రహస్య మేమిటంటే. ఇప్పుడు చెప్పుకొన్న, నిరుపాధిక బ్రహ్మోపాసనము ధ్యానమనీ, ఉపాసన అనీ, అనడం నామ మాత్రమే. ఎందుకనంటే, అది సాక్షాత్తు బ్రహ్మ విద్యా స్వరూపమే కనుక.

## 185

నిరుపాధికమయిన ఈ బ్రహ్మ స్వరూపమునందు జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అనే త్రిపుటి ఉండదు. అంతా కేవలాఖండరసమే.

## 186

ఇంద్రియములకు విషయాలు దగ్గరపడితే, అంతరింద్రియమైన మనస్సు ద్రవిస్తుంది. అంటే అది మెత్తపడి ఆ విషయాల మీదికి పరుగెత్తుతుందన్న మాట. అందువల్ల విషయాలకు దూరంగా ఉండటం మంచిది.

## 187

మనస్సు బహిర్ముఖమైనప్పుడు విషయాలతోను, అంతర్ముఖమైనప్పుడు ఆత్మతోను కలుసు కుంటుంది.

188

మనస్సు యొక్క స్వభావం చలింపటమే. దాన్ని నిశ్చలంగా ఉంచుకోనడమే ధీరులు చేసే పని. తత్త్వజ్ఞుని మనస్సు అతడు చెప్పినట్లుగా వింటుంది.

189

మానవులలో ఇంద్రియాలను, మనస్సును స్వాధీనము చేసుకోగలవారు కొందరైతే, వాటికి స్వాధీనమయ్యేవారు మరికొందరు ఉంటారు. వాటికి స్వాధీనపడేవారు దుఃఖాన్ని, వాటిని స్వాధీనం చేసుకోగలవారు ఆనందాన్ని అనుభవిస్తారు. ఒకరికి దాసుడైన వాడెప్పుడూ దుఃఖియేకాని సుఖి కాలేడు. వాడికి స్వాతంత్ర్యం ఉండదు.

190

స్వప్న రాజ్యాన్ని సృష్టించేది మనస్సే. మనస్సులోని గుప్త సంస్కారాలు, క్రమ రహితంగాను, అల్లిబిల్లిగాను కలసికొని స్వప్న ప్రపంచాన్ని సృష్టిస్తాయి.

191

అష్టాంగ యోగ సాధన మనస్సును స్వాధీనపరచుకొనటానికి రాచబాట. యోగి మనస్సు, అతడు చెప్పినట్లు నడచుకుంటుంది.

192

అనేకులు సోమరితనంవల్ల యోగాభ్యాసానికి పూనుకోలేరు. వారికి లోక విషయాలంటేనే రుచి ఎక్కువ. శ్రమపడి యోగ ప్రయోజనాలను పొందుదామని ప్రయత్నించరు.

193

సమస్తమునకు అధిష్ఠాన (ఆధార) మైన చైతన్యము, ఆ చైతన్యమునందు తోచిన లింగదేహము, ఆ సూక్ష్మ దేహములో ప్రతిబింబించిన చిదాభాసుడు. ఈ మూటికీ జీవుడని పేరు.

194

పరమేశ్వరుని వద్ద లోకాలను సృష్టించే శక్తి, వాటిని మోహింప చేసే శక్తి రెండూ ఉన్నాయి. మోహక శక్తి జీవులను అజ్ఞానం పాలు చేస్తుంది.

195

నీకు కావలసిన దాన్ని పొందలేకపోవటం, అనిష్టాలను తొలగించుకోలేకపోవటం, ఇవి రెండే అసమర్థత అంటే. ఈ అసమర్థతకు కారణం మోహన శక్తియే!

196

జగత్తును సృష్టించే వాడేమో ఈశ్వరుడు. అనుభవించేవాడు జీవుడు.

197

ఒకసారి బ్రహ్మ సాక్షాత్కారము పొందినవాడికి వేదాంత శాస్త్రము వల్ల ప్రయోజన మేమీ లేదు. అతడు దానిని పునః పునః, మననం చేయవలసిన పనీ లేదు. శాస్త్ర మనేది సాక్షాత్కారానికి సాధనం మాత్రమే.

198

ఆత్మ జ్ఞానానికి తక్కిన జ్ఞానాలన్నీ లోకువే. ఆత్మ

జ్ఞానం కలిగినవాడు తక్కిన అనాత్మ పదార్థాల జ్ఞానం కోసం పరితపించడు. వాటిని తృణప్రాయంగానే చూస్తాడు.

199

కామ, క్రోధాదు లనేవి మోక్ష సాధకులకు ఇబ్బందిని కలుగజేసి, తత్త్వ జ్ఞానాన్ని అలవడనీయవు. బ్రహ్మ జ్ఞానం కలిగిన తరువాత కూడా, వాటిని దూరంగా ఉంచటమే కర్తవ్యం.

200

బాహ్య దృశ్యాల కంటె మనో దృశ్యాలే నీకు ఎక్కువ కీడు చేస్తాయి. మనో దృశ్యాలను లయింప జేసుకో గలిగితే, సమాధిసుఖమనేది తేలికగానే కలుగుతుంది.

201

ఎవని చిత్తమునకు విక్షేపము ఉండదో, వాసనలు ఉండవో, అట్టి వానిని బ్రహ్మవేత్త అనవక్కరలేదు. వాడు సాక్షాత్తు బ్రహ్మమే.

202

విషయాలను స్మరిస్తూ ఉన్నందు వలన వాటి మీద ఆసక్తి పెరుగుతుందన్న గీతా వాక్యంలో గొప్ప సత్యం ఉన్నది. దానికి విపరీతంగా నిరంతరం బ్రహ్మ చింతనే చేసేటట్లైతే ఆ విషయాలకి దూరుడా కావచ్చు.

203

సముద్రంలో పుట్టిన కెరటాలు అన్నీ ఎప్పటికయినా ఒడ్డుకు చేరుకోవలసినవే. అలాగే సృష్టిలోని జీవులందరు, ఏనాటికైనా, పరమాత్మలో లీనం కావలసినదే. లేకపోతే వారికి సార్థకత లేదు.

204

సత్వ, రజ, స్తమో గుణాలనుండి కలిగే మనోవికారాలుకాని, దేహక్రియలుగాని, నీ ఆత్మమీద వాటి ప్రభావాన్ని చూపనంతవరకు నీవు ముక్తుడవే. వాటి ప్రభావానికి లోబడినట్లయితే నీవు బద్ధుడవైనట్లే.

205

ఉపవాసము వల్ల శరీరము నందలి జీర్ణకోశములోని మాలిన్యాలు నశించినట్లు- వాఙ్మౌనమువల్ల మాటలలోని మాలిన్యాలు, తపో మంత్ర జపాదులవల్ల మానసిక మాలిన్యాలు కడిగివేయబడతాయి. అప్పుడు సాధకునికి త్రికరణ శుద్ధి ఏర్పడుతుంది. అంటే అంతఃకరణములో రజ, స్తమో గుణాలు తగ్గి, సత్వానికి తావు ఏర్పడుతుందన్నమాట. అందువల్లనే శారీరక, వాచిక, మానసిక తపస్సులను "తత్త్వ సాధనాలని" మనవారు పేర్కొన్నారు.

206

నీలో రజోగుణం తగ్గుతున్న కొలదీ కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాదులు; తమోగుణం తగ్గుతున్న కొలదీ నిద్ర, అజ్ఞాన, మోహభ్రాంతులు సన్నగిల్లుతూ ఉంటాయి. అప్పుడు సత్వగుణానికి, హృదయంలో స్థానం ఏర్పడుతుంది. ఈ సత్వ, రజ, స్తమో గుణాలను మూటిని దాటిపోయే స్థితిని సాధించినవాడికి, జన్మ జరా వ్యాధ్యుత్పత్తులు లేవు.

207

సత్వం సుఖాన్ని, రజస్సు కర్మలను, తమస్సు నిద్రా మోహ ప్రమాదాలను సృష్టిస్తూ ఉంటాయి.

208

వస్తుతత్త్వ జ్ఞానం వల్ల, సాధకులకు సందేహాలు తీరుతాయి. భయం పోతుంది. రక్షణ సదుపాయాలు కల్పించుకొంటారు. ఇంత ఎందుకు! వారు ఎలా ప్రవర్తించవలసినదీ నిర్ణయించుకొని సుఖపడగలుగుతారు.

209

అణిమాది సిద్ధులు, పరకాయ ప్రవేశం మొదలయిన అతీత శక్తుల కోసం ఆశపడవద్దు. చివరకు వాటిమీద కోరిక గూడ, నిన్ను బంధించివేసి ముక్తికి దూరం చేస్తుంది. కనుక వాటిమీద కూడా కలిగే వైరాగ్యమే సాధకునికి సుఖాన్ని కూర్చుతుంది అందుకే "సర్వం వస్తు భయాన్వితం, భువి నృణాం వైరాగ్య మేవా భయం." అన్ని వస్తువులు భయానికి నివాసాలే. ఒక్క వైరాగ్యమే అభయమైనది అన్నాడు భర్తృహరి.

210

సత్సాంగత్యము, ఈశ్వర చింతనము, సృష్టిని గూర్చి మననం చేయుటం, సత్కార్యాచరణ, పరమేశ్వర ధ్యానము. అనేవి నిన్ను ఉన్నతస్థితికి కొనిపోతాయి. దుస్సాంగత్యము, దుష్కార్యాచరణ, దుర్విషయచింతన నిన్ను అధోలోకాలలో పడవేసాయి.

211

ఆసన, ప్రాణాయామాదులన్నీ, ఆరోగ్యానికి అవసరమయినంతవరకు; ధ్యానాదులను, చిత్తవృత్తులను జయించి, ఏకాగ్రత కుదిరేవరకు అనుష్ఠించితే చాలు. వాటికి ఆత్మ విచారణను తోడుచేసుకుంటే మోక్షం కరతలామలకమే అవుతుంది.

212

ప్రారబ్ధకర్మ అనేదానికి, ఇవ్వవలసిన ప్రాధాన్యమిస్తే చాలు. అంతేకాని, ప్రారబ్ధమనుకొంటూ, ఏ ప్రయత్నము చేయకుండా ఉండకూడదు ప్రయత్నాలను ఉపేక్షించినందు వలన, నీకు అనర్థాలే కలుగుతాయి. కనుక, యథాశక్తి ప్రయత్నశీలివై ఫలితాన్ని భగవంతునికి వదలివేయి.

213

పరమేశ్వరుడనేవాడు ప్రతివారిలోను, ప్రయత్న స్వరూపుడుగానే ఉంటాడు. గనుక, ఎవరు కాని మానవ ప్రయత్నం వ్యర్థమని భావించరాదు. తానుచేసే ప్రయత్నమే, ఈశ్వర స్వరూపముగా పరిణమించి (వివర్తించి), తనకు కార్యసిద్ధి కలిగిస్తుంది. ఇదే కర్మ రహస్యం.

214

సద్విషయాలమీద, సత్పురుషులమీద మైత్రిని పెంచుకోవాలి. దుష్కార్యాలను, దుశ్చింతలను, దుష్టులను ఉపేక్షించాలి. దీనులను, దుఃఖులను, రోగులను దయతో చూడాలి. పుణ్యాత్ములను చూస్తూ, పుణ్యక్రియలను చేస్తూ

సంతోషపడాలి. ఈ మైత్రి, సంతోషం, ఉపేక్ష, కరుణ అనే నాల్గింటిని "చతుర్బ్రహ్మ విహారా"లని బుద్ధదేవు డన్నాడు.

215

తీరిక చిక్కినప్పుడల్లా మంచి పుస్తకాలను చదువుతూ ఉంటే, మనస్సు నిర్మలమై; జ్ఞాన విజ్ఞానాలు పెరుగుతాయి. హృదయం విశాలమవుతుంది. అనేకులు తీరిక సమయాలను వ్యసనాలకు, వినోదాలకు వెచ్చించి పాడుచేస్తూ ఉంటారు. సద్గ్రంథ పఠనమనేది "బ్రహ్మయజ్ఞ" మంటారు.

216

"బ్రహ్మైవేదం, విశ్వమిదం, వరిష్ఠం" (ముండకం-2-11). ఈ విశ్వమంతా సర్వశ్రేష్ఠమయిన బ్రహ్మమే అని, ఉపనిషత్తులు అంటున్నవి. అంటే బ్రహ్మకు విశ్వం అన్యము కాదని భావము. ఈ విశ్వాన్ని బ్రహ్మముగానే భావించి చూచి, సేవించాలన్నమాట. ఆ విశ్వమును, బ్రహ్మమును కలిపితే విశ్వబ్రహ్మ మవుతుంది. ఈ విశ్వబ్రహ్మకు అలంపురంలో ఒక దేవాలయం కూడా ఉన్నది.

217

అజ్ఞానులకు బ్రహ్మము జగత్తుగా మాత్రమే అగపడు నట్లు, సుజ్ఞానులకు జగత్తు బ్రహ్మముగానే తోస్తుంది.

218

అంతర్దృష్టి, బహిర్దృష్టి అని రెండు చూపులున్నాయి. బహిర్దృష్టి కలవాడికి, అంటే వస్తు విశేషము లేనివాడికి,

బంగారము నగగా మాత్రమే కనబడుతుందికాని, బంగారంగా కనబడదు. అంతర్దృష్టి కలవాడికేమో నగ, బంగారంగానే కనబడుతుందికాని, నగగా తోచదు. అలాగే, వెలిచూపు కలవారు జగత్తును జగత్తుగానే చూచి, సుఖ దుఃఖాలను పొందుతారు. లోచూపు కలవారు జగత్తును బ్రహ్మముగానే చూచి నిత్యానందులై ఉంటారు.

219

అజ్ఞానికి జగత్తు, జగత్తేకాని బ్రహ్మము కాదు. సుజ్ఞానికైతే, బ్రహ్మము బ్రహ్మరూపమైన జగత్తుకూడా! గ్రుడ్డికి పగలుకూడా అంతా చీకటే. కన్నులున్నవానికి వెలుగు వెలుగుగాను, చీకటి చీకటిగాను అగపడుతుంది. అజ్ఞాని గ్రుడ్డివానివంటివాడు. జ్ఞాని కన్నులున్నవాడివంటివాడు.

220

రక్త, మాంస, అస్థులతో కూడిన భోగభూమియే స్థూల శరీరము. దీనిలోపల జ్ఞానేంద్రియ పంచక, కర్మేంద్రియ పంచక, ప్రాణపంచక, మనోబుద్ధులతో కూడిన భోగసాధనమే సూక్ష్మ శరీరము. జన్మాంతర సంస్కారాలతో కూడి, ఆ సూక్ష్మ శరీరంలోపల ఉండేదే కారణ శరీరము. ఆ కారణ శరీరంలో ప్రతిఫలించి ఉండేవాడే జీవుడు లేక చిదాభాసుడు. వాడికి మూలమయినవాడే ప్రత్యగాత్ముడు లేక కూటస్థుడు. ఆ కూటస్థుడే శివన్నా, బ్రహ్మమన్నా.

221

స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు నీకు సాధనాలే కాని, 'నీవు' అనేవాటివి మాత్రం కాదు. నీవనేవాడు, నిత్య కూటస్థాత్మ స్వరూపుడే. కారణ శరీరాన్ని ధరించి కర్తగా, భోక్తగా పనులుచేసి ఫలితాలు అనుభవించే చిదాభాసుడు గూడ నిజమయిన నీవుకావు. ఆ చిదాభాసుడికిగూడ, ఆధార మయిన కూటస్థాత్మయే నీవు.

222

మహాకారణ శరీరమనికూడ ఒకటి వేదాంతంలో విన బడుతున్నది. దాని స్వరూపం తురీయమే. అక్కడ ఉపాధి అనేది ఉండీలేనట్లుగా ఉంటుంది. అదే మహాకారణమంటే. అనగా సర్వకారణమని భావము. అవ్యక్త మహదాదులకు, అది మూలకారణమన్నమాట.

223

శరీరము ఉన్నప్పుడు, దానికొక అవస్థ (దశ) ఉండాలి. స్థూలశరీరానికి జాగ్రత్తు; సూక్ష్మానికి స్వప్నము; కారణానికి సుషుప్తి అనేవి అవస్థలు. మహాకారణమును శరీరమంటే దానికి కూడ ఒక అవస్థ ఉండాలికదా! అది ఏదని అడుగ వచ్చు. అది తురీయమే. అంటే సమాధియే. కనుక మహా కారణాన్ని శరీరమన్నారు. ఇక తురీయాతీతమనేది సాక్షాత్తు పరమాత్మ భావమే అనుకో.

224

కొందరు ఏడువరకు శరీరాలున్నాయని అంటారు.

కాని అది శాస్త్రానికి, అనుభవానికి సరిపోయే మాటకాదు. ఆ సంఖ్య కేవలం ఊహాకల్పితం మాత్రమే. శరీరమని పేరు పెట్టినాక దానికొక అవస్థ అంటూ ఉండాలనుకొన్నాము కదా! అవస్థ లేనిది శరీరం కాదు. మన అనుభవంలో ఉన్న అవస్థలు- జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము లేక సమాధి అనేవి మాత్రమే. అలాగే శరీరాలుకూడ స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములే.

225

ఒకే జీవుడు స్థూల శరీరాభిమానంతో ఉన్నప్పుడు (జాగ్రత్తులో) విశ్వుడని, సూక్ష్మ శరీరాభిమానంతో ఉన్నప్పుడు (స్వప్నంలో) తైజసుడని, కారణ శరీరాభిమానముతో ఉన్నప్పుడు (సుషుప్తిలో) ప్రాజ్ఞుడని, మహాకారణంతో పొత్తు కలిగినప్పుడు (సమాధిలో) 'ఆత్మ' అని చెప్పబడు చున్నాడు. ఈ నాలుగు భేదాలు శరీరాభిమానాలనుబట్టి కలిగినవేకాని, మూలవస్తువు మాత్రమొక్కటే. ఒకే వ్యక్తి భార్యకు భర్త, తండ్రికి కొడుకు, బిడ్డలకు తండ్రి అవుతాడు గదా!

226

మనం చిన్ముద్ర పట్టేటప్పుడు మూడు వ్రేళ్ళను వదలి చూపుడు వ్రేలి కొనతో, బొటనవ్రేలి అగ్రాన్ని కలుపుతాము. మనం వదలిపెట్టిన మూడు వ్రేళ్లు స్థూల, సూక్ష్మ కారణాలకు సంకేతాలు. చూపుడు వ్రేలు జీవునికి, బొటన

ధ్రేలు పరమాత్మకు చిహ్నాలు. అంటే శరీరత్రయ సంబంధం లేకుండా, జీవుడు పరమాత్మతో ఐక్యమయివాడని చిన్ముద్ర యొక్క పరమార్థ మన్నమాట.

227

కారణోపాధి యందు ప్రతిఫలించిన, చిదాభాసునకే సంసారముగాని, కేవలాత్మకు సంసారం లేదు. ఈ అంశమును ప్రతి సాధకుడు శ్రవణ, మననాదులవల్ల నిశ్చయించుకొని ఆత్మదర్శనమును పొందవలె.

228

సాధకుడగువాడు ఈ జగత్తనగా నేమి! జీవుడనువాడెవ్వడు! ఆత్మయన నేమి! అని లెస్సగా విచారించుచున్నట్లయితే- జీవ జగత్తులు, మాయాకల్పితములని తెలియడంవల్ల; ఆత్మ ఒక్కటే మిగులుతుంది. ఆత్మజ్ఞానం కలుగుతుంది.

229

గాఢంగా ఆత్మ విచారణ చేస్తే జీవుడు; జగత్తు కల్పితములని తేలిపోయి ఆత్మ ఒక్కటే శాశ్వతమని తెలిస్తుంది. జగజ్జీవులు బాధింపబడినప్పుడు వారు తోచినప్పటికీ, (ఉన్నప్పటికీ) నీకు నష్టం లేదు. వారియందు నీకు నిత్యత్వ బుద్ధి యుండదు. ఆత్మయందే నిత్యత్వ బుద్ధి ఉంటుంది.

230

నీవు జగత్తును మరచిపోవాలని వేదాంతం బోధించటం లేదు. నీకు దానిమీద, నిత్యత్వ బుద్ధి పోవాలని మాత్రమే వేదాంతం చెపుతున్నది. జగత్తును మరచిపోవటమే కాదు

మయితే, సుషుప్తిలో జగత్తు యొక్క ఎరుకయే లేనందువల్ల, నిద్రపోయేవారందరూ ముక్తి పొందినట్లే కదా! జగత్తనేది బ్రహ్మకు భిన్నము కాదనే జ్ఞానమే వాస్తవ జ్ఞానమంటే.

231

పరోక్ష జ్ఞానమని, అపరోక్ష జ్ఞానమని, జ్ఞానం రెండు విధాలు. ఆత్మ అనేది ఒకటి కలదనే నిశ్చయం పొందటం పరోక్ష జ్ఞానం. ఆ ఆత్మ తనలోని ప్రత్యగాత్మయే అనే అనుభూతి పొందడం అపరోక్ష జ్ఞానము. దీనినే, ఆత్మ సాక్షాత్కారమంటారు.

232

నీవు నీ దేహత్రయాన్ని, సంకల్ప వికల్పాలను, మనోబుద్ధులను, వాటి వృత్తులను, అన్నిటినీ దాటితేనేగాని నీకు ఆత్మ పరోక్ష జ్ఞానం కలుగదు.

233

ఉపాదాన కారణమంటే, కారణం కార్యంలో ప్రవేశించి ఉండటం. వస్త్రానికి దారములు ఉపాదాన కారణములు. కనుక అవి వస్త్రములో ప్రవేశించి ఉంటవి. అలాగే కుండకు మట్టి ఉపాదాన కారణం. అది మట్టియొక్క కార్యమయిన కుండలో అంతటా వ్యాపించి ఉంటుంది. ఇలాగే నగలకు బంగారం ఉపాదానం. నగలయందంతటా బంగారం నిండే ఉంటుంది. ఇలాగే జగత్తుకు భగవంతుడు ఉపాదాన

కారణం. కనుక జగత్తు పొందంతటా భగవంతుడే నిండి ఉంటాడని తెలిసికొని ఆరాధించాలి.

234

నిమిత్త కారణ మంటే ఒక కార్యాన్ని సృష్టించేవాడు. కుండ తయారు కావడానికి కుమ్మరి నిమిత్త కారణము. అతడు కార్యానికంటే వేరుగానే ఉంటాడు. ఉపాదాన కారణం లాగ కుండలో కలిసి ఉండడు. అలాగే వస్త్రానికి నేతకాని వాడు, నగలకు శిల్పి నిమిత్త కారణాలు. భగవంతుడు మాత్రము జగత్తుకు ఉపాదాన కారణము, నిమిత్త కారణమూ రెండూ తానే. భగవంతుడు తనకంటే భిన్నమయిన పదార్థంతో జగత్తును సృష్టించేలా, తన స్వరూపాన్నే జగద్రూపకంగా వివర్తింపచేసినాడు. గనుక, జగత్స్వరూపుడూ వాడే, జగత్కర్తా వాడే. ఈ రహస్యాన్ని ఋగ్వేద దశమ మండలంలోని విశ్వకర్మ సూక్తం విస్పష్టంగా వివరించింది.

(విశ్వకర్మా విదాశ్చ మహాన్ స్యహితా విశ్వచక్షుః)

235

సృష్టి అనేది పగటిని, మెలకువను, కన్నులు తెరచి ఉండుటను, మనస్సంకల్పమును పోలినట్టిది. ప్రళయమేమో రాత్రిని, నిద్రను, కన్నులు మూసియుండుటను, సంకల్ప రహితముగా ఉండుటను పోలినట్టిది.

236

నిద్రించేవాడికి మెలకువ కలిగితేనే కాని, కలలు రావడ

మనే అవస్థ పోదు. నిద్రలో ఉన్నంతవరకు కలలు కాంచక తప్పదు. అలాగే జీవుడు అజ్ఞానంలో ఉన్నంతవరకు, ప్రాపంచిక దుఃఖాలు తప్పవు. జ్ఞానోదయమైనప్పుడు పరమార్థం తెలిసి దుఃఖ నివృత్తి కలుగుతుంది.

237

జీవేశ్వర స్వరూపంగాను, చేతనా చేతన రూపంగాను, సుఖదుఃఖాత్మకంగాను కనుపించే జగత్తంతా పరమాత్మ యందు కలిగే కలవంటిదే కాని, తదితరము కాదు. కల ఎంత నిజమో, ఈ ప్రపంచం కూడ అంతే నిజము. ఈ స్వప్నాని కాధారమయిన పరమాత్మ మాత్రమే సత్యవస్తువు.

238

అఖండాద్వితీయ బ్రహ్మతత్త్వము తెలియనంతవరకు, దాన్ని గూర్చి నీవు చేసే భావనలు, ఊహాలు, నిర్ణయాలు, పూజా పురస్కారాలు అన్నీ భ్రాంతులే కాని నిజాలు కావు. బ్రహ్మతత్త్వం ఒక్కటే పరమార్థము.

239

పరమ తత్త్వాన్ని గూర్చి నేటివరకు దార్శనికులు మొదలగువారు అనేక నిర్వచనాలు, నిర్ణయాలు చేశారు. వారిలో పరతత్త్వం బోధపడ్డది కొలదిమందికి మాత్రమే.

240

ఒక ధనవంతుడు బిచ్చమెత్తుకొన్నట్లు కల గాంచు కాడు. అయినా మేల్కాంచిన పిదప వాడు ధనవంతుడే

కాని బిచ్చగాడు కాడు. ఒక బిచ్చగాడు కలలో రాజ్యమేలవచ్చు. అయినా మేల్కొన్నాక వాడు బిచ్చగాడే కదా! కనుక అజ్ఞానంతో చేసే నిర్ణయాలు, కల్పనలు సత్యసాక్షాత్కారానికి ఉపయోగించవు.

241

లోతుగా విచారించి చూస్తే బ్రహ్మతత్త్వమొక్కటే పరమార్థమయినది. జీవ, ఈశ్వర, జగత్తులు కూడా దాని మీద కల్పితాలయినవే. వీటికి మూడు కాలములయందు ఉనికి లేదు. మాయ ఉన్నంతవరకే వీటికి ఉనికి. ఆ మాయయేమో జ్ఞానం కలుగగానే నశిస్తుంది.

242

ఉత్పత్తి అంటే స్థూలదేహంతో సంబంధం కలగటం. బంధమంటే సుఖ, దుఃఖ, జనన, మరణాది ధర్మాలు కలిగి ఉండటం. సాధన అంటే శ్రవణ, మనన, యోగ, ఉపాసనాదులు చేయడం. ముముక్షుత్వమంటే సాధన చతుష్టయ సంపత్తిని కలిగి ఉండటం. ముక్తి అంటే అవిద్య నివర్తించటం.

243

మాయ అనే ఉపాధిలో ప్రతిబింబించిన బ్రహ్మమును ఈశ్వరుడన్నారు. ఆ ప్రతిబింబానికి మూలవస్తువు నేమో బ్రహ్మమన్నారు. ఉపాధిని తొలగించి చూస్తే ఈశ్వరుడూ బ్రహ్మము ఒక్కటే.

244

ముముక్షువులు సాధించవలసినది జీవేశ్వరైక్యము. ప్రత్యగాత్మ, పరమాత్మల (కూటస్థ బ్రహ్మల) ఐక్యము. ఇదే దుఃఖనివృత్తికి ఉపాయము. ఇది వస్తుతత్త్వ జ్ఞానంవల్లనే కలుగుతుంది.

245

ఒకనికి కలలో తోచిన జగము, అతనికి మాత్రమే నిజము, ఇంకొకనికి అసత్యము అయినట్లే. మాయాకాశమున తోచే జగముకూడ మాయా దృష్టికి నిజము, నిర్మల బ్రహ్మదృష్టికి అసత్యము అవుతుంది.

246

ఎల్లప్పుడూ ముక్తుడవై ఉండటమే నీ స్వభావము. ఆ రహస్యం తెలియక, ముక్తికోసమై గంగాది తీర్థాలలో మునుగుతూ, క్షేత్రయాత్రలు చేస్తూ, నీ అజ్ఞానాన్ని ప్రదర్శిస్తున్నావు.

247

మేల్కాంచి ఉన్నప్పుడు స్థూలదేహమే కాను అనుకొనే జీవుడు, స్వప్న సుషుప్తులలో, ఆ స్థూల శరీరంతో సంబంధం లేకుండా ఉంటున్నాడు. అయినా మరల జాగ్రత్తులోనికి వచ్చి, ఆ స్థూలదేహమే కావని భ్రాంతిపడుతున్నారు. ఎంత అజ్ఞానమో చూడండి.

248

నీ శరీరంలో ఉన్న ఆత్మ స్వయంజ్యోతి స్వరూప

మున్నువది. స్వయంజ్యోతి అంటే, తాను ఇతర సహాయం లేకుండా ప్రకాశిస్తూ, స్వయంప్రకాశశక్తి లేని ఇతర జడ వస్తువులను ప్రకాశింపచేసేది అని భావము. నీ దేహంలోని ఆత్మ, సుషుప్తిలో తాను స్వయంగా ప్రకాశిస్తున్నదని నీకు తెలుసు. అదే జాగ్రత్ స్వప్నాలలో జడములైన దేహం ద్రియ మనోబుద్ధి సంకల్పాదులను గూడ ప్రకాశింపచేస్తున్నది. అయినా నీవు దానిని గుర్తించటం లేదు. ఆలోచించి చూస్తే నీవు స్వయంజ్యోతి స్వరూపుడవని తెలుస్తుంది.

249

"పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్" అని పురుష సూక్తం అంటున్నది. మన కంటికగపడే సర్వజగత్తు ఇప్పుడు, ఇదివరకు, ఇకముందుకూడ; సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే. అని ఆ మంత్రానికి అర్థము. కనుక జగత్తు, జగత్తుగా ఉన్నా, దాని నిజరూపం మాత్రం పరబ్రహ్మమే.

250

నీవు జగత్తును, దేహమును, ఇంద్రియాలను, సంకల్ప, వికల్ప, సుఖ దుఃఖ, జనన, మరణాలను ఎల్లప్పుడూ చూచే ద్రష్టవు. వాటిని ప్రకాశింపచేసే చిత్తువు కూడ. కనుక, నీవు మృణ్మయ మూర్తివి (మట్టిబొమ్మవు) కావు. మరియు చిన్మయుడవు [illegible] స్థితిలో దేహాదులే నీవనుకోవడం [illegible] అజ్ఞానము, [illegible]

251

నేను నిత్యుడను, పరిశుద్ధుడను, బుద్ధుడను, ముక్తుడను, సచ్చిదానంద రూపుడను అనే తెలివికలగడమే, జ్ఞానమంటే! నేను దేహమును, బుద్ధేంద్రియ రూపుడను, సుఖ దుఃఖాలను పొందేవాడను, చావుపుట్టుకలు కలవాడను అనుకొనడమే అజ్ఞానమంటే.

252

నీవు ద్రష్టవని తెలిసికొంటే నీకగపడేదంతా దృశ్యమవుతుంది. నీవు సాక్షివని గ్రహించగలిగితే దృశ్యముల యొక్క వికారాలు నిన్నూ అంటుకోవు. అంటే, నిన్నేమి చేయలేవన్నమాట.

253

నీ హృదయంలో శమము, దమము, కరుణ, నిగ్రహము, వైరాగ్యము మొదలయినవి ఉన్నంతకాలం, సాధు సాంగత్యం కొనసాగుతున్నంతవరకు, సద్గ్రంథ పఠనం చేస్తున్నంతవరకు నీవు సంసారానికి భయపడనవసరము లేదు.

254

నీలోని అంతర్జ్యోతిమీదనే నీదృష్టి నిల్పి ఉన్నంతకాలం, నీకు ఏ దుఃఖాలుండవు ఆనందమయుడవయ్యే ప్రకాశిస్తావు.

255

నీ శరీరం మాంసపు ముద్ద. ఆత్మయే నీవూ జ్ఞానస్వరూపమయినది. శరీరం పుట్టుతుంది, నశిస్తుంది. ఆత్మ పుట్టదు,

చావదు. శాశ్వతంగానే ఎల్లప్పుడు ఉంటుంది. మరి నీవు శరీర మనంటావా! లేక ఆత్మనంటావా!

256

ఏ వస్తువుకు గుణములు, క్రియలు, రూపాదులు మొదలైన విశేషము లుండవో దానిని నిర్విశేషమని అంటారు. అలాంటిది ఒక్క బ్రహ్మపదార్థమే. అందుకే బ్రహ్మమును నిర్విశేష చిన్మాత్రమని అనడం.

257

"పశ్యతీతి పశుః" అనే వ్యుత్పత్తిని బట్టి దేహమునే తానని తలచేది పశువన్నమాట. మనుష్యులుకూడ దేహమునే తామని తలచేటట్లయితే వారికి పశువులకు భేదమేముంటుంది. కనుక మనుష్యులు దేహాత్మభావం కలవారు కాక, కేవలాత్మ భావం కలవారు అయినప్పుడే జన్మకు సార్థక్యము.

258

రక్త మాంసాస్థిమయమైన శరీరం కంటే, కర్మేంద్రియములు శ్రేష్ఠమయినవి. వాటికంటె ప్రాణశక్తి దొడ్డది. దానికంటె జ్ఞానేంద్రియములు శ్రేష్ఠములు. వాటికంటె మనస్సు, దానికంటె బుద్ధి, దానికంటె అహంకారము, ఒకదానికంటె నొకటి గొప్పది. స్థూల శరీరం మొదలుకొని అహంకారం వరకు గల ఇవి అన్నీ జడపదార్థాలే. అవి స్వయంగా ప్రకాశించలేవు. శరీరాన్ని ఇంద్రియాలను, మనోబుద్ధులను,

వాటిద్వారా బాహ్య ప్రపంచములోని పదార్థాలను ప్రకాశింపచేసే ప్రత్యగాత్మ వేరుగా ఉన్నది. దానికి తాను ప్రకాశించటము, ప్రకాశించలేని ఇతరాలను ప్రకాశింపచేయుటమే స్వభావము. అదే నీలోని ప్రత్యగాత్మ అంటే. ప్రత్యగాత్మ అనగా అన్నిటికంటె లోపల ఉండే ఆత్మ అని భావము. నీ దేహేంద్రియ, మనో, బుద్ధ్యహంకారములకంటె, వాటి వృత్తులకంటె, లోపల సూక్ష్మాతిసూక్ష్మంగా ఉంది. వాటి నన్నిటినీ "ఇవి ఇట్టివి" అని ప్రకాశింపచేస్తూ తెలిసికొనేదే "ప్రత్యగాత్మ" అంటే.

259

ఇలాంటి ప్రత్యగాత్మ యొక్క చైతన్యం అహంకారం మీద లేక "బుద్ధి" అనే ఉపాధిమీద పడుతుంది. అంటే ప్రతిఫలిస్తుందన్నమాట. వెంటనే జడమైన, ఆ అహంకారానికి గూడ, చైతన్య ధర్మం కలుగుతుంది. అప్పుడు అహంకారం ఆ ప్రతిబింబాన్ని ఆవరించి వేస్తుంది. ఆ రెంటికీ, అన్యోన్యాధ్యాస కలుగుతుంది. అంటే, ప్రతిబింబానికి అహంకార ధర్మాలు, అహంకారానికి చైతన్య ధర్మాలు కలిగి రెండు ఒక్కటే అనే భ్రాంతి గాఢమవుతుంది, ఈస్థితిని కాల్చిన ఇనుపగుండుతో పోల్చవచ్చు. ఇనుప గుండును కాల్చితే అగ్నిధర్మాలు గుండుకు, గుండు ధర్మాలు అగ్నికి వస్తాయి కదా! ఆ రెంటి చిజ్జడములనే సమ్మేళనమే జీవుడనే

వాడు. ఇక జీవుడు అహంకారంతో ఆ యా పనులు తాను చేస్తున్నానని కర్తృత్వాన్ని పొంది, వాటి ఫలాలను అనుభవిస్తున్నానని భోక్తృత్వాన్ని పొందుతాడు. సుఖ దుఃఖాలకు గురి అవుతాడు. ఈ జీవునికి మూలమై, బింబముగా ఉండేవాడే ప్రత్యగాత్ముడన్నా, కూటస్థుడన్నా!

260

ప్రత్యగాత్మ యొక్క చైతన్యం బుద్ధి వృత్తులద్వారా, ఇంద్రియ మార్గాల నుండి; బాహ్య పదార్థాలమీద ప్రసరిస్తుంది. అప్పుడు జీవునికి, వస్తువుల యొక్క జ్ఞానం కలుగుతుంది. కనుక అహంకారం నుండి దేహము వరకు గలవన్నీ జడములే కాని, ఇతరములు కావు. ఆ జడ పదార్థాలు ఏనాటి కయినా నశించి తీరవలసిందే. కనుక, వెలుపల పదార్థాల కంటె నీవు వేరైనట్లు స్థూలదేహానికంటెగూడ నీవు వేరే అని గ్రహించాలి. ఈ సందర్భంలో మనోవృత్తుల ద్వారా ఇంద్రియ మార్గాలనుండి బాహ్య పదార్థాలను ప్రకాశింపచేస్తూ నిర్వికారంగా ఉండేవాడే ప్రత్యగాత్ముడు.

261

నీ స్థూల శరీరం జాగ్రత్తులో మాత్రమే పనిచేస్తుంది. కాని స్వప్నంలో పనిచేయదు. చైతన్య ప్రతిబింబముతో గూడిన బుద్ధియే స్వప్నకాలంలో జాగ్రత్ జగమువంటి జగత్తును కల్పించి నాటకమాడుతున్నది ఆ నాటకాన్ని చూసేది నీలోని ప్రత్యగాత్మయే. ఈవిధంగా చూచినప్పుడు

జాగ్రత్, స్వప్న జగత్తులకు సాక్షివి నీవే అవుతావు. అంటే ఆ శరీరాలకు, ఆ జగత్తులకు నీవు వేరైనవాడవన్న మాట.

262

సుషుప్తిలో స్థూల, సూక్ష్మ శరీరాలు రెండూ పని చేయటం లేదు. ఈ రెంటికీ కారణమైన బుద్ధి అనే ఉపాధి కూడ అజ్ఞానంలో లీనమై పనిచేయకుండానే యున్నది. అప్పుడు ప్రకాశించేది ప్రత్యగాత్మ ఒక్కటే. అదే సాక్షి భూతమయిన నీవూ, నీ జ్ఞానానంద స్వరూపము! ఆ నిన్నే ఉపనిషత్తు "అత్రాయం పురుషః స్వయంజ్యోతి ర్భవతి" అని చెప్పుతున్నది. జాగ్రత్ స్వప్నాలలో గోచరముకాని, నీ సచ్చిదానంద స్వరూపం సుషుప్తిలో చక్కగా ప్రకాశించింది గదా!

263

సుషుప్తి వేళ అజ్ఞానంలో లీనమయిన బుద్ధి, దాన్ని ప్రకాశింపచేసే ఆత్మప్రకాశము రెండూ ఉంటవి. ఆ అజ్ఞానమునే కారణశరీర మంటారు. జడమయిన కారణ శరీరాన్ని ప్రత్యగాత్మ చూస్తూ ఉంటుంది. అంటే ప్రకాశింపచేస్తుందన్నమాట. మెలకువ వచ్చినతరువాత, నాకేమీ తెలియ లేదు- హాయిగా ఉన్నదంటున్నావు. ఏమీ తెలియలేదనడం అజ్ఞానానికి గుర్తు. హాయి ఆనందానికి చిహ్నము. ఆ రెంటినీ గుర్తించేదే ఆత్మలోని చిత్స్వభావము. ఈవిధంగా వివేచించి చూచినట్లయితే కేవల ప్రత్యగాత్మ- వికార రహితుడని,

ప్రకాశ స్వరూపుడని, ఆనందమయుడని ఒక్కడేఅని తెలుసు కోవచ్చు.

264

మనం తినే బూరెలో బియ్యపు పిండి, బెల్లం రెండూ కలుస్తాయి. అయినా, బూరె నుండి తీపిని వేరుచేయలేం ఆలోచించి చూస్తే, రెంటి సమ్మేళనమే బూరె అని తెలుసు కోవచ్చు. అలాగే సుషుప్తిలో జ్ఞానానంద స్వరూపమయిన ఆత్మ ఉన్నది. అది బూరెలోని తీపి వంటిది. కారణ శరీరమూ (బుద్ధి అనే ఉపాధి) ఉన్నది. అదేమో బూరెలోని పిండివంటిది.

265

సుషుప్తిలో, అజ్ఞానంలో లీనమయిన బుద్ధి అనేదేమో జడవస్తువు. దాన్ని ప్రకాశింపచేసే, అంటే గ్రహించే వెలుగేమో ఆత్మ. బూరెను, తీపిని వేరుచేసి చూచినట్లు; కారణ శరీరమును, ఆత్మప్రకాశమును సాధకులు వేరుచేసి తెలిసికొనవచ్చు. అలాగే స్వప్నావస్థలో కూడ స్వప్నజగాన్ని కల్పించే బుద్ధిని వేరుచేసి, దానిని ప్రకాశింపచేసే ఆత్మను ప్రత్యేకంగా చూడవచ్చు. అలాగే జాగ్రత్తులో కూడ బాహ్య వస్తువులను, ఇంద్రియ మనో బుద్ధి వృత్తులను జడములని గ్రహించి వేరుచేసినట్లయితే, వాటినన్నిటిని ప్రకాశింపచేసే ఆత్మను పట్టుకోవచ్చు. అసలు ఆ ఆత్మే నీవు గనుక, పట్టుకోవడమంటూ పొసగనే పొసగదు, తెలుసు కోవడమే. అనుభూతి పొందడమే అక్కడ జరిగే పని.

266

నీలోని ప్రత్యగాత్మ (అంటే నిజమయిన నీవు) ఏమీ చేయదు. అది శరీరంలో ఉన్నంతవరకు శరీరేంద్రియాలు, ఆ యా పనులను చేస్తూయుంటవి. ఇంట్లో దీపం వెలుగుతూ ఉంటే ఇంట్లోనివారు తమ తమ పనులను చేసుకుంటూ ఉంటారుగదా! అయినా దీపానికి వారి సంగతేమి పట్టదు. వారెలా ఉన్నా దీపం వెలుగుతూనే ఉంటుంది. అలాగే నీలోని ప్రత్యగాత్మకు దేహేంద్రియాదుల యొక్క పనులతోగాని, వికారములతోగాని సంబంధముండదు. బుద్ధి అనే ఉపాధిలోని చిదాభాసుడు (జీవుడు) అహంకారం వల్ల శరీరేంద్రియ వికారాలను, కార్యాలను తనమీద ఆరోపించుకొని సుఖదుఃఖాలను పొందుతూ ఉంటాడు. ఆ అహంకారమనేది నశిస్తే మిగిలేది నిష్క్రియమైన ఆత్మ స్వరూపమే.

267

జాగ్రత్ స్వప్నాలలో అంతఃకరణం పనిచేస్తున్నది గనుక, ప్రపంచం కనబడుతూ ఉన్నది. సుషుప్తిలోనేమో అంతఃకరణం పనిచేయుటలేదు గనుక ప్రపంచం ఉండటం లేదు. గనుక ప్రపంచం కాని, సంసారంకాని, మనస్సు యొక్క కల్పనయే. సాధకుడు సమాధిలోనికి వెళ్లినప్పుడు ఆ అజ్ఞానంకూడ నశించి కేవలాత్ముడై మిగిలి ప్రకాశిస్తాడు.

268

'కారక రోగ' మంటే యమ నియమాదులైన

అష్టాంగాలతో కూడిన యోగమన్న మాట. దీనినాచరించడం వలన మనస్సులోని రజ, స్తమోగుణాలు తగ్గుతాయి. సత్వగుణం వృద్ధిచెంది మనశ్శుద్ధి, మనశ్శాంతి ఏర్పడుతాయి. సాంఖ్యయోగ మంటే ప్రకృతిని, దానివలన కలిగిన జగత్తును విమర్శించి చెప్పి, ఆత్మతత్త్వమును బోధించేదన్నమాట. దీని వలన ఆత్మానాత్మ వివేకము కలిగి, ప్రకృతి పురుష జ్ఞానం సిద్ధిస్తుంది. ఇక మూడోదేమో అమనస్క యోగము. ఇది సంపూర్ణమైన అనుభవజ్ఞాన మన్నమాట. సాంఖ్యము వలన ఏ ఆత్మానాత్మల రహస్యాలను తెలిసికొన్నాడో, వాటిని అనుభవము ద్వారా సిద్ధింపజేసుకొని ఆత్మస్వరూపుడై ప్రకృతి సంగములేని కేవలత్వాన్ని పొందుతాడు.

269

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనే పంచకోశములలోనూ, అన్నమయ కోశమంటే స్థూల శరీరం. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల్లు మూడు సూక్ష్మశరీరం. ఆనందమయ కోశమేమో కారణ శరీరం. అందుకనే సుషుప్తిలో ఆనందము వ్యక్తమౌతూ ఉంటుంది. ఈ పంచకోశాలను, మూడు శరీరాలను అంటకుండా వాటిని ప్రకాశింపజేసేదే ప్రత్యగాత్మ.

270

ఆకాశాది పంచమహా భూతములు, జ్ఞాన కర్మేంద్రియ

ములు 10, పంచప్రాణములు, మనోబుద్ధి చిత్తాహంకారములు; వీటికి మూలమైన ప్రకృతి, శబ్దాది విషయ పంచకము, ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖాదులు అనేవాటికి కూటము, క్షేత్రము అని పేర్లు. ఈ కూటమునందు వాటికి అంటకుండా, వాటిని ప్రకాశింపజేస్తూ ఉండేవాడే; కూటస్థుడన్నా, క్షేత్రజ్ఞుడన్నా. క్షేత్రాన్ని ప్రకాశింపజేస్తాడు గనుక క్షేత్రజ్ఞుడనే పేరు సార్థకం. వేదాంతంలో కూటస్థుడు, ప్రత్యగాత్మ, క్షేత్రజ్ఞుడు, అక్షరుడు, పురుషుడు, సాక్షి అనే పదాలను పర్యాయంగా వాడుతూ ఉంటారు. (ఇవి పరమాత్మకు కూడా వాచకాలే.)

271

నీవు నీశరీరాన్ని అభిమానించి దాని అవసరాలను ఎలా తీర్చుతున్నావో, అలాగే ఇతర ప్రాణుల శరీరావసరాలనుకూడా, తీర్చి సాయపడినప్పుడే నీవు సంపూర్ణ భూతదయ కలవాడవు కాగలుగుతావు.

272

నీ మనస్సు సంకల్ప, వికల్పాలను చేస్తుంది. ఇంకా ఎన్నెన్నో తలపులను తలపోస్తుంది. అలాంటప్పుడు అవి అన్నీ నీవే చేస్తున్నావని అనుకోకుండా, వాటిని ప్రకాశింప జేసే లేక తెలుసుకొనే సాక్షిగా నీవు వ్యవహరించాలి. అలాంటి స్థితి నీకు పట్టుబడినప్పుడు నీవు నిర్వికార స్వభావుడవు, సాక్షివి కాగలుగుతావు. అలాగే దేహేంద్రియాలు

చేసే పనులకు కూడా నీవు కట్టుబడకుండా సాక్షివిగానే నిస్సంగుడవుగానే నడచుకోవాలి. అప్పుడే జ్ఞాని అనే పేరు నీకు చెల్లుతుంది.

273

ప్రపంచములో నీచేత తెలిసికొనబడే వస్తువులన్నీ దృశ్యములనిపించుకుంటాయి. వాటిని తెలుసుకొనే నీవు మాత్రం దృక్కువు అవుతావు. దృశ్యాలకు ప్రకాశించే శక్తి ఉండదు. దృక్కుకేమో, తాను ప్రకాశిస్తూ ఇతరాలను ప్రకాశింపజేసే శక్తి ఉంటుంది. ఇలాంటి దృక్కు, దృశ్యము అనే వివేకమే నిన్ను అమృతుని చేస్తుంది. దృశ్యాలు క్షణక్షణానికి పుట్టుతూ, పెరుగుతూ, మారుతూ, తరుగుతూ, నశిస్తూ ఉంటాయి. దృక్కుకు అలాంటి వికారాలేమీ ఉండవు. అది సర్వకాల సర్వావస్థలయందు ఏకరూపమై ప్రకాశిస్తూనే ఉంటుంది.

274

బ్రహ్మమును త్రిగుణాలతో కూడిన ప్రకృతితో సంయోగము కలిగినప్పుడు సగుణుడని, ఆ గుణములతో సంయోగము లేనప్పుడు నిర్గుణుడని, శాస్త్రాలు వ్యవహరిస్తున్నాయి; గాని ఆ సగుణ, నిర్గుణ స్థితులు పరబ్రహ్మమునకు లేనేలేవు. సంయోగ, వియోగాలనేవి ద్వంద్వములు కనుక, ద్వంద్వాతీత బ్రహ్మమునకు అవి రెండూ ఎలా సంభవిస్తాయి? కనుక అవీ వ్యావహారికాలే.

275

నీవు ఏ సంకల్పాలను- మనస్సులోనికి రానీయకుండా "నేను సత్తు, చిత్తు, ఆనందమే స్వరూపముగా కలవాడను" అనే గాఢ భావాన్ని కలిగి, నిన్ను నీవు చూచుకొనసేర్చితే మనశ్చాంచల్యాన్ని ఉడిగి నిర్వికల్ప, నిరామయ, నిర్గుణ బ్రహ్మవు అయితీరుతావు.

276

ఒకవేళ కారణాంతరాలవల్ల సంకల్ప, వికల్పాదులు కలిగినా; అవి నేను కాదని, నావికాదని అనుకొని, వాటిని చూసే ద్రష్టను, సాక్షినే నేను అనే నిశ్చయం కలిగిఉన్నా; నీ నిర్వికార, నిర్మల సాక్షిత్వం మిగిలి నీవు ధన్యుడవే అవుతావు.

277

నిన్ను నీవు చూచుకొనలేకపోవటంవల్ల, నీమీదే నీవు ఉండలేకపోవటంవల్ల, నీ మనస్సు నానావిషయాల మీద పంచరిస్తూ, నిన్ను ప్రపంచంలోకి లాగి బాధ పెట్టుచున్నది. నిన్ను నీవు చూచుకొనడం నేర్చితే, నిత్యానందమే నీ స్వరూపమై, మనస్సనేది నీలోనే లీనమైపోతుంది.

278

నీ మనస్సును కోరికల మీానికి, ఇంద్రియ భోగాల మీాదికి పంపి, నీవు బాధ పడుతున్నావు. వాటిమీాద విరక్తిని అలవాటు చేసుకుంటే నీవు సుఖస్వరూపుడుగానే ఉంటావు.

279

ఆత్మానంద మనేదాన్ని, నీవు ఒక్కసారి అనుభవించినా, బాహ్య విషయాల కోసం అఱ్ఱులు చావవు. ప్రాప్తమైనదానితో తృప్తిపడి, ఆత్మరూపుడవే అయి మెలగగలుగుతావు.

280

ఇంద్రియాలు ఆయా విషయాల మీద సంచరిస్తున్నా. నీవు నీమీదనే ఉండి, ఆనందించే ఉపాయ మొకటి ఉన్నది. అదేగనుక నీకు పట్టుబడితే, నీవు వ్యవహారంలో ఉన్నా ఇబ్బంది లేదు. అయితే దాన్ని అతిజాగ్రత్తగా అలవాటు చేసుకోవాలి.

281

బాహ్య విషయాలను సంపాదించుకొనటానికే నీవు బాధపడాలి. ఎందుకంటే అవి నీకంటే వేరుగా వెలుపల ఎక్కడో ఉన్నవి గనుక. ఆత్మానంద సంపాదన అలా కష్టమేమీ కాదు. ఎందుకనంటే ఆత్మ నీ స్వరూపమే, నీవే కాబట్టి, నిన్ను నీవు గుర్తుచేసుకోగానే దాన్ని పొందినట్లే. మన ఇంట్లోని వస్తువులను మనం పొందడం కంటే పొరిగింటి వస్తువులను పొందడం కష్టమని అందరికీ తెలిసినదే కదా!

282

ఇంకొక దృష్టితో చూస్తే, మనస్సనేది అతి సూక్ష్మమయిన జడపదార్థమే. దానికి, చావుపుట్టుకలు వికారాలు

ఉన్నాయి. అది పనిచేయాలంటే ఆత్మ ప్రకాశాన్ని పొంది సజీవం కావాలి. ఇక నీ ఆత్మయేమో స్వయంప్రకాశము, నిర్వికారము, నిత్యము గనుక, దానిమీది క్రీడ నీకు చేతిలోని వెన్నముద్దను తినడం వంటిదే అనుకో!

283

గాఢనిద్రలో నీ స్థూలశరీరము పనిచేయకుండా మంచంమీద పడిఉన్నప్పుడు; నీ సూక్ష్మశరీరము స్వప్నాలు కనకుండా, నిద్రలో మునిగినప్పుడు; బుద్ధి అనే ఉపాధి, అజ్ఞానంలో లీనమయినప్పుడు ఉన్నట్టి శూన్యస్థితిని; చూచే ద్రష్టవు, దానికి సాక్షివి నీవే. నీ శరీరాదులు పనిచేయక పోయినా, నీవు మాత్రం సుషుప్తిలో ప్రకాశిస్తూ, అజ్ఞానికి ద్రష్టవై, ఆనందరూపుడవై ప్రకాశిస్తూనే ఉన్నావు. మెలకువ వచ్చినాక, ఆ సుషుప్తిలోని అనుభవాన్ని గూర్చి నాకేమీ తెలియలేదని, ఆనందాన్ని గూర్చి హాయిగా ఉన్నదని చెబుతున్నావు. ఆ చెప్పే నీవే నిన్నుగా గుర్తుపట్టాలి. ఎల్లప్పుడు గుర్తుంచుకోవాలి. సర్వకాల సర్వావస్థలలోను ఆ "నీ"మీదే క్రీడించటం నేర్చుకోవాలి. అప్పుడు నీవు ఆత్మరతి, ఆత్మ తృప్తి, ఆత్మక్రీడ కలవాడవు అవుతావు.

284

5 జ్ఞానేంద్రియాలు; 5 కర్మేంద్రియాలు; 5 ప్రాణాలు; 5 మహాభూతములు; మనో, బుద్ధి, చిత్తాహంకారములు అనేవి ఇరువది నాలుగు తత్త్వములు. ఇవి అన్నీ జడ పదా

ర్థాలే. వీటిని ప్రకాశింపచేసే ఇరువది అయిదవదే ఆత్మ తత్త్వము, అదే నీ స్వరూపము. దాన్నే నీవు సుషుప్తిలో గమనించేది, గమనించవలసినది.

285

సంసారమనేది అంతా మనస్సులోనే పుడుతుంది. మనస్సులోనే పెరుగుతుంది. చివరకు మనస్సులోనే కలుస్తుంది (నశిస్తుంది) కూడ. అందుకే, ఆ మనస్సు సుషుప్తిలో మ్రగ్గినప్పుడు సంసారముండదు. మేల్కొంచగానే, ప్రపంచమంతా సిద్ధమవుతుంది.

286

మనస్సు కారణరూపంగా ఉన్నప్పుడు దాన్ని అవ్యక్తం, ప్రకృతి, మాయ, అవిద్య, అజ్ఞానము అని అంటారు. కార్యరూపాన్ని తాల్చినప్పుడు, సంకల్పం, సంసారం, వాసనామయం- ప్రపంచం-బంధ మోక్షకం అంటారు.

287

ఈ మనస్సును లేకుండా చేసుకొనే దశయే అమనస్కమంటే. మనస్సు తోచటానికి కారణం ఆత్మ వస్తువే. ఆత్మ వస్తువుమీద కలిగే చిన్న స్పందనే మనస్సంటే. కనుక ఆత్మను నిష్పందం చేసుకుంటే- అంటే సచ్చిదానంద మయంగా చూడగలిగితే అప్పుడు మనస్సు మాయమై- సుషుప్తిలోలాగ సచ్చిదానందాత్మయే మిగులుతుంది.

288

"లీనం గమయతీతి లింగం" అనే వ్యుత్పత్తిని బట్టి తనలో లీనమైఉన్న ఆత్మకు తెలియపరచేది కాబట్టి, సూక్ష్మోపాధికి లింగశరీరమనే పేరు సార్థకమవుతుంది. ఆత్మ అంతఃకరణోపాధి ద్వారానే వ్యక్తమవుతుంది కనుకను, అంతఃకరణం లింగ శరీరంలోదే కనుకను- దానికి ఆ పేరు సార్థకం.

289

అంతఃకరణోపాధి (బుద్ధి) యందు ప్రతిఫలించిన చైతన్యమే ప్రమాత అని చెప్పబడే జీవుడు. అతడు బుద్ధితో తాదాత్మ్యమును చెంది సూక్ష్మ, స్థూల దేహములను అభిమానించి కర్తగా, భోక్తగా ఒప్పుతున్నాడు.

290

అంతఃకరణములో- సత్వగుణము అతిశయించినప్పుడు జాగ్రదవస్థ, రజోగుణము అతిశయించినప్పుడు స్వప్నావస్థ, తమోగుణము పెరిగినప్పుడు- సుషుప్తి కలుగుతాయి. ఈ అవస్థలు అనుభవించేది అంతఃకరణముతో గూడిన జీవుడే కాని, బింబరూపమయిన ఆత్మ మాత్రం కాదు. ఆత్మ వీటన్నిటికి సాక్షిగా మాత్రమే ఉంటుంది.

291

మనోమయ కోశములో మనస్సుకు ప్రాధాన్య మున్నట్లు, విజ్ఞానమయ కోశంలో బుద్ధికి ప్రాధాన్యముం టుంది. ఈ బుద్ధి సత్వగుణం వల్ల నిర్మలమయినది గనుక,

ఇందులో ఆత్మ చైతన్యం లెస్సగా ప్రతిఫలిస్తుంది. అప్పుడు బుద్ధినే ఆత్మ అనుకొనేటంతగా వాటికి తాదాత్మ్యం కలుగుతుంది. ఈ స్థితిని కాల్చిన ఇనుపముద్దతో పోల్చవచ్చు. ఇనుము తాను కాల్చలేకపోయినా, అగ్నిసంపర్కము వల్ల కాల్చగలుగుతుంది కదా! అలాగే ఆత్మ ప్రతిఫలనం చేత బుద్ధి ఆత్మయే అయి భ్రాంతిని కలిగిస్తుంది. దానిలో స్థూల, సూక్ష్మ శరీర ధర్మాలను, బుద్ధి ధర్మాలను తనవిగానే యెంచి జీవుడు సంసారము అనుభవిస్తాడు.

292

కాలిన ఇనుము నుండి అగ్నిని వేరుచేసి చూడలేనట్లు, బుద్ధి నుండి ఆత్మను వేరుచేసి చూడటం మిక్కిలి కష్టముయిన పని. ప్రకాశానందములేమొ ఆత్మవని, సుఖ, దుఃఖ, కర్తృత్వ, భోక్తృత్వాదులేమొ బుద్ధిధర్మాలని తెలిసికొనే జ్ఞానం కలిగితేనేకాని, తత్వం బోధపడదు. ఆ తత్వము నెరిగినవాడే తత్త్వజ్ఞుడంటే.

293

ఆత్మచైతన్యంతో కూడిన అహంకారం శరీరంలోని ప్రతి అణువులోను ఆపాదమస్తకము వ్యాపించి ఉంటుంది. కాబట్టి, శరీరంకూడ చైతన్యవంతమై ప్రకాశిస్తుంది. అంతకు మించి శరీరానికి స్వతః చైతన్యం లేదు. అందుకనే అంతఃకరణోపాధి తొలగగానే దేహం మరణిస్తుంది. ఏపనీ చేయలేకపోతుంది.

294

బుద్ధి ప్రతిఫలిత ఆత్మప్రకాశం వల్ల దేహం చైతన్యం కలదిగా కనబడడంవల్లనే. దానిమీద మనకు ఆత్మ అనే భ్రాంతి కలుగుతుంది. నిజం విచారించితే దేహంకాని, బుద్ధి కాని రెండూ జడవస్తువులే. కాలిన ఇనుపగుండు మీద అగ్ని అనే భావం కలగటమే దీనికి ఉదాహరణ.

295

తనలో ఉన్న అహంకారాన్ని "నాకు అహం కారమున్నది. ఈ అహంకారము అన్ని అనర్థాలకు మూలము" అని నీలో ఎవడు తెలిసికొంటున్నాడో వాడే "అహంకార సాక్షి" అని చెప్పబడుతున్నాడు. "నీ"వనే వాడు అహంకారం కాడు. ఆ అహంకారానికి కూడ సాక్షిగా ఉండేవాడు అని గ్రహించాలి.

296

ఆత్మవస్తువు అహంకారాన్ని చూచే- తెలిసికొనే ద్రష్ట. ఆత్మ ద్రష్ట అయినప్పుడు అహంకారం దృశ్యమవు తుంది కదా. కనుక నీ అహంకారం కంటే- ఆ అహం కారాన్ని చూపే ద్రష్టవు- సాక్షివి. నీవు వేరు కాదా! ఆ నీవే ఆత్మవు. నీకవతల ఇంకేమి ఉండదు.

297

నీ కగపడే ప్రపంచం, నీ శరీరం, ఇంద్రియాలు, ప్రాణం, మనస్సు, మనోవృత్తులు, చిత్తం, బుద్ధి, అహం

కారం. అందులో ప్రతిఫలించిన జీవుడు, వాడికి మూలమయిన నీవు, ఇవి నీలో ఉన్న వస్తువులు. నీవు ప్రపంచం అనేదాని నుండి ప్రయాణం ఆరంభించి, అహంకారానికి గూడ సాక్షువైన నీదాకా వెళ్ళితే ఇక అవతల ఏమీ ఉండదు. చివరకు మిగిలేది నీవే. అప్పుడు నీరూపం నీకు తెలుస్తుంది. ఆ నిన్ను గూర్చి తెలియనంతవరకూ, నీవుకాని వాటిని పట్టుకొని నీవనుకొన్నంతవరకు, నీకు దుఃఖాలు తప్పవు.

298

అహంకారానికి దగ్గరగా ఉన్నందువలన, దాని గుణాలు తనమీద ఆభాసించి ఆత్మకు జీవత్వం కలుగుతుంది. ఎట్టగులాబీపూవు దగ్గరగా ఉన్న స్ఫటికమణి తెల్లదయినా ఎట్టగానే ఉంటుంది కదా! అలాగే ఆత్మకు జీవత్వమున్ను; ఆ రెంటిని వేరుచేస్తే ఎవరి స్వరూపం వారికే ఉంటుంది.

299

తనకు జీవత్వం ఉపాధివల్ల కల్పించబడినదని, ఆత్మత్వం స్వతస్సిద్ధమయిన నిజరూపమని తెలిసికొనటానికే, మానవజన్మ వస్తుంది. ఆ జన్మను ఎవరూ తెలివితక్కువగా వ్యర్థపుచ్చుకోరాదు.

300

అమనస్క యోగమనేది చివరి మెట్టు. దానిని అతి మెలకువగా ఆచరిస్తే దుఃఖనివృత్తి కలిగి ఆనందరూపుడవు అవుతావు.

301

ఆత్మ తత్త్వం తెలిసినప్పటికీ విషయముల నుండి విగ మించలేకపోతే నీ తత్త్వ జ్ఞానం వ్యర్థమే. కనుక చిత్త నిగ్రహ పూర్వకంగా విషయ పరిత్యాగం చేయడం ప్రయోజనకారి.

302

"అహమాత్మా-అహంబ్రహ్మ" అనే ఆత్మభావన అలవడనంతవరకూ ఎన్ని శాస్త్రాలు ఎంతగా చదివినా అందువల్ల ప్రయోజనం లేదు.

303

పంచభూతములు, వాటి పరిణామమయిన శరీరేంద్రియ ప్రాణ, మనోహంకారములనేవి దృశ్యాల క్రింద కే వస్తాయి. ఆ దృశ్యాలనుకూడ, దృశ్యాలుగాకాక, దృగ్రూప బ్రహ్మం గానే భావించటమనేది ఒక దివ్యసాధన. అలా భావించి ఆ దృగ్రూప బ్రహ్మము 'నేనే' అని సుస్థిరుడయినవాడు కృతార్థుడు.

304

ఇంద్రియాలతో విషయాలను అనుభవిస్తూ ఉన్నప్పటికీ, నేను వీటన్నింటికీ సాక్షినని అనుకుంటూ తన్ను తాను చూచుకొని ఆనందించటమనేది ఒకరకమయిన సాధన.

305

ఇంద్రియాలనేవి తమ తమ పనులను చేస్తున్నా, ఆ

చేసినది 'నేను' అనే భావము లేకుండా వాటితో సంబంధం (సంగం) పెట్టుకోక ప్రవర్తించటమే రాజయోగుల నడత.

306

ఏకాంత ప్రదేశ నివాసమంటే ఎవరూ లేని నిర్జన ప్రదేశంలో ఉండటమని భావం కాదు. ఏ ప్రదేశానికి, మనో, బుద్ధి, చిత్త, అహంకారములు, ఇంద్రియాలు- వాటి వ్యాపారాలు ప్రవేశించలేవో, అలాంటి నిర్గుణ నిర్మల ప్రదేశమే ఏకాంతమంటే. అట్టిది బ్రహ్మమే కనుక, ఆ బ్రహ్మమనే ఏకాంత దేశవాసియే నిజమయిన ఏకాంతవాసి.

307

శివ, శక్తి, విష్ణు, విశ్వకర్మ దేవతల రూపములను ధ్యానించటంకంటే వాటినన్నింటినీ చూడజాలిన తాననే దృగ్రూపమును ధ్యానించటం పరమోత్తమ ధ్యానం.

308

ఇంద్రియములకు తోచేది, మనస్సునకు గోచరించేది, సరమూ బ్రహ్మమే అని భావన చేయటం ఒక అద్భుత యోగం.

309

పూజ, ధ్యాన, సమాధి సమయాలలోనేకాక మల మూత్రాదులు, విసర్జన చేసే వేళలందుకూడ నీకు బ్రహ్మ భావన స్థిరమై తోచటమనేది అనుసరింపదగిన మార్గం.

310

అజ్ఞానికి బ్రహ్మం జగత్తుగా తోచినట్లు, సుజ్ఞానికి జగత్తు

బ్రహ్మపదార్థంగానే తోస్తుంది. కాని జగత్తును బ్రహ్మముగా భావించి ప్రవర్తించడం తేలికగాదు.

311

సత్యజ్ఞానం వల్ల మిథ్యాజ్ఞానం బాధింపబడుతుందే కాని, మిథ్యాజ్ఞానం వల్ల సత్యజ్ఞానం బాధింపబడదు. అసత్య వస్తు జ్ఞానంవల్ల సత్యవస్తువునకు బాధ కలుగదు కాని, సత్య వస్తుజ్ఞానం వల్ల మాత్రం అసత్య వస్తువునకు బాధ కలిగి తీరుతుంది. ఎలాగంటే ముత్యపుచిప్పను చూచి, దానిని వెండి అనుకొన్నందువల్ల ముత్యపుచిప్పకు ఏమీా నష్టం లేదు. కాని ముత్యపుచిప్పను చూచి వెండి అనుకొని తీరా పరీక్షించి చూచితే ఇది ముత్యపు చిప్పేరా అని అనుకొన్నందువల్ల వెండి లేకుండా పోవలసివస్తుంది గదా!

అలాగే బ్రహ్మమును చూచి, జగత్తు అనుకొన్నందు వల్ల బ్రహ్మపదార్థానికేమీా లోటులేదు. కాని విచారించి చూచినప్పుడు సత్యమయిన బ్రహ్మము బ్రహ్మముగానే తోచగా, దానియందు తోచిన జగత్తు బాధింపబడవలసి వస్తుంది. ఇక్కడ బాధ అంటే యథార్థంగా లేకపోవడం. సారాంశమేమిటంటే సత్య వస్తువయిన బ్రహ్మము యొక్క జ్ఞానం కలిగినప్పుడు జగత్తు లేకుండా పోతుంది. అంతేకాని బ్రహ్మమును చూచి జగత్తు అని భ్రాంతిపడినప్పుడు, బ్రహ్మము నశించుట లేదు. నీకు తెలియబడకపోయినా బ్రహ్మము శాశ్వతముగా ఉండనే ఉంటుంది. జగత్తు

మాత్రం అలాకాదు. సత్య వస్తు జ్ఞానంవల్ల అది బాధింప బడుతుంది. కనుక, సత్యాన్ని అసత్యం అనుకున్నా, సత్యము శాశ్వతముగా నిలచే ఉంటుంది. ఆ సత్యజ్ఞానం వల్ల నశిం చేది అసత్యమే! ఈ విషయం కొంచెం క్లిష్టంగా ఉన్నది కదూ!

312

జగత్తనేది జాగ్రదావస్థలో నిజంగానే ఉన్నట్లుగాను, స్వప్నదశలో ఉండీ లేనట్లుగాను (ప్రాతిభాసికంగా), సుషుప్తిలో అసలు లేకుండగనూ, రూపాలను మార్చుకుం టుంది. కాని, ఈ మూడు దశలలో ఆ జగత్తుని చూచే ద్రష్ట మాత్రం- అంటే నీలోని సాక్షీ మాత్రం ఏ మార్పులు లేకుండా ఏకరూపమయి జ్ఞానానంద స్వరూపంగా ప్రకాశి స్తూనే ఉన్నది. కనుక నీవు నిత్యానంద స్వరూపుడవే. జగత్తేమో జనన మరణాదులయిన వికారాలను పొందుతుంది.

313

ఏ వస్తువును ఆధారం చేసుకొని, ఏ వస్తువు కనబడు తుందో అది ఆ మొదటి వస్తువుకంటె భిన్నం కాదు. మట్టిని ఆధారంగా చేసుకొని, కుండ తయారయి కనబడుతుంది. గనుక, కుండ మట్టికంటె వేరుకాదు. అలాగే త్రాటిని ఆధా రంగా చేసుకొని పాము కనబడుతుంది. కనుక ఈ రజ్జు, సర్ప ములు రెండు ఒక త్రాడనే వస్తువే! అలాగే అఖండ బ్రహ్మమునిూదనే జగత్తు కనబడుతుంది గనుక, జగత్తు

బ్రహ్మముకంటె భిన్నం కాదనే రహస్యాన్ని గ్రహించాలి. ఇంకో ఉదాహరణ చూడు. బంగారం మీాదనే నగ తోస్తుంది. ఆలోచిస్తే నగయొక్క స్వరూపం బంగారమే కదా!

314

నీలో తోచే నిద్రాలస్య, భ్రమ, ప్రమాదాదులు. అజ్ఞానం, జాగ్రత్తు మొదలయినవన్నీ, నీ కారణశరీర ధర్మాలేకాని, సాక్షివైన నీకు చెందినవి కావు. నీ వేమో నిర్మల, నిర్వికార, కూటస్థాత్మ చైతన్య స్వరూపుడవే.

315

అవరోహణ క్రమములో (క్రిందికి దిగటం) పరమాత్మ నుండి జీవేశ్వరులు, ఆకాశాదులయిన చతుర్వింశతి తత్త్వములు, జగత్తు జగత్తులోని వస్తువులు పుట్టుకొస్తాయి. నీకు వాటి జ్ఞానము కలిగిన తరువాత మరల ఆరోహణ క్రమములో పైకి ఎక్కడం జరుగుతుంది. జగమును పంచభూతాలలోను, భూతాలను అహంకారములోను, అహంకారమును మహత్తులోను, మహత్తును అవ్యక్తములోను, అవ్యక్తాన్ని (అజ్ఞానాన్ని) అఖండ పరమాత్మలోను లీనం చేసుకుంటూ, వీట న్నింటిని లీనం చేసే నీవుకూడ పరమాత్మలోనే లీనమయి పరమాత్మగానే శేషించుతావు. ఇదే జగత్తులోని వైచిత్రి. ఎక్కడనుండి వచ్చినది అక్కడకు చేరితేనేగాని కృతార్థం కాదు.

316

పరమాత్మ నీ కంటే భిన్నంగా ఎక్కడనో లేదు. అది నీ స్వరూపమే అయి నీలోనే ఉండి జగత్తును తోపింపచేస్తున్నది. మళ్ళీ తనలోనే లీనం చేసుకుంటున్నది. కనుక పరమాత్మ తత్త్వం కోసం నీవు ఎక్కడికీ పరుగులు పెట్టనవసరం లేదు. నీలో అన్వేషణ జరిపి తెలిసికోవచ్చు. నీవు అది (పరమాత్మ) కానూవచ్చు.

317

మనస్సనే పక్షికి ప్రాపంచిక విషయాల స్మరణ, వాటి మీద ఆశ అనేవే రెండు రెక్కలు. ఆ విషయస్మృతి, విషయాల మీద ఆశ అనే రెండు రెక్కలను నరికితే, చిత్త విహంగం ఎగరలేక కుప్పకూలిపడి ఉంటుంది.

318

పున్నామ నరకం నుండి తరింపచేస్తాడు గనుక పుత్రుడు మోక్షాన్నిస్తాడని కొందరు భ్రాంతిపడతారు. కాని వాడివల్ల నరకం తప్పుతుందేమోగాని మోక్షం మాత్రం రాదు. మోక్షం కలగాలంటే జ్ఞానపుత్రుడు పుట్టవలసిందేగాని, మాంసమయపుత్రుడు వల్ల కలుగదు.

319

ప్రాపంచిక వస్తు రూపములుగా గోచరించే వెలుపలి దృశ్యాలన్నీ నీకు దృగ్రూప బ్రహ్మజ్ఞానాన్ని కలుగనీయకుండా కప్పివేస్తున్నాయి. దృశ్యములు కల్పితాలనే భావం

దృఢమవుతుంటేనేకాని, దృగ్రూప బ్రహ్మమునందు సాధకుడు సుస్థిరుడు కాలేడు.

320

ఎంతటి బ్రహ్మజ్ఞానికైనా బాహ్య దృశ్యమనేది గోచరించగానే మనస్సు దానిమీదికి పరుగెత్తి దాన్ని అనుభవించాలని యత్నిస్తుంది. దానితో వాడు అలా, అలా జారిపడి సుజ్ఞానానికి దూరమవుతాడు.

321

బాహ్య దృశ్యాలే గాదు, చిత్తంలో కలిగే అంతర్ దృశ్యాలయిన సంకల్పాదులు, అభిలాషలు గూడ సాధకుని భ్రష్టునే చేస్తాయి. అందుకే విషయాలను ధ్యానిస్తే వాటి మీద కోరిక కలిగితీరుతుందన్నది గీత. "ధ్యాయతో విషయాన్ పుంసః"—2. కనుక బాహ్యాంతర దృశ్యాలకు దూరంగా ఉండటమే ఉత్తమ సాధకుని కర్తవ్యం.

322

వెలుపలి, లోపలి దృశ్యాలను నిరాకరించగలిగితే, ఇక మిగిలేది- వాటిని సాక్షియై చూచే ఆత్మ చైతన్య మొక్కటే! అదే దృక్కు అన్నా, దృగ్రూప బ్రహ్మమన్నా.

323

అసలు నిజం చెప్పాలంటే బ్రహ్మము కోసమై, యత్నం చేయవలసిన పనేలేదు. ఎందుకనంటే వెలుపలివి, లోపలివి అయిన దృశ్యాలు బ్రహ్మంమీద తోచే కల్పిత

వస్తువులే అనే భావం కలిగితే, తరువాత స్థిరంగా ఉండేది బ్రహ్మమే గనుక దానికోసం యత్నించటం ఎందుకు?

324

నాచు కప్పిన చెరువులో నీటిని పొందాలంటే నాచును తొలగించటానికే యత్నంచేయాలికాని, నీటికోసం యత్నించనవసరము లేదు. నాచు తొలగగానే అగపడేది నీరేగదా! అలాగే అజ్ఞాన నాశనానికే నీవు యత్నం చేయాలి. అజ్ఞానం తొలిగితే ఇక మిగిలేది బ్రహ్మమే.

325

నిక్కమయిన బ్రహ్మ సాక్షాత్కారం కలిగి "అహం బ్రహ్మాస్మి" అనే స్థితికి వచ్చిన యోగి స్వర్గ, వైకుంఠ, కైలాసాది లోకములనుగూడ లెక్కచేయడు. అలాంటివాడీ ప్రపంచానికెందుకు లొంగును.

326

మనస్సుకు ఏ యే వస్తువులమీద కోరిక ఉంటే, అది ఆ యా వస్తువుల ఆకారమునే పొంది తన్మయమైయే ఉంటుంది. భార్యా, పుత్ర, ధన, ధాన్యాదులమీద కోరిక గలవాని మనస్సు ఆ యా స్వరూపములు కలిగినదై- వాటి పెంపుకోసమే యత్నిస్తుంది. అలాగే నీకు శాశ్వత వస్తువయిన బ్రహ్మముమీద కనుక ఆసక్తి ఉంటే, నీ మనస్సు బ్రహ్మాకారమయి బ్రహ్మముయొక్క సచ్చిదానందములనే అనుభవిస్తుంది. విషయాకారములను పొందదు.

327

మనస్సనేది ఒకటి ఉన్నప్పుడే తెలిసికొనేవాడు (జ్ఞాత), తెలియబడేది (జ్ఞేయము), తెలివి (జ్ఞానం) అనే త్రిపుటి (మూడు) ఉంటాయి. నిద్రాదశలో మనస్సు లేదు గనుక జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానములనే త్రిపుటి ఉండటము లేదు. దీన్ని బట్టి అమనస్క యోగము అభయము, ఆనందమయము, దుఃఖరహితము అని తెలుస్తుంది గదా!

328

లోకంలో అందరూ నేను కర్తను, నేను భోక్తను, (అనుభవించేవాడను) అని ప్రవర్తిస్తూ ఉంటారు. జ్ఞాని మాత్రం తన నడతలో తాను కర్తననికాని, భోక్తననికాని, భావించకుండా ప్రవర్తిస్తాడు. అందుకే అతనిని జీవన్ముక్తుడని అంటారు లోకులు. కర్తృత్వ, భోక్తృత్వాలు బంధ హేతువులు. అవి లేకపోవడమే ముక్తి.

329

తమ దేహంమీద అహంకారమును; భార్యా పుత్ర, మిత్ర, గృహారామ, ధనధాన్యాదులమీద మమకారమును వదలిపెట్టి బ్రహ్మదృష్టితో చరించేవాడే జీవన్ముక్తుడంటే.

330

జీవన్ముక్తుడు గతాన్నిగూర్చి ఇది ఇలా జరిగిందని చింతనొందడు. రాబోయేది ఇలా జరగాలని కోరుకోడు.

వర్తమానంలోని సుఖ, దుఃఖాలు ప్రారబ్ధానుసారంగా వస్తున్నా వాటికి చలించడు. మూడు కాలాలను గూర్చి ఉదాసీనుడైయే సాక్షిగా ఉంటాడు.

331

సుషుప్తిలో అంతఃకరణం, తనకు మూలమయిన కారణ శరీరంలో లయిస్తుంది. అప్పుడు జీవుడు ఉపాధి లేనివాడై స్వస్వరూపంతోనే ఉంటాడు. ఇలా బ్రహ్మైక్యమును పొంది నప్పటికీ అనాది అయిన కర్మవాసనల వల్ల, మరల జాగ్ర దవస్థకు వస్తున్నాడు. ఆ కారణ శరీరమనేది నశిస్తే ఇక జన్మకు రాడు.

332

బ్రహ్మనిష్ఠ అంటే బ్రహ్మమందే బ్రహ్మస్వరూపుడై ఉండటం. ఆ బ్రహ్మనిష్ఠ ధృఢమవుతున్నకొద్దీ సంసారవాస నలవల్ల ఏర్పడిన ఆవరణానికి, భంగం కలుగుతూ ఉంటుంది. ఆ ఆవరణ భంగమే మోక్షమంటే.

333

వాసనలు (అభిలాషలు) శుద్ధ వాసనలు, మలిన వాస నలు అని రెండు రకాలు మలిన వాసనలు రజ, స్తమో గుణాలవల్ల కలిగేవి. వాటివల్ల బంధం పెరుగుతుంది. శుద్ధ వాసనలు సత్వగుణం వల్ల కలిగేవి. వాటివల్లనేమో మోక్షా నికి బాటలు ఏర్పడతాయి. సత్పురుష సాంగత్యం, సత్కా ర్యాచరణ, సద్గ్రంథ పఠనము మొదలయినవి శుద్ధ వాసనలు.

334

జగత్తు, జీవులు, బ్రహ్మము వేరు వేరని తలంచటానికి అజ్ఞానమే మూలము ఆ అజ్ఞానమే కారణ శరీరమంటే. ఈ మూాటి తత్వముల నెరిగిన జ్ఞాని అభేద జ్ఞానము కలవాడయి, భేదమును లోపచేసిన కారణ శరీరమును, సమూలముగా నశింపచేయగలడు. ఆ శరీరము నామమాత్రముగా ఉన్నప్పటికీ, అది బ్రహ్మజ్ఞాన సంపన్నుని బాధింపదు.

335

విశ్వమంతా బ్రహ్మస్వరూపమే అనే జ్ఞానముతో, దాన్ని బ్రహ్మముగా చూడనేర్చిన తత్త్వజ్ఞుడు, అనేక వాసనలకు నిలయమయిన సూక్ష్మశరీరమును కూడ, లేనిదానినిగా చేసుకొని బ్రహ్మమయి ప్రకాశించగలడు.

336

జన్మలకు కారణములయిన ఆగామి, సంచితము, ప్రారబ్ధము అనే మూడు రకాలయిన కర్మలకూ జ్ఞాని, తాను కర్తను కాదని, వాటిని జ్ఞానాగ్నిలో తగులపెట్టి స్థూలదేహం కూడా లేని, బ్రహ్మమయి ప్రకాశింపగలుగుతున్నాడు.

337

జగత్తుగాను, జీవులుగాను తోచే ఈ సమస్తముగూడ అఖండ పరిపూర్ణ బ్రహ్మమే. అవి చూడగలవానికి బంధ, మోక్షభీతి ఎంతమాత్ర ముండదు. జీవులు వేరు, జగత్తు వేరు, బ్రహ్మము వేరు అనే భేదదృష్టి కలవారికే సంసార బాధ.

338

బ్రహ్మమును జగత్తని భ్రాంతిపడి జగత్తుగా చూచినప్పుడే వాసనలు ప్రకోపించి, కోరికలు పెరిగి, సుఖ, దుఃఖ, జన్మ, జరా, మరణరూప సంసారం సంభవిస్తుంది. జగత్తును బ్రహ్మముగా చూడనేర్చినప్పుడు అట్టివానికి ప్రాపంచక దుఃఖాలు కలుగవు.

339

నీకు బ్రహ్మజ్ఞానం కలిగితే జగత్తు బ్రహ్మంలో లీనమయిపోతుంది. అంటే జగత్తనేది బ్రహ్మంగానే తోస్తుందన్నమాట. అలాగే నీకు బ్రహ్మజ్ఞానం కలుగకపోతే బ్రహ్మము జగత్తులోనే కలసిపోతుంది. అంటే బ్రహ్మము కనపడక, జగత్తే కనపడి ఎండమావుల వెంటబడ్డ లేడిలాగ, ఆ జగత్తు వెంట పరుగులు పెట్టి భంగపాటు పొందుతావన్న మాట. జగత్తు బ్రహ్మములో లీనమయినప్పుడేమో బ్రహ్మానందంతో నిండి తన్మయుడవై ఉంటావు.

340

సాధకునకు మొట్టమొదట తాను బ్రహ్మము అనే జ్ఞానానుభవములు కలగాలి. అటుపిమ్మటగాని కంటికగపడే జగమంతా బ్రహ్మమనే సర్వాత్మభావము కలుగదు.

341

చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, మేధస్సు, మజ్జ, మలమూత్రములు, వాత, పిత్త, శ్లేష్మములు అనే

వాటితో గూడిన స్థూలశరీరము జీవాత్మ కాదని సామాన్యునికి గూడ తెలుసు. అయినా భ్రాంతికి, మోహానికి లోనైన నరుడు స్థూలశరీరమైన దేహమునే తాను అనుకుంటూ బంధింపబడుతున్నాడు. ఒకక్షణమునేవు విచారించిన అసలు నిజమేమిటో తెలుస్తుంది.

342

తనను దేహము అనుకుంటున్నందువలననే- భార్య, పుత్ర, మిత్ర, బంధువులు, మరి వెలుపలి వస్తువులు తన్ను సుఖపెట్టుతున్నాయని తలచి వాటికి లోబడి వాటి తుష్టి, పుష్టులకోసము చేయరాని కార్యాలన్నీ చేసి పాపాత్ముడగుచున్నాడు. తాననేవాడు దేహానికంటే భిన్నమయిన ఆత్మ అనే జ్ఞానం కలిగితే ఈ అకార్యాలు చేయలేడు.

343

కలగాంచి మేల్కొన్నవానికి, ఆ కలలోని సుఖ, దుఃఖాలమీద అవి సత్యమనే భావనుండదు. అలాగే ఆత్మదర్శనం పొందినవానికి, జాగ్రత్ ప్రపంచంమీద కూడ సత్యత్వ బుద్ధి యుండదు. అందుకనే వెలుపలి సుఖ, దుఃఖాలకు ఆత్మవేత్త చలించడు.

344

మన ఇంటిలో వాడుకొనే కడవలు, పాత్రలు, పళ్లెములు, మనం పూజించే దేవతా మూర్తులు, దీపాలు వెలిగించే ప్రమ్మెలు, కుండలు అన్నీ ఇత్తడితోనే చేయబడినట్లు,

ఆకాశాది నానా పదార్థాలుగా తోచే జగత్తులోని వస్తువులన్నీ, ఆత్మపదార్థము వల్లనే ఏర్పడుతున్నవి. వాటి, వాటి నామరూపాలను విడచిచూస్తే కనబడేది ఒక్క ఇత్తడే అయినట్లు, ప్రపంచ వస్తువుల నామరూపాలను వదిలిచూస్తే తోచేది సచ్చిదానందాత్మక పరబ్రహ్మము ఒక్కటే.

345

ప్రాపంచిక వస్తువులను సంపాదించి, పొందే ఆనందం కంటే ఆత్మ దర్శనంవల్ల పొందే ఆనందం ఎన్నోరెట్లు గొప్పది. దాన్ని మించిన ఆనందం లేనే లేదు. వస్తువుల వల్ల కలిగే ఆనందం ఆ వస్తువులు దొరకకపోయినా, అవి నశించినా ఆనందంకూడా నశిస్తుంది. ఆత్మానందం అలా నశించదు. ఎందుకనంటే ఆత్మ నీ స్వరూపమే గనుకనూ, నీవు నశించవు గనుకనూ!

346

నీవు బాహ్య జగత్తులో పూజించే శివ, శక్తి, విష్ణ్వాదుల ప్రతిమలు శిలా. లోహాదులతో కల్పించినట్టివి కనుక, అవి కృత్రిమాలు. వాటినన్నిటినీ తెలిసికునే నీలోని ఆత్మ తత్త్వమేమో అకృత్రిమము, సహజసిద్ధము అయినట్టిది. కనుక వివేకి అయినవాడు తన శరీరములోని ఆత్మను తెలిసికొని, ఆరాధించటం లెస్స.

347

బ్రహ్మాభాసమని, బ్రహ్మప్రతిభాసమని రెండు ఉంటాయి. బ్రహ్మాభాసమంటే పరమ తత్త్వమే. బ్రహ్మ

ప్రతిభాసమంటే ప్రకృతి అన్నమాట. భాసం, ప్రతిభాస మయ్యేటప్పటికి, ఉపాధివశాన అది మార్పుగా గోచరిస్తుంది. నిజమాలోచిస్తే భాస, ప్రతిభాసాలకు భేదమంటూ ఉండదు. అవి బింబ, ప్రతిబింబాల వంటివి. జ్ఞాని ఈ రహస్యాన్ని తెలిసికుంటాడు గనుక ఆ రెంటినీ చూచి మోహపడడు.

348

ఉప్పుగల్లు నీటిలో కరగి, నీటిలోనే కలసిపోయేటట్లు, బ్రహ్మవేత్తయొక్క ఇంద్రియ, ప్రాణ, మనో బుద్ధ్యాదులు- వాటి, వాటి కారణములయందు లయించిపోగా, ఇక వాటి స్పర్శలేని కేవలాత్మ మాత్రమే మిగిలి యుంటుంది.

349

తనకు తానై వెలుగుతూ ఉండే ఆత్మ చైతన్యాన్ని, 'చిత్తు' అని అంటారు. ఆ చిత్తు యొక్క ప్రతిబింబముతో గూడిన బుద్ధినేమో విజ్ఞానమయ కోశమంటారు. ఈ చిత్ప్రతి బింబముతో గూడిన బుద్ధి సుషుప్తిలో లయము చెంది, జాగ్రత్తుతో శరీరమంతటా వ్యాపించి అన్నిటినీ తెలిసి కొంటూ ఉంటుంది. ఇది కేవలాత్మ మాత్రము కాదు. ఆభాసాత్మ మాత్రమే.

350

గాఢనిద్రలో, "నేను సుఖాన్ని అనుభవించాను" అనుకొనేదే (అహంకారమే) 'ఆనందమయ' కోశమంటే. దీనికి అహంకార స్పర్శ ఉన్నది గనుక ఈ ఆనందమయ

కోశం కూడ కేవలాత్మ కావటానికి వీలులేదు. అయితే ఇక ఆత్మ ఏదయ్యా అంటే, ఆ అహంకారములోని ప్రతిబింబానికి మూలభూతమయిన కేవల చిద్బింబమే ఆత్మ అంటే! అదే అన్నిటినీ చూచే సాక్షి, బుద్ధీంద్రియ సాక్షి. చివరకు అహంకారసాక్షి గూడ అదే. అదే నీవు, నీ విశుద్ధ సత్య స్వరూపం అదే.

351

అన్నమయ కోశమయిన శరీరంలోనే ఈ అవ్యయాత్మను, వెదకుకుంటూ పోవాలి. అలా వెదకితే ముందు కర్మేంద్రియాలు, పంచప్రాణాలు గోచరిస్తాయి. తరువాత జ్ఞానేంద్రియాలు, మనస్సు గోచరిస్తాయి. పిదప బుద్ధి, అహంకారం తోస్తాయి. తరువాత సుషుప్తిలోని ఆనందం అనుభూతమవుతుంది. ఆవల (అంటే సమాధిలో) కేవలాత్మ ప్రకాశిస్తుంది. ఇదీ ఆత్మాన్వేషణ చేసే విధానము. శరీరములో మొదలయిన ఈ వెదకులాట, ఆత్మ తోచగానే అందమవుతుంది. ఆత్మను దాటిపోవటానికి అవతల ఏమీ ఉండదు. పిమ్మట మిగిలేదంతా అదే. ఉన్నదీ, ఉండేదీ అదే!

352

నీ ఆత్మవల్ల అన్నీ ప్రకాశిస్తున్నాయికాని, ఆ అన్నిటిలో ఏ ఒక్కదానివల్లా ఆత్మ ప్రకాశించుట లేదు. సూర్యుడివల్ల లోకం ప్రకాశిస్తుందేకాని, లోకం వల్ల సూర్యుడు ప్రకాశించడు గదా!

353

"నేతి, నేతి" (ఇది కాదు, ఇది కాదు) వాక్యాలవల్ల ఆత్మను తెలిసికోమన్నది ఉపనిషత్తు. అంటే ఇది కాదు, ఇది కాదు అంటూ పోవాలి అన్నమాట. ఈ స్థూలం కాదు, ఈ సూక్ష్మం కాదు, ఈ కారణం కాదు అంటూ, శరీరేంద్రియ ప్రాణ, మనో, బుద్ధి, అహంకారాలను కూడా కాదు, కాదు అంటూపోతే వాటినన్నింటినీ కాదనే తాను మిగులుతాడు. ఆవల దానిని చూచే సాక్షీభూతమయిన కేవలాత్మ చైతన్యం మిగులుతుంది. అదే సర్వాంతరమయిన, అన్నిటికీ లోపలదైన ఆత్మ! దాన్నే "ఏషమ ఆత్మా సర్వాంతరః" నా ఈ ఆత్మ అన్నిటికీ లోపల ఉన్నదని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.

354

అద్వైతానికి ఆనందమే స్వరూపము. ఆ అద్వైతానందం మీద, ద్వైతభావంతో తోచేవే బాహ్య విషయాలు, శరీరేంద్రియ, ప్రాణ, మనో, బుద్ధి, అహంకారాలు. కనుకనే వాటితో సంగం కలిగినప్పుడు దుఃఖం కలుగుతున్నది. వాటితో సంగం లేని సుషుప్తిలో కేవలానందమే మిగులుతుంది. అందుకే శ్రుతి "ద్వితీయాద్వై భయం భవతి" రెండవదానివల్ల భయ, దుఃఖాదులు కలుగుతాయని అంటున్నది. అయితే రెండవదానివల్ల కూడ ఒకప్పుడు సుఖాలు కలుగుతున్నాయి కదా అని మీరనవచ్చు. కలిగినా ఆ సుఖం

శాశ్వతం కాదు. అది మొట్టమొదట మధురంగాను, చివరకు దుఃఖంగాను పరిణమిస్తుందని అందరికీ తెలుసు. అది మీసాల మీది తేనె మాత్రమే. భ్రాంతివల్ల కలిగేది మాత్రమే.

355

కేవలానంద స్వరూపుడయిన ఆత్మకు రెండవదానితో సంగమే జీవత్వమంటే. ఇది ఆగంతుకమేకాని, సహజం కాదు. సహజాని కెప్పుడూ నాశముండదు. ఆగంతుకం వస్తుంది, పోతుంది. ఇంకా లోతుగా విచారిస్తే దాన్ని భ్రాంతిమాత్రమే అన్నారు అనుభవజ్ఞులు.

356

నీకు నీ పరమార్థ స్వరూపం తో చేటప్పటికి అపార మార్థికమయినది నశించినట్లే లెక్క. అది కొంతకాలం పాటు ఉన్నట్లున్నా లేనిదానిలోనే జత ఎందుకనంటావా? పరమార్థం కానిదేదీ ఉండటానికిగాని, ఉండి బాధించ టానికిగాని వీలులేదు గనుక. అది కానేపు నిన్ను భ్రాంతి పాలుచేసి, నశించి, చివరకు తన అస్థిగతను ప్రకటిస్తుంది. ఇందుకు నిదర్శనం స్వప్నజగత్తే.

357

దీనికి నేను కర్తను, ఇది నేను చేసే పని అనే భేదజ్ఞానం ఉన్నంతవరకు ఎవనికి గాని బ్రహ్మజ్ఞానం కలిగినదనుకోరాదు. "నేను కర్తనుగాని, భోక్తనుగాని కాను. ఇక నా కెట్టి

కర్మలు, భోగ్యపదార్థాలుంటాయి" అనే జ్ఞానం కలవాడే బ్రహ్మజ్ఞాన సంపన్నుడు. కర్త, కర్మ జ్ఞానమనేది ద్వైతప్రపంచానికి సంబంధించినది. ఆ రెంటికి అభేదాన్ని బోధించేదే అఖండాద్వైత బ్రహ్మజ్ఞానమంటే.

358

జగత్తులనేవి పుట్టడం ఎంత నిజమో, అవి చావటం కూడ అంతే నిజము. ఎందుకనంటే చావు, పుట్టుక లనేవి జంటలు. పుట్టిందెల్లా చావక తీరదు. చావటమే కాదు. పుట్టడం, ఉండటం, పెరగటం, మారటం, తరిగటం, చావటం అనే ఆరు ధర్మాలు ప్రతి వస్తువుకు తప్పవు. పుట్టకుండా ఉండేదే చావులేనిది. అదే బ్రహ్మపదార్థము. ఆ ఆత్మవస్తువు పుట్టనూ పుట్టదు, చావనూ చావదు. అందుకనే దాన్ని నిత్యమన్నారు. ఏది పుట్టదో దానికి తక్కిన ఐదవస్థలు కూడ ఉండవు.

359

తాత్త్వికులలో కొందరు జగత్తులు పుట్టుతాయని, మరికొందరు పుట్టనే పుట్టవని చెబుతారు. పుట్టవనే వారిని అజాతవాదులని అంటారు. వీరి సంఖ్య చాల తక్కువ. వీరు నిర్గుణవాదులు కూడ. ఈ రహస్యాన్ని "అజాయ మానో బహుధా విజాయతే" అన్న వేదవాక్యం స్పష్టం చేస్తున్నది.

360

ఏ వాదాలు ఎలా ఉన్నా, జగమనేది నీకు అగపడు

తున్నంతవరకు దాన్ని పుట్టలేదని అనుకోలేవు కదా! కనుక అలాంటి జగత్తులో ఉండే, ఆ జగత్తును, దానివల్ల కలిగే బాధలను రహితం చేసుకోటానికి యత్నించాలి. ఆ యత్నం సఫలమయితే, జగత్తు ఉన్నప్పటికీ నిన్నది బాధించలేదు. ఆ జగత్తు శాస్త్ర బ్రహ్మంలో కరగి, బ్రహ్మంగానే తోచి, ఆనందమయ మవుతుంది. ఆ స్థితిలో నీవు దుఃఖరహితుడవే. ఆనందమయుడవే!

361

బ్రహ్మశబ్దానికి వేదమని కూడ ఒక అర్థం. వేదాన్ని చదివి, దాని అర్థాన్ని తెలుసుకొన్నవాడు బ్రాహ్మణుడు. అయితే మనవారు బ్రహ్మదేవునికి పుట్టినవాడు బ్రాహ్మణుడని అర్థం చెవుతున్నారు. అందరూ బ్రహ్మకేగదా పుట్టినది. అప్పుడు అందరూ బ్రాహ్మణులు కావాలి. బ్రహ్మశబ్దానికి జగత్కారణ వస్తువని అర్థం చెప్పినప్పుడు అట్టి బ్రహ్మము యొక్క జ్ఞానం కలవాడెల్లా బ్రాహ్మణుడే అవుతాడు. ఆ ఈ అర్థాలన్నిటినీ శాస్త్రాలు భావించాయి.

362

బ్రహ్మాండమనే మాటను మనం సాధారణంగా వాడుతూ ఉంటాము. అనేక కోట్ల బ్రహ్మాండములు కలసి ఒక విష్ణ్వండ మవుతుంది. అట్టి విష్ణ్వండాలనేకం కలసి రుద్రాండము అవుతుంది. పెక్కు రుద్రాండములు ఒక ఈశ్వరాండము. ఎన్నో ఈశ్వరాండములు కలసి ఒక సదా

శివాండము లేక విశ్వకర్మాండము. అలాంటి విశ్వకర్మాండములకు ఎన్నింటికో కారణభూతమైనదే నిర్వికార, నిర్గుణ, నిరుపమాన, పరబ్రహ్మ తత్త్వము. ఇలాంటి సర్వకారణం నీలోనే, నీ స్వరూపంగానే ఉన్నది.

363

జాగ్రత్తు, నిద్ర మొదలగు దశలు, నిత్యప్రకాశ స్వభావము గల ఆత్మకు ఉండవు. అది బుద్ధ్యుపాధి సహిత మైన జీవలక్షణములు లేదా విజ్ఞానమయ కోశధర్మములు కలది. ఆత్మ ఈ జాగ్రదాదులకు సాక్షియై వీటిని చూచు చుండును.

364

బుద్ధి తత్త్వము సత్వగుణం వల్ల కలుగుతుంది కాబట్టి అది నిర్మలంగా ఉంటుంది. అందులో పరమాత్మ ప్రతిబింబము ప్రతిఫలించి తాను జీవుడనే భ్రాంతిని పొందుతుంది. ఆ చైతన్య ధర్మం శరీరేంద్రియములన్నింటికీ వ్యాపిస్తుంది. దానితో కర్తృత్వ, భోక్తృత్వాలు కలిగి సుఖ, దుఃఖాను భవాలు, సంసారం ఏర్పడుతుంది.

365

ఆత్మ అంటే ఏదో కాదు. ఎక్కడో లేదు. అది నీ స్వరూపమయి, నీలోనే యున్నది. అయితే నీవు నీ స్వరూపాన్ని, నీ దేహంగా, నీ ఇంద్రియాలుగా, నీ మనస్సుగా, నీ బుద్ధిగా, నీ అహంకారంగా, నీ సుఖదుఃఖాలుగా, నీ సంకల్పాలుగా, కోరికలుగా భావిస్తున్నావు. అంతేగాని, దేహం

ంద్రియ, మనోబుద్ధులు కల నీ వెవరవో ఆలోచించడం లేదు. నీ దేహేంద్రియాల స్వరూపాన్ని గూర్చి విచారిస్తూపోతే చిట్టచివరకు 'నీ' వనేవాడు దొరుకుతాడు. వాడే అన్నిటినీ నావి, నావి అంటూ నేనుగా లేక నీవుగా మిగులుతాడు. అలాంటి నిన్ను పట్టుకుంటే అదే ఆత్మ లేక నీవు అవుతావు. ఆ తర్వాత దాని స్వరూపాన్ని తెలుసుకోవాలి. ఆ నీవు అన్నింటిని తెలిసికొంటున్నావు కనుక నీవు చిత్స్వరూపివి. సుషుప్తిలో ఆనందరూపంగా మిగులుతున్నావు కనుక ఆనంద రూపుడవు, శాశ్వతుడవు.

366

ప్రపంచంలో నీకు గోచరించే వస్తువులమీద, నీవు అనుభవించేవాటిమీద, నీవు పనిగొనే వాటిమీద కూడ నీకు బ్రహ్మభావన కలగాలి. అది స్థిరమై ఆ యా వస్తువులు బ్రహ్మకు అభిన్నములుగా అనుభూతములయినప్పుడు నీకు జగత్తుమీద బ్రహ్మభావం ఆరూఢమయినట్లు. అప్పుడు "బ్రహ్మణోఽన్యన్న కించన" బ్రహ్మముకంటె భిన్నంగా ఏమీలేదనే దృష్టి స్థిరపడుతుంది. జగత్తు, అందలి వస్తువులూ, జగత్తుగానే, జగత్సంబంధాలుగానే తోచినంతకాలం నీకు సుఖ, దుఃఖాలూ, బంధమూ తప్పవు.

367

నరుడు ప్రపంచంలోని వస్తువులను ఇదీ, అదీ; అదీ, ఇదీ అని చెప్పుతూ ఉంటాడు. అలాగే తన శరీరంలోని

ఇంద్రియాలనూ, మనోబుద్ధులునూ, కోరికలను, భావాలను కూడ నిర్దేశిస్తూ ఉంటాడు. ఈ విధంగా బాహ్యాంతర పదార్థాలను గుర్తించే, నీలోని చైతన్యరూప సత్పదార్థమే నీ వన్నా ఆత్మ అన్నా! ఈ విధంగా ఆత్మను తెలుసుకోవడం ఎంతో సులభం!

368

సుషుప్తిలో ఆత్మ ప్రకాశం ప్రస్ఫుటంగా ఉంటుంది. అందుకనే, నీకు ఆనందం తప్ప ఇంకేమీ గోచరించదు. జాగ్రత్స్వప్నాలలో ఆ యా వృత్తుల అలజడివల్ల, ఆత్మప్రకాశం ఉండీ ఉండనట్లుగా తోస్తుంది. జాగ్రత్తలో మనస్సు ఏకాగ్రం చేస్తే ఆత్మభావం అధికంగా ఉంటుంది. ఇంతకూ తేలిందేమంటే, సత్వ, రజ, స్తమో, గుణవృత్తుల ఆటోపం వల్ల ఆత్మ ఉన్నట్లు, లేనట్లు తోస్తూ ఉంటుంది.

369

శరీరం నేను కాదు. ప్రాణం నేను కాదు. ఇంద్రియాలు నేనుకాదు. మనోబుద్ధులు, వాటి వ్యాపారాలు నేను కాదు. కామక్రోధాదులు, సంకల్ప, వికల్పాలు నేను కాదు అంటూ నిషేధిస్తూపోతే చివరకు "కాదు" అని నిషేధింప దగిన వస్తువేదీ మిగలదు. అపుడు మిగిలేది అన్నిటినీ, నిషేధించిన నీవు మాత్రమే. ఆ నీవే ఆత్మ అంటే!

370

బ్రహ్మాకార చిత్తవృత్తితో ఉండడం సవికల్ప సమాధి.

ఆ చిత్తవృత్తికూడ బ్రహ్మాకారంలో లీనం కావడం నిర్వికల్ప సమాధి.

371

శరీరోపాధిలో ఉండికూడ, ఆ శరీరోపాధి బంధాల చేత, సూక్ష్మ కారణోపాధి బంధాలచేత కట్టుపడకుండా ఉండేవాడే జీవన్ముక్తు డంటే. బ్రతికి ఉండియే అంటే శరీరంలో ఉండే ముక్తిసుఖాన్ని చూరలాడేవాడని భావం!

372

వైరాగ్యం అంటే ఐహికాముష్మిక విషయాలమీద ఆసక్తి లేకపోవడం. అలాంటి వైరాగ్యం కలుగనిదే ఆత్మ జ్ఞానం (బోధ) కలుగదు. ఆత్మజ్ఞానం కలుగనిదే విషయాల నుండి విరమించలేడు. విషయోపరతి లేనిదే శాంతి చేకూరదు. కనుక వైరాగ్యం, బోధ, ఉపరతి అనేవి ఆత్మవేత్తకు అలవడవలసినవి.

373

జీవుడు కించిజ్ఞుడు ఈశ్వరుడేమో సర్వజ్ఞుడు. జీవునిది అవిద్యోపాధి అయినందువల్ల అతడు కించజ్ఞుడయినాడు. ఈశ్వరునిది మాయోపాధి అయినందువల్ల అతడు సర్వజ్ఞుడయినాడు. కాగా కించిజ్ఞత్వ, సర్వజ్ఞత్వము లనేవి ఉపాధి వల్ల కలిగిన గుణాలేకాని, వస్తుస్వభావంవల్ల కలిగినవి కావు. ఉపాధులను తొలగించి చూచినప్పుడు జీవేశ్వరు లిద్దరులోనూ మిగిలేది అఖండ సచ్చిదానంద స్వరూపమే! అది

ఏకవిధమూ, ఏకరసమూ అయినది. ఇదే జీవేశ్వరైక్య మంటే. ఈ జీవేశ్వరైక్య జ్ఞానంగల చిత్తవృత్తిని ప్రజ్ఞ అంటారు. అలాంటి ప్రజ్ఞను సాధించినవాడే స్థితప్రజ్ఞుడంటే. ఈ స్థితప్రజ్ఞుని గూర్చి గీత 2వ అధ్యాయాంతములో వర్ణన కలదు.

374

సంసారం రెండు విధాలు. బాహ్యము, అంతరమూ అని. ఆలు, బిడ్డలు, ధనము, ధాన్యాలు మొదలయిన వెలుపల విషయాలతో గూడినది బాహ్యం. అహంకారం, మనోబుద్ధులు, సంకల్ప, వికల్పాలు, కోరికలు, కామక్రోధాదులు మొదలయినవాటితో కూడినదేమో అంతరం. జ్ఞాని అయినవాడు ఈ బాహ్యాంతర సంసారాల రెంటికీ భిన్నుడూ, విలక్షణుడూ అయి సచ్చిదానందమాత్రుడుగా ప్రవర్తించాలి!

375

మన నీడ మనలను వెంబడించే ఉంటుంది. అలాఉన్నా దానిమీద మనకు అదే నేను అనే అహంకారంగాని, అది నాది అనే మమకారం గాని ఉండదు. అట్లాగే ఆత్మస్వరూప వివేకం గల జ్ఞానికిగూడ తన స్థూలదేహం మీద అహంకార, మమకారాలు ఉండవు. ఆ శరీరం కారణంగా ప్రవర్తిల్లిన వాటిని గూర్చి, వాడు మోహపడడు. వాటికి భిన్నమయిన వాడే తానని నిశ్చయంతో ఉంటాడు.

376

సంసారం జీవ కల్పితమని, ఈశ్వర కల్పితమనీ రెండు విధాలు. జీవకల్పిత మంటే- భార్య, పుత్ర, మిత్ర, ధన, ధాన్య, గృహారామాది రూపమయినది. ఈశ్వర కల్పిత మంటే, భూతభౌతికాది ప్రపంచ రూపమయినది. ఈ రెండు విధములయిన సంసారాల సంస్కారాలు అంటకుండ నిర్లిప్తుడుగా ఉండేవాడే జీవన్ముక్తుడు.

377

ధ్యానసమయంలో కొందరికి బాహ్యపదార్థ జ్ఞానం ఉంటుంది. అంటే వెలుపలి శబ్దాలు వినపడుతాయన్న మాట. సుఖ, దుఃఖానుభవాలు కూడ తోస్తూ ఉంటాయి. ఇలాంటివారికి ప్రారబ్ధం పూర్తిగా నశించలేదన్న మాట. ధ్యానసమాధులు అనుష్ఠించేవేళ బాహ్యజ్ఞానం లేకుండా ఉంటే, దాన్ని నిర్వికల్ప సమాధి అనాలి. అట్టి యోగికి సుఖ, దుఃఖానుభవ రూప సంసారం (అంటే ప్రారబ్ధం) లేదన్నమాట. ఇలాంటివన్నీ అతిరహస్యాలు. అందరికీ అనుభూతికి వచ్చేవికావు. దీనికి ఎంతో సాధన, జ్ఞానసిద్ధి అవసరం.

378

బాహ్యవిషయాలు ప్రవర్తిస్తున్నా, ఎవనికి సుఖ, దుఃఖాదుల అనుభవం గోచరించదో వాడికి ప్రారబ్ధం లేనట్లే. సుఖ, దుఃఖాదుల అనుభవం ఉన్నంతవరకూ ప్రారబ్ధం నిన్ను వెంటాడుతున్నట్లే లెక్క. అలాంటి వాడికి,

నిర్మలధ్యానం కూడ కుదరదు. సాధకులయినవారు ప్రయత్న పూర్వకంగా బాహ్యజ్ఞానం లేని ధ్యానయోగానికి అలవాటు పడాలి.

379

కలలో నీవు యజ్ఞ, దాన, ధర్మ, దేవతారాధనలు చేసినా, లేక ఘోరాతిఘోర పాపాలు చేసినా మేల్కొంచిన తర్వాత వాటి ఫలంగా స్వర్గంగాని, నరకంగాని నీకు కలుగదు. అలాగే నేను బ్రహ్మమును అన్న జ్ఞానం కలిగిన తర్వాత పూర్వజన్మలలో చేసిన పుణ్య, పాపరూప కర్మలన్నీ నిష్ఫలములై నశించి తీరవలసిందే.

380

నీకు దేహేంద్రియ ప్రాణ, మనో, బుద్ధ్యహంకారాలతో తాదాత్మ్యం (అదే నేను అనే భావం) ఉన్నప్పుడు అవిచేసే పనులకు నీవు కర్తవు అవుతావు. వాటి సంబంధం లేని, కేవలాత్మ 'కర్త' కానేరదు. ఈ విధంగా కర్తృత్వాన్ని రహితం చేసుకోగలిగిననాడు ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలు నీకు బంధకములు కానేకావు.

381

నీకు ఆత్మ తత్త్వజ్ఞానం కలిగితే, మూలాజ్ఞానం నశిస్తుంది. ఆ అజ్ఞానం నశించగానే దేహేంద్రియాలతో తాదాత్మ్యం ఉండదు. అప్పుడు కర్తృత్వ బుద్ధి ఉండదు. కర్తృత్వ రాహిత్యమే కేవలాత్మ తత్త్వరూప స్థితి. ఆ స్థితిలో కర్మల

తోను, కర్మఫలాలతోను సంబంధం ఉండదు. నైష్కర్మ్య సిద్ధి అంటే అదే!

382

ఆకాశం అంతటా వ్యాపించి ఉంటుంది. కుండలో ఉన్నదాన్ని ఘటాకాశం అంటారు. కుండ వల్ల ఆకాశానికి, పరిచ్ఛేదం (పరిమితి) కలిగిందే కాని, నిజానికది పరిచ్ఛిన్న వస్తువు కాదు. ఆ కుండలో కల్లుపోసినామనుకో. ఆ కల్లు యొక్క వాసన కుండ కంటుతుందేకాని, ఆకాశాని కంటదు. అలాగే సర్వవ్యాపకాత్మ శరీరంలో పరిచ్ఛిన్నమై ఉన్నా, అది పరిచ్ఛిన్నం కాదు. మద్యపు వాసన కుండలోని ఆకాశాని కంటనట్లు, ఉపాధిగతాలైన పుణ్యపాపాలు కేవలాత్మ కంటవు. అది సచ్చిదానందము, నిర్వికారము అయి వెలుగుతూనే ఉంటుంది. మహాజ్ఞాని యొక్క స్థితి ఇలాంటిదన్న మాట.

383

ఎలాంటి పీడకలలను కంటున్నా మెలకువ రాగానే, అవన్నీ నశించినట్లు నీకు "నే నఖండ బ్రహ్మమునే" అనే అగాధ జ్ఞానం కలిగిననాడు కోట్ల జన్మలలో చేసికొన్న ప్రారబ్ధమంతా నశించి తీరుతుంది.

384

నిరతిశయానందానికి, సౌషుప్త పదమని పేరు. అది సుషుప్త్యానందము వంటిదే కదా!

385

మనస్సున్నంతవరకు సుఖ, దుఃఖాలనేవి తప్పవు. సంసారము తొలగదు. అమనస్క స్థితిని పొందిన నాడు-సుఖ, దుఃఖాలు, సంసారముకూడ నివర్తిస్తాయి.

386

చిత్త చలనాన్ని అరికట్టాలంటే ప్రాణచలనాన్ని బంధించాలి. అందుకు ప్రాణాయామము తగిన సాధనము.

387

నరుడు చిత్తనాశం వల్ల సుఖాన్ని, చిత్తలాలనం వల్ల దుఃఖాన్ని పొందుతాడు. లాలించిన బిడ్డ నెత్తిమీద కెక్కినట్లు, అణచివేయని చిత్తం కూడ అలజడులపాలు చేస్తుంది. అందుకే చిత్త నిగ్రహానికి ప్రాధాన్యమిచ్చారు తత్త్వవేత్తలు.

388

నీకు సమ్యగ్ దృష్టి కలిగి, జగద్భావన నశించనంత వరకు, లోపల మనోబుద్ధ్యాదులు విజృంభించి కలత పెట్టుతూనే ఉంటవి

389

జీవన్ముక్త స్థితిని పొందిన మహనీయుల చిత్తము చిత్తమే కాదు. అది విశుద్ధమయిన సత్త్వగుణమే. ఆ సత్త్వములో పరమాత్మ నిష్కళంకంగా ప్రకాశిస్తాడు. అంటే జీవన్ముక్తుడు పరమాత్మయే అన్నమాట.

390

చిత్తము సత్త్వముగా పరిణమించిన తత్త్వవేత్తలు

బ్రహ్మాభూతులయి జగత్తులో లీలామాత్రంగా తిరుగుతూ ఉంటారు.

391

అలాంటి సత్వగుణ సంపన్నులు లోక వ్యవహారం నడుపుతున్నా, శాంతులై ఆ పరంజ్యోతి స్వరూపులుగానే ప్రకాశిస్తారు. అట్టివారి దర్శన, స్పర్శన సేవాదులు సత్ఫలాలనే ప్రసాదిస్తాయి.

392

ఇది ఆత్మ, ఇది అనాత్మ అనే వివేకం కలగటంవల్ల నిర్మలమయిన చిత్తాన్నే సత్వమయ చిత్తమంటారు. అలాంటి చిత్తంలో మోహమనేది ఏనాడూ కలుగదు.

393

నీవు ఎల్లప్పుడు ఏదో ఒక సంకల్పం చేస్తూనే ఉంటావు. అందువల్లనే నీకు దుఃఖం కలుగుతుంది. ఏ సంకల్పం లేకుండా ఉండు. ఏ దుఃఖం కలుగకుండా సుఖరూపుడవే అవుతావు నిస్సంకల్ప స్థితి, ఆనందమయ మనటానికి సుషుప్తియే ఉదాహరణ. సుషుప్తిలో నీకు దుఃఖాలన్ని నశించి ఆనందమే కదా మిగిలేది.

394

వ్యవహార కాలంలోకూడ అద్వైత స్వరూపుడవే అయి, భావంలో మాత్రమే అద్వైతాన్నవలంభించి, కర్మాచరణ విషయంలో అద్వైతాన్ని ఆశ్రయించకుండా,

ద్వైతా, ద్వైతముల రెంటియందు అనాసక్తి కలవాడవై వర్తించు.

395

పరమాత్మ శక్తి ఒక్కటే జగన్నిర్మాణ లీలచేత ద్వైతాద్వైత రూపములయిన భేదములతో కూడి విజృంభిస్తుంది. అభ్యాసము వల్లనే నీవు ఆత్మయందు రమించే వాడవు. శోకరహితుడవు, అంతఃసుఖ సంపద కలవాడవు అవుతావు. కనుక నిరంతరాత్మాభ్యాసాన్ని వదలిపెట్టవద్దు.

396

అభ్యాసము వల్లనే ప్రాణ చలనం కూడ నిలచిపోగా, నీ మనస్సు ప్రశాంతిని పొందుతుంది. అప్పుడు మిగిలేదే నిర్వాణ స్థితి.

397

ప్రాణ చలన మనేది మనశ్చలనానికి హేతువవుతుంది. దానివల్లనేమో సంసారం పెరుగుతుంది. ప్రాణ, మనస్సులు చలనాన్ని వదలినట్లయితే సంసార తాపమనేదే ఉండదు.

398

మనస్సనేదున్నంతవరకూ దుఃఖక్షయము లేనేలేదు. మనస్సు గనుక అస్తమిస్తే సంసారానికి తావే ఉండదు.

399

నీవు వేదాంత గ్రంథాలు చదివి ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నా బ్రహ్మస్వరూపుడవే లేక ఆ గ్రంథాలు చదువక పోయినా; ఆత్మను తెలుసుకోకపోయినా బ్రహ్మస్వరూపు

డవే. అలాగే జ్ఞానసమాధులను అనుష్ఠించినా బ్రహ్మ రూపివే, అనుష్ఠించకపోయినా బ్రహ్మమవే. అయితే వేదాంతం చదివినందువల్ల, ధ్యానాదులను ఆచరించినందువల్ల మరపునబడిపోయిన నీ బ్రహ్మస్వరూపం నీకు గుర్తుకు వచ్చి, నీ ప్రవర్తనలో మార్పు తెస్తుంది. అంతేకాని, నీ సహజసిద్ధ స్వరూపానికి ఏ క్రొత్తదనాన్ని సంపాదించవు. నీవు అప్పుడు ఇప్పుడు, ఎప్పుడూకూడ అఖండబ్రహ్మ స్వరూపుడవే.

400

మరపునబడిన నీ స్వరూపాన్ని గుర్తుకు తేవటానికే. శ్రవణ, మనన, నిదిధ్యాసలుకాని, యోగానుష్ఠానం కాని, ధ్యానసమాధుల అభ్యాసంకాని, గురువులుకాని, తదితర సాధన ప్రణాళికగాని! నిత్యసిద్ధమయిన నీ సచ్చిదానంద స్వరూపము. నీకు ఆత్మజ్ఞానం కలగనప్పుడు, కలిగినపిమ్మట గూడ ఒకేరీతిగా వెలుగుతూనే యున్నది. అయితే సాధనానంతరం ఆవరణ విక్షేపశక్తులు తొలగి, ఆత్మబింబము నిర్మలంగా గోచరిస్తుంది. మబ్బుతునక అడ్డము వచ్చినప్పుడు, అడ్డము రానప్పుడు సూర్యుడు ఒకేరీతిగా వెలుగుతూనే యున్నాడు. అజ్ఞానం వల్ల నీవు, మబ్బు సూర్యుని కప్పివేసిందనుకుంటున్నావు. మబ్బు సూర్యునికాదు కప్పింది. నీ కన్నులను సుమా! అందుకనే నీకు సూర్యుడు కనపడలేదు.

401

మన కన్నుల కగపడే రూపాలను, చెవులకు వినబడే

శబ్దాలను, ముక్కు గుర్తించే వాసనలను, చర్మం అనుభవించే స్పర్శలను, నాల్కకు అందే రుచులను, అలాగే మనస్సుకు తోచే సంకల్ప, వికల్ప, రాగ, ద్వేషాలను ప్రత్యక్ష విషయాలని అంటారు. అక్షములు అంటే ఇంద్రియాలు. ఆ ఇంద్రియాలకు అందేవి కనుక పై విషయాలను ప్రత్యక్షాలు, ప్రత్యక్ష ప్రమాణ గోచరాలు అన్నారు. ఇంద్రియాలకు గోచరించకుండా చాటున ఉండేవాటిని పరోక్షములు అంటారు. ప్రత్యక్షానికి వ్యతిరేక పదము పరోక్షమనేది. "అది నా పరోక్షములో జరిగినది అంటాము" అంటే నీ ఎదుట జరుగలేదని భావము. మనస్సు ద్వారా విషయాలనన్నింటినీ తెలిసికొనే నీవే 'ఆత్మ' అంటే. నీవనే ఆత్మ లేకపోతే ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహించే వ్యక్తియే ఉండదన్నమాట. కనుక నీవనేవాడు ఇంద్రియాల ద్వారా అన్నిటినీ గ్రహిస్తూ, ఇంద్రియాలకు గోచరించకుండా (అందకుండా) నీ స్వరూపంగా ప్రకాశిస్తున్నాడు. ఇలాంటి నీవనే ఆత్మవస్తువు ప్రత్యక్షమూ గాదు, పరోక్షము గాదు. ఎలాగో చూడు. నేత్రాదుల చేత చూడలేము గనుకను, మనస్సుచేత భావించలేము (పట్టుకోలేము) గనుకను అది ప్రత్యక్షం కాదు. అది నీవేనై, నీ స్వరూపంగానే ఉన్నదిగనుక పరోక్షమూగాదు. కనుకనే దానిని అపరోక్షము అన్నారు. అందుకే ఆత్మను తెలిసికొన్నవాడిని, ఆత్మాపరోక్ష జ్ఞానం కల సిద్ధుడని అంటారు. ఆ ఆత్మా

పరోక్ష సాక్షాత్కారాన్నే బ్రహ్మ సాక్షాత్కారమని కూడ వాడుతూ ఉంటారు.

402

ఆత్మ పరోక్ష సాక్షాత్కారానికి, ఆత్మానాత్మ విచారణ అనేది దగ్గరి సాధనము. నీవు అనుకునే దేహము, ఇంద్రియాలు, ప్రాణము, మనోబుద్ధులు, అహంకారము అనే వాటిలో ఏది ఆత్మవస్తువో, ఏవి అనాత్మ వస్తువులో విచారణ చేయాలి ఇలాచేస్తే దేహం మొదలుకొని, అహంకారము వరకూ గల వస్తువులన్నీ ప్రకృతివల్ల కలిగిన అనాత్మ పదార్థాలే అని తెలుస్తుంది. ఇక వీటినన్నింటినీ, "ఇది, ఇదీ" "ఇవి, ఇవీ" అని తెలిసికొనే చైతన్య వస్తువయిన నీవనే వాడే 'ఆత్మ' అంటే అనే జ్ఞానం కలుగుతుంది. ఈ జ్ఞానాన్ని పరోక్ష జ్ఞానం అంటారు. మనన, ధ్యానాదుల ద్వారా ఆ ఆత్మను ఎరుగగలిగినవాడే, అనుభూతి పొందగలిగినప్పుడే, ఆత్మా పరోక్ష సాక్షాత్కార మనేది నీకు కలిగినట్లు! ఈ సాధననే తత్త్వచింతన మంటారు. ఇది ఉత్తమ సాధన. "ఉత్తమం తత్త్వ చింతాచ" అని శాస్త్రీకుల సూక్తి. శరీరంలోను, బ్రహ్మాండంలోను ఉన్న పదార్థాలను, తత్త్వాలని అంటారు. వాటి చింతనం వల్ల నీకు వస్తు పరిజ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం వల్ల అజ్ఞానం నుండి విడివడి ప్రకాశిస్తావు.

403

వస్తు తత్త్వం తెలియనప్పుడు, అజ్ఞానము, మోహము విజృంభించి, నరుని ఇక్కట్లపాలు చేసి, దుఃఖాన్ని కలి

గిస్తాయి. వస్తు తత్త్వం తెలియగానే జ్ఞానం వెల్లివిరసి కర్త వ్యం బోధపడి సుఖాన్ని చేకూరుస్తుంది. కనుక ప్రతివాడు నిత్యానిత్య వివేకం కోసం పాటుపడాలి.

404

ప్రకృతి స్థూలమనీ, సూక్ష్మమనీ రెండు విధాలుగా ఉంటుంది. మనం చూచే ప్రకృతి స్థూలమయినది. ఇది పంచీకరణ వల్ల కలిగిన పంచభూతాల పరిణామం. సూక్ష్మ ప్రకృతి, అపంచీకృత పంచభూతాల స్వరూపం. ఈ స్థూల, సూక్ష్మ ప్రకృతులు రెంటికీ కారణమయినదాన్ని మూల ప్రకృతి అంటారు. ఆ మూల ప్రకృతి యొక్క వికాసమే ఈ స్థూల ప్రకృతి. నేటి సైంటిస్టుల ప్రయోగాలు స్థూల ప్రకృతి మీదనే గాని, సూక్ష్మకారణ ప్రకృతుల మీద కాదు. అవి రెండూ అవ్యక్తాలు. (ఇంద్రియాల కందనివి).

405

బుద్ధిని అధో మార్గానికి లాగే గ్రంథాలను తత్త్వ జిజ్ఞాసువులే కాదు. ఎవరూ చదువకూడదు. ప్రతివాడు తనను ఉన్నతస్థితికి కొనిపోయే గ్రంథాలే చదివి ఉత్తమస్థితిని సాధించాలి.

406

ఆత్మవస్తువు సర్వకాలముల యందు దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటుంది. దానిమీద సవికారమయిన మనస్సు, ఇంద్రియాలు తో స్తకే కాని శాశ్వతంగా ఉండవు. కనుక మనస్సే లేని- మనస్సే కాని ఆత్మకు ఆలోచనలు, కోరికలు

కలుగటానికి వీలేలేదు. ఆత్మకు భిన్నంగా ఉన్న మనస్సులో కలిగేవాటిని, ఆత్మకు సంబంధించినవే అనుకొని భ్రాంతిపడి నీవు దుఃఖాల పాలవుతున్నావు. అలాగే కర్మరహితమయిన ఆత్మమీద ఇంద్రియాలు చేసే కర్మలను ఆరోపించుకొని, కర్మలతో కట్టుబడుతున్నావు. శ్రుతి ఆత్మను గూర్చి "అది అప్రాణము, అమనస్కము, శుభ్రము" (అప్రాణోహ్యమనాః శుభ్రః) అంటున్నది. కనుక అలాంటి నిర్మలాత్మకుల మాలిన్యాలయినా అంటుతాయని భావించవద్దు.

407

చింతపండు రసముతో సంయోగము కలిగినందువల్ల రాగి, ఇత్తడి, తమమీది మాలిన్యాన్ని పోగొట్టుకొని, ప్రకాశించినట్లు, సత్పురుష సాంగత్యమువల్ల నరుడు పరిశుద్ధుడై ప్రకాశిస్తాడు.

408

జ్ఞాని అయినవాడు, జాగ్రత్తులో ఉన్నప్పటికీ ద్వైతమును గూర్చి పట్టించుకోకుండా, సుషుప్తిలో ఉన్నట్లుగాను, సుషుప్తిలో ఉన్నా, స్వాత్మరూప దర్శనాన్ని పొంది, జాగ్రత్తులో ఉన్నట్లుగాను; అన్ని వేళలయందు, అన్ని దశలయందు తురీయ పదాన్ని అవలంబించి, దేహపతనం జరిగే వరకు కాలక్షేపం చేస్తాడు.

409

అహంకార మనేది ఎందుకు పుట్టుతుందో, ఎక్కడ పుట్టుతుందో, ఎలా పుట్టుతుందో కనిపెట్టాలి. దానివల్లనే

నీకు దేహభ్రాంతి, ప్రపంచ భ్రాంతి కలిగి ఆశాపాశాలకు కట్టుబడి కష్టాలకు గురి అవుతున్నావు అహంకారమనేది లేని సుషుప్తిలో చూడు. నీ కేమైనా కోరికలు, సంకల్పాలు, వికల్పాలు కలుగుతున్నాయేమో! అప్పుడు కేవలము ఆనందమాత్రుడవుగానే ఉండగలుగుతున్నావు గదా! కనుక అహంకారాన్ని కనిపట్టి దాన్ని లేకుండా చేసుకో. అదే ముక్తి అంటే!

410

ఆకాశాది తత్త్వాలను తొలగించి, వాటిలోపల ఉన్న పరతత్త్వాన్ని గ్రహించటం చాల కష్టమైనపనే. అందుకు ఎంతో సమ్యగ్ దృష్టి కావాలి. అగపడేదాన్ని కాదని, అగపడనిదాన్ని గుర్తించి తెలిసికోవాలి. అసలు వేదాంతంలో జరుగవలసిన పనే అది. దృశ్యాన్ని కాదని, దృక్కును పట్టుకోవాలి గదా!

411

మిథ్యాజ్ఞానం వల్ల రాగద్వేషాలు కలుగుతాయి. ఈ రెంటిలో రాగము వల్ల ప్రవృత్తి, ద్వేషము వల్ల నివృత్తి ఏర్పడుతుంది. ఆ రెంటివల్ల కర్మలు చేస్తారు. కర్మలవల్ల జన్మలు వస్తాయి. జన్మల వల్ల దుఃఖము కలుగుతుంది. కనుక మిథ్యాజ్ఞానము నశించి పరమార్థ జ్ఞానము కలిగితేనే ముక్తి సిద్ధిస్తుంది. ఈ దుఃఖ జన్మ ప్రవృత్తి, దోష (రాగద్వేష) మిథ్యా జ్ఞానాలనే అవిద్యా చక్రమన్నారు.

412

ప్రకృతిని ప్రధానమని కూడ అంటారు. "ప్రధీయతే అస్మిన్ సర్వాణి ప్రళయకాలే" అని దానికి వ్యుత్పత్తి. అంటే ప్రళయకాలంలో ఈ వాయు, ఆకాశాదులైన తత్త్వాలన్నీ వాటి వికారాలతో కూడ అందులో లీనమవుతాయి గనుక దానికి ప్రధానమనే పేరు సార్థకము.

413

మనకు అనాది సిద్ధాలుగా తోచే పదార్థాలు ఆరు ఉన్నాయి. అవే 1) శుద్ధ చైతన్యము 2) అజ్ఞానము 3) అజ్ఞానముతో చైతన్యానికి ఉన్న సంబంధము 4) ఈశ్వరుడు, 5) జీవుడు, 6) జీవేశ్వరుల కుండే భేదము అనేవి. ఈ అజ్ఞాన మనేది చైతన్యాన్ని ఆశ్రయించి యుండి దాన్ని తనకు విషయంగా చేసుకుంటుంది అంటే ముందు అజ్ఞానము ఏర్పడి జీవుని సృష్టిస్తుందన్నమాట. గనుక అజ్ఞానము సృష్టించిన జీవుడు అజ్ఞానానికి ఆశ్రయుడు కాదు. జీవేశ్వర విభాగము లేని శుద్ధ చైతన్యమే అజ్ఞానానికి ఆశ్రయం. అజ్ఞాన మనేది శుద్ధ చైతన్యాన్ని ఆశ్రయించి జీవేశ్వరులను సృష్టి చేస్తుందన్నమాట.

414

అజ్ఞానానికి ఆవరణ శక్తి, విక్షేప శక్తి అని రెండు శక్తులుంటాయి. ఆవరణ శక్తి వస్తువును కప్పివేస్తుంది. విక్షేప శక్తి దాన్ని ఇంకొకరీతిగా తోచేటట్లు చేస్తుంది. అంటే ఆవరణ శక్తి బ్రహ్మమును కప్పివేయగా విక్షేప శక్తి

దాన్ని జగత్తుగా తోచేటట్లు చేస్తుంది. ఉదాహరణ చూడండి. ఆవరణ శక్తి (చీకటి) త్రాటిని కప్పుతుంది. విక్షేప శక్తి దాన్ని పాముగా తోచేటట్లు చేస్తుంది.

415

అజ్ఞానమనేది సద్రూపము (శాశ్వతము) కాదు. అసద్రూపమూ గాదు. సదసద్రూపమూ గాదు. అందుకే దానిని అనిర్వచనీయ మన్నారు. వేద మేదైనా అది మంచు వంటి దన్నది.

416

అజ్ఞానానికి మాయ యనేది మరొక పేరు. మాయ "అఘటన ఘటనా పటీయసీ" అంటే కుదరనివాటినికూడ కుదిరేటట్లు చేసే శక్తికలది అని, ఆలోచించ వీలుకాని పనులను చేసేది అని భావము. మనం మాయ చేసే సృష్టిని గూర్చియే అర్థం చేసుకోలేము. ఇక మాయను ఎలా అర్థం చేసుకుంటాము? మనవారు మాయను ఒక మహాశక్తి స్వరూపిణిగా భావించి ఆరాధించేది అందుకే. మా తండ్రి కనపడకుండా నాకు అడ్డమురాకు తల్లీ అని ప్రార్థించటమే దాని అంతరార్థము.

417

ఆనందం కాని, శాశ్వతత్త్వము గాని, బాహ్యాంతర ప్రాపంచిక విషయాలను తెలిసికొనటమనేది కాని చైతన్యము ఆత్మయొక్క స్వభావమే. అయినా అవి భిన్న ధర్మములుగా అనుభవావస్థలో గోచరిస్తూ ఉంటాయి.

418

మనో, బుద్ధ్యహంకారాలు, ఇంద్రియాలు, ప్రాణము, శరీరము అనేవి జడ పదార్థాలే. కనుక వాటికి కర్తృత్వ మనేది పొసగదు అసంగమయిన శుద్ధ చైతన్యం ఏ పనీ చేయనే చేయదు గనుక, దానికీ కర్తృత్వము సిద్ధించదు. పోగా ఈ రెంటి సమ్మేళనము వల్ల ఏర్పడ్డ జీవునికే కర్తృత్వ, భోక్తృత్వ, స్వర్గ, నరక, సుఖ, దుఃఖ, మోహాది ధర్మా లన్న మాట. కనుక నీవు నిస్సంగ సచ్చిదానంద మాత్రుడ వని తెలిసికో.

419

ప్రతి సాధకుడు తాను పొందిన హృదయ పరిపక్వతను బట్టి సంపాదించిన జ్ఞానమును బట్టి విగ్రహారాధన, మంత్ర జపాది సాధనలు చేస్తూ ఉంటాడు. సామాన్య సాధనలు విగ్రహారాధనాదులు, భజనలు చేయనందువల్ల అతనిని నాస్తికుడని ఆక్షేపించరాదు. గొప్ప సాహిత్యారాధకుని పిల్లల కథల పత్రికలు చదవమంటే చదవలేడు కదా!

420

శరీరావసరాలను గూడ వీలైనంతగా తగ్గించుకోవడం మంచిది. శరీరావసరాలను పెంచుకొన్నకొద్దీ వాటిని తీర్చు కొనే వస్తుసామగ్రి కోసం వెంపరలాడటం తప్పదు. అలా, అలా ఇతరులను గూడ ఆశ్రయించవలసి వస్తుంది. ఇతరులను ఆశ్రయించినకొద్దీ నీవు వారి దృష్టిలో తేలిక అయిపోతావు.

421

నీవు బ్రహ్మవేత్తవి అయినప్పటికీ, బ్రతికినంత కాలము గురువును, దేవుణ్ణి, వేదాంతమును గౌరవిస్తూ ఉండవలసిందే. ఆ త్రయమే లేకపోయినట్లయితే నీకీ బ్రాహ్మస్థితి కలుగదు కదా!

422

జగత్తులన్ని ఏ మహావస్తువు నుండి పుట్టి- దేనిమీద క్రీడిస్తూ, చివరకు ఎందులో లీనమవుతున్నవో అదే బ్రహ్మ మంటే.

423

జాగ్రత్తుకు, స్వప్నానికి, సుషుప్తికీ ఆధారభూతమయినదే అఖండ బ్రహ్మమనుకో. ఆ బ్రహ్మమే లేకపోతే నీవనుభవించే మూడవస్థలు జరగనే జరుగవు. అవి ఆ బ్రహ్మము మీదనే.

424

సమాధి కూడ ఆ బ్రహ్మము మీదనే. అయితే సమాధి ఆ బ్రహ్మస్వరూపమే అనేది ఇక్కడ రహస్యం.

425

బ్రహ్మమునకు సత్యము, జ్ఞానము, ఆనందమే స్వరూపాలు. ఇదే స్వరూప లక్షణమంటే.

426

జగత్తు లనేవి బ్రహ్మము నుండి పుట్టి దానిమీదనే

పెరిగి అంతే నశిస్తున్నాయనేది బ్రహ్మమునకు తటస్థ లక్షణము.

427

నీకు భయ సందేహాలు తీరిపోయి ఆనందం వెల్లి విరియాలంటే విజ్ఞానాన్ని సాధించి తీరాలి. విజ్ఞానమంటే ప్రకృతి పురుషుల యొక్క తత్త్వ వివేకమే.

428

తత్త్వ జ్ఞానాన్ని మించిన హృదయ శాంతిసాధనము మరొకటి లేదు.

429

అజ్ఞానము వల్ల దుఃఖము, భయ సందేహాలు మాత్రమే కలుగుతాయి. సుజ్ఞానం వల్ల శాంతి, సుఖ, సంతోషాలు వర్ధిల్లుతాయి.

430

పరమార్థమయిన వస్తువునకు ఏకాలంలోనూ, బాధ (నశింపు) ఉండదు. అయదార్థ వస్తువులు ఒకప్పుడు ఉంటాయి. ఇంకొకప్పుడు నశిస్తాయి. జగత్తు జాగ్రత్తులోను, స్వప్నములోను మాత్రమే ఉంటుంది. సుషుప్తి సమాధులలో ఉండదు. ఆ జగత్తును చూచే ద్రష్టవైన నీవు జాగ్రత్స్వప్న, సుషుప్తి సమాధులనే నాలుగు దశలలోను ఉంటున్నావు కనుక నీవే పరమార్థ వస్తువంటే.

431

"స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమ చ్ఛదో వర

అవిశేశ" (ఋ. 10-81-1) అని ఋఙ్మంత్రం (విశ్వకర్మ సూక్తం) చెపుతున్నందువల్ల ఈ శరీరములో ఉన్న నీవు దాన్ని సృష్టించిన ఆ పరబ్రహ్మవే కాని వేరు కాదు.

432

మనకు కంఠచామీకర న్యాయమని ఒకటి ఉన్నది. ఒకడు తన మెడలోనేయున్న బంగారు గొలుసును మరచి పోయి అది లేదని దుఃఖపడుతున్నాడట. ఒక పుణ్యాత్ముడు అది నీ మెడలోనే ఉన్నదిరా అని చెప్పి చూపించాడు. అప్పుడు వాడు దుఃఖనివృత్తిని పొందాడు. అలాగే నీవు బ్రహ్మమవే అయినా ఆ సంగతిని మరచి చింతలపాలవు తున్నారు.

433

తాను కర్తగాని, భోక్త (అనుభవించేవాడు) కాని, కాడనుకునే జ్ఞాని ఏ కర్మనుగాని, ఏ ఉపాసనాదులను కాని చేయలేడు. వాడేదయినా చేస్తున్నాడంటే అది లోకసంగ్రహం కోసమే అవుతుంది.

434

కేవల జ్ఞానమనేది అతి పరిశ్రమవల్లకాని లభ్యం కాదు. అందుకనే గీతలో "తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏక భక్తిర్విశిష్యతే" అనీ, "జ్ఞానీత్వాత్మైవ మే మతం" అ పలుగురిలో జ్ఞాని నిత్యయోగి అనీ, ఆ జ్ఞానీ, తాను ఒకటే అని అన్నాడు భగవానుడు.

435

ఏకత్వము, సమత్వము, సత్యము, తపస్సు, శీలము, ఋజుత్వము (తిన్నదనము) అనేవి సాధువులకు తరుగని ధనములు.

436

శూన్యము నుండే జగత్తులు పుట్టాయి. కనుక శూన్యమే జగత్కారణమని కొందరంటారు. అయితే మొదట శూన్యమున్నదనటానికి, దానిని చూచిన సాక్షి ఒకడుండాలి కదా. ఆ సాక్షి లేకపోతే శూన్యము కాదని మనకెలా తెలుస్తుంది. కనుక అన్నిటిని చూచే సాక్షి ఉండి తీరాలి. ఆ సాక్షివి నీవే.

437

ఈ జగత్తులన్నీ అఖండ చిన్మాత్ర పరబ్రహ్మం మీద, త్రాటిమీద సర్పంలాగ తోస్తున్నవి. కనుక బ్రహ్మమును జగత్తులకు వివర్త కారణమన్నారు. త్రాడు సర్పంగా తోచినప్పుడు, త్రాటిలో ఏవిధమయిన మార్పు రాదు. అలాగే బ్రహ్మం జగత్తుగా వివర్తించినప్పుడు గూడ ఆ బ్రహ్మములో ఎట్టి పరిణామాది వికారాలు కలుగవు. ఈ సంగతి అనుభూతి పరులకు గాని పూర్తిగా అంతుబట్టదు.

438

కుండకు మట్టి ఉపాదాన కారణమైనట్లు, జగత్తులకు గూడ బ్రహ్మమే ఉపాదాన కారణము. కార్యరూపమయిన కుండ తయారు కాకముందూ, తయారైన పిమ్మట, మరల

నశించినాక మట్టిలోనే ఒదిగిఉంటుంది. అందుకనే కుండకు మట్టి ఉపాదాన కారణమన్నారు. అలాగే జగత్తులనేవి బ్రహ్మపదార్థం మీదనే తోచి దానిమీదనే కొంతకాలం ఉండి చివరకు దానిలోనే కలసిపోతున్నాయి. కనుక బ్రహ్మము జగత్తులకు ఉపాదాన కారణం అవుతుంది.

439

కుండకు మట్టి ఉపాదాన కారణమయినా దానిని తయారుచేసిన కుమ్మరి నిమిత్తకారణ మవుతున్నాడు. బ్రహ్మము ఉపాదాన కారణమే కాకుండా నిమిత్త కారణం కూడా అవుతున్నది. అందుకనే బ్రహ్మమును లోకాలకు "అభిన్న నిమిత్తో పాదాన కారణ" మన్నారు విజ్ఞులు. లోక సిద్ధ వస్తువులకు నిమిత్తోపాదాన కారణాలు భిన్నాలుగా ఉంటాయికాని జగత్తుల విషయములో మాత్రం అలాకాదు అద్వైత దృష్టిలో.

440

చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే ఈ మూడు వస్తువు లనే అంగీకరించే విశిష్టాద్వైతుల దృష్టిలో అయితే- అచిత్తు అయిన ప్రకృతి ఉపాదాన కారణమూ, ఈశ్వరుడు నిమిత్త కారణమూ అని గ్రహించాలి.

441

బ్రహ్మము నిర్వికారము అనెడి అద్వైత వేదాంతుల దృష్టిలో జగత్తులకు బ్రహ్మము వివర్త కారణమే అవుతుంది.

వేదోపనిషత్తులు ఈ వాదానికే అనుకూలిస్తవని వారి భావం.

442

బ్రహ్మమునకు కూటస్థుడని మరొక పేరు. కూట మంటే శిల్పులు సాధారణంగా ఉపయోగించే దాగలి (పట్టెడ) అన్నమాట. శిల్పి ఆ దాగలి మీద బంగారమును సాగకొట్టుతూ ఎన్నో రకరకాల నగలను తయారుచేస్తూ యుంటాడు. ఆ దాగలి బంగారం నానాలంకారాలుగా తయారుకావటానికి ఉపయోగపడుతుందే కాని తాను మాత్రం ఏకొంచము మార్పుచెందదు. తన్ను ఆధారంగా చేసికొని బంగారమే ఎన్నో నగల రూపాలను ధరిస్తుంది. అలాగే కూటస్థ బ్రహ్మమును ఆధారంగా చేసికొని చిత్ర విచిత్రమయిన జగత్తులు పుట్టుచున్నప్పటికీ బ్రహ్మమునకు మాత్రము ఏమార్పు రాదు. అందుకనే బ్రహ్మమునకు "కూటస్థుడని" పేరు వచ్చినది.

443

బ్రహ్మమును సత్తు, చిత్తు, ఆనందము (సచ్చిదానందము) అంటున్నారు. సత్తు అన్నందువల్ల అది అసత్తు (లేనిది) కాదని, చిత్తు అన్నందువల్ల అది జడము (అంటే తెలియనిది) కాదని, తెలిసికొనేదే అనియు, ఆనందము అనడం వల్ల అది దుఃఖరూపం కాదనీ సాధకులు గ్రహించి ప్రవర్తించాలి.

444

బ్రహ్మము సూక్ష్మమునకంటె సూక్ష్మతరము (సూక్ష్మాచ్చతత్ సూక్ష్మతరం) అన్నారంటే, ఆకాశము లాగ అతి సూక్ష్మమయినదే బ్రహ్మమని తెలిసికోవాలి. బ్రహ్మం బృహత్తు అన్నారంటే- పృథివికంటె జలం, దాని కంటె అగ్ని, దానికంటె గాలి, దానికంటె ఆకాశము. దాని కంటె మహత్తు. దానికంటె ప్రకృతి గొప్పది కనుక, వీటన్నిటికంటె కూడ బ్రహ్మము బృహత్పదార్థమని అర్థం చేసుకోవాలి.

445

మిథ్య, మాయ అనే పదాలకు శాస్త్రంలో పలు వ్యుత్పత్తులు చెప్పబడినాయి. నిజంగా లేకపోయినా ఉన్నట్లు కనబడేది మిథ్య అని కొందరు, విచారిస్తే నిలువలేనిదని కొందరూ, జ్ఞానోదయం కాగానే నశించేదని మరికొందరు ఇలా ఎన్నో రీతులుగా చెప్పారు. ఎన్ని రీతులు చెప్పినా జ్ఞానంచేత, విచారణచేత నశించేదన్న నిర్వచనమే బాగుం టుంది. ఈ సంగతినే శాస్త్రం "అవిచారకృతో బంధః; విచారేణ వినశ్యతి" విచారణ లేక కలిగిన సంసారం తత్త్వాన్ని గూర్చి విచారిస్తే నశిస్తుందని అన్నది.

446

ఒక్కొక్క వస్తువునకు ఒక్కొక్క వస్తువు మూలము, కారణము అనీ మన మెరుగుదుము. బ్రహ్మపదార్థము మాత్రము అన్ని మూలాలకు మొట్టమొదటిదయిన ఆది

మూలము, ఆదికారణము. తనకు ఇంకొక కారణము లేని సర్వకారణమూను అన్నమాట. అంటే బ్రహ్మమున కవతల ఇంకొక కారణ వస్తువు లేదు కనుక బ్రహ్మము నిష్కారణము.

447

అతి సూక్ష్మమయిన వస్తువునకు నాశనము లేదు. అది సూక్ష్మమయి అంతటా వ్యాపించి ఉంటుంది కనుక సత్యమయిన వస్తువు అదే!

448

ఆకాశం మీద గాలి, అగ్ని, నీరు, నేల తక్కిన పదార్థాలు అన్నీ నిలువగలుగుతాయి. ఆ ఆకాశమేమో అఖండ పరబ్రహ్మమును ఆధారంగా చేసుకొని నిలుస్తుంది. ఒకదాని మీద నిలచేదాన్ని ఆధేయమని, నిలుపుకొనేదాన్ని ఆధారమని అంటాము. ఆధేయాలు పరిపూర్ణ వస్తువులు కాదు గనుక, అవి నశిస్తాయి. సర్వాధార బ్రహ్మం సర్వవ్యాపకం గనుక అది నశించదు. అందుకే అది సత్యము. (సత్యం, జ్ఞాన, మనంతం బ్రహ్మ అని ఉపనిషత్తు).

449

నీవు అన్నిటినీ "ఇది కాదు, ఇది కాదు" అని నిషేధించగలవు కాని; నిన్ను నీవు "నేను లేను" అని నిషేధించుకోలేవు అలాగే బ్రహ్మం మీద తోచే ప్రపంచాన్నంతటినీ నిషేధించవచ్చు కాని, బ్రహ్మమును మాత్రము నిషేధించటానికి వీలులేదు. బ్రహ్మమనేది నీ స్వరూపమే కనుక, నీవు

నీ స్వరూపమయిన బ్రహ్మము. నిన్ను ఎలా నిషేధిస్తావు! కనుక చివరకు మిగిలేది నీవు.

450

లోకంలోని వస్తువులు ఒకదానితో మరొకటి కలసి సంగము (కలియక)ను కల్పించుకోవచ్చు. కాని బ్రహ్మము మాత్రము నిస్సంగమయి దేనితోను కలియదు, అంటు పడదు. దేనికి సంగము ఉండదో దానికి నాశనము లేదు. దృష్టాంతం ఆకాశం. అలాగే బ్రహ్మం కూడా అవినాశి. మూడు కాలాల యందూ శాశ్వతంగా ఉండేదిను.

451

బ్రహ్మము సర్వవ్యాపకమై అంతటా పరిపూర్ణంగా నిండి ఉండేది గనుక నశించదు. దానిమీద జరిగే పనుల కన్నిటికీ అది సాక్షిగానే ఉంటుంది.

452

బ్రహ్మము జ్ఞాన రూపమయి తనకు తాను స్వయంగా ప్రకాశిస్తూ, స్వయంగా ప్రకాశించలేని దేహమును, ఇంద్రియాలనూ, ప్రాణమును, మనస్సును, బుద్ధిని, అహంకారాన్ని, తక్కిన జగత్తును ప్రకాశింప చేస్తూ (తెలుసుకుంటూ) ఉంటుంది. గనుక దాన్ని చిత్తు, జ్ఞానఘనము అన్నారు. వెలుగే స్వభావముగా కలది కనుక బ్రహ్మమును అన్నిటినీ చూచే సాక్షి అని అన్నారు.

453

బ్రహ్మము యొక్క సత్యత్వాన్ని తత్త్వవేత్తలు స్వానుభవంతో ఎరిగినవారై, లోకానికి మార్గదర్శకులవుతూ ఉంటారు.

454

బ్రహ్మము వెలుగే స్వరూపముగా కలదై అంతటా వ్యాపించి ఉన్నందువల్ల, ఎక్కడెక్కడ జరిగే విషయాలన్నీ అంటే సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహాదులు ఎల్ల జీవుల కర్మ సంకల్ప, వికల్పాదులు బ్రహ్మమునకు తెలియక తప్పదు. అందుకని బ్రహ్మము సర్వజ్ఞము (అన్నిటినీ తెలిసికొనేదన్నమాట).

455

సృష్టించటం, పెంచడం, లయింపచేయడం మొదలైన శక్తులన్నీ బ్రహ్మములోనే ఉన్నందువల్ల దాన్ని సర్వశక్తి అన్నారు.

456

అన్నిటినీ శాసించేదీ, తమ తమ ధర్మాల యందు నడిపేదీ బ్రహ్మమే కనుక దాన్ని "సర్వేశ్వరం" అన్నారు.

457

మెలకువలోను, కలలోను, జగద్విషయాలతో విసిగి వేసారిన జీవుడు, సుషుప్తి దశలో బ్రహ్మమును చేరుకొని ఆనందమును అనుభవిస్తున్నాడు. గనుక బ్రహ్మము ఆనంద

రూపమే అని స్పష్టమగుచున్నది. అయితే జీవులకు తాము సుషుప్తిలో బ్రహ్మను చేరుకున్నామని తెలియదు.

458

బ్రహ్మమే ఎల్ల శరీరాలలోనూ. ప్రత్యగాత్మ రూపుడుగా ప్రవేశించినందువల్ల, జీవులు కూడ సచ్చిదానంద స్వరూపులే అని తెలిసికోవాలి. ఈ అంశమును సుషుప్తిని బట్టిగూడ గ్రహించవచ్చు. సుషుప్తిలో నీయొక్క యదార్థ స్వరూపము వ్యక్తమవుతుంది. కనుకనే, నీవు హాయిగా ఆనందంగా ఉంటున్నావు.

459

తన కిష్టమయిన వస్తువులను ప్రేమించే జీవుడు తన్ను తానే ప్రేమించుకోకుండా ఎలా ఉంటాడు. కనుక జీవుడు ప్రేమాస్పదుడు అన్నమాట. ఏది ప్రేమాస్పదమో, అది ఆనందరూపం అయితీరాలి. పరమ ప్రేమాస్పదం పరమానంద రూపమే.

460

లోకంలో ఉన్న ఆనందాలు, బ్రహ్మానందంతో పోల్చి చూస్తే చిన్న, చిన్న కణాల వంటివి. బ్రహ్మానందమో అఖండము, అనిర్వచనీయము. అందుకనే దానిని పరమానంద మన్నారు.

461

శరీరమనే ఉపాధిలో ప్రవేశించినంతమాత్రాన బ్రహ్మము యొక్క పరమానంద స్వరూపానికి ఏలోటూ

రాదు. గనుక శరీరంలో చేరి జీవుడయినప్పటికీ ఆ బ్రహ్మము పరమ ప్రేమాస్పదుడే, పరమానంద రూపుడే.

462

నీవొకసారి కలగన్నావనుకో. ఆ కలలో నీకగపడిన పదార్థాలు మెలకువ రాగానే, నశిస్తాయి కదా! అవి నశించినా, వాటిని చూచిన నీవే మెలకువలో వాటియొక్క లేమిని చూస్తున్నావు. అంటే కలను చూచిన నీవే మెలకువను గూడ చూస్తున్నావన్నమాట. గాఢనిద్రలోనికి పోయినప్పుడు అన్ని పదార్థాలనూ మరచి, అజ్ఞానాన్ని చూస్తూ ఉంటావు. ఈ మూడుచోట్లా ఉన్న ద్రష్టవైన నీవు మాత్రం నశించటం లేదు. అలాగే ఎన్ని జన్మలు మారుతున్నా, ఎన్ని క్రొత్త శరీరాలు వస్తున్నా, ఆ శరీరాలలో ఉండి వ్యవహరించే నీవు మాత్రం నశించవు. మారవు. శరీరాల నాశనాన్ని చూచే ద్రష్టవుగా, సాక్షివిగా నీవు మిగులుతావు. కనుక నీవుకూడా సత్యస్వరూపుడవే అని గ్రహించు.

463

సత్యరూపుడవయిన నీవు అన్నింటినీ తెలిసికొంటున్నావు గనుక చిత్స్వరూపుడవు గూడ. కాబట్టి నీవు శరీరాదుల వంటి జడ పదార్థానివి కాదు.

464

నీలో ఉన్న ఆనందరూపం కూడ శాశ్వతంగా వెలుగుతూనే ఉంటుంది.

465

సుషుప్తిలో అహంకారము అజ్ఞానంలో లయం పొందుతుంది. అందుకనే శారీరక, మానసిక, సుఖ, దుఃఖాలు తోచవు.

466

"తత్-త్వం-అసి" అనేది నీవు బ్రహ్మమవే- అని చెప్పే ఉపనిషత్తు లోని మహా వాక్యం. ఈ శరీరానికి, ఇంద్రియాలకు, ప్రాణానికి, అంతఃకరణానికి సాక్షిభూతమయిన జీవ చైతన్యమే ఇందులోని "త్వం" అనే పదానికి లక్ష్యార్థం. అఖండ బ్రహ్మ చైతన్యమే "తత్" అనే పదానికి లక్ష్యార్థం. "అసి" అనే పదం రెంటినీ ఏకం చేస్తుంది. కాగా, "తత్త్వమసి" అనే వాక్యానికి అఖండ చైతన్యమే తెలుసుకోదగిన పరమార్థము.

467

బ్రహ్మవేత్తలందరూ ఒకేవిధమయిన నడవడి కలిగి ఉండాలన్న నియమము లేదు. వారివారి ప్రారబ్ధకర్మను బట్టి, వారివారి చర్యలు భిన్న, భిన్న రీతులుగా ఉంటాయి. సానగాది బ్రహ్మఋషులు సృష్టి ప్రవర్తకులుగా ప్రకాశించారు. వశిష్ఠుడు బ్రహ్మవేత్త అయినా వర్ణాశ్రమాచారాలను పాటించే ప్రవర్తించినాడు. జడభరతుడు బాలోన్మత్త లక్షణాలతో వెలిగినాడు. సౌభరి అనే ఋషి భోగాలతో తుల దూగాడు. జనకాదులును అంతే. శంకరులు, బ్రహ్మంగారు నడచుకున్న రీతులు మన మెరిగినవే. బందరులోని దొంతు

లమ్మ పిచ్చిదిగానే తిరిగేది. మదుగుస్వామి నిరంతర సమాధి నిష్ఠుడై ఉండేవాడు. రమణ మహర్షి నిర్లిప్తుడుగా సంచరించి నాడు. సత్తెనపల్లి దగ్గరి రాజుపాలెంలోని నాగశేషమాంబ అనే బాలయోగిని (రాజుపాలెం అమ్మ) బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా ఆహార, పానీయ, శరీర చలనాదులను గూడ వీడి, ఇప్పటికీ సమాధినిష్ఠలోనే ఉన్నది. వీరివీరి వెలుపలి నడవడులు భిన్న, భిన్నాలుగా ఉన్నా వీరు పొందిన బ్రాహ్మీస్థితిలో మాత్రం ఏమాత్రం భేదముండదు. ఆ నడవడులలోని భేదాలు వారివారి ప్రారబ్ధకర్మను బట్టి ఏర్పడినట్టివే.

468

యోగుల యొక్క, తత్త్వజ్ఞుల యొక్క మాటలు, చేతలు, నడతలు ఎలా ఉన్నా మనకవి పూర్తిగా అర్థం కావు. నీటిలో చేప అడుగులను, ఆకాశాన పక్షుల దారులను- తత్త్వవేత్తల నడవడులను ఎవరూ కనిపెట్టలేరు.

469

ఈశ్వరుడు సృష్టించిన జగత్తు నీకు ఎట్టి అపకారము చేయదు. ఆ జగత్తును ఉపయోగించుకొనే రీతులను గూర్చి ప్రేరేపించే మనస్సే నీకు సుఖ దుఃఖాలను గాని, బంధ-మోక్షాలను గాని చేకూరుస్తుంది. కనుక నీ మనస్సును నీవు వశం చేసుకోవాలి.

470

జగత్తుల పుట్టుకను, పెరుగుదలను, నాశనమును గూర్చి

ఇది ఇలాంటిదని చెప్పటానికి వీలుకాక అది మిథ్య యని మాయ అని. అనిర్వాచ్యమని అన్నారు విజ్ఞులు. వారికి తెలిసిందల్లా అఖండాద్వితీయ, నిత్య పరిపూర్ణ, పరబ్రహ్మ తత్త్వాన్ని గూర్చి మాత్రమే. ఈ సంగతినే ఋగ్వేదం "కో అద్ధా వేద కఇహ- ప్రవోచత్కుత ఆజాతా-కుత-ఇయం సృష్టిః". మనము ఎక్కడనుండి వచ్చామో. ఈ సృష్టి ఎలా కలిగిందో ఎవడికి తెలుసు. దీన్ని గూర్చి ఎవడు చెప్పగలుగు తాడు అన్నది.

471

లోతుగా ఆలోచించి చూస్తే. బ్రహ్మము నుండి జగత్తులు పుట్టడానికే వీలులేదు. ఇక, ఆ పుట్టినటువంటి లోకాలు పెరగటమేమిటి? నశించటమేమిటి? అందులో నీ వనే వాడుండి బంధమని మొత్తుకోవడమేమిటి? సాధన చేసి ముక్తి పొందడమేమిటి? ఇదంతా ఒక చిత్రాతిచిత్ర పరిస్థితి. ఆశ్చర్యకరమైన అనుభూతి!

472

ఈ జగద్బ్రహ్మల తత్త్వాన్ని గూర్చి చెప్పేవాళ్లూ అరుదే! తెలిసికొనేవాళ్లూ అంతకంటే అరుదే. ఆచరణలో పెట్టేవాళ్ళు ఇంకా అంతకంటే అరుదే. ఎవరన్నా చెప్పా రంటే అది అత్యల్పము మాత్రమే.

473

మహాత్ములలో కొందరు అవతార పురుషులుగాను, కొందరు సిద్ధ పురుషులుగాను, మరికొందరు సాధకులుగాను

ఇంక కొందరు కర్మబద్ధులుగాను పుట్టుతుంటారు. కర్మబద్ధులు మోక్షము పొందగోరి శ్రవణ, మనన, యోగాభ్యాసాది సాధనలు చెయ్యవలసిందే. సాధకులు పూర్వజన్మలో సాధన ఎక్కడ ఆగినదో అక్కడనుండి కొనసాగించాలి. ఇక సిద్ధ పురుషులు ఆత్మ సాక్షాత్కారం పొందినా, ఏదో కొంచెం కర్మశేషం వల్లకానీ, లోకంకోసంకానీ పుట్టవలసి వస్తుంది. భగవంతుని ఇచ్ఛవల్ల ఆయన అంశను స్వీకరించి పుట్టేవారు. అవతార పురుషులు. బ్రహ్మంగారు మున్నగువారు ఈ కోవకు చెందుతారు.

474

అభ్యాస యోగులకు కామక్రోధాదులవల్ల విఘ్నాలు కలిగినా, వారు మళ్ళీ తెప్పరిల్లి తమ యోగాన్ని కొనసాగిస్తారు. అలా కొంతకాలానికి సిద్ధిని గూడ పొందుతారు.

475

సాధనకు ఏదో ఒక ఆటంకం వచ్చి ఆగిపోయినప్పటికీ నిరుత్సాహ పడనక్కరలేదు. నీవు నీ తప్పును తెలిసికుంటే మళ్ళీ నడక సాగుతుందికాని, భ్రష్టుడవు మాత్రం కావు.

476

మన దృష్టిలో కొన్ని జన్మలనేవి ఎంతో దీర్ఘకాలంగా కనబడవచ్చు. కాని, ఈశ్వర దృష్టిలో ఆ అనేక జన్మల కాలం అత్యల్పమే అవుతుంది. స్వప్నంలో చూడు. ఒక గంటసేపు కన్న కలలోనే నీకు ఎన్నో సంవత్సరాలు, జన్మలు

కూడ గడచిపోవచ్చు. గడచిపోతాయి. అదే మాయ యొక్క మహిమ అనుకో.

477

సాధకులు ఎంతో మెలకువతో ప్రవర్తిస్తేనే తప్ప వారికి "దేహమే నేను" అనే అధ్యాస తొలగదు. అలాగే "ఇది బ్రహ్మమేకాని జగత్తు కాదు" అనే భావము కూడా అనుక్షణము అనుసంధానము చేస్తుంటూనేకాని దృఢం కాదు.

478

మాటలు చెప్పినంత తేలికగాను, పుస్తకాలు చదివినంత సులభంగాను, తత్త్వాన్ని విన్నంత చులకనగాను బ్రహ్మానుభూతి పట్టుబడదు. దాన్ని ఎంతో నిష్ఠతోను, పట్టుదలతోను ప్రతిక్షణం మనన, ధ్యానాలతోను అభ్యాసం చెయ్యాలి.

479

నీవు అభ్యాసంలో ఏపాటిగా వెనుకబడ్డప్పటికీ నీకు తత్త్వ జ్ఞానము, తత్త్వ సిద్ధి దూరం కాకతప్పదు.

480

ఒక లౌకిక విషయాన్ని సంపాదించాలంటేనే నీవు ఎంతో ప్రయత్నం చేసి, ఎంతో డబ్బు ఖర్చుపెట్టి పాటు పడాలో ఆలోచించుకో. అందులో ఏ స్వల్ప భాగాన్న

యినా పరమార్థ సిద్ధికి ఉపయోగించినట్లయితే కృతకృత్యు
డవు కాగలుగుతావు.

481

ఒక్కొక్క పనిని చేసేటప్పుడు కొందరు అన్నపానీ
యాలను, చిరుతిండ్లను, చివరకు కాఫీని గూడ మానుకుం
టారు కాని భగవద్ధ్యానము వంటి కార్యము ముగియకుండా
ఏమీ చేయకూడదు, ఏదీ తినకూడదు అనే నియమాలను
పాటించలేరు. అంటే భగవత్ప్రాప్తికి చేసే పనులంటే అంత
నిర్లక్ష్యము, లౌకిక కార్యాలలను గూర్చి అంత పట్టుదల
మానవులకు ఉన్నాయని తెలుస్తుంది గదా!

482

అభ్యాసం ఎంత అవసరమో, అంతగా ఇంద్రియ
విషయాల మీద, ప్రపంచం మీద వైరాగ్యం కూడ
అవసరమే. ఈ అభ్యాస, వైరాగ్యాలే సాధకులకు ఆత్మ
సిద్ధిని చేకూర్చేవి.

483

ధ్యానాదులు చేసుకునే సమయంలో ఇతరుల వల్ల
ఏవైనా ఆటంకాలు కలుగుతూ ఉండవచ్చు. అలాంటప్పుడు
కోపాన్ని తెచ్చుకోకూడదు. ఓర్పుతోను, నేర్పుతోను
వారిని సమాధానపరచి, నీ ధ్యానాదులను కొనసాగించు
కోవాలి.

484

ఎవరయినా సినిమాలకు పోతున్నా, రుచిగల పదా

ర్థాలను తింటున్నా నీకుకూడ వారివలె సినిమాలకు పోవాలనీ, రుచ్య పదార్థాలను తినాలనీ కోరికలు కలుగవచ్చు. అలాంటప్పుడు నీ మనస్సును నిగ్రహించి అదుపులో పెట్టుకోవాలి. ఇది ఉదాహరణ మాత్రమే. ఇలా ఎన్నో ప్రాపంచిక విషయాలు తమవైపునకు నిన్ను లాగుతూ ఉంటాయి. అలాంటప్పుడు తెలివిగా వాటికి లోబడక నడచుకోవాలి.

435

సత్పురుషులతో సాంగత్య మనేది, సద్గ్రంథ పఠన మనేది, సద్విషయాలను చింతించట మనేది నిన్ను చాలా వరకు విషయాల వైపునకు పోనీయక మరల్ప గలుగుతాయి. కనుక వాటిని తప్పకుండా అలవరచుకుంటూ ఉండాలి.

436

ఆత్మ బోధకాని, ఆత్మ సాధనలు కాని నిన్ను నీ కుటుంబానికి దూరం చేసి భ్రష్టుణ్ణి చేస్తాయని, పిచ్చివాణ్ణి చేస్తాయని మనవారికొక దురభిప్రాయ మున్నది. నిక్కమయిన ఆత్మజ్ఞానం ఎప్పుడూ ప్రపంచానికి నిన్ను దూరం చేయదు. ప్రాపంచిక విషయాల మీద నియమ నిబంధనలను పెంచుతుంది. నిన్ను సదాచార పరాయణుని, సత్కార్యశీలుని చేస్తుంది.

437

భగవంతుని నామరూపాలను గూర్చి కొందఱు శివుడెక్కువా, విష్ణువెక్కువా, శక్తి ఎక్కువా అని వివాద పడుతూ ఉంటారు. అది తప్పు. భగవద్భక్తిలో మాత్రం ఏ

భేదం లేదు. అది సత్తు, చిత్తు, ఆనందమే స్వరూపంగా కలిగి ఉంటుంది. "సత్యం జ్ఞాన మనంతం" అనికదా ఉపనిషత్తు లంటాయి. ఉన్నదల్లా ఏకము. సత్తు మాత్రమే. ఆ నిర్గుణానికే బుద్ధిమంతులు అనేక నామరూపాలు ఏర్పాటు చేసుకొని ఆరాధిస్తారు. కనుక నామరూపాలకు తరతమ భేదాలు కల్పించి తగవులాడడం అజ్ఞానమే కాని, సుజ్ఞానం కాదు.

488

భగవద్ధ్యానం చేసే సమయంలో చంచలమయిన మనస్సు అనేక విషయాల మీదకి పోతూ ఉంటుంది. అలాంటి మనస్సును నేర్పుగా వశపరచుకొని నీ ధ్యానాన్ని కొనసాగించాలి.

489

ధ్యానం వల్ల చిత్తానికి ఏకాగ్రత కలిగి ఒక తేజస్సు, బలమూ, నిర్మలత్వమూ, పవిత్రత దానికి చేకూరుతాయి. అలాంటి మనస్సులోకి చెడ్డ ఆలోచనలు, దుస్సంకల్పాలు రావు. అది భగవన్మయమై ఆనందంలో నిండియుంటుంది. అదే చిత్తశాంతి అంటే.

490

నీకు భగవదనుగ్రహము కలిగిందనటానికి, బ్రహ్మజ్ఞానం బట్టుబడ్డదనటానికి ఉత్తమమయిన చిత్తశాంతి కలగడమే నిదర్శనము. మనశ్శాంతి ఏర్పడనంతవరకు భగవదనుగ్రహం కాని, బ్రహ్మజ్ఞానం కాని లభించలేదన్నమాటే.

491

మంత్రాలనేవి భగవంతునికి పెట్టుకున్న పేరుల వంటివి. ఓం నమః శివాయ, ఓం నమో విశ్వకర్మణే, ఓం నమో నారాయణాయ ఇత్యాది మంత్రాములను నీవు జపిస్తున్నావంటే, ఆ భగవంతుని పిలిచి ఆయన శాసనాలకు లోబడి నడచుకొనటానికి నీవు ప్రతిజ్ఞ చేస్తున్నావన్నమాట. కనుక భక్తుడైనవాడు భగవత్సంకల్పానికి, సృష్టి ధర్మానికి విరుద్ధమయిన పనులు చెయ్యకూడదు. అందుకనే సత్యం, అహింస, శౌచము, అక్రోధము, కారుణ్యము, భూతదయ, తపస్సు మొదలయిన దైవ గుణాలను సాధువులు అలవరచుకోవాలన్నారు తత్త్వజ్ఞులు.

492

కొన్ని మంత్రాలు బీజాక్షరాలతో ఉంటాయి. అవి కూడ ఆయా భగవచ్ఛక్తులను ఆరాధించి వాటిని మనం పొందటానికి పనికివచ్చేవే. వాటిని గూర్చి భయ సందేహాలేమీ అవసరం లేదు.

493

అక్షరాలు, రూపాలూ కూడ, అద్భుత శక్తులకు నివాసాలే. అందుకనే బీజాక్షరోపాసన కూడ ఫలప్రదం అవుతుంది. విగ్రహారాధన నిన్ను రూపరహిత బ్రహ్మతత్త్వము లోనికి తీసుకొని వెళ్తుంది కూడ.

494

ప్రపంచం అనే మాట అది ఐదు అంశాలలో కూడు

కొన్నదని మనకు చెప్పుచున్నది. ఆ ఐదే 1) రూపం 2) నామం, 3) సత్యం, 4) జ్ఞానం, 5) ఆనందం అనేవి. వీటిలో నామరూపాలు అనేవాటికి జగత్తే స్వరూపం. సత్య జ్ఞానానందా లనేవి ఈశ్వర స్వరూపము. పురుష సూక్తము "సర్వాణి రూపాణి విచిత్ర ధీరః నామాని కృత్వాభి వదన్ యదాస్తే" అని, నామరూప ప్రశంస చేసింది. నీవు నామ రూపాలను మాత్రమే, ప్రపంచంలోని పదార్థాలను మాత్రమే ఆశ్రయించి బ్రతకదలచుకుంటే సుఖదుఃఖాది ద్వంద్వాలు తప్పవు. వాటివల్ల రాగద్వేషాలు, వాటివల్ల అన్ని అనర్థాలు ఏర్పడుతాయి. సత్య, జ్ఞానానందాలను ఆశ్రయించితే దుఃఖదూరుడవై- శాంతి సంతోషాలతో అమృతత్వాన్ని పొందగలుగుతావు.

495

గాంధీగారు సత్యమే భగవత్స్వరూపమని దాన్నే ఆరాధించి తాను కృతకృత్యుడు కావటమే కాక, ప్రపంచానికి గూడ తరుణోపాయం చూపాడు. బుద్ధుడు ఒక్క-అహింసనే ప్రధానం చేసుకొని లోకానికి సుఖమార్గాన్ని బోధించాడు. వేదోపనిషత్తులు జ్ఞానం మోక్షసాధనమని చెప్పడం వల్ల ఎంతోమంది తాత్త్వికులు ఆ జ్ఞానాన్ని ఆశ్రయించి ధన్యులయినారు.

496

నీకు కొన్ని కొన్ని పేర్లు వినపడగానే ఆ పేర్లు గల వస్తువులమీద కామమో, క్రోధమో కలుగుతుంది. అలాగే

కొన్ని కొన్ని రూపాలను చూచినందువల్ల కూడ రాగ, ద్వేషాలు కలుగుతాయి. వాటిద్వారా నీవు దిగజారిపోతావు, కాని మరికొన్ని పేర్లు, ఆకారాలు ఎన్నిసార్లు చూచినా శాంతి, సుఖము, సంతోషము, జ్ఞానము కలిగి ధన్యుడవవు తావు. కనుక పవిత్రములయిన నామరూపాలనే సేవించాలి.

497

నామరూపాల జోలికి పోకుండా సత్యాన్ని, జ్ఞానాన్ని ఆరాధిస్తే రాగద్వేషాలు నశించి, ఆనందప్రాప్తి కలిగి సాధు పురుషుడ వవుతావు.

498

అసలీ నామరూప సచ్చిదానందములనే అయినను కూడ పంచ భూతాలకు, పంచ బ్రహ్మలకు, పంచ ఋషులకు-జగత్తులకు హేతువులయిన పంచ ప్రధాన తత్త్వాలకు సంకేతాలు. ఈ పంచకాన్ని వదలిచూస్తే ప్రపంచమే ఉండదు. ఈ పంచకమే ప్రపంచము, ఆ ప్రపంచంలోని నీవు, నేను అన్నీను.

499

భగవంతుడనేవాడిలో కాని, బ్రహ్మపదార్థమనే దానిలో కాని, ఒక సత్యమే కాని, ఒక జ్ఞానమే కాని, ఒక ఆనందమే కాని వేరు, వేరుగా ఉండను. ఈ మూడింటి సమాహారమే భగవత్స్వరూపము కానీ, బ్రహ్మముకానీ, ఈ సచ్చిదానందమనేది కానీ. ఆత్మ వస్తువే అనుకుంటే దానికి శరీరమే నామరూపాలు- నామరూపాత్మక ప్రపంచము.

500

మన దేవాలయ వ్యవస్థలో ఈ నామరూపోపాసన అనేది లెస్సగా కుదురుకున్నది. ఆలయంలో ఒక రూపంలో దేవుడూ ఉంటాడు. ఆ దేవుని ఉపాసించే మంత్రమూ, పూజా విధానమూ ఉంటుంది. ఇలాంటి నామ రూపోపాసన సచ్చిదానంద స్వరూప భగవత్తత్త్వ ప్రాప్తికి స్థూలమయిన సాధనమన్న మాట.

501

నీ నడవడిని బట్టి నామరూపాలనేవి దుఃఖానికి హేతువులు కావచ్చు, సుఖానికి కారణాలు కావచ్చు. వాటిని నీవు మలచుకొనడంలోనే ఫలితమంతా ఉన్నది.

502

జుట్టువల్ల అందం కలిగే మాట నిజమే. అయినా జుట్టు ఉన్నంతకాలము పేలు పడకుండా ఉండవు. జుట్టువల్ల చెమట-దానివల్ల పేలూ, వానివల్ల బాధలూ తప్పవు. అలాగే నీవొక శరీరధారివై లోకంలో తిరుగుతున్నంతవరకు ఎంత సాధు స్వభావంతో ప్రవర్తించినప్పటికీ ఇతరుల ఉపకారాపకారాలకు కామక్రోధాదులకు, నిందా స్తుతులకు, మానావమానాలకు గురికాక తప్పదు.

503

సాధకుడెప్పుడూ నిందలకు దుఃఖపడి క్రుంగిపోకుండానూ, పొగడ్తలకు ఆనందిస్తూ పొంగిపోకుండానూ బూడిద లాగా ఉండాలి. బూడిద చూడండి- అది మండనూ మండదు

ఆరనూ ఆరదు. కట్టె మాత్రమే మండుతుంది. మండి చల్లారుతుంది అంటే నీలో ప్రాపంచిక విషయాలనే కొయ్యతనం ఉండకూడదన్న మాట. ఆ కొయ్యగా నీ పున్నంతవరకు, మండక-ఆరక తప్పదు.

504

కొందరు సాధకులు "సోఽహం" అని, "అహం బ్రహ్మాస్మి" అని జపము చేస్తారు. సోఽహం అంటే ఆ పరమేశ్వరుడు నేనే అని భావము. అహం బ్రహ్మాస్మి అంటే నేను బ్రహ్మమును అని భావము. ఈ జపము ప్రారంభమయి ధ్యానము కొనసాగి ఆ అర్థం దృఢపడుతున్న కొలదీ- నేను, బ్రహ్మము అనే భావాలు ఒకదానితో ఒకటి కలిసిపోయి చివరకు అఖండమయిన బ్రహ్మ మొక్కటే మిగులుతుంది. నిప్పుకట్టెను అంటుకొని, దాన్ని కాల్చి తన స్వరూపంగా చేసుకొని ఏకమై చివరకు తానుగూడ లేకుండా శాంతిస్తుంది కదా. అలానే పై మంత్రాల భావము అనుభవాని కొచ్చి నప్పుడు రెండు తత్త్వాలు ఒక్కటే అయిపోతవి.

505

నిన్ను నీవు, అంటే నీ దేహేంద్రియాదులను గాక ఆత్మను చూచుకొగలిగితే, నిరతిశయానందం నీలోనే గోచరిస్తుంది. ముక్తికాంత నీకు దాసీ అవుతుంది.

506

పరబ్రహ్మమును జ్ఞాత అనిగాని, జ్ఞేయము అనిగాని

అనడం న్యాయం కాదు. వాడు కేవల జ్ఞానస్వరూపుడు మాత్రమే. జ్ఞాతృ, జ్ఞేయము లనేవి ద్వైత జగత్తుకు త్రిపుటికి సంబంధించినవి. ఇంకా అతీత స్థితిలో చూస్తే అది జ్ఞానమని కాని, అజ్ఞానమనికాని చెప్పటానికి వీలుకాదు. జ్ఞానాజ్ఞానాలు ద్వంద్వ ప్రపంచంలోనివే కదా! అందుకే "నాసదాసీత్" అనే సృష్టిసూక్తం సృష్టికి ముందరి స్థితిని సత్తూ కాదనీ, అసత్తు కాదనీ అన్నది. గీత దానినే "నసత్తన్నాసదుచ్యతే" అన్నది.

507

యుద్ధం జరిగే ప్రదేశానికి జయాపజయాలతో ఎలాంటి సంబంధము ఉండదు, ఆ ప్రదేశాన యుద్ధం చేసే ఉభయ పక్షాలకే గెలుపు-ఓటములతో పొత్తు. యుద్ధ ప్రదేశం సాక్షి వంటిది మాత్రమే. అలాగే శరీరేంద్రియాలు చేసే అన్ని పనులతోను సంబంధం లేని సాక్షిమాత్రుడుగా అసంగుడుగా నీవు సంసారంలో మెలగాలి.

508

దారముల కూర్పువల్ల ఏర్పడిన వస్త్రము దారములే అయినట్లు, బంగారము వల్ల తయారైన నగ బంగారమే అయినట్లు, మట్టితో ఏర్పడిన కుండ మట్టియే అయినట్లు, శిలతో చేసిన విష్ణు ప్రతిమ శిలయే అయినట్లు, బ్రహ్మము వల్ల ఏర్పడిన జగత్తు కూడ బ్రహ్మమేకాని ఇతరం కాదు.

509

విశ్వం అదృశ్యమయితేనేకాని, భగవత్ సాక్షాత్కారం

కాదు అని అనుకోనటం అజ్ఞానమే. బ్రహ్మం మీద విశ్వం తోచినప్పుడు, తోచనప్పుడు, తోచి తిరోహితమయినప్పుడు కూడ బ్రహ్మము విశ్వానికి అధిష్ఠానముగా ఉండనే ఉన్నది. ఆ అన్ని వేళలలోను నీవు బ్రహ్మమును చూడగలగాలి. అదే పూర్ణత్వమంటే. బంగారము నగగా రూపుదాల్చినా బంగారమే. కరగపెట్టినా బంగారమే. కరిగి ద్రవంగా ఉన్నా బంగారమే. అలాగే విశ్వబ్రహ్మలు కూడ.

510

బ్రహ్మపదార్థము నాకంటె వేరైనది అనే భావమే బంధాన్ని కలిగిస్తుంది. అది నేనే, నా స్వరూపమే, నాకు దానికి భేదము లేదు, అనే జ్ఞానానుభవాలు మోక్షాన్ని చేకూరుస్తాయి. ఈ విషయం అజ్ఞానులకు భగవద్రోహముగా తోచవచ్చును గాని ఉన్న సత్యం మాత్రం అదే.

511

ఒకడు నిద్రలో కలగంటున్నాడు. ఆ కలలో ఇంకొకడు వచ్చి వాడిని కత్తితో పొడిచి గాయము చేసినాడు. వాడు దానికి మందులు వెదక నారంభించినాడు. ఏ మందులు ఆ గాయాన్ని తగ్గిస్తవి. వాడే కనుక మేల్కొన్నట్లయితే- ఆ గాయం మానడానికి ఆ మెలకువే మందవుతుంది. అలాగే సంసార దుఃఖాలు శాంతించాలంటే నీకు జ్ఞానోదయమనే మెలకువ కలగాలి. అప్పుడు నిన్ను సంసారము- దానివల్ల కలిగిన బాధలు ఏమీ చేయలేవు.

512

"సర్వస్య చాహం హృది సన్నివిష్టః" భగవంతుడు "నేను అందరి హృదయాలలోను ఉన్నాను" అని అన్నాడు. కనుక సాధకు డెప్పుడు ప్రాణుల హృదయాలలో ఉన్న భగవంతుని దర్శిస్తూ వారితో వ్యవహరించాలి. ఆ యోగాన్ని ఆచరణలో పెట్టితే ఎలాంటి కలహ, విద్వేషాలు కలుగక మైత్రీ-సంతోషానురాగాలు వెల్లివిరుస్తాయి.

513

నీకొకప్పుడు రజోగుణ లక్షణాలయిన కామ, క్రోధాదులు, కర్మలు చేయాలనే కోరిక కలుగవచ్చు. ఇంకొకప్పుడు సత్పురుష సాంగత్యము-సద్గ్రంథ పఠనము, సత్యశౌచాదుల అభ్యాసము మొదలయిన సత్త్వగుణ లక్షణాలు కలుగవచ్చు. ఇంకొకప్పుడు- నిద్ర మాంద్యము, ఆలస్యము, మొద్దుతనము మొదలగు తమోగుణ లక్షణాలు కలుగవచ్చు. అలాంటివి ఏవి కలిగినా, వాటిలో నీవు లీనం కాకుండా వాటిని తెలిసికొనే యజమానుడిగా ప్రవర్తిస్తూ, వాటిని శాసించటం నేర్చుకోవాలి. అప్పుడు నీవు వాటికి సాక్షివని గూడ తెలిసికొని నీ స్వరూపంలో నీవు సుఖపడగలుగుతావు.

514

సుఖాన్ని, దుఃఖాన్ని, మిత్రుని, శత్రువుని బంగారాన్ని, మట్టిపెళ్ళను- మానాన్ని, అవమానాన్ని, ప్రియాన్ని, అప్రియాన్ని సమానంగా చూడగలిగేటటువంటి

ఒక గొప్ప సామ్యయోగం. దీనివల్ల అమూల్య ఫలితాలు కలుగుతాయి.

515

భగవద్గీత 2వ అధ్యాయంలో చెప్పిన స్థితప్రజ్ఞ లక్షణాలు, 12వ అధ్యాయంలోని భక్త లక్షణాలు, 14వ అధ్యాయంలోని గుణాతీత లక్షణాలు అలవరచుకొనటానికి ప్రతి సాధకుడు యత్నించాలి. అవి సాధకులను భగవంతునితో సమానులను చేస్తాయి.

516

ప్రతి మనుజుడు ఏదో ఒక సంకల్పం చేసికొని, దాన్ని సాధించటానికి అష్టకష్టాలకూ లోనవుతూ ఉంటాడు. ఏ సంకల్పము లేనివాడు హాయిని అనుభవిస్తాడు. సంకల్ప, అసంకల్పముల ప్రభావము అలాంటిది!

517

సంకల్పాలు, కోరికలు లేకుండా ఎలా జీవించడం అని అంటారు. అవి కలిగినప్పటికీ వాటికి నీవు అతీతుడవయి ప్రవర్తించే విధానం ఒకటి ఉన్నది. ఆ మార్గాన్ని సాధిస్తే నిన్ను ఎన్ని సంకల్పాలయినా ఏమీ చేయలేవు.

518

“ఏక్ నిరంజన్; దో సుఖ, తీన్ గడబిడ, చార్ లట పట” అని మనవాళ్ళు అంటుంటారు. ఏదయినా సరే, సంఖ్య పెరిగినకొద్దీ- అశాంతి, అసౌఖ్యము ఎక్కువవుతూ ఉంటాయి.

అందుకే రెండవ వస్తువు లేని అద్వైతం సౌఖ్యదాయక మయింది.

519

గాఢము-నిర్మలమూ అయిన భక్తితో వెదకటం మొదలుపెడితే భగవంతుడెవ్వడో, ఎటువంటివాడో తెలిసికో గలుగుతావు. తరువాత క్రమంగా ఆ భగవత్తత్త్వాన్ని గ్రహించి అందులో ప్రవేశించగలుగుతావు.

520

నీవు చేసే కర్మలకు ఫలితాలు కలిగినా, కలుగక పోయినా, ఒకప్పుడు విపరీత ఫలితాలు కలిగినా, సంతోష విచారాలు పొందకుండా సమభావంతో ఉండటమే నిజ మయిన భక్తి యోగమంటే.

521

. వివిధ మతాలవారు, దర్శనాలు వ్రాసినవారు. తత్త్వాన్ని గూర్చి వారికి తోచిన విధంగా భిన్న భిన్న రీతుల నిర్వచనాలు చేసినారు. తత్త్వమనేది మాత్రం వారి వారి నిర్వచనాలను అనుసరించి ఉండాలని నియమమేమీ లేదు. అది దాని స్వరూపంలోనే ఉన్న రీతిగానే ఉంటుంది. గనుక సాధకులకు ఏమీ బాధలేదు. వారు స్వయంగా ఆలోచించి సాధన చేసి తత్త్వాన్ని ఉన్నది ఉన్నట్లుగా పట్టుకోవచ్చు.

522

ఆదిమూలమయిన తత్త్వం పలురీతులుగా అన్నింటికి లోపల, వెలుపల అంతటా ఉండవచ్చు. ఒక్కొక్కచోట

ఉన్నప్పుడు ఆయా ఉపాధులను బట్టి అది పలురీతులుగా తన లీలలను ప్రకటిస్తూ ఉంటుంది.

523

నీవు వింటున్నా, తింటున్నా, చూస్తున్నా, మూర్కొంటున్నా, ఇస్తున్నా, పుచ్చుకొంటున్నా, తాకుతున్నా, విడుస్తున్నా, సుఖస్తున్నా అవి అన్నీ జరుగుతున్నట్లు నీకు తెలుస్తూనే ఉంటుంది. ఏ ఏ అవయవాల ద్వారా ఆ పనులు జరిగేది గమనిస్తూనే ఉంటావు. ఆ పనులు చెయ్యమని ప్రేరేపించే మనస్సుకూడ నీకు తెలిసినట్టిదే. ఇవి అన్ని నీకు సాధనాలే కాని, వీటన్నిటిని గ్రహించే తెలివి- జ్ఞానం మాత్రము ఏ వికారాలూ లేకుండా- ఏ పనులు చేయకుండా ఏకమై, ఏకరూపమై నీవుగానే ఉంటుంది. కనుక నీవంటే అదే అని సర్వకాల సర్వావస్థల యందు గట్టి స్పృహ కలిగి యుండు. లోపలి, వెలుపలి వికారాలకూ- కార్యాలకూ చలించబోకు. అదే పరమార్థ స్థితి అంటే!

524

పరబ్రహ్మ వస్తువనేది నీవు తెలిసికొనగలిగిన ఏ వస్తువు కానట్టిది. ఏ లక్షణమూ లేనట్టిది. ఎందుకవంటే నీవు తెలిసికొనేవన్నీ నీకు వేరైనట్టివి. అవి కర్మ స్వరూపాలు (objects). బ్రహ్మతత్త్వమేమో కర్త, కర్మ, క్రియలు అనే త్రిపుటికి, జ్ఞానాజ్ఞానముల నే ద్వంద్వాలకు అతీతమయినట్టిది. ప్రకాశించటమే, తెలిసికొనటమే దాని స్వరూపము, స్వభావము.

525

కొందరు క్రొత్త విషయాలను చెప్పవలెనని తహతహ పడుతూ ఉంటారు. వారు ఆ ప్రయత్నం చేయటానికి ముందు ఇదివరకున్న విషయాలను పూర్తిగా అర్థం చేసుకొనటం మంచిది. ఎందుకంటే నీవు క్రొత్త విషయం అనుకొన్నది ఇదివరకే ఎవరయినా చెప్పి ఉండవచ్చునేమోగా తెలుస్తుంది.

526

ప్రకృతి పురుషుల యొక్క యదార్థమయిన జ్ఞానమనేది నీకు ఆత్మశాంతిని చేకూర్చుతుంది. అటుతరువాత భగవంతునితో సాధర్మ్యాన్ని అంటే సమానస్థితిని పొందగలుగుతావు.

527

రాగము-భయము-క్రోధము అనే వాటిని విడచి చిత్తాన్ని బ్రహ్మమయం చేసికొని బ్రహ్మపరాయణుడవై ఉండటమే జ్ఞాన యోగమన్నా, జ్ఞాన తపస్సన్నా. అట్టి జ్ఞాన తపస్సు తప్పకుండా నిన్ను బ్రాహ్మీస్థితికి తీసుకొనిపోతుంది.

528

పవిత్రమయిన ఆత్మజ్ఞానం వల్ల ప్రకృతికి సంబంధించిన అజ్ఞానం నశిస్తే నీవు కేవలానందరూపుడవై ప్రకాశిస్తావు.

529

జ్ఞానం ప్రకాశించకుండా, మరుగున పడటానికి కామక్రోధాలే మూలం. కనుక ముందు సాధకుడు వాటిని జయించితే సాధనలో కృతకృత్యుడవుతాడు.

530

ఎవరినీ ద్వేషించకుండా, అందరితో మైత్రితోను, కరుణతోను మెలగుతూ అన్ని భూతాలలో భగవంతుని చూడడానికి చేసే సాధన ఒక అత్యుత్తమ తపస్సు.

531

నీకున్నదానితో తృప్తిపడి మనస్సును విషయాల మీాదికి పోనీకుండా భగవదర్పితం చేసి ప్రవర్తించటమనేది ఒక యోగ్య సాధన.

532

ఏకాంత ప్రదేశంలో నీ శరీరేంద్రియాదులను గూర్చి- చిత్తవృత్తులను గూర్చి విచారిస్తూ, తత్త్వం కోసం అన్వేషణ సాగిస్తూ ఉంటే నీకు ఆత్మ సాక్షాత్కారం సులభంగానే లభిస్తుంది.

533

ఏ కోరికలూ పెట్టుకోకుండ, పరిశుద్ధ తత్త్వ చింతనతో ఏ బాధలకూ గురి కాకుండా, కొత్త పనుల జోలికిపోకుండ నిలకడ కలిగి భగవంతుని చూస్తూ ఉండడమనేది ఆత్మ శాంతికి హేతువవుతుంది.

534

సుఖ, దుఃఖాలు అనుభవించేటప్పుడు వాటికి సాక్షిగా ప్రవర్తించాలని శాస్త్రం చెప్పుతున్నది. ఆచరణలో చూస్తే సుఖం అనుభవించేటపుడు సాక్షినని భావించవచ్చు గాని, దుఃఖాన్ని అనుభవించేటప్పుడు సాక్షి ననుకొని దుఃఖానికి

భిన్నంగా ఉండడం కష్టసాధ్యం. అది ఎంతో సాధన ఉంటేనేగాని సాధ్యపడదు. కష్టమనేది నిన్ను కష్టంగానే బాధిస్తుంది.

535

నిజానికి ప్రకృతీ, దాని గుణాలూ, వాటి వికారాలయిన ఇంద్రియాలే అన్ని పనులూ చేస్తాయి. ఆత్మ అకర్త కనుక ఏమీ చేయదూ, చేయించదూ. అయినా ఇంద్రియాలు చేసే పనులను ఆత్మయే చేస్తున్నదని తలచి, సాధకుడు కర్తృత్వానికి కట్టువడుతాడు. ఆ కర్తృత్వమే కనుక నశిస్తే నరుడు ముక్తుడన్న మాటే!

536

అన్ని వస్తువులలోనూ, అంతటను వెలిగే నిర్గుణ పరమాత్మ దర్శనం కావడమనేది బహుజన్మ పరిపాకమేకాని, తేలిక పనిగాదు. ఎంతో గాఢసాధన సాగితేనేకాని అలాంటి సిద్ధి కలుగదు.

537

అనేక విషయాలను తెలుసుకొని బోధించేవారు ఎందఱయినా ఉండవచ్చు. కాని బ్రహ్మవేత్త అయిన సద్గురుమూర్తి మాత్రం మిక్కిలి దుర్లభుడు.

538

జాగ్రత్, స్వప్న, సుషుప్తులనే దశలకూ- రజ, సత్వ, తమస్సులనే గుణాలకూ స్థూల, సూక్ష్మ కారణాలనే దేహా

లకూ అంటకుండ నిర్లిప్తుడై ఉండే యోగులు మిక్కిలి అరుదుగా ఉంటారు.

539

ఈ లోకవాంఛలే కాకుండ మోక్షకాంక్ష కూడ లేకుండ కేవలం పరబ్రహ్మ స్వరూపుడై ఉండే తత్త్వజ్ఞుడు అందరికీ ఆరాధనీయుడు.

540

సాధకుడు ప్రకృతి విషయాలకు ఎంతెంతగా దూర మయితే అంతంతగా పరమాత్మకు దగ్గఱ అవుతూ ఉంటాడు.

541

ధ్యానం వల్ల నీ చిత్తం బ్రహ్మమందు నిలకొని బ్రహ్మ స్వరూపస్థితిని పొందుతుంది. అంటే బ్రహ్మపదా ర్థంలో కరగిపోతుందన్నమాట. అప్పుడు మనస్సుకు పరుడవూ, పరమాత్మవే అవుతావు నీవు!

542

ఎల్లప్పుడూ "నేను సత్యవస్తువునూ, జ్ఞానరూపుడనూ, ఆనందమయుడనూ అని ధ్యానించి అనుభూతి నందగలిగితే నీ బుద్ధి వాటితోనే నిండి చిత్తులో కరగిపోతుంది.

543

జీవన్ముక్త స్థితిని పొందినవానిని బద్ధమూచనుడని కొందరంటే, కొందఱు అతని మనస్సు సాక్షాద్బ్రహ్మమే

అని అన్నారు. ఎవరెలా అన్నా అతడొక పరిపూర్ణ అమనస్క యోగియే.

544

దేహ సంబంధమైన, మనస్సంబంధమైన బాధలు శమించాలంటే సమాధిని అలవాటు చేసుకొనడమే జరుగ వలసిన పని. సుషుప్తిలోలాగ సమాధిలో కూడ ఏ బాధలూ తోచవు.

545

బ్రహ్మనిష్ఠ అంటే బ్రహ్మమునందు నివసించడమని భావం. అది చాలదు. బ్రహ్మమందుండి క్రమంగా బ్రహ్మ మవ్వై అయిపోవాలి. ఎలాగంటే నిప్పులో వేసిన కట్టె నిప్పయిపోయినట్లు.

546

ఆకాశాన్ని గాలి ఎగురగొట్టనూ లేదు, అగ్ని కాల్చనూ లేదు, నీళ్ళు తడపనూ లేవు. అలాగే ప్రాపంచిక విషయాలు ప్రవర్తిస్తున్నా నిన్ను ఏమీ చేయలేని స్థితిని నీవు సంపాదించుకోవాలి. అప్పుడే దుఃఖదూరుడ వవుతావు.

547

బ్రహ్మవేత్తలకు నీవు ఏపాటి సేవ చేసినప్పటికీ, ఏది సమర్పించినప్పటికీ అది గొప్ప ఫలితాన్నే ఇస్తుంది కాని వ్యర్థం కాను. అందుకే ఉపనిషత్తు ఫలం కోరేవాడు ఆత్మ జ్ఞాని అర్చించాలి అన్నది. "తస్మాదాత్మజ్ఞం హ్యర్చయే

ద్ధ్యాతికామః" అని. పండ్లచెట్టును ఆశ్రయిస్తే పండ్లకు కొఱత ఉండదు కదా!

548

సద్గురువుకు సచ్ఛిష్యుడు దొరకడం ఎంత కష్టమో, సచ్ఛిష్యునకు సద్గురువు దొరకడమూ అంత కష్టమే. ఆ సన్మేళనం బంగారం పరిమళించడమే.

549

మెలకువతో ఉన్నవాడికి కల రాదు. అలాగే ఆత్మ జ్ఞానం పొందినవానిని మాయ దరిచేరలేదు.

550

నీకు మాయ యొక్క గుట్టూ, మట్టూ బోధపడనంత వరకే అది నిన్ను బాధ పెట్టుతుంది. దాని మర్మం తెలుసుకొన్నావంటే అది నీ జోలికే రాదు.

551

నీవు సత్యమూ, జ్ఞానమూ, ఆనందమే స్వరూపంగా కలవాడివయినా, అజ్ఞానానికీ, అసత్యమైన దృశ్యాలకూ ఆశ్రయంగా కనబడుతూ ఉంటావు. ఇదే మాయ యొక్క మహిమ!

552

దృక్స్వరూపుడవైన నీవే మనస్సుతోడి పొత్తు వల్ల అనేక దృశ్యాలుగా తోస్తూ ఉంటావు. నీ దృక్స్వరూపాన్ని తెలుసుకొని దానిమీదే నిలిస్తే నీకు దృశ్యబాధ ఉండనే ఉండదు.

553

నీకు లోపలా, వెలుపలా, అంతటా దృశ్యాలే తోచి నిలకడ చిక్కనీయడం లేదు. వీటిలో లోపలి దృశ్యాలే ఎక్కువగా అపకారం చేస్తాయి. ఆ లోపలి దృశ్యాల వల్లనే బాహ్య దృశ్యాలు తయారవుతున్నాయి. లోపలి దృశ్యాలంటే సంకల్ప వికల్పాలూ, కామ క్రోధాదులు మొదలైనవే.

554

దృశ్యాలనేవి నానా ప్రకారాలుగా పుట్టుతూ, గిట్టుతూ ఉంటాయి. దృక్కు మాత్రం పుట్టదూ, గిట్టదూ. దృశ్యాలు పుట్టినా, పుట్టకపోయినా దృక్కు మాత్రం ఏక రూపంగా వెలుగుతూనే ఉంటుంది.

555

దృశ్యాలు ఎన్ని రీతులుగా ఎలా ఉన్నా, అవన్నీ దృక్కునకు లోబడి ఉండవలసినవే. అసలు దృక్కే లేకపోతే దృశ్యాలే ఉండవు.

556

సాధకునికి దృశ్యభ్రాంతి తొలగి దృశ్యదృష్టి నశిస్తే, వాడు అఖండ దృగ్రూప పరమాత్మగా మాత్రమే మిగులుతాడు.

557

దృశ్యం యొక్క ధర్మం దృక్కుకుగాని, దృక్కు యొక్క ధర్మం దృశ్యాలకు గాని రాదు. దృశ్య ధర్మం దృక్కునకే గనుక వస్తే అదికూడ జడమే అవుతుంది.

558

వేళను అందిన ఆహారం తింటూ, లభించింది కట్టుకొంటూ, ఆశ్రయించినవారికి ఆత్మబోధ చేస్తూ ఎక్కడ వీలైతే అక్కడ కాలక్షేపం చేస్తాడు బ్రహ్మవేత్త!

559

"నాకు అది కావాలి, ఇది కావాలి. నాకు అది నియమం, ఇది నిషేధం, ఈ వస్తువులు ఉంటేనే కాని నా పని సాగదు" అనేవాడు పూర్ణ బ్రహ్మజ్ఞాని కాడు.

560

నశించిపోయే శరీరోపాధులలో నశించకుండ ప్రకాశించే ఆత్మను అనుభవించేవాడే జ్ఞాని!

561

అంతటా నిండిఉన్న ఆత్మ తత్త్వాన్ని సమంగా చూస్తూ తనకూ, లోకానికీ ఎగ్గు జరుగనీకుండా నడచుకొనేవాడే జ్ఞాని.

562

" ఈ కర్మలన్నీ ప్రకృతివల్లనే జరుగుతున్నాయి. నిస్సంగుడనయిన నావల్ల ఏమీ జరగడం లేదు" అనే నిశ్చయ జ్ఞానం కలవాడే జ్ఞాని.

563

ఆకాశం మీద బ్రహ్మాండ లీలలు జరుగుతున్నా, అది ఏమీ చలించనట్లు, నామీద శరీరేంద్రియాల

కార్యాలు జరుగుతున్నా, వాటితో నాకేమీ సంబంధం లేదు అనుకొనేవాడే జ్ఞాని.

564

సూక్ష్మమైన ఆకాశానికి ఏదీ ఎలా అంటదో, శరీరంలో ఉన్న నాకున్నూ ప్రకృతి వికారాలు ఏవీ అంటవు అనే స్థిరతర జ్ఞానం కలవాడే జ్ఞాని.

565

సత్త్వ, రజ, స్తమో గుణాల ప్రభావాలు ఏమాత్రమయినా ఎవనిమీద పడవో, వాడే గుణాతీతుడయిన నిర్మల జ్ఞాని.

566

"అతి నిర్మలమూ, స్వచ్ఛమూ అయిన సత్త్వగుణం కూడ ప్రకృతి సంబంధమయినదే కనుక, దానికికూడ లోబడని స్వచ్ఛాతి స్వచ్ఛుడను నేను" అనుకొనేవాడే పరిపూర్ణ జ్ఞాని.

567

చరాచరము లన్నింటిలోనూ ఉన్నది నేనే" అనే ఆత్మానుభవం కలవాడే ఆత్మజ్ఞాని.

568

"క్షరాక్షరములకు అతీతమయిన పరమాత్మను నేనేను" అనే భావం కలవాడే అకలంక జ్ఞాని.

569

అహంకారం అనేది లేనివాడూ, బుద్ధికి ప్రకృతి

పదార్థసంగం లేనివాడూ ఏదైనా చేసినా వాడది చేసినట్లే కాదు. వాడి కర్మ అంతా జ్ఞానరూపమే.

570

శబ్దాది విషయాల మీద తగుల్కొన్నవాడుకాక, విశుద్ధమైన బుద్ధితో కూడి, వాక్కాయేంద్రియ నిగ్రహం కలిగి వైరాగ్యంతో ధ్యాన యోగాన్ని అనుష్ఠిస్తూ ఉండే వాడు మహా జ్ఞాని.

571

బ్రహ్మభూతుడైన మహనీయు డెప్పుడూ, కోరడూ, ద్వేషించడూ, ఏదీ పట్టించుకోడూ. ఆత్మరూపములోనే లీనమై ఉంటాడు.

572

నేను పరమాత్మ రూపుడనే అనే జ్ఞానంతో కర్మలు చెయ్యడమనేది బలే విచిత్రమైన యోగం. దాన్ని ఎవరూ అర్థం చేసుకోలేరు.

573

జగత్తు బ్రహ్మమే అనే మాటలోని మర్మంఎఱిగి, అనుభవానికి తెచ్చుకొని సంచరించేవారే ఆత్మయోగులంటే.

574

పుట్టనిదీ, కదలనిదీ, అద్వయమూ, అప్రమేయమూ, అవ్యవహార్యమూ, శాంతమూ, శివమూ, అనందమూ,

అమృతమూ అయిన తత్త్వం తానే అయినవానిని గూర్చి ఏమి చెప్పగలం, ఏమి వ్రాయగలం!

575

ప్రపంచోపశమం, అచింత్యం, అఖిలసేవ్యం అయిన పరమతత్త్వం తానే అయి ఉన్నవాడి ఐశ్వర్యం, ఈశ్వరత్వం వర్ణనాతీతం.

576

అఖండాత్మవేత్త దేహంలో జీవన్ముక్తుడుగా ఉన్నా, లేక విదేహ ముక్తి నందినా భేదం లేదు.

577

మనం చూచే వస్తువులు, వినే విషయాలు యథార్థ వస్తువులు కావు. అవి ఒకానొక ఋత సత్యమనే పరమార్థ వస్తువు యొక్క ఆభాసలు. కనుక శాశ్వతంగా ఉండవు. వీటికి ఆధారమైన మూలవస్తువే శాశ్వతమైనట్టిది. అసలైన నీవు ఆ సత్యవస్తువే. (ఈ అంశాన్నే ఋఙ్మంత్రం "న విజానామి యది వేద మస్మి నిణ్యః సన్నద్ధో మనసా చరామి, యదా మాగ న్ప్రథమజా ఋతస్య ఆది ద్వాచో అశ్నువే భాగ మస్యాః" అన్నది. ఉపనిషత్తేమో "అహ మస్మి ప్రథమజా ఋతస్య" (భృగువల్లి) అన్నది. అనగా ఋతమునకు- అనగా పరబ్రహ్మమునకు తాను ప్రథమజుడు. పెద్ద కొడుకే అన్నమాట. ఇక ప్రహ్లాదుడేమో దృశ్యవర్గమంతా మిథ్య అనీ, దృక్కే వస్తువనీ (ఋతమనీ) "విశ్వమందు కన్న విన్న వస్తువులందు వస్తుదృష్టి చేసి వాంఛయిడకు" అని

వర్ణింపబడినాడు. తనుక బుతము యొక్క ఆభాసలే లోకా లన్నీ అని తెలుసుకోవాలి. ఈ అంశాన్ని మంత్రమొకటి "బుతం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళం, ఊర్ధ్వ రేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః" అన్నది.)

578

సాధకుడు ముందు శాంతుడు కావాలి. అనగా శమం కలవాడన్నమాట. మనస్సుకు ఏకోరికలూ కలుగకుండా శమం అనే గుణం ప్రాప్తించాలని భావం. ఆవల దాంతుడు కావాలి. అంటే బాహ్యములైన జ్ఞాన కర్మేంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. ఆవల విషయాలతో సంపర్కం కలిగే అవకాశాలు కలుగుతున్నప్పటికీ వాటినుండి విరమించే యత్నం చేయాలి. ఆ ప్రయత్నంలో వాడు ఉపరతుడు అవుతాడు. పిమ్మట తితిక్షువు. శమ, దమ, ఉపరతులను సంపాదించినప్పటికీ బాహ్య ప్రపంచ విషయాల వల్ల దెబ్బలు తగిలే ప్రమాదం ఏర్పడవచ్చు. అయినా వాటిని తట్టుకొని సుఖ, దుఃఖాలకు ఓర్చుకొనే ధీరత్వాన్నే తితిక్ష- ఓర్పు అంటారు. అందులో నెగ్గితేగాని సమాహితత్వం- సమాధి సిద్ధించి పరమాత్మమీద నిలకడ చిక్కదు. సమాహి తత్వంలో సాధకుడు కడపటి హద్దుకు చేరుకొన్నవాడవు తాడు. దీన్నే శాంతుడు, దాంతుడు, ఉపరతుడు, తితి క్షువు, సమాహితుడు కావాలని శాస్త్రం వర్ణించింది.

579

"తన శరీరమందు తనరెడి తత్త్వంబు గానలేక

యెదుట గానబడెడి వాటివెంట బడుము పరమార్థ సిద్ధికై యేమనంగ చెల్లు సిద్ధమిత్ర" ఎంత వెదకినేని ఎచ్చట దొరకని వస్తువుండే నాత్మ వస్తువగుచు, వస్తువులకూ, విషయాలకూ, గుణాలకూ, కనబడడము, కనబడకపోవటమూ, తోచడము, తోచకపోవడమూ అనే రెండు లక్షణాలుంటాయి. కనుక అవి శాశ్వతాలు కావు. ఆ రెండు లక్షణాలనూ ఏదయితే గ్రహిస్తుందో, చూస్తుందో, ఆ వస్తువు మాత్రమే ఆ రెండు లక్షణాలు లేని నిత్యచిద్రూపంగా వెలుగుతూ ఉంటుంది. అలాంటి అద్వితీయ నిత్యసత్య చిన్మాత్ర వస్తువే నీవు.

580

"తనలోన నున్న తత్త్వమెవ్వరు తరచి కనరన్న" అని బ్రహ్మంగారు వ్రాసిన తత్త్వమొకటి చెప్పుతున్నది. దీన్ని బట్టి మనుష్యుడు తెలియదగిన తత్త్వమనేది వెలుపల ఎక్కడా లేదనీ, అతనిలోనే (బుద్ధి గుహలో) ఉన్నదనీ, దాన్నే వెదకి తెలుసుకోవాలనీ తెలుస్తుంది. కనుక సాధకుడు తనలోని ఆదిమ మూలతత్త్వాన్ని తెలిసికొనడానికే యత్నించాలి. అయితే అది వెదకితే కనబడదు. వెదకితే కనబడేవన్నీ కర్మరూపాలు. అలాంటివాటిని వెదకి పట్టుకొనే వసువే తనలోని తత్త్వమంటే. అదే నీవు (తత్త్వమసి). ఇలాంటి జ్ఞానాన్నే ప్రతి మానవుడు సంపాదించాలి. అందుకు సాధన, ఆలోచన, విచారణ, తపస్సు అవసరం. కనుకనే "తపసా

బ్రహ్మ విజిజ్ఞాసస్వ" తపస్సు చేత బ్రహ్మపదార్థాన్ని తెలుసుకో అన్నారు.

581

తపస్సంటే తీర్థయాత్రాదులు కాదు. నిరంతరం మననం చేయడం, మానసికంగా ఆలోచించడం, లోపల ఉన్న బుద్ధ్యాదులను గూర్చి విచారించి తెలిసికొనడం. వాటిని విచారించి తెలుసుకొనే వస్తువే తానని అనుభూతి పొందడం. అదే నిజమైన తపస్సంటే.

582

సృష్టిని గూర్చి మానవుడెలాంటి అనుభవాలను సంపాదించినాడో వాటిని మాత్రమే వేదాది గ్రంథాలలో నిక్షేపించినాడు. కాని ఇంకా తెలిసికోదగినవి, భౌతికంగా కాని, ఆధిభౌతికంగాకాని అనేకం ఉన్నవి. ప్రాణం యొక్క, జీవుల యొక్క రాకపోకలను గూర్చి తెలిసికోదగిన అంశాలు, వాటిని గూర్చిన విచారణ ఇంకా ఎంతో కొనసాగింపవలసి యున్నది. అలాంటివాటినిగూర్చి గూడ సమగ్ర విచారణ కొనసాగి జ్ఞానం సిద్ధించాలి. అనాడే తత్త్వ విచారణ కొనసాగుతూ ఉన్నట్లు.

583

జీవితంలో సత్యసాధన అనేదే గొప్ప యోగం. అగత్యాకారణ సత్యాన్ని అవగాహన చేసికొనడమనేది మరీ గొప్ప యోగం. మన ఉపనిషద్ఋషులు అలాంటి యత్నం కొంతవఱకు చేయబట్టే మనకీపాటిగానైనా జ్ఞానం అందినది.

584

తనయందు తాను ఉండడమే (స్వాత్మస్థితి) మోక్షం. తాను కానివాటియందు ఉండడం (ఆత్మేతర స్థితి) వాటిని స్మరించడం చేయటమే బంధమంటే. ఎల్లప్పుడు నీయందే నీవు ఉంటే నిన్ను ఏదీ బంధించలేదు.

585

నీకంటె భిన్నాలయిన వాటిమీద ఉన్నా, వాటిని గూడ ఆత్మయే అని భావించగలిగితే అదీ ఆత్మస్థితీ, ఆత్మానందమే అవుతుంది. నీ మనస్సులోని కోరిక వెలుపలి విషయం మీదికి ప్రసరించగానే అది ఒక త్రాడులాగ సాగి, నిన్ను, ఆ విషయాన్ని కలిపి ముడివేస్తుంది. ఇక నేం, దాని మీద నీకు ఆసక్తి బలమవుతుంది. అదే బంధమంటే. మనస్సుతోనూ, అందలి కోరికతోనూ నీవు తాదాత్మ్యాన్ని పొంది ఉన్నావు. కనుక ఆ కోరిక నిన్ను కట్టివేసి ఆ విషయానికి దాసుణ్ణి చేస్తుంది ఇక దాన్ని సంపాదించి అనుభవించాలని ఎన్నెన్నో యత్నాలు చేస్తావు. ఆ యత్నాలలో న్యాయాన్యాయాలు వదలి ప్రవర్తిస్తావు. ఇలా పతితుడవవుతావు.

586

నామరూపాదులైన సర్వ వస్తువులూ, భావాలూ వేటికవి స్వతః సత్యాలు కావు. అనృతాలే. వాటినే సద్రూపంగా చూడగలిగితే అంటే వాటిలో సత్తును గ్రహించగలి

గితే అప్పుడు సద్రూపంగా సత్యాలవుతాయి. (సర్వం చ నామరూపాదికం సదాత్మనైవ సత్యం స్వతస్తు అనృతమేవ).

587

ఈశ్వరుడు నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావుడు. ఆకాశం శుద్ధమే కాని, నిత్యమూ, బుద్ధమూ కాదు. జీవుడు నిత్యుడూ, బుద్ధుడే కాని, ముక్తుడు కాడు. ఈశ్వరునిలో నిత్యత్వము, బుద్ధత్వమూ, ముక్తత్వమూ మూడు ఉన్నాయి. బుద్ధత్వమంటే జ్ఞానపూర్ణత, నిత్యత్వమంటే శాశ్వతంగా ఉండడం. శరీరంచేత బద్ధత్వం లేకపోవడమే ముక్తత్వమంటే. అందుకే ఉపనిషత్తు బ్రహ్మమును "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అన్నది.

బ్రహ్మ శబ్దానికి మూడు విధాలుగా వ్యుత్పత్తులు చెప్పవచ్చును. బృహత్త్వాద్బ్రహ్మ. అన్నింటికన్న పెద్దది కాబట్టి దాన్ని బ్రహ్మమన్నారు. 1) బృంహణత్వా ద్బ్రహ్మ: ఆకాశాదులైన సర్వపదార్థాలనూ తనలో ఇముడ్చుకొంటుంది కాబట్టికూడ అది బ్రహ్మము. 2) బర్హణత్వాద్బ్రహ్మ: అన్నింటిని తనలో ఇముడ్చుకొనడమేకాక, తనలో లయం చేసుకొంటుంది కనుకగూడ అది బ్రహ్మం.

588

అవిద్యకు ఆవరణ శక్తి, విక్షేప శక్తి అని రెండు శక్తులున్నాయి, ఆవరణ శక్తివల్ల ఆత్మకు జీవభావం వస్తుంది. విక్షేప శక్తివల్ల ఆత్మ జగత్తుగా అంటే జడ ప్రపంచంగా

లోస్తుంది. జీవజగత్తులు రెంటికీ, అవిద్యే కారణం గనుక దాన్ని కారణ శరీరమని అన్నారు.

589

పరమాత్మ అనేది నీవు చూచినా, చూడకపోయినా ఉంటుంది. కాని జగత్తు అనేది నీవు చూచినపుడు మాత్రమే ఉంటుంది. చూడకపోతే ఉండదు. అలాగే పరమార్థ మనేది మనం చూచినా, చూడకపోయినా ఉంటుంది. వ్యవహార మనేది నీవు చూస్తున్నప్పుడు మాత్రమే ఉంటుంది. కాని పరమార్థంలో వ్యవహారం ఉండదు. ఉన్నట్లయితే అది పరమార్థమే కాలేదు. భేదభిన్నమే అవుతుంది. ద్వంద్వాలు త్రిపుటి ఉంటేనే వ్యవహారం. ద్వంద్వాతీతం, త్రిపుటిరహితం పరమార్థం!

590

అధ్యాస అనేది చేతనం అచేతనం మీద, అచేతనం చేతనంమీద పడడం వల్ల ఏర్పడుతుంది. ప్రాణం దగ్గఱ నుండి త్వగింద్రియం దాకా ఉన్న శరీరమంతా అచేతనమే. దానిమీద ఈశ్వర చైతన్యం పడేటప్పటికి, అచేతనమైన శరీరానికి చేతనభావం వచ్చిపడ్డది. ఇదే అధ్యాస. అందుకనే శరీరమే నేననే భావం కలిగింది. ఇదే దేహాత్మ భావమంటే. ఇప్పుడు జీవుడు సిద్ధమైనాడు. ఈ జీవుడు తనచుట్టూ ఉన్న ప్రపంచం అంతా తనదని భావించాడు. అది భోగ్యం కావాలనుకొన్నాడు. చైతన్యం మీద అచేతనారోపణమంటే ఇదే. దానితో ఇక జగదాత్మ బుద్ధి ఏర్పడుతుంది. ఈ

జగమంతా తనకు భోగ్యం కావాలని మమకారం ఏర్పరచుకొంటాడు జీవుడు. జగంమీద కల ఆత్మీయతకే మమకారం అని పేరు.

590

సృష్టిలో ఎన్నోరకాలయిన ధాన్యాలు, కూరలు, పండ్లు ఉన్నాయి. అయితే వీటినన్నింటినీ ప్రతివాడూ తిని తీరాలని లేదు. ఎవరికిష్టమయిన పండును, కూరను, ధాన్యాన్ని వాడు, వీడు ఉపయోగించుకొని తన ఆకలిని తీర్చుకోవచ్చు. అలాగే పరతత్త్వాన్ని చేరడానికి అనేక మార్గాలు, భక్తి, జ్ఞాన, కర్మయోగాది మార్గాలున్నాయి. వీటిలో ఎవడికి ఇష్టమయిన, అనువైన మార్గాన్ని వాడు అనుసరించి కృతకృత్యుడు కావచ్చు. అలాగే ఎవరికిష్టమైన గ్రంథాలను వారు చదివి పరమార్థాన్ని తెలుసుకోవచ్చు. అందుకే గీతాదుల మీద ఇన్ని వ్యాఖ్యానాలు, వివరణాదులు బయలుదేరినాయి.

591

"తద్బుద్ధయః" ఆ పరబ్రహ్మము నందే బుద్ధి కలవారై, అంటే బ్రహ్మజిజ్ఞాసతో శ్రవణం చేసి అని భావం. "తదాత్మానః"- ఆ పరబ్రహ్మమును గూర్చి మననం చేసి, తన్నిష్ఠాః- ఆ బ్రహ్మమునందే ఉన్నవారై, అనగా నిధిధ్యాసన తత్పరులై, ఈ శ్రవణ, మనన, నిదిధ్యాసములు జరిగేటప్పటికి పూర్తిగా అదే పరాయణంగా కలవారవు

కారు. (తత్పరాయణాః) ఇవి మూడూ సాధించినందుకు ఫలమేమిటంటే, వారియొక్క ప్రారబ్ధం పటాపంచలు కావడమే. దీన్నే "జ్ఞాన నిర్ధూత కల్మషాః" అన్నది గీత. అవల జరిగే పనేమెు; అపునరావృత్తే- అంటే తిరిగి పుట్టుకనందని మోక్షస్థితి అన్నమాట. కనుక గీతలో "తద్బుద్ధ యస్త దాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః, గచ్ఛన్త్య పునరా వృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః" (5-17) అన్న శ్లోకం ఎంతో ముఖ్యమైనట్టిది. ఇందులో శ్రవణ, మనన, నిదిధ్యాసాపూర్వకమైన పునరావృత్తరహిత శాశ్వత మోక్షం ప్రతిపాదితమైనదన్న మాట.

592

అనుభవమనేది ద్వంద్వాలతోను, త్రిపుటితోను కూడినది గనుక అది సగుణము, ప్రాకృతికముకాక తప్పదు. ఇక మోక్షమనేది. స్థితి (ఉనికి) మాత్రమూ, సిద్ధమూ కనుక, అంటే తాను తానుగా ఉండిపోవడమే కాబట్టి అది ద్వంద్వరహితము, త్రిపుటి రహితముగాక తప్పదు. కనుక మోక్షమనేది ద్వంద్వ త్రిపుటులు లేని కేవల వస్తు మాత్ర స్థితి అన్నమాట. ఇంతకూ తేలిందేమంటే, అనుభవమనగా సాధనదశ అనీ, ముక్తి అనగా సిద్ధి అనీ. ఉనికి నుండి తోచేవే అనుభవం కానీ, సిద్ధి కానీ.

593

ఆడుకొనే పిల్లవానికి ముక్కు, మొగము, తోకా, తొండములేని ఏ సున్ననో అందిస్తే వాడు దాన్నే నేలకువేసి

కొట్టుతాడు. ఇలాంటి బొమ్మ నిచ్చారని మనమీదకు తిరుగుబాటు కూడా చేస్తాడు. అలాంటివాడికి ఏ పక్షి బొమ్మనో, జంతువు బొమ్మనో ఇస్తే కాదు తృప్తిపడి దానితో ఆడుకొంటాడు. ఆనందిస్తాడు. దాన్నిగూర్చి ఒక కథకూడా అల్లి చెప్పతే వాడు ఇంకా సంతోషిస్తాడు. అంతే కాదు మనం చెప్పినట్లు వింటాడుకూడా. అలాగే పిల్లలవంటి సామాన్య జిజ్ఞాసువులకు సచ్చిదానందాఖండ పరబ్రహ్మ తత్త్వాన్ని బోధించి, తృప్తిపరచలేము. వారికి నామ రూప గుణక్రియలతో గూడిన ఏ దేవతామల కథలనో చెప్పితే గాని, తృప్తిపడరు, చెప్పినట్లు వినరు. కనుక నిర్గుణ మార్గంలో ఉన్న ఇబ్బంది ఇది. అందుకే వేదాలు కాని, వేదాంతాలు కాని, ఆఖ్యాయిక (కథ)లను సృష్టించి తత్త్వ బోధకు పూనుకొన్నవి. ఈనాటికీ ఆత్మసాక్షాత్కారం పొందిన మహనీయులు, అదే మార్గాన్ని అనుసరిస్తున్నారు. ఏమీ తెలియని, పాలుతాగే పిల్లలకంటే నేటి సాధకులు ఉన్నతస్థాయిలో లేరు.

594

మానవుడు అధ్యాసలో ఉన్నంతవరకూ, ప్రకృతినే తన స్వరూపమనుకొన్నంతవరకూ దుఃఖాలు తొలగవు. నిత్య నిర్మలాఖండానందమయుడు కాలేడు. ఈ ప్రాకృతిక పదార్థాలకు మూలమయిన కారణవస్తువే నా స్వరూపము. ఆ నా స్వరూపం మీద ఈ కార్యములైన ప్రాకృతిక వస్తువులు తోచి ఆటలాడుతూ నన్ను భ్రాంతిపాలు చేస్తున్నా

యని గ్రహించినప్పుడే అతనికి ఆత్మశాంతి, ఆత్మానందం, ఆత్మమయత! అందుకే వేదాంత విచారణలో మూలవస్తు గవేషణ అవసరమవుతున్నది. జీవితంలో పరమ కర్తవ్యం, పరమ పురుషార్థం అదే అవుతున్నది. మోక్ష పురుషార్థ సాధన అంటే జగత్కారణ విచారణ అన్నమాట.

595

"హవిస్సు" అంటే హోమద్రవ్యం అని అర్థం. అంటే అగ్నిలో వేల్చే నేయి, సమిధలు, ధాన్యాదులు మొదలయినవి. అంతేకాదు భగవంతునికి చేసే అర్చా పూజార్పణాదులు కూడా అనే భావాన్ని వేదమంత్రాలు కొన్ని వ్యక్తం చేశాయి. భగవదర్పితంగా త్యాగం చేసే ప్రతి వస్తువూ హవిస్సు క్రిందకే రాగలదు. ఈ అర్థమును గీత

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణం"
(9-27)

అని చెప్పింది. అది ముక్తిహేతువన్న మాట.

596

అత్యుత్తమమూ, అత్యున్నతమూ, గుణశాసకమూ అయిన సంసిద్ధిని పొందిన పరమ పురుషుడు, సృష్టికర్తలో లీనమై సృష్టికర్తా, పాలకునిలో కలసిపోయి- పాలకుడూ, లయకర్తలో కలసిపోయి లయకారుడూ, సర్వములో కలసి సర్వజ్ఞుడూ, సర్వశాసకుడూ, సర్వమూ తానగలిగి, ఏమిటా లోటులేని పరిపూర్ణుడై ప్రకాశించగలుగుతాడు. అతనిని

గూర్చి ఆనందాది పదములు చెప్పజాలవు. అతడు వెలుగే, పరంజ్యోతియే! ఉనికియే సదసద తీతానందాద్వితీయ పరమ కారణాతీతమే.

597

నిరంజనుడంటే సాధనాంతర నిరపేక్షుడన్న మాట. అంజనం (కాటుక) నిధి నిక్షేపాదుల దర్శనానికి సాధనం. అట్టి సాధనాపేక్ష లేనివాడే అన్నింటిని చూచే ద్రష్ట- అంటే సాధనమూ, సాధ్యమూ, సాధకుడు అనే త్రిపుటి తానే అయినవాడని భావము.

598

జీవితంలో సత్యసాధన మనేది గొప్ప యోగం. జగత్కారణ సత్యాన్ని అవగాహన చేసుకొనడమనేది ఇంకా గొప్ప యోగం. మన ఉపనిషదృషులు అలాంటి యత్నాన్ని కొంతవరకు చేయబట్టే మనకీపాటిగానైనా జ్ఞానం లభించింది.

599

గురువులు 5 విధములుగా ఉంటారని గురుగీతా గ్రంథం అంటున్నది :-

శ్లో॥ గూఢో దృఢశ్చ, ప్రీతశ్చ మౌనేన సమాహితః,
సకృత్కామగత శ్చేతి పంచధా గురురీరితః॥

1. గూఢుడనగా తాను బ్రహ్మజ్ఞాన సంపన్నుడయిననూ, ఆ సంగతి నితరులకు తెలియనీయక, ఏ ఆశ్రమము లోనో, గుహాలోనో రహస్యముగా నుండువాడు.

2. దృఢుడనగా స్వస్వరూప స్థితినందియున్నను, తృప్తి చనక శిష్యుల నుద్ధరింప బోధాదులు చేయువాడు. ఇతడు పర్యటనము చేయుచు జ్ఞానమును లోకమున కందించును.

3. ప్రీతుడనగా బాహ్యదృశ్య సంబంధమును వీడి, భక్తులను తరింపచేయగలవాడు. తాను దృశ్యాతీతుడైనను ఇతడు దృగ్దృష్టి మాత్రముచే శిష్యుల నుద్ధరింప జాలును.

4. సమాహితుడనగా, తాను నిరంతర బ్రహ్మనిష్ఠుడయ్యు, ధ్యాన (సంకల్ప) మాత్రబలముచేత జగదుద్ధరణము చేయగలవాడు.

5. సకృత్కాము డనగా, దృశ్యప్రతీతి పూర్తిగా లేనివాడై ఒక్కమారు చేసిన సంకల్పము చేతనే లోకోద్ధరణము చేయగలవాడు.

600

"బీజం మాం సర్వభూతానాం విద్ధిపార్థ సనాతనం" గీత 7-10. ఒక పండులో గుజ్జు, రసము, తోలు, గింజలు ఉన్నప్పటికీ, బీజములే మరలా మొక్కలను పుట్టించకలుగుతాయి కాని రసము, గుజ్జు, తోలు, పుట్టింపలేవు. అలాగే శరీరములోకూడ రక్త మాంసాస్థి ధాతువులు ఎన్ని ఉన్నా, శుక్ర కణానికే శరీరాన్ని సృష్టించే శక్తి ఉంటుంది కాని, తక్కినవాటికి ఉండదు. అలాగే శరీరంలో శరీరం మొదలు కొని అహంకారం వరకు గల కోశాలు ఎన్ని ఉన్నా, అవి

అన్నీ చైతన్యమయ (రూప)ములు కావు. చైతన్యమనేది జ్యోతిః స్వభావం కలదై వీటన్నింటికంటే వేఱై ఆత్మ స్వరూపంగా ఉంటుంది. అదే సృష్టికి సనాతనమైన బీజమంటే. కాగా ఇక్కడ భౌతిక బీజం శుక్రకణమూ అధిభౌతిక బీజం ఆత్మ సత్తా అని సూక్ష్మంగా గ్రహించాలి.

601

విభూతియోగంలో భగవానుడు సారమైనదంతా తానని, నిస్సారము-పొల్లు-పొట్టు-తన యొక్క ఛాయ, లేక ప్రతిభాసమనీ చెప్పినాడు. అంటే మూలకారణం పరమాత్మ అనీ, దాని ప్రతిభాసమైన జగత్తేను కార్యమని చెప్పినట్లయినది. కార్యమునందు సక్తుడయితే సంసారమూ, కారణమందు సక్తుడయితే ముక్తి కలుగుతుందన్నమాట. జగద్బ్రహ్మల రహస్యాన్ని ఇలా బోధించింది గీత.

602

తాను గొప్పవాడు కావాలనే కోరికతో, ఏదో సాధించి ఇబ్బందులుపడి గొప్పవాడననిపించుకొన్న వాడికంటె, ఏ కోరికా పెట్టుకోనివాడే నిజమైన గొప్పవాడు. అయితే వీడికి ఆ గొప్పవాళ్ళవలె వారిని మించి తనకా భాగ్యం లేకపోయెనే అనే చింతకూడా ఉండకూడదు. అనాడే వాడు నిజంగా గొప్పవాడు.

603

దృశ్యమూ, ఉపాధి అయిన కారణ దేహాన్ని ఆత్మ

కంటే వేఱుగచేసుకొని అద్వైతంగా ఉండే స్థితి మిక్కిలి విచిత్రమైనది. సాధించదగినదీ అదే.

604

స్వస్వరూపస్థితి, స్వస్వరూపానుసంధానం అని రెండు విధాలు కలవు. తన స్వరూపము నందు తానే తానై యుండడం స్వస్వరూప స్థితి. తనయొక్క సచ్చిదానంద స్వరూపాన్ని తన మనస్సులో అనుసంధానం చేయడం స్వస్వరూపానుసంధానం. మొదటిదానిలో త్రిపుటికాని, ద్వంద్వాలు కాని ఉండవు. స్వస్వరూపానుసంధానంలో తాను, తన మనస్సు, తన మనస్సుతో ఆత్మను అనుసంధించడం అనేవి మూడూ ఉంటాయి. ఇది సాధనక్షేత్రం. స్వస్వరూప స్థితిలో తాను తప్ప ఏదీ ఉండదు. అది పరమాద్వైత భావం. ఉత్తమోత్తములైన సద్గురువులు దానియందే క్రీడిస్తూ ఉంటారు.

605

బూడిదే కదా అని నోటితో ఊదితే కన్నులలో పడుతుంది. అలాగే సాధువులు ఏమీ అనకపోయినా, వారికి ఎగ్గు చేసేవారూ, వారిని దూషించేవారూ వాటి ఫలాన్ని అనుభవించక తప్పదు.

606

కొందఱు శిష్యులు తమ గురువులను గూర్చి "నాకు ప్రాణాయామం కావాలి, కుండలినీ యోగం కావాలి, అజప గాయత్రి కావాలి, మహావాక్యాలు కావాలి, అచల పరిపూర్ణం కావాలి అని అడుగుతూ ఉంటారు. కాని అది

అంత మంచి పద్ధతికాదు. గురువే శిష్యుల అధికారాన్ని గుర్తించి వారికి ఏది అర్హమో దాన్ని ఉపదేశించి, మెట్టు తరువాత మెట్టుమీదికి ఎక్కించుకొంటూ కడతేర్చడం మంచిది.

607

"త్రీణ్యేక ఉరుగాయో విచక్రమే, యత్ర దేవాసో మదన్తి" (ఋ. 8-30-7) ఉరుగాయః : లెస్సగా కీర్తింప బడెడు అఖండ పరబ్రహ్మము. ఏకః=ఒక్కడే, త్రీణి = స్థూల, సూక్ష్మ కారణము లనెడి మూడు దేహములను, విచక్రమే=ఆక్రమించెను. అనగా ఏకైక పరబ్రహ్మము తానే తనయందు తోచిన దేహత్రయమున విశ్వ, తైజస, ప్రాజ్ఞ రూపములతో ప్రవేశించెనన్నమాట. ఈ అంశమునే విశ్వకర్మ సూక్తము "య ఇమావిశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా నిషసాద పితా నః, స ఆశిషా ద్రవిణ మిచ్ఛ మానః పరమచ్ఛదోఽవర ఆవివేశ" అనే మంత్రమూ చెప్పినది. అట్లే విశ్వకర్మ సూక్తము "యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మ న్నుతేమా" అన్న ప్పుడు కూడా అచ్చటి త్రిధామములు స్థూల సూక్ష్మ కారణములని కూడా చెప్పుకొనవచ్చును. కాగా విష్ణు, రుద్ర, విశ్వకర్మ మంత్రములలో చెప్పబడిన మూలతత్త్వము ఒక్కటే అనెడి సారాంశము లభింపగలదు.

603

ఆది లేనిదీ, అంతము లేనిదీ అయిన వస్తువును పట్టుకొనడం తేలిక. ఎందుకనంటే, అది ఎక్కడబట్టినా ఉంటుంది. దొరుకుతుంది. ఆది, అంతం ఉన్న వస్తువులు అంతటా ఉండలేవు. కనుక వాటిని ఎక్కడ ఉన్నవా అని వెదకుకొనవలసి వస్తుంది. ఆ వెదకులాట దేశకాల పరిచ్ఛిన్నమై ఉంటుంది కదా. అందుకే జగత్కారణ పరమాత్మను అనాదీ, అనంతమూ అన్నారు అనుభవజ్ఞులు. అది శరీరేంద్రియ ప్రాణాది సమస్త స్వరూపములనూ తాల్చియే ఉన్నది. కాన ఏ ఒక్కదాన్ని నీవు గ్రహించినా ఆత్మను గ్రహించినట్లే అవుతుంది.

609

భగవంతుడెపుడూ తన ప్రేమను భక్తులమీద వర్షిస్తూనే ఉంటాడు. కాని భక్తులే ఆ ప్రేమకు పాత్రులయ్యేలాగ ప్రవర్తించలేరు. గురువుకూడ అలాగే దయాదృష్టిని కురిపిస్తూనే ఉంటాడు. కాని శిష్యులు దాన్ని అందుకునేటట్లు నడచుకోలేరు.

610

భేదం సత్యమనుకొనడం అవిద్య. అభేదం సత్యమనుకొవడం విద్య.

611

జాన్‌రస్కిన్ అనే ఆంగ్లవేత్త ఆదర్శ మానవుడు. అతని "అన్ టు ది లాస్టు" అనే పుస్తకాన్ని చదివి, గాంధి

గారు ఎంతో నేర్చుకొన్నారు. ఆయన సిద్ధాంతాలు కొన్ని ఇవి :-

1. హస్త కర్మ, కృషి కర్మ చాలా గొప్పవి. దాన్నిబట్టి సమాజంలో శిల్పమూ, కృషి గొప్పవి అవుతున్నాయి.
2. ఎవరు కాని శరీరకష్టం చేసి, జీవించాలే కాని, యాచనా జీవి కారాదు. పరాన్నజీవి అధముడు.
3. సమాజంలోని మానవులలో హెచ్చుతగ్గులు చూపడం మిక్కిలి అన్యాయం.

612

'కా' అంటే సరస్వతి. 'మా' అంటే లక్ష్మి. వారిద్దరికీ ప్రభ్వి (స్వామిని) అయిన తల్లియే కామేశ్వరి అంటే- కామములకు, కోరికలకు తల్లి- తీర్చేది అని అర్థం ఉండనే ఉన్నది

613

శ్లో॥ అభేద దర్శనం జ్ఞానం, ధ్యానం నిర్విషయం మనః,
స్నానం మనోమలత్యాగః, శౌచ మింద్రియ నిగ్రహః.
(స్కందోపనిషత్తు)

సర్వమును భేదరహితంగా చూడడమే జ్ఞానం. మనస్సును విషయవాసనా రహితం చేసుకోవడమే ధ్యానమంటే. ఇక స్నానమంటే మనస్సును మాలిన్య రహితంగా ఉంచుకోవడమే. ఇంద్రియాలను అదుపులో పెట్టుకోగలిగితే అదే పారిశుధ్యమవుతుంది.

614

బీజసారమే మ్రానూ, కొమ్మా, రెమ్మా, ఆకులు, పూలు, పండ్లు, గుజ్జు, విత్తనం అని తెలుసుకొనగలిగితే, భగవంతుడే ఆకాశాది భూతములు, చరాచర ప్రాణులూ, విశ్వమంతా అని తెలుసుకొనగలుగుతావు.

615

"త్ర్యంబకం యజామహే" అన్నప్పుడు అంబిక శబ్దానికి సాధనమనే అర్థాన్ని చెప్పుకొని స్థూల, సూక్ష్మ కారణ శరీరాలను సాధనాలుగా చేసుకొని ప్రకాశించే జీవాత్మను తెలుసుకొమ్మనే భావమును సాధించడం ప్రయోజనకారి.

616

మానవులలో మతదృష్టికంటె తత్త్వదృష్టీ, దేవతా దృష్టికంటె మానవదృష్టి, ఆత్మదృష్టీ, పరలోక దృష్టికంటె ఇహలోకదృష్టీ, భవిష్యజ్జన్మ దృష్టికంటె వర్తమాన జన్మలోనే బాగుపడాలనే దృష్టి కలగడం మంచిది.

617

మతాన్ని తత్త్వమనుకొనడం పెద్ద పొరపాటు. మతం కొన్ని నియమనిబంధనలకు కట్టుబడి ఉంటుంది. తత్త్వమనేది సత్యానికి కట్టుబడి ఉంటుంది.

618

కొందరు భూమిని స్వర్గానికి ఎత్తాలని యత్నిస్తారు కాని భువిని దివిగామార్చే ప్రయత్నం చేయదగ్గది. ఏలయన, భువి అనేది దివియొక్క ఛాయయేకాని ఇతరంకాదు. అందు

వల్ల భూమిమీద ఉన్న నీవు అక్కడకు పోనక్కరలేదు. భువిని దివిగా మార్చుకుంటే సరిపోతుంది. అది నీ చేతనైన పనే. నీయత్న ఫలితమే.

619

"పృథి వ్యన్తరిక్షం ద్యౌః" అని వేదం అన్నది. దాన్నే (ఆ భూమ్యన్తరిక్ష దివములనే) అధమ, మధ్యమ, పరమ ధామములుగాను, త్రి-అంబకములు (త్ర్యంబకం)గాను విష్ణునియొక్క మూడుస్థానములుగాను, వేదం పేర్కొన్నది. వాటిని మనం స్థూల, సూక్ష్మ, కారణ దేహములుగా అర్థం చేసుకోవాలి. వాటిలో (బాహ్యాంతరములు) పాలలో వెన్న లాగ ఉన్నతత్త్వమును సాక్షాత్కరించుకోవాలి. ఇదే సమస్త వేదవేదాంతములసారమున్నూ.

620

పృథివ్యన్తరిక్ష- ద్యులోకములను పేర్కొన్న వేదమే అందు క్రీడించువాటిని "అగ్ని ర్వాయు రాదిత్యః" అన్నది. అంటే పృథివిమీద అగ్ని, అంతరిక్షాన వాయువు, దివమున ఆదిత్యుడు అన్నమాట. ఆధారమనే పృథివియందు గల అగ్నిరూప కుండలిని మేలుకొల్పి, అనాహతమనే అంతరిక్షాన గల వాయువుతో అనుసంధింపచేసి, అవల సహస్రారస్థ పరమాత్మ రూపాదిత్యునితో ఐక్యపరచవలె. ఈ ఆదిత్యుడే సవిత. అందువల్లనే త్రిధామములలో అగ్ని, వాయు- ఆదిత్యులకు ప్రాధాన్యం.

621

నిన్ను నీవు తెలిసికొంటే భగవంతుని గూర్చి వెంటనే తెలుస్తుంది. నిన్నే నీవు తెలుసుకోనినాడు నీకేమీ తెలియనట్లే లెక్క.

622

ద్వైతాద్వైత విశిష్టా ద్వైతాదులు, ఆ యా దృక్పథాలే కాని, సిద్ధాంతాలు మతాలు కావు. వీటిని సృష్టించిన వారి దృక్పథాలే అవి.

623

ప్రకృతియందు ప్రాకృతిక గుణాలతో సంచరించడం అజ్ఞానం. ఆ ప్రకృతియందే బ్రాహ్మిస్థితితో వర్తించడం జ్ఞానం.

624

కూటము అనగా పంచభూతములు, జ్ఞానకర్మేంద్రియ దశకము, మనోహంకార బుద్ధి ప్రకృతులు, శబ్దాది పంచకము, ఇచ్ఛాద్వేష సుఖ దుఃఖ దైన్యాదులు అన్నమాట. ఇట్టి కూటమునందు ఉన్నవాడే కూటస్థుడు. ఈ కూటమునకు క్షేత్రమనికూడ పేరు. కూటస్థుడన్నను, ప్రత్యగాత్మడన్నను, పురుషుడన్నను ఒకటే. ఇతడు అక్షరుడు, సాక్షి, ఇత్యాది నామములచేతగూడ పిలువబడును.

625

మాయ లేదు అంటే బ్రహ్మమువలె నిత్యమై లేదు అని అర్థంకాని, అసలు లేదని అర్థం కాదు. అది బ్రహ్మము

మీద తోచే ఒకానొక స్ఫురణ. ఆ స్ఫురణ ఉన్నప్పుడు, జగత్తు పుట్టి పనిచేస్తుంది. లేనప్పుడేమో ఆ బ్రహ్మంలోనే కలిసిపోతుంది- సముద్రంలో తరంగాలులాగ, మట్టిలోను బంగారులోను తద్వికారాలులాగ.

626

అగ్ని వ్యక్తం కావాలంటే కొయ్య మొదలైన ఉపాధులు అవసరం. అలాగే ఆత్మ అభివ్యక్తం కావాలంటే అంతఃకరణమనే ఉపాధి కావాలి. కొయ్యకు సంబంధించిన ఉపాధి రూపం రూపరహితమైన అగ్నికి సంక్రమించినట్లు అంతఃకరణోపాధి యొక్క వికారాలున్నూ ఆత్మకు ఉన్నట్లు తోస్తాయి.

627

"ఏకం సద్విప్రా బహుధా వదన్తి" అంటే ఒకే సత్పదార్థమును మేధావులు తమ దృష్టిని జ్ఞానానుభవాలను బట్టి అనేకవిధాలుగా ప్రవచనం చేస్తారని భావం. అనగా బుద్ధ, నాగార్జునాదులు అనేక విధాలుగా వికల్పిస్తారని తేలుతుంది. అగ్ని వరుణాదులుగా భావించడమే కాక భిన్నభిన్న దార్శనిక మార్గాలున్నూ వస్తాయని భావం.

628

బ్రహ్మం రెండు విధాలు. జగద్రూపము, కేవల రూపము. కేవల బ్రహ్మము ఆత్మస్వరూపమే. జగద్రూప బ్రహ్మము ఉపాదేయము, అనుపాదేయము అని రెండు విధాలు. ఆరాధనీయములన్నీ ఉపాదేయములు. విసర్జ

నీయములన్నీ అనుపాదేయములు. ఉపాదేయములతో మనం క్రీడింపవచ్చును. అనుపాదేయాల స్పర్శ పనికిరాదు. అది హింస్రములైన వ్యాఘ్రసర్పాదులు. వాటిని విసర్జించుటయే ఆరాధనము. కేవల బ్రహ్మమీ ద్వంద్వములకు అతీతము.

629

సత్త అనేది వ్యావహారికమూ, పారమార్థికమూ అని రెండు విధాలు. జగత్తు వ్యావహారిక సత్త కలది. బ్రహ్మము పారమార్థిక సత్త కలది. పారమార్థిక సత్త త్రికాలా బాధ్యము. వ్యావహారికసత్త దానికి భిన్నమై ఒకప్పుడు మాత్రమే ఉండేది. ఇందుకు జాగ్రదాద్యవస్థలే ఉదాహరణ ములు. అవస్థలు, ఆకర్తలు, ఆజగములు అప్పుడప్పుడు మాత్రమే ఉంటాయి. వీటన్నింటినీ చూచే సాక్షి సర్వకాల సర్వావస్థల యందూ ఉంటాడు. తదతీతుడై ఉంటాడు.

630

"దృష్టిం జ్ఞానమయీం కృత్వాపశ్యే ద్బ్రహ్మమయం జగత్". నీ దృష్టి బ్రహ్మజ్ఞానమయ మయినట్లయితే, జగ త్తంతా నీకు పరబ్రహ్మమయంగానే గోచరిస్తుంది. కనుక దృష్టి మారవలసి ఉన్నది. దృష్టి మారితే నడవడి మారుతుంది.

631

"ఏకోరసః కరుణఏవ నిమిత్తభేదా ద్భిన్నః పృథక్పృథ గివ శ్రియతే వివర్తాన్ ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారా నంభో యథా సలిలమేవహి తత్సమస్తం" అన్న

భవట్టారీ వివర్తవాద ప్రణయిగా కనబడుతున్నాడు. జలం తరంగాదులుగా వివర్తించినట్లు బ్రహ్మంకూడ, ఆకాశాది భూతాలుగా, ప్రపంచంగా వివర్తిస్తున్నది. ఇదే స్వర్ణభూషణ న్యాయం అన్నమాట.

632

ఒకపరి జగముల వెలికిని, ఒకపరి లోపలకు గొనుచు నుభయము తానై సకలార్థ సాక్షియగు నయ్యకలంకుని నాత్మమయుని నర్థి తలంతున్". ఈ పద్యములో ఉభయము తానై అనే మాటలో అద్వైతం ఉన్నది. సకలార్థ సాక్షి అనేమాట పరమేశ్వరుని సాక్షిత్వాన్ని చాటుతున్నది. ఈ విషయాన్నే గీత "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా" అని సృష్టి ప్రళయాలు రెండూ తన స్వరూపమే అని చెప్పినది. "మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ" అని అంతా తన స్వరూపమే అన్నాడుకూడా గీతాకర్త.

633

నీవు మనస్సుతో ఆలోచిస్తున్నావంటే కేవల మనస్సు ఆలోచించడం లేదు. చైతన్యంతో గూడిన మనస్సు ఆలోచిస్తుందన్నమాట. ఆలాంటి మనస్సులోనే అందులోఉన్న చైతన్యశక్తినిగూడ గమనించాలి. అంటే తనలో కలసిఉన్న చైతన్యాన్ని దర్శించాలి అన్నమాట. అప్పుడు ఏది గ్రహించినట్లు? మనస్సా, చైతన్యమా, రెండూనూ. అలాంటి చైత

న్యాన్ని నీవనుకొనడమే. నీమీద నీవు నిలవడం. అప్పుడు ఏమవుతుంది? మనస్సు చైతన్యరహితమైతే ఇక అది సంకల్పాదులు చెయ్యలేదు. తనలో ఉన్న చైతన్యంతోనే అది లీనమై (కలసిపోయి) ఊరుకొంటుంది. దీన్నే ఆత్మైక్యం, బ్రహ్మైక్యం అంటారు. అమనస్క స్థితి అనికూడా అన వచ్చు. అమనస్కమైనపుడు మిగిలేది కేవలాత్మయే కాని భిన్నం కాదు. ఈస్థితి సృష్టి, స్థితి, లయాదులు లేనట్టి ఆదిమ స్థితి. దీన్నే "నాప దాసీ న్నోస దాసీత్" అని ఋగ్వేదం వర్ణించింది. అంటే అపుడు నీవు ద్వంద్వాలతోను, త్రిపుటితోను సంబంధం లేని సర్వాతీతుడవై నావన్నమాట. ఇవుడు చూడు. మనస్సనేది నీ ఆత్మనుండి కలిగిన ఒక కిరణమే అవుతుంది. ఆ సంచలనం వల్ల నీవు చలించినట్లు భావిస్తున్నావు. అంతేకాని నీకు స్వతఃచలన మనేది లేనేలేదు. నీవు "అచలోయం సనాతనః" అన్నట్లు నిశ్చలుడవు, శాశ్వతుడవు. నీవు అచల శాశ్వతత్వాలు కలవాడవు. కనుకనే నీనుండి చలనమూ, అశాశ్వతాలూ ఎన్నో కలుగుతున్నాయి. ఈ అంశాన్నే మన వేదాంతశాస్త్ర వాఙ్మయం అనేక విధాల బోధిస్తున్నది. నిర్గుణుడవైన నీనుండే గుణాలు కలుగుతున్నాయి. కలిగి నిన్ను భ్రాంతిపాలు చేస్తున్నాయి. ఆ గుణాల కన్నింటికీ అధిపతివి నీవే. వాటిని నీమీద ఆరోపించుకొని నీవు సంసారాన్ని సృష్టించుకొంటున్నావు అందులో బంధింపబడినట్లు భావిస్తున్నావు. ఆ భావనను నీ

నుండి తొలిగించేదే నీ సద్గురుమూర్తి బోధ. దాన్ని అనుస రించే నీ సాధన.

634

రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అంతఃకరణ చతుష్టయమునకు ప్రతీకలు. రాముడే బుద్ధి. భరతుడే మనస్సు. లక్ష్మణుడు అహంకారము. శత్రుఘ్నుడు చిత్తము. రామునిలో సత్త్వగుణము, భరతునిలో రజోమిశ్రమైన సత్త్వ గుణము, లక్ష్మణునిలో రజస్తమః ప్రధాన సత్వము, శత్రు ఘ్నుని యందు త్రిగుణములు కలవు.

635

భూత, భవిష్య, ద్వర్తమానములనే మూడు కాలాల యందు జన్మ, స్థితి, వృద్ధి, క్షయములు లేకుండా ఉండేదే నిత్య సత్యవస్తువు. దాన్నే ఋతము (Reality) అన్నారు. "ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళం" అనీ, "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం" అనీ చెప్పబడిన తత్త్వం అదే. ఆ శాశ్వత సత్యమున జన్మ, స్థితి, వృద్ధి, హ్రాసాది వికారాలు గల విశ్వం తోస్తుంది. కాని ఇది శాశ్వతం కాదు. ఆ మూలవస్తువు యొక్క ప్రతిభాస మాత్రమే ఇది. అది లేకపోతే దీనికి ఉనికే ఉండదు. కనుక దీనిని దానియొక్క లీల, లేక ప్రతిభాస అనవచ్చు. నీవనే వాడు ఈ ప్రతిభాసలోని వాడే. అయితే అతని మూల స్వరూపం మాత్రం దానికంటే భిన్నం కాదు. విశ్వంలో విశ్వమూలసత్త, విశ్వమూ ఉన్నట్లు నీలోకూడా మూల

సత్తు, నీ బాహ్యరూపము రెండూ ఉన్నాయి. అలా అగపడ డం ఆ మూలవస్తువు యొక్క స్వభావం. ఈ రహస్యాన్ని తెలిసికొని అనుభూతి పొందడమే తత్త్వజ్ఞానం యొక్క గమ్యం.

636

సద సద్విచారణ.

ఋగ్వేదములోని నాసదీయ సూక్తము సృష్టికి పూర్వ మున్న వస్తువును సత్తనికాని, అసత్తనికాని చెప్ప వీలు కాదన్నది. దీనినిబట్టి అది సదసత్తులకు అతీతమని భావింప వలసి యున్నది. అనగా అది సత్తుకాని, అసత్తుగాని కాక, తననుండి ఆ సదసత్తులు వెలువడుటకు, వీలైన వస్తువని భావించుట సమంజసము. అట్లు భావించుటవలన అది సద సల్లక్షణములుకల జగత్తునకు మూలపదార్థమగుటకు వీలు కలుగును. అంతేకాక, సదసద్విభాగము ఏర్పడిన పిదప సత్తు నుండి అసత్తుకాని, అసత్తు నుండి సత్తుకాని, పుట్టుటకు, వ్యక్తమగుటకు కూడ వీలుకలుగును. సృష్టి రహస్యమును విచారించి చూచినచో అసత్తు అయిన ప్రకృతినుండి సదా త్మకమైనవి పుట్టుట కాంచుచున్నాము. ఈ అంశమునే తైత్తిరీయోపనిషత్తు "అసద్వా ఇద మగ్ర ఆసీత్" మొదట ఇదిఅంతయు అసత్తే అయిఉన్నదని చెప్పి "తతో వై సదజా యత" దానినుండి సత్తు కలిగినదన్నది. "అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే అన్నాత్పురుషః" అనే వాక్యములు కూడ ఆ సద్వస్తువు నుండియే సద్రూపము వెలువడినట్లు చెప్పుచున్నవి.

ఇక "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయం" అనెడి వాక్యములు సదసద్రూప వస్తువు నుండి సత్తు పుట్టుటను వ్యక్తీకరించుచున్నవి. కనుక సదసదీలీతము నుండి సత్తు, బ్రహ్మము, ఆత్మ, పురుషుడు, విశ్వకర్మ అను పదములచే పేర్కొనబడిన సదాత్మ ఉద్భవించినదన్నమాట. మరల ఆ సదాత్మ నుండియే ఆకాశాది జడతత్త్వములు పుట్టినవి.

ఈ అంశమునే తైత్తిరీయోపనిషత్తు "ఆత్మన ఆకాశస్సంభూతః" ఇత్యాదిగా మొదలిడి "పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నాత్పురుషః" అని చెప్పినది. ఇక్కడ పురుష శబ్దముచే చెప్పబడినది శరీర విశిష్ట జీవుడన్నమాట. ఈ వర్ణన మదీయ శిల్పదర్శనము నందు కానవచ్చును. ఈ స్థితినే చిజ్జడముల సమ్మేళనముగా పేర్కొనవచ్చును. దీనినే "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య" సద్వస్తువు కలదని మాత్రి వాక్యములు పేర్కొన్నవి. కాగా జీవోత్పత్తి అనునది అహరాగమము (పగలు) వంటిదగుచున్నది. ఇదే వ్యక్త స్థితి. బ్రహ్మము యొక్క ప్రతిభాసము తోచిన దశ. తొలుత చెప్పుకొన్న 'నాసదాసీ న్నోసదాసీత్' అన్నట్టిది రాత్ర్యాగమము. ప్రళయానంతర స్థితి. దీనినే అవ్యక్తదశ అన్నది గీత. "అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః" కాగా ఇప్పుడు చూడుడు. జాగ్రత్తు, సృష్టి, స్థితులు. సదసత్తులు వ్యక్తమైన దశ. స్వప్న సుషుప్తులు నిద్రాదశ. అది ప్రళయమునకు సంకేతము. ఆ దశలో సదసత్తులు, నిద్రావస్థలో నుండు

సన్నమాట. కేవల సన్మాత్ర దశ సమాధి స్థితి. దీనినే తురీయ మనవలెను. అవ్వలిది "నాసదాసీ న్నోసదాసీత్" అన్నట్టి తురీయాతీత స్థితి. కాగా ఇప్పుడు 'సృష్టి నుండి 2, 3 స్వప్న సుషుప్తి (ప్రళయము) లనెడి లయదశకు పోయి అవల 4వ దైన సమాధిస్థితి నుండి తురీయాతీత స్థితికి పోవుట పర మార్థము. నాసదాది సూక్తస్థితితో ప్రారంభమయిన సృష్టి విధానము మరల ఆకావునకు, లేక ఆస్థితికి చేరిననేకాని సమాప్తము కాదు. మానవజీవి సాధింపవలసిన ఉద్గతి- ఊర్ధ్వ ప్రయాణము ఇదియే. ఈ అంశమునే సృష్టి సూక్త (నాసదీయ) విశ్వకర్మ సూక్త, మోతు సూక్తములు ప్రవచించుచున్నవి. ఏ పరమ కారణము నుండి నరుని రాక ప్రారంభమయినదో ఆ పరమ కారణమును చేరుకొన్ననాడే, తెలిసికొన్ననాడే దానికి పరిసమాప్తి. దీనినే కఠవల్లి "సోఽ ధ్వనః పార మాప్నోతి" "తద్విష్ణోః పరమం పదం" అని చెప్పినది. దానిని "సదాపశ్యన్తి సూరయః" అని ఋక్కు చెప్పినది. "న తం విదాథ, య ఇదం జజాన" అని విశ్వకర్మ సూక్త మన్నది. యజురారణ్యకము నందలి పురుష సూక్త మేమో "త మేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ" అన్నది. "మా ముపేత్య పున ర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం, నాప్నువంతి మహాత్మానః సంసిద్ధం పరమాం గతాః" అన్నది గీత. ఇంతకూ తేలిన సారాంశము జనుడు కానటనుండి వచ్చెనో, దాని నెఱింగి

తద్రూపుడు కావలసియున్నాడు. ఈ జ్ఞానము కలుగనిది అతని భయసందేహములు తీరవు. అవి తీరనంతవరకు శాంతి సౌఖ్యానందములు కలుగవు. అందుకే వేదాలను చదువ వలయును. అర్థమును పర్యాలోచింపవలెను. అనుష్ఠింపవలెను. గమ్యమును చేరవలెను. ఇక్కడ ఇంకొక అంశము ఆలోచింపవలసి యున్నది. సదసదతీత వస్తువు మీద ఈ జగత్తు త్రాటిమీద పామువలె తోచుచున్నదా! లేక అది పరిణామ ప్రక్రియలో ఆకాశాది భూతభౌతికాది వస్తువులుగా మారుచున్నదా అనునదే ఆలోచనీయాంశము. మాయావాదులు రజ్జు సర్పభ్రాంతిని ఉదాహరణముగా చెప్పి బ్రహ్మము జగత్తుగా తోచుచున్నదనుచున్నారు. కాని దివ్యపరిణామ వాదులు (అరవిందాదులు) మూలవస్తువు సర్వశక్తి గనుక అది పరిణామము చెందినను దానికి కలిగెడి నష్టమేమియు లేదనుచున్నారు. అనేకులు పరిణామ సిద్ధాంతమునే ఆదరించుచున్నారు. భౌతికవాదులుకానీ, హేతువాదులు కానీ పరిణామ వాదమునే అనుసరించుచున్నారు. జగత్తు సత్యమే కాని, అసత్యము కాదనుట వారికిష్టము. ఈ రెండు వాదముల నటుంచి వివర్త సిద్ధాంతమును బట్టి ఇంకొకరీతిగా భావించుట మరికొందరు తాత్త్వికుల అనుభవముగా నగపడుచున్నది. జగత్తు మూలవస్తువు యొక్క వివర్తమనుటలో వారు చెప్పు రీతి ఇది : వస్తుతః మూలవస్తువు పరిణమించినను అది తానుకాకుండా పోలేదు. తాను తానుగా నుండియే అది మార్పులను చూపుచున్నది. బంగారము బంగారముగా

నుండియే వస్తువులుగా తయారగుచున్నది. అది వగ అయి నప్పుడు ధరింపవచ్చును. కత్తిగా పరిణమించినపుడు కంఠము నుత్తరించుకొని, మరణము నందవచ్చును. ఇట్లే వైవిధ్యమే కాని, మూల వస్తువునకు నిత్యమైన మార్పు లేదని వీరి భావము.

"అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః స్తమాహుః పరమాం గతిం
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ".

గీత 8.21.

అవ్యక్తము రెండు విధములు. ఒకటి జగత్తులకు మూలభూతమైన ప్రకృతి. ఇది పరిణమించునని బ్రహ్మవాదు లందురు. వారి దృష్టిలో మఱొక అవ్యక్తము అక్షరాత్మక పరబ్రహ్మమే. అదే ప్రకృత్యాదులకు గూడ పరమగతి యైనది. వాటిని తనలో లీనమొనర్చుకొనగలిగినది. దానినే ఈ శ్లోకము సర్వులు పొందదగిన పరమగతిగా చెప్పినది. దానిని అనగా ఆ బ్రహ్మమును పొందినవారు తిరిగి రారని భావము.

637

"త్ర్యంబకుడు"

మూడు కన్నులు గలిగి త్రిశూలధారి అయిన ముక్కంటి వెలుపల ఉండి పూజల నందుకొనేవాడు. స్థూల, సూక్ష్మ, కారణ దేహములనే మూడు సాధనములను లేదా మనోవాక్కాయములనే మూడు సాధనములను కలిగిఉన్న ఆత్మదనే త్ర్యంబకుడు తన శరీరములోనే తానుగా

ఉన్నవారు. చతుర్వింశతి తత్త్వాలకంటే భిన్నుడై వెలుగై తనలో ఉన్నవానిని వెదకి తద్దర్శనం చేసికొనడమే ఈశ్వర దర్శనంకాని అన్యదర్శనంకాదు. వాని ఆరాధనే శివారాధన. వాటి పూజయే శివపూజ. వారు అందరిలోను చైతన్యరూపులై ఉన్నారు కాన అందరియొక్క అర్చనే శివార్చన అవుతుంది. ఆ శివార్చనను చేయాలి కాని గుడిలోనికి వెళ్ళి అభిషేకాదులు చేయించటం కాదు తత్త్వవేత్తలు చేయదగిన పని.

638

జగత్కారణ బ్రహ్మము ఏల అనంతమైనది? ఏ వస్తువు చిన్నదై ఉంటుందో అది ఏనాటికైనా పెద్దదికూడా అవుతుంది. పెద్దదయినదానికి చిన్నది కావడం కూడా స్వతస్సిద్ధమైన ధర్మమే. ఈ చిన్న పెద్దలనేవి వస్తువుల యొక్క ధర్మములైనప్పుడు వాటికి నశించడమనే గుణంకూడ తప్పదు. నశించిన వస్తువు ఆ రూపంతో కాని, మరొక రూపంతో కాని పుట్టితీరాలి. దీనివల్ల చావు పుట్టుకలు, వృద్ధి క్షీణతలు, స్థితి పరిణామాలు (మార్పులు) అనే ఆరు ధర్మాలు వస్తువులకు తప్పటం లేదు. అందువల్లనే ఈ ఆరు లక్షణాలు గల జగత్తును షడ్భావ వికారాలు గలది అంటున్నాము. ఈ లక్షణాలు లేకుండా ఉండాలి అంటే, అది అనంతం అయితీరాలి. అనంతం, పరిపూర్ణమూ ఎప్పుడు అవుతుందో అప్పుడు దానికి పెరగడం ఉండదు. ఒక వస్తువు పెరగవలెనంటే అది పెరగ

టానికి వీలు కలిగించే ప్రదేశం ఇంకొకటి ఉంటేనే కాని ఆ పని జరగదు. బ్రహ్మములేని ప్రదేశం కాని, కాలంకాని, లేనే లేదు గనుక అది పెరగడం అనే ధర్మాన్ని ప్రకటించ టానికి వీలు లేదు. పెరగడం ఎప్పుడు ఉండదో ఆ వస్తువుకు తరగడమూ ఉండదు. ఈ వృద్ధి క్షీణతలు లేనిదానికి చావు పుట్టుకలు గూడా ఉండడానికి వీలులేదు. ఈ నాలుగు ధర్మాలు లేనప్పుడు పరిణామాదులు కూడా ఉండవు. ఏతా వతా బ్రహ్మము అనంతము, నిర్వికారము, సర్వపరిపూర్ణము, సర్వ వ్యాపకమూ, సర్వాత్రగము, అచలమూ అవుతున్నది. ఈ లక్షణాల నన్నిటిని జగత్కారణ వస్తువునకు వేదోప నిషత్తులు వర్ణించినవి. నాసదీయ సూక్తము ఈ లక్షణా లన్నింటిలో కూడ అది అసత్తని కాని, సత్తనికాని చెప్ప డానికి వీలుకాని అనిర్వచనీయమని కూడా అన్నది. అలాంటి దానిమీదనే పరిచ్ఛిన్నమైన అవ్యక్తము, లేక ప్రకృతి, తమస్సు తోచినది. లేక పుట్టినది అన్నది. ప్రకృతికి జన్మ ఉన్నది కనుకనే అది మరణాన్ని, నాశనాన్ని గూడా పొంది తీరుతుంది. జన్మస్థితి నాశనములున్నవి గనుకనే అది సగుణ మైనది. ఆ గుణముల యొక్క సాంకర్యము వల్లనే సృష్టిలో వస్తు వైచిత్రి ఏర్పడుతున్నది. ఆత్మనుండి ఆకాశాదులు పుట్టినవనడం. పృథివి నుండి ఓషధులు, అన్నమూ, వాటి నుండి జీవులూ పుట్టినారనడం ఇత్యాదులు పరిచ్ఛిన్నమైన సృష్టి వర్ణనలలో మనం చదువుతున్నాము. ప్రకృతిలో ప్రత్యక్షంగా చూస్తూనూ ఉన్నాము.

అయితే ఇక్కడ ఇంకొక దృష్టితో గూడ విచారించాలి. ఏ కార్యవస్తువు, ఏ కారణ వస్తువునుండి పుట్టుతున్నదో అది దానికంటె భిన్నం కావటానికి వీలులేదు. ఇది శాస్త్ర సమ్మతమైనట్టి సిద్ధాంతం. మట్టినుండి కలిగిన ఘటాదులు, మట్టికంటె వేరుకావు. బంగారు నుండి కలిగిన నగలు, బంగారం కంటె వేరుకావు. కాకపోగా ఆ కార్యముయొక్క సృష్టి, స్థితి, లయాలు ఆ కారణాన్ని ఆశ్రయించే జరుగుతాయి. బంగారాన్ని తొలగిస్తే భూషణం సృష్టి కాదు, నిలువనూ నిలువదు. చివరకు అది బంగారంలోనే లీనమవుతుంది కూడ. కనుకనే కారణమనేది కార్యమునకంటె భిన్నము కావడానికి వీలులేక విశ్వబ్రహ్మమే అయి విశ్వబ్రహ్మోపాసన చేయవలసిన అవసరం ఉపాసకులకు కలుగుతున్నది.

ఈ రహస్యాలను నాసదీయ సూక్తము, విశ్వకర్మ సూక్తము బహురీతులుగా వర్ణించి చెప్పినవి. చివరకు జగత్తులో ఒకడనైన నీవు, ఆ జగత్తు యొక్క క్రీడలో కూరుకొనిపోయి, నిన్ను నీవే మరచినావంటున్నది. "న తం విదాథ య ఇదం జజాన" అనే వాక్యం. ఈ వాక్యం ఆదిమానవుని జగద్విచారణ కోసం ప్రేరేపిస్తున్నదా లేదా! అలా ప్రేరేపించి చివరకు "యో నః పితా జనితా యో విధాతా" అని చెప్పి ద్యావా పృథువులను (భూమ్యాకాశములను) సర్వ భువనాలనూ సృష్టించి జల, నదీ, సముద్రములకు జనకుడైన ఆ విశ్వకర్మను- ఆ సర్వపితను ఆరాధించి అంటె విచారించి

తెలిసికొని ధన్యులు కండంటున్నది "సముద్రాయ వయునాయ... సిత్రేజు హుతా విశ్వకర్మణే విశ్వాహా మర్త్యగం హవిః" జగత్కారణ పరమార్థ మేదికలదో, ఏది నీ హృదయంలో జీవరూపంగా, చైతన్యంగా, వెలుగుతున్నదో, దాన్ని తెలిసికొని ఆరాధించి ఆ వస్తువు నీవుకావాలి అని ఆ విశ్వకర్మ సూక్తము చెప్పుతున్నది.

639

"ఆత్మన ఆకాశ స్సంభూతః" ఇత్యాదిగా ఆకాశాదుల సృష్టి వర్ణింపబడినప్పుడు, ఆ ఆకాశంలో ఆత్మలేదనీ, కేవలం జడమైన ఆకాశం పుట్టిందనీ అర్థంకాదు. ఆ ఆకాశం లోని ఆత్మ అనభివ్యక్తం. అంటే దాన్ని అనభివ్యక్త చైతన్యమని గ్రహించాలి. అలాగే ఆత్మనుండి కలిగిన సృష్టిలో అంతటా బహిరంతరాలలో ఆత్మలేకుండ లేదు. అలాగే "అన్నా త్పురుషః" అన్నప్పుడు కూడా కేవలాన్నం కాదు పురుషుడయినది. ఆత్మ తత్త్వ విశిష్టమైన అన్నపరిణామమే పురుషుడన్నమాట.

640

"రజోజుషే జన్మని, సత్త్వవృత్తయే
స్థితౌ ప్రజానాం, ప్రళయే తమోజుషే,
అజాయ జన్మస్థితి నాశహేతవే
త్రయీమయా యత్రి గుణాత్మనే నమః"

(బాణ మహాకవి)

పుట్టడమంటూ లేని జగత్కారణ తత్త్వం జగత్తుగా రూపొందేటప్పుడు రజోగుణాన్నీ, స్థితివేళ సత్త్వగుణాన్ని, ప్రళయకాలాన తమోగుణాన్ని పొంది ఆయా పనులను నిర్వహిస్తున్నది. అది త్రయీమయం కూడ. దాన్నే తెలుసుకోవాలి

641

అర్థం కానిదే వేదాంతమంటే. అర్థమయ్యేదంతా ప్రకృతికీ, అపరానికీ సంబంధించినదే. అందుకే ముండకం "తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వవేదశ్శిక్షా కల్పో వ్యాకరణం, నిరుక్తం ఛందో జ్యోతిషమితి. అథపరాయ యాతదక్షర మధిగమ్యతే" యత్తదద్రేశ్య మగ్రాహ్యం" ఇత్యాదిగా పేర్కొన్నది. కనకనే అది బ్రహ్మమే కాక పరబ్రహ్మమూ, ఆత్మయే కాక పరమాత్మ అయినది. అలాగే వేదమే కాక, వేదాంతము కూడా అయినది. కనక అది అర్థం కాకూడదు. మరేమిటి అంటే అది అనుభూతి మాత్రమయినది. అనుభూతితో త్రిపుటికాని, ద్వంద్వాలు కానీ ఉండవు. అప్పుడంతా ఏకం సత్తే. "ఏకం సదేవ య దనిర్వచనీయ మాయాసంబంధమేతద్ బహుధా ఘటతే జగన్తి" అని ఆత్మదర్శనం అన్నది.

642

నీవు మౌనం దాల్చి మాటాడకుండ ఊరుకొన్నా, నిన్ను లోకం మౌనంగా ఉండనియ్యదు. నీ మౌనాన్ని చెడగొట్టి మాట్లాడేటట్లు చేస్తుంది. అవల నీవు చెప్పినదాన్ని

తాను ఒప్పుకోవకుండా తాను చెప్పినదాన్నే ఒప్పుకొనేటట్లు చేస్తుంది. అవసరమైతే నిర్బంధిస్తుంది. ఇంకా నీవు లొంగక పోతే నిన్ను నిందించడానికి, తిట్టడానికి గూడ సిద్ధమవుతుంది. కనుక మానవ్రతాన్ని భంగం చేసుకోబోకు.

643

అచల మార్గము అద్వైతముకన్న భిన్నగా అగపడు తున్నది. ఆలోచించిచూడగా, ఇది అజాతవాదము నుండి పుట్టినట్లు తోస్తున్నది. అజాతవాదములో జగము పుట్టనే పుట్టదు. ఇక అది పెరుగుట, గిట్టుట ఎట్లు సంభవిస్తుంది. అలాగే అచలములోని తె మంత్రములు సర్వమూ శూన్య మనీ,బయలే బ్రహ్మమనీ చెప్పుతున్నది కదా!

644

అన్నీ తమకు తెలుసుననుకొనేవారు జ్ఞానం కోసం ప్రయత్నించలేరు. తమకు తెలియవలసినది ఇంకా చాలా ఉన్నదనుకొనేవారు జ్ఞానార్థం ప్రయత్నిస్తారు. ధనాదుల విషయంలో తృప్తి మంచిదే కాని, జ్ఞాన విషయంలో ఎవరూ తృప్తిపడకూడదు.

645

తన భవిష్యత్తును గూర్చి తనకేమీ తెలియదు కదా. తన మరణకాలం ఎలా గడుస్తుందో, తానెలా పోతాడో, అప్పుడెవరు శరీర సౌఖ్యానికి తోడుపడతారో నరుడికి ఏం తెలుసూ. నీకు బంధుమిత్రులైనవారూ, నీవల్ల ఉపకారం పొందినవారూ అవకాశం లేక కానీ, ఇష్టం

లేక కానీ ముఖం తప్పించవచ్చు. అందువల్ల ఇలాంటి
వాటికన్నిటికీ మానవుడికి జాగ్రత్త అవసరం.

646

భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే
పంచ భూతాలలోనూ, ఇంక తక్కిన జడములలోను కూడ
ఆత్మ ఉండడంలో ఆక్షేపణ లేదు. ఆ ఆత్మలకు ఆ ప్రాణులా
గ్నులే బాహ్య భౌతిక రూపాలు. సూక్ష్మశరీరాలేమో అధి
దైవిక రూపంతో ఉంటాయి. ఇక అంతరాత్మ అనేదే
అసలైన ఈశ్వర స్వరూపం. ఈ విషయాన్నే "ఏష దేవో
విశ్వకర్మా మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః"
అనీ, "ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"
అని చెప్పబడినది. కాని మన స్థూల, సూక్ష్మ కారణ శరీ
రాలలాగ వాటి దేహాలు సుస్పష్టం కాకపోవచ్చు. అంతరాత్మ
మాత్రం అవ్యక్తంగానే ఉండిపోతుంది. ఈ సంగతే "అంత
ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" అని చెప్ప
బడినది.

647

మానవుల శరీరానికీ, వాక్కునకూ, ప్రాణానికీ,
ఇంద్రియాలకూ భిన్న, భిన్న శక్తులు ఉంటాయి. వాటిని
సదభ్యాసముల చేత, సత్సాధన చేత ఉద్దీప్తం చేసికొన్నట్ల
యితే అవి ఇంక ఎక్కువగా పెరిగి తనకూ లోకానికి
ఉపయోగిస్తాయి యోగమనేదీ, సంయమమనేదీ అలాటి
పాటవాన్ని పెంపు చేయటానికే ఏర్పడ్డవి. అయితే ఈ శక్తి

లతో పాటు శరీరేంద్రియ, ప్రాణ, మనోబుద్ధులకు కొన్ని వ్యాధులు కూడా ఉన్నాయి. ఇవి ఆయా ఇంద్రియాదుల శక్తులను తగ్గించివేసి వాటి నాశనానికి కూడ దారితీయ వచ్చు. దానితో అవి నిర్జీవములూ, నిశ్శక్తములూ అయి పోయే ప్రమాదం కూడా ఉన్నది. అలాంటి వ్యాధులను, మూలికాహారాదుల ద్వారా పారద్రోలడానికే వైద్య శాస్త్రం ప్రయత్నిస్తున్నది. అందుకే దాన్ని ఆయుర్వేదం అన్నారు. ముందీ వ్యాధిరూప క్షీణ శక్తులను సంహరించి ఆవల నిజశక్తుల ఉద్దీపనకు నరుడు సాధన చెయ్యాలి.

648

నీయొక్క ఆత్మయే నీయందు తన మాయచేత కానబడి ఆత్మను, దానికంటెను భిన్నమైన శరీరేంద్రియ ప్రాణ మనో బుద్ధ్యాదులను కల్పించుచు, వాటి భేదము లతో క్రీడించుచున్నది. అంటే తేలినదేమిటి? ప్రకృతికాని, దానిచే ఏర్పడిన శరీరేంద్రియాది భేదములుకాని, ఆత్మకంటె భిన్నములు కావన్నమాట. కనుక ప్రకృతి (మాయ) యందు సాధకుడు ఆత్మాభిన్నదృష్టిని అలవరచుకొనవలెనని సారాం శము. అప్పుడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" మాత్రమే అవుతుంది. ప్రకృతి పురుష భేదం నశిస్తుంది. నీవొక్కడవే శేషించుకావు. ఇదే వేదాంతమంటే. ఇందుకు బంగారు బొమ్మను దృష్టాంతంగా తీసుకోవచ్చును. ఆ బొమ్మలోని భాగాలన్నీ బంగారమే కదా!

649

నీ చిత్తంలో వాసనారూపంగా, పృథివ్యాది రూపమైన సంసారమనేది ఎన్నెళ్లనుండో ఉన్నది. ఆ వాసనలే వ్యక్తమవుతూ, అణగుతూ ఉంటాయి. ఎప్పుడయితే నీవు ఆత్మదర్శనస్థితిని పొందుతావో అప్పుడు ఆ వాసనలు ఉన్నా లేకపోయినా నీకేమీ హాని ఉండదు. నీవనే (ఆత్మ) శాశ్వత వస్తువుమీదే వాటి క్రీడ. నిన్ను నీవు మరువకుండ ఉంటే నిన్ను అవి (ఆ సంసారం) ఏమీ చేయలేవు. సుఖదుఃఖాది ద్వంద్వాలు నీమీది నీడలు మాత్రమే అవుతాయి. నీడకు మూలమయిన వస్తువవే నీవు. ఇదే పరమసిద్ధి అంటే.

650

మానవ జీవిత లక్ష్యం ఆత్మాభివ్యక్తి మాత్రమే. తనలో నిగూఢంగా ఉండి తన సర్వకృత్యాలకూ ప్రేరణనిచ్చే ఆత్మను వ్యక్తీకరించుకొని, తద్దర్శనం చేసుకోవడం ముఖ్యాతి ముఖ్యం. భౌతిక జీవితమంతా ఆత్మాభివ్యక్తికే ఉపయోగపడాలి.

651

నీ ఆత్మ అభివ్యక్తం కావాలంటే దానిమీద ఉన్న ఆవరణలను తొలగించాలి. అంటే వాటిని తీసివేయాలని కాదు అర్థం. వాటిని దాటి నీవు లోలోపలికి పోవలసి ఉంటుంది అన్నమాట.

652

ఆత్మ అభివ్యక్తమయినా తరువాతకూడా ఆవరణలు

నామమాత్రంగా ఉండకపోవు. అవి అలా ఉన్నా నిన్ను బంధించలేవు, బాధించలేవు. వాటిని నీయొక్క ఛాయలుగా చూడడం నీకు అలవాటు కావాలి. అదే దుఃఖరహితమైన కేవలానందస్థితి.

653

కాను బ్రహ్మమైనవాడు ఒకపనిచేసి పొందే ప్రయోజనంకాని, చేయక పొందే నష్టంకాని ఏమీఉండదు. అతడు ప్రయోజనా ప్రయోజనాలకు అతీతుడు. అతనికి ఎవరివద్ద సాధించదగిన ప్రయోజనమేటూ ఏదీఉండదు. ఈ అంశాన్నే గీత "నైవతస్యకృతేనార్థో, నాకృతేనేహకశ్చన, నచాస్య సర్వభూతేషుకశ్చిదర్థవ్యపాశ్రయః (3-18) అన్నది.

654

మాయాశక్తి మహిమ అనిర్వచనీయమంటూనే వేదాంతులు దాన్ని నిర్వచించాలనీ, తిరస్కరించాలనీ యత్నిస్తున్నారు. ఇదే మాయాశక్తికి లోబడిపోయినారన డానికి దృష్టాంతం. నీకు నీవు మంచిదని ఒకదాన్నిగూర్చి ఒప్పుకొంటూనే దాన్నివశం చేసుకోవాలని పూనడం అజ్ఞానం కాకమరేమిటి? అయితే ఏం చెయ్యాలని అడుగు తారు కదూ! దానికి ఒక్క నమస్కారంపెట్టి నా జోలికి రాకుతల్లీ అనడమే కర్తవ్యం. అది అప్పుడు నీబ్రహ్మ స్వరూపాన్ని ఆవరించదు.

655

బ్రహ్మమూ అనిర్వచనీయమే. దానిశక్తి అయిన

మాయా అనిర్వచనీయమే. నీవు సాధించవలసినదెల్లా రెంటినీ అభేదదృష్టితో చూడడమే. ఇదే బ్రహ్మవిద్య అంటే.

656

బ్రహ్మకంటె భిన్నంగా కనబడేదాన్ని బ్రహ్మంగా చూడడమే బ్రహ్మవిద్య.

657

భిన్నదృష్టిని పోగొట్టుకొని అఖండాత్మైక దృష్టిని పొందడమే ఆత్మజ్ఞానం.

658

గురువునూ, గురూపదేశాన్నీ, నిన్నూ అఖండ పరమాత్మ స్వరూపంగా అనుభూతి పొందడమే ఆత్మాపరోక్షానుభూతి.

659

“న గురో రధికం కించిత్” అని శాస్త్రం. గురువును మించినదేదీ లేదట. కనుక గురువులో అభేదాధ్యవసాయం పొంది వర్తించు. అవల జగత్తులో నీకు బ్రహ్మ తాదాత్మ్యం తానంతటదే కలుగుతుంది.

660

“గురువులు తమకుమలోబడు శిష్యులు చెప్పుదురు” అనేమాట కొందరి విషయంలో నిజమేకాని, అఖండద్వైతానుభూతి పొంది, జీవన్ముక్తులైన గురువులుకూడ లేకపోలేదు. వారిని వెదకిపట్టుకొనటం కష్టం. అనేకులు కల్లగురువులనే నమ్మి మోసపోతారు.

661

మనస్సు ఎలా ఎలా సంకల్పిస్తే చిత్తు అలా అలా రూపొందుతుంది. మూలవస్తువేమొ చిత్తే కనుక, తక్కిన వాటికి స్వరూపాన్నిచ్చేది అదే. మనస్సుకు వస్తుత్వమనేది లేదు. అది సంకల్ప వికల్పాత్మకం–ఉంటుంది, లేకపోతుంది.

662

నీకు తోచే ఉనికి అంతా చిత్తేగాని, వేరొకటి కాదు. చిత్తానికి స్వతస్సిద్ధమయిన ఉనికి లేదు. అది చిత్తు ననుసరించి స్వరూపలాభాన్ని పొందుతుంది.

663

వేదాంత విషయాలనుగూర్చి ప్రశ్నిస్తూపోతే చివరకు మిగిలేది మౌనమే. ప్రశ్నలు సమాధానాలు నడుస్తున్నంత వరకు వేదాంతం పరిపూర్తినందనట్లే. మౌనరూపానుభూతి లోనే దానికి పరిసమాప్తి, పరిపూర్ణత.

664

మనస్సునకు గాఢ మౌనంలో మునిగితేనే పూర్ణత్వం. సంకల్పిస్తున్నంతసేపు అది ప్రకృతి విషయాలలోనే ఉన్నట్టు లెక్క.

665

కొందరు జగత్తు నిత్యమనే అన్నారు. ఇంక కొందరు అనిత్యమూ అన్నారు. మరికొందరు జగత్తు మిథ్య, లేనిదే అన్నారు. ఇంకా కొందరు జగత్తు బ్రహ్మమే అన్నారు. ఈ ప్రతిపాదనలు అన్నీ సత్యాలే. ఎలాగంటే వారివారి పరిపక్వ

తనుబట్టి, అనుభూతినిబట్టి ఇవి అన్నీ ఆయాదశలలో సత్యాలే. పరిపూర్ణానుభవజ్ఞునికి దశ లేదు. అతడు అన్నింటికీ మూలమయినదానిలో లీనమయి అన్నీ కాగలడు.

666

అంతటానిండి, పరిపూర్ణంగా ఉన్న వస్తువు చలించ డానికి వీలులేదు. అయినా అది చలించినట్లు కనబడుతుంది. అలా కనిపింప చేసేదాన్నే మాయాశక్తి అన్నారు. ఆ మాయాశక్తే సృష్టికి మూలమయినది. అందుకనే అది సృష్టి చేసిన జగత్తును మాయామయమన్నారు. అసలు రహస్యం ఇదీ. తెలిందేమంటే చలించని వస్తువును, చలించినట్లు కల్పింప చేయడం సాధ్యంకాని పని. అలాచేసేది భ్రాంతి ఒక్కటే. అందుకనే జగాలు భ్రాంతి సిద్ధాలన్నారు వేదాంతులు. అయితే ఇప్పుడు మాయ అనేది ఉన్నదా అంటే ఉండడానికి వీలులేదు. కనుకనే "యా మా సా మాయా" ఏది లేదో అదే మాయ అన్నారు.

667

జరుగని పనులను జరుగుతున్నట్లు చూపేది మాయ. అయితే ఈ మాయ ఎక్కడ ఉన్నది? బ్రహ్మములోనే. బ్రహ్మంమందే మాయతోటి జగత్సృష్టి చేస్తున్నదన్న మాట. కనుక మాయాబ్రహ్మములు భిన్నవస్తువులు కావు. బ్రహ్మ శక్తికి మాయ అనిపేరు. కనుక స్వతస్సిద్ధంగా లేనిదే అయిన మాయనుగూర్చి భయపడవక్కరలేదు. దాన్ని బ్రహ్మంగా చూడడమే, అనుభూతి పొందడమే నీ కర్తవ్యం.

668

వర్ధమాన మహావీరుడు బోధించిన త్రిరత్నములంటే 1. సమ్యగ్దర్శనం 2. సమ్యగ్జ్ఞానం 3. సమ్యక్చరితం. సమ్యగ్దర్శనమంటే తత్త్వాన్ని లెస్సగా చూడడం. దాన్ని బాగా అవగాహన చేసికొనడమే సమ్యగ్జ్ఞానం. దాన్ని లెస్సగా ఆచరించడమే సమ్యక్చరితమంటే. ఈ మూటినీ ఆచరించడం వల్ల మానవుడు సంసిద్ధిని పొందవచ్చు. మనుష్యుల దర్శన జ్ఞానాచరణలు సమగ్రములు, శ్రేష్ఠములుకావు. వీటిని అలా చేసుకుంటే వారు ధన్యులవుతారు.

669

పంచ మహావ్రతములు కూడ మహావీరుని బోధల లోనివే. అవే అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహములనే పంచశీలములుకూడా. వీటిని పరిపూర్ణంగా ఆచరించితే సిద్ధి సమకూరుతుంది. త్రిరత్న సిద్ధికి ఇవి సాధనలు. వీటిని మన అష్టాంగయోగములో యమము చెప్పనే చెప్పింది. అయితే వీటిని నిర్దుష్టంగా ఆచరించడం కష్టం.

670

బంధం, సంసారం అనేవి జగత్తుకు సంబంధించిన వ్యవహారాలయినట్లే, బంధరాహిత్యం, మోక్షంకూడా జగద్వ్యవహారాలేకాని, పారమార్థికాలు కావు. బంధమోక్షాలు లేనిస్థితే, పరమార్థమంటే. పారమార్థిక పురుషునికి బంధమూ లేదు, మోక్షమూ లేదు.

671

"తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి నాలుగు వేదాలు గొలుసులమరించి, బరువైన ఫణిరాజు పానుపమరించి చెలువ డోలికలోనచేర్చి లాలించి" అనే గేయం (జోలపాట) ఎంతో ఆధ్యాత్మిక రహస్యాన్ని చాటుతున్నది. బ్రహ్మాండమే ఉయ్యేలతొట్టి అట. నాలుగు వేదాలే గొలుసులట. ఆది శేషుడే పాన్పుఅట. ఈ ఆదిశేషుడు ఎవరో కాదు. కుండలిని యే. అది సర్పాకారమని మనవారి వర్ణన. ఆ కుండలినీ శక్తిని ఆశ్రయించే జీవాత్మ ఉంటాడు. కనుక కుండలినీ శక్తిని మేలుకొలిపి తద్ద్వారా అందున్న ప్రత్యగాత్మను, ఆరాధించమనీ, లేదా "నే"నని తెలిసికొమ్మనీ దీని అంతరర్థంగా తెలుసుకోవాలి.

672

జ్ఞానికి సర్వకాల సర్వావస్థలయందు నిలకడగా ఉండేది ఆత్మభావన మాత్రమే. ఎందుకంటె, అది అతని సహజ స్వరూపమేకనుక. అవసరాలనుబట్టి అప్పుడప్పుడు కల్పించుకొనేది దేహభావన.

673

అజ్ఞాని ఎప్పుడూ దేహ (జగత్) భావనలోనే ఉంటాడు. అతడప్పుడప్పుడు బలవంతంగా పొందేది ఆత్మభావన, ఎందుకనంటే అతడు జగద్దృష్టి, దేహదృష్టి కలవాడు కనుక.

674

కొందఱు అస్తిత్వంవేరు, జ్ఞానం వేరు, ఆనందం వేరు

అనుకొంటారు. కాని ఇవిమూడూ ఒకదానొకటి విడబాయ
నివి. ఒకటిఉంటే తక్కిన రెండూకూడా ఉంటాయి.

675

అస్తిత్వంమీద అనవస్థితి (లేమి) ఆనందం మీద
దుఃఖమూ జ్ఞానంమీద అజ్ఞానమూ ఆగంతుకంగా చర్చి
స్తారేకాని ఆ అసజ్జడ దుఃఖాలకు ఉనికిలేదు.

676

నీకు తత్త్వ జ్ఞానం పట్టుపడుతుందనటానికి గుర్తు,
ముందుగా నీలో పరోపకారాదులు తగ్గి దయాదాక్షిణ్య
క్షమాదులు కలుగడమూ, పరోపకారపరుడవుకావటమే.

677

మనకు స్థూల, సూక్ష్మ, సూక్ష్మతర సూక్ష్మ తమ
రూపంగా గోచరించే పదార్థం పుట్టనూలేదు, గిట్టనూగిట్టదు.
అది సంకోచ వ్యాకోచాలను పొందుతూ అదృశ్యత్వాన్ని
దృశ్యత్వాన్నీ ప్రదర్శిస్తుంది.

678

ప్రాచీన గ్రీకు తత్త్వవేత్తలు, భౌతికవాదులయిన
కొందఱు ఇలా భావించారు. హెరాక్లిటస్ అనే ఆయన
ప్రపంచానికి పునాది అగ్ని అనుకొన్నాడు. మన ఋగ్వేదం
"అగ్నిమీళే" అనే అగ్ని మంత్రంతో ప్రారంభమవుతుంది.
థేల్స్ అనే ఆయన నీరు జగన్మూలం అనుకొన్నాడు. ఈ
అంశంకూడా 'ఆపోవా ఇదం సర్వం' అని ఋక్కులు చెప్పక
పోలేదు. డెమాక్రిటస్ అనే ఆయన జగన్మూలం అణువులు

అన్నాడు. ఈ విషయం కణాదుడు ఏనాడో చెప్పినట్టిదే. ఈ వాదాలను ఏంగిల్సు, ఛేల్సు మొదలయినవారు విస్తరించారు.

679

జగత్తును సత్యం అని కొందఱు, అసత్యం అని కొందఱు, సత్యము-అసత్యమూ అని కొందరూ, అంశిక సత్యమని కొందరూ, భ్రమజనితమని కొందరూ, అణువుల పరిణామమని కొందరూ, ప్రకృతి పురుషుల (మాయా పర మాత్మల) విలాసమని కొందరూ, త్రైతశక్తి అని కొందరూ పరిపరివిధాల వచించారు. వీరందరి భావాలూ నిజాలే. కాని పరిపూర్ణ సత్యాలు మాత్రం కావు. కృత్స్నదృష్టికి మాత్రమే పరిపూర్ణ సత్యం గోచరిస్తుంది. ఈ దృక్పథాలన్నీ ఆలోచనా భేదాలను బట్టి, దృష్టి విశేషాలను బట్టి, అను భూతి భేదాలను బట్టి ఏర్పడినవే. కనుక వాటిని ఇది నిజం, ఇది నిజం కాదని అనలేము. వీటన్నిటి సారాంశం ఏమిటంటే బ్రహ్మముకానీ, జగత్తుకానీ అనిర్వచనీయమనడమే. అది మానవబుద్ధి యొక్క కొలతలకు లొంగేది కాదు. అఖం డమూ, అనంతమూ, అవాచ్యమూ, సర్వమూ, సర్వపరి పూర్ణమూ అయినట్టిది.

680

"నాసదాసీన్నో సదాసీత్" అన్నట్టి స్థితినే, భగవ ద్గీత "న స త్త న్నాస దుచ్యతే" అని చెప్పింది. అంతే కాకుండా "అవ్యక్తం" అనికూడా అన్నది. "అవ్యక్తం,

వ్యక్తి మాపన్నం మన్యన్తే మామ బుద్ధయః" అని గీతా వాక్యం కూడ చెప్పింది. సత్తు, అసత్తూ కానిదాన్ని అవ్యక్త మనక ఇంకేమంటారు. అలాగే "పర స్తస్మాత్తు భావోఽ న్యోఽవ్యక్తో వ్యక్తాత్సనాతనః" అన్న వాక్యం కూడ సద సదతీత వాదాన్నే సమర్థిస్తున్నది. అవ్యక్తం మీద వ్యక్తం క్రీడిస్తున్నట్లే, వ్యక్తం యొక్క బాహ్యాభ్యంతరా లందన్నిం టనూ, అవ్యక్తం స్థాలలో నీరు లాగ ఉండనే ఉంటుంది. ఇవి సూక్ష్మంగా మననం చేయదగిన భావాలు.

681

భారతదేశంలో మనిషి మనిషిగా బ్రతకాలన్నా, తత్త్వాన్వేషిగా చెలామణీ కావాలన్నా కష్టం. గాని, దేవు డుగా మారి పూజలందుకోవటం తేలికే.

682

మతగ్రంథాలన్నీ భగవంతుడు చెప్పినవే, భగవదా దేశాలే అని ఆయా మతకర్తల విశ్వాసము, ప్రచార మూనూ. వాటిని భగవంతుడు చెప్పకపోయినా, అవి మహ నీయుల అనుభవాలే కనుక ప్రమాణాలు కాకపోవు. అయితే మహనీయులమీది కంటె, భగవంతుని మీద భక్తివిశ్వా సాలు ఎక్కువయినందున అవి భగవంతుని బోధలని అంటు న్నారు. మహాత్ములనబడేవారు భగవంతుని కంటె ఏమీ తక్కువవారు కారు.

683

"జ్ఞానీ త్వాత్మైవ మే మతం" అన్నప్పుడు జ్ఞానిని

నేనే. జ్ఞానికీ అవతారమూర్తినైన నాకూ భేదము లేదని ఒక భావము. జ్ఞాని అయినవాడు, సాక్షాత్తూ జగత్కారణ పరమాత్మయే అని ఒక భావము. అనగా, జ్ఞాని సాక్షాత్పరమాత్మభూతుడే కాని, పరమాత్మకు భిన్నుడు కాదని సారాంశము. సాధకులు ఈ రహస్యము నెఱింగి పరమాత్మాభిన్నులై సంచరించుచూ, వ్యవహారమును నడుపుకొనవలసి యున్నది.

684

జగత్సంబంధము- సవికల్పమూ, సాతిశయమూ, సాంతము. బ్రహ్మసంబంధము- నిర్వికల్పమూ, నిరతిశయమూ, నిత్యమూ.

685

జగద్వస్తు సంపాదనవల్ల కలిగే తృప్తి తీరనిది. బ్రహ్మప్రాప్తివల్ల కలిగెడి తృప్తి నిరంతరము, నిర్భయము, నిత్యము.

686

ప్రతి మానవుడికీ జీవితంలో ఒక ప్రధాన లక్ష్యం ఉండాలి. అప్పుడు దాన్ని సాధించడానికి తక్కినవన్నీ సాధనాలు అవుతాయి. తత్త్వ జిజ్ఞాసువుకు జగత్కారణ జ్ఞానం ప్రధానంగా వుంటుంది. అప్పుడు జగద్విషయాలు, ఆ లక్ష్యసిద్ధికి సాధనాలు, అప్రధానాలు అవుతాయి. ఆకలి తీరడానికి ఆహారము సాధనమే కాని, అదే ప్రధానం కాదు. ప్రధానం ఆకలి తీరడం. అవుడతడు ఏ ఆహారాన్నైనా స్వీకరించి ఆకలి తీర్చుకొంటాడు.

687

పుస్తకాలు వ్రాయడమూ, లోకంలో పూజలందుకోవడమూ, మహాస్వీయుడని కీర్తిప్రతిష్ఠలు పొందడమూ వేరు. జగత్కారణ రహస్య స్వరూపం యథాతథంగా తెలిసికొని అఖండానుభూతిన్ని పొందడం వేరు. పై వాటివల్ల ఇది సిద్ధించిందని కాని, దీనివల్ల పైవి వస్తాయనికానీ ఏమీ లేదు. జగద్రహస్యమును ఎరిగి ఏ ఆడంబరాలూ లేకుండానూ ఉండవచ్చును. అన్ని ఆడంబరాలూ కలిగి జగత్కారణ రహస్యం తెలియకుండానూ ఉండవచ్చు.

688

జ్ఞానమంటే వస్తువు యొక్క యదార్థ స్థితిని తెలుసుకొనడం. యోగమంటే దానిని పొందడానికి చేసే సాధన. అంటే ఆచరణ "ప్రాక్టికల్ వర్క్" అన్నమాట. యోగం వల్ల జ్ఞానమూ సిద్ధించవచ్చు. జ్ఞానం వల్ల యోగమూ కొనసాగవచ్చు.

689

36 తత్త్వములెవగా ఇవి :-

| | |
|---|---|
| అవిద్య | 1 |
| అంతఃకరణ చతుష్టయం | 4 |
| ఆకాశాది భూతపంచకం | 5 |
| శబ్దస్పర్శాది విషయ పంచకం | 5 |
| జ్ఞాన కర్మేంద్రియములు | 10 |

| | |
|---|---|
| దశవిధ వాయువులు | 10 |
| 36వ వాడు జీవుడు | 1 |
| మొత్తము | 36 |

690

బ్రహ్మజ్ఞానమంటే జగత్తు 'జగత్తు' కాదు, అది సాక్షాత్తూ బ్రహ్మమే అనే జ్ఞానం కలగడం. అంటే జగత్తు నందు అది బ్రహ్మమే కాని, భిన్నము కాదు అనే జ్ఞానం కలగడం. దాన్నే బ్రహ్మజ్ఞానం అన్నారు. 'నగ' మీద నగ అనే భావం పోయి, బంగారమే అనే భావం కలిగినట్లు అన్న మాట.

691

ద్వైతం ఎక్కడనుంచో వచ్చినది కాదు. అది అద్వైతం నుండే ఆవిర్భవించింది. కనుక నే తిరిగి అద్వైతంలోనే లీనమై పోతుంది. కనుక అద్వైతులు ద్వైతాన్ని ఈసడించ నక్కరలేదు. అందులో నుండి అద్వైతంలోకి పోవడానికి ప్రయత్నం (సాధన) చెయ్యాలి.

692

బ్రహ్మము వేరు, జగత్తు వేరు అని చూడడం ద్వైతం. అవి రెండూ ఏకైక పరబ్రహ్మమే అని తెలిసి అనుభూతి పొందడం అద్వైతం.

693

బ్రహ్మమును తెలియకుండా చేయునది అణవమలము.

చరాచరాత్మక జగదుత్పత్తి స్థితి, లయములకు కారణమైనది మాయామలము. పుణ్యపాపము సుఖదుఃఖాది ద్వంద్వ రూపమై యుండునది కార్మికమలము. ఇవి మూడూ ప్రకృతికేగాని, పరమాత్మకు లేవు. కనుక అది నిర్మలము, నిష్కలుషము.

694

ఆదిమధ్యాంతము లనేవి బ్రహ్మపదార్థానికి వలె ప్రకృతికి గూడ లేవు. అయినా అవి వున్నట్లు తోపచేయడ మనేదే ప్రకృతి లక్షణం. అందుకే అది బ్రహ్మమును ఆవరించి దానికి గూడ ఆదిమధ్యాంతము లున్నట్లు చేస్తున్నది.

695

జగత్కారణ బ్రహ్మము, సర్వవ్యాపక వస్తువు గదా! అది లేని వస్తువంటూ ఏదీ లేదు. ఈ సంగతి అందరికీ తెలుసు. అలాంటి బ్రహ్మము నీలో కూడా ఉండి ఉంటుందనడంలో ఏ సందేహమూ అక్కరలేదు. దాన్ని వెదకి పట్టుకోవడానికి ప్రయత్నించు. అది చిక్కితే నీ భయసందేహాలన్నీ తొలగి శాంతి, ఆనందాలు లభిస్తాయి.

696

జ్ఞానశక్తి కలవాడు హిరణ్యగర్భుడని, మణుల యందు కూర్చిన దారంలాగా నానావిధ ప్రపంచమున అనుస్యూతుడైనందున సూత్రాత్ముడని, క్రియాశక్తితో కూడినందున ప్రాణుడనీ సమష్టి స్వప్నద్రష్టకు మూడు పేర్లు.

697

సుషుప్తిలో కారణ శరీరాభిమానియైన జీవునికి ప్రాజ్ఞుడని, పారమార్థికుడనీ, అపరిచ్ఛిన్నుడనీ పేర్లు. స్వప్రకాశ స్వరూపుడు కనుక ప్రాజ్ఞుడు. అవస్థాత్రయము నందు అను స్యూతుడు కాన, పారమార్థికుడు. దేహేంద్రియాద్యుపాధు లచే పరిచ్ఛిన్నుడు కానందున అపరిచ్ఛిన్నుడు.

698

సుషుప్తి యందు వృత్తులతో కూడిన అంతఃకరణం అవ్యాకృతము (అనాది అజ్ఞానం) నందు లీనమవుతున్నది. సమాధియందు వృత్తులతో కూడిన అంతఃకరణం బ్రహ్మము నందు లీనమవుతున్నది. సుషుప్తి యందు అజ్ఞానావృతమైన స్వరూపానందం అనుభవింపబడుచున్నది. సమాధిలో నిరావరణమైన బ్రహ్మానందము ప్రకాశించుచున్నది.

699

వెలుపలి గురువులు నీకు చెప్పేదీ, నీవు వినేదీ పూర్తి అయిన పిమ్మట- ఇంకా చెప్పవలసినదానికి, నీ లోపలనే ఒక అంతర్గురువు ఏర్పడగలడు. ఈయన మీాది భక్తి, శ్రద్ధా, విశ్వాస గౌరవాలతో నీవు ఎన్నో విషయాలు తెలిసికొనే వీలు ఏర్పడుతుంది. అయితే ఇలాంటి అంతర్గురువు ఏర్పడ డం నీ శ్రద్ధా, భక్తి, గౌరవాలను బట్టి; జ్ఞానతృష్ణను బట్టి ఉంటుంది.

700

జగత్కారణ వస్తువు వేరు, తాను వేరు, అనుకొనడం

ద్వైతం. తానూ, జగత్కారణ బ్రహ్మమూ ఒక్కటే అని అనుభూతి పొంది వదవడం అద్వైతం.

701

సత్తుగాని (ఉనికి), అసత్తు (లేమి=అభావం) కాని కానట్టి ఒకానొక అనిర్వచనీయ స్థితిని సమాధిలో పొంద డమే పరమగతి అంటే. అసలు దాన్ని పరమగతి అనికాని, ఇంకొకటి అనికాని చెప్పలేము. నాసదీయ సూక్తము ప్రతిపాదించిన ద్వంద్వాతీత స్థితి, మాత్రమే అది. ఇక అప్పుడు ఆకాశాదులు, వాటి సృష్టికర్తలు ఉండరని వేరుగా చెప్పనక్కర లేదు.

702

వేదము "పృథివ్యన్తరిక్షం ద్యౌః" అని పృథివికి, అన్త రిక్షమునకు, ద్యులోకమునకు ప్రాధాన్యమిచ్చి తన విజ్ఞాన మును విస్తరించినది. పిండాండమున పృథివి అనగా ఆధార చక్రము. అంతరిక్షమనగా అనాహత చక్రము. ద్యౌః అనగా సహస్రారము. ఈ మూటినీ ప్రధానీకరించుకొనియే మానవ ప్రాణి జీవితము కొనసాగుచున్నది. ఆధారము విసర్జన కర్మ నొనర్చుచూ, మానవునకు సుఖమొసంగుటయేకాక, లిమటకు జఠరాగ్నిని జ్వలింప చేయుచున్నది. అనాహతము ప్రాణము నకు నివాసమై మానవుని సజీవునొనర్చి, బ్రతుకు నొసంగు చున్నది. ఇక సహస్రారము పరమాత్మ నివాసమై భ్రూ మధ్యస్థ జీవుని తనలో లీనమొనర్చుకొని, అమృతత్త్వమును ప్రసాదించుచున్నది. కావున భూమి, అంతరిక్ష, ద్యులోక ములు అతి ముఖ్యములు.

703

మిత్రా వరుణు లనగా, పగలు రాత్రి అనియు; ఇడా, పింగళ నాడులు "శంనో మిత్రశ్శం వరుణః" అనియు మనం చదువుతాం. అనగా రేలు, పవళ్లు మాకు అపకారం చేయకుండా రక్షించాలని భావం. ఇడ, పింగళలని చెప్పుకొన్నప్పుడు ఆ రెండు నాడులు ప్రాణాయామం ద్వారా మాకు ఆరోగ్యాన్ని చేకూర్చాలని భావం. మిత్రుడు పగటికి అభిమానియైన దేవత. వరుణుడు రాత్రిని అభిమానించే దేవత. ఇక్కడ దేవత అంటే ఒకానొక దివ్యశక్తి అని భావం. "శంన ఇంద్రో బృహస్పతిః" అంటే ఇంద్రుడనగా పరమైశ్వర్యశాలి అయిన దేవుడు.

ప్రభువు బృహస్పతి అనగా వాగధిపతి అయిన విశ్వకర్మ. ఉరుక్రముడైన విష్ణువంటే కుండలినీ శక్తి. అది ఆధారాదులమీదుగా సహస్రార యాత్రచేసి, యోగిని రక్షిస్తుంది. భవబంధముక్తుని చేస్తుంది. కనుకనే విష్ణువును మోక్షప్రదాత అన్నారు. ఇవి రహస్యాలైన అంతరర్థాలు.

704

లోకంలో ఉన్న వస్తువులు ప్రధానమైనవి రెండే రెండు. ఒకటి వెలుగు. రెండోది చీకటి. వెలుగు లేపోతే కలిగేది చీకటి. చీకటేమో జగత్తుకూ, సంసారానికీ సంకేతం. వెలుగేమో పరమాత్మకు, జగత్కారణ వస్తువుకూ గుర్తు. చీకటి ఇబ్బందినీ, దుఃఖాల్ని కలిగిస్తుంది. వెలుగేమో వస్తువు

లను తెలియచేసి ఆనందాన్ని ఇస్తుంది. అలాగే జగత్తు దుఃఖవ్యాకులమైనదీ కాగా, ఆత్మ ఆనందమయం. చీకటి వంటి జగద్విషయములలో మునిగి దుఃఖపడక, వెలుగువంటి పరతత్త్వాన్ని ఆశ్రయించి ఆనందించమని "తమసోమా జ్యోతిర్గమయ" అనే వాక్యం చెబుతున్నది. "అసతోమా సద్గమయ, మృత్యోర్మా అమృతం గమయ" అనే వాక్యాలు కూడా ఇలాంటివే.

705

సృష్టి, స్థితి, లయములకు హేతువులైన బ్రహ్మ, విష్ణు, రుద్రులుగాని, వారి శక్తులుగాని, విడివడి వేరువేరై ఉండవు. ఒక శక్తి పైకి వ్యక్తమయినా దానిలో అంతర్భూతంగా తక్కిన శక్తులు ఇమిడే ఉంటాయి. అలాగే విష్ణునిలో శివ-బ్రహ్మలు, శివునిలో బ్రహ్మ-విష్ణువులూ అంతర్భవించే ఉంటారు. అయితే మనకు సంపూర్ణ జ్ఞానం లేనందువల్ల సమష్టిగా చూడలేక వ్యష్టిగానే భావించి సంకుచితత్త్వానికి లోనవుతూ ఉంటాము. అలాగే లక్ష్మిలో భవానీ-సరస్వతులు, సరస్వతిలో లక్ష్మి-భవానులు, భవానిలో లక్ష్మి-సరస్వతులు అంతర్భూతులయ్యే ఉన్నారని భావించి ఆరాధించాలి. లేకపోతే సాధకునికి సంపూర్ణ తత్త్వ సాక్షాత్కారం కాదు. ఇది పరమ రహస్యం. దీన్నే అణువులో మహత్తును, మహత్తులో అణువును చూడడమని కూడా అనుకోవచ్చును.

706

పుట్టుకలో మరణమున్నది. మరణములో పుట్టుకా ఉన్నది. ఇవి జంటలు. విడివడి ఉండవు. కనుక మనం సృష్టిలో ప్రళయాన్ని, ప్రళయంలో సృష్టినీ దర్శించాలి. మరణం లేని జీవనంగాని, జీవనం లేని మరణంగాని ఉండవు. అంటే దాని సారాంశం పుట్టింది గిట్టకా తప్పదు. గిట్టింది పుట్టకా తప్పదు. దీన్నే గీత "జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ" (2.27) అని చెప్పినది. అయితే చావు పుట్టుకలను దాటే ద్వంద్వాతీత స్థితి కోసమే మానవుని ప్రయత్నం కాగా, మనకు బయటికి ఒకటి కనబడినప్పుడు ఇంకొకటి కనబడదు. జీవితంలో మరణంగాని, మరణంలో జీవితంగాని అగపడదు. అంటే అలా మనం చూడలేమన్నమాట. అలా చూడగలిగే శక్తినే తాత్త్విక దృష్టి అంటారు. తాత్త్విక దృష్టి ఆ రెంటినీ దర్శించగలిగి, ఆ రెంటికీ అతీతంగా కూడా ప్రకాశిస్తుంది.

707

విశ్వవ్యాపకమైన బ్రహ్మమే విశ్వబ్రహ్మం. అది సృష్ట్యాది విశ్వకర్మలకు పూనుకొన్నప్పుడు విశ్వకర్మ అవుతుంది. కనుక సాధకుడు విశ్వకర్మార్చన ద్వారా విశ్వబ్రహ్మ స్థితిని అందుకోవాలి. ఇదే విశ్వబ్రహ్మ, విశ్వకర్మ పదాల తత్త్వార్థం.

708

"శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే".

శ్రీశైలమంటే ప్రకృతి పురుషుల సంయోగం వల్ల ఏర్పడ్డ శరీరం. ఆ శరీరంలోని శిఖరం వంటిది సహస్రార కమలం. అక్కడే పరమాత్మ విహారం. అటువంటి శిఖరప్రాయమైన సహస్రారాన్ని దర్శిస్తేనే కాని జన్మరాహిత్య రూపమోక్షం సిద్ధించదని శ్లోకానికి అర్థం. కనుక బాహ్యమైన శ్రీశైలశిఖరాన్ని కాక, శరీరమనే శ్రీశైలంలోని సహస్రార శిఖరానికి చేరుకొని పరమాత్మ దర్శనం చేసుకోవాలి.

709

దేవాలయాలకూ, చర్చిలకూ, మసీదులకూ, ఆరాధన స్థలాలకూ పోయి భగవదారాధన ధ్యానాదులు చేయుట అనేది మందబుద్ధుల యొక్క పని. సిద్ధపురుషుడు తానెక్కడ ఉంటే అదే దేవాలయమనీ, ఏపని చేస్తే అదే భగవదారాధనమనీ భావిస్తాడు. అతడికి దేశ, కాల, వస్తు, క్రియాదులన్నీ కూడ భగవన్మయాలే కాని భిన్నాలు కావు. ఈ భావం ఆరూఢమయితేనే కాని ప్రకృతి బంధ విముక్తి అయినట్లు కాదు.

710

దేశ, కాల, వస్తు, కార్యాలను బ్రహ్మమయాలుగా భావించవచ్చుగాని, ఒక దేశాన్ని మరొక దేశంగా, ఒక కాలాన్ని మరొక కాలంగా, ఒక వస్తువును ఇంకొక వస్తువుగా, ఒక పనిని వేరొక పనిగా మార్చలేము. ఎందుకనంటే దేశ, కాల, వస్తు, క్రియలలో భగవచ్ఛక్తి అంతటా వ్యాపించి ఉన్నది. కాని ప్రకృతి ధర్మంగా ఏర్పడిన దేశ, కాల, వస్తు,

కార్యాలలో భేదమే కాని అభేదం లేదు. కంచి కాశీ కాదు, కాశీ కంచి కాదు. ఉదయాన్ని మధ్యాహ్నం కాదు, మధ్యాహ్నము ఉదయమూ కాదు. అలాగే అన్నము సున్నమూ గాదు, సున్నం అన్నమూ కాదు. తినడం విసర్జించడమూ కాదు. విసర్జన తినడమూ కాదు. ఇవి ప్రకృతి నుండి కలిగాయి కనుక ఒకటి మరొకటి కాదు. వీటికి ఆధారమయిన భగవచ్ఛక్తి మాత్రమే అన్నీ కాగలుగుతుంది. అందుకనే ప్రకృతి నానాభేదాలతో భిన్నమనీ, పరమాత్మ సమస్తంలో అభిన్నమనీ భేదరహితమనీ అంటున్నాము. ఇదే పరమ రహస్యం.

711

కోరికలను సాధకుడు వదలిపెట్టే స్థితి ఒకటీ, కోరికలు వాటంతట అవే సాధకుని వదలిపోయే స్థితి ఒకటి అని రెండు ఉంటాయి. ఈ రెంటిలో మొదటిదానికి, సాధకుని ప్రయత్నం ఉంటుంది. రెండోదానికి ఏవిధమయిన యత్నమూ ఉండదు. ఇది కలిగేటప్పటికి సాధకుని అనుభూతి అతిచిత్రంగా మారుతుంది.

712

సన్యాసస్థితి గానీ, అవధూత స్థితిగానీ కావాలని, అలవరచుకొంటారు కొందరు. కొందరికివి వాటంతట అవే అనుకోకుండా ప్రాప్తిస్తవి. ఇలాంటివారే ఉత్తమోత్తమాధికారులు.

713

బద్ధజీవుల స్వభావం ప్రవృత్తి, బుద్ధ (ముక్త) జీవుల స్వభావం నివృత్తి. ఇంకొక తరగతి వారుంటారు. వీరికి బంధ మోక్షాలు కానీ, ప్రవృత్తి నివృత్తులు కాని ఉన్నాయనే దృష్టే ఉండదు. వారిది విలక్షణ స్థితి. ప్రవృత్తి నివృత్తులు జరుగుతున్నా, జరుగకున్నా వారికి ఏవిధమయిన చలనమూ ఉండదు. వారు అచల స్వరూపులు. "అచలోఽయం సనాతనః" అన్నట్లు.

714

బ్రాహ్మీస్థితిలో ప్రాణవాయువు పనిచేయనూవచ్చు, చేయకపోనూవచ్చు లేదా సుషుమ్నలో తిరగనూవచ్చు. మనస్సు వృత్తిరహితమై బ్రహ్మాకారాన్ని పొంది ఉంటుంది. దాన్నే బ్రాహ్మీస్థితి, తురీయాతీతం, నిర్వికల్ప సమాధి, ఈశ్వర సాధర్మ్యం ఇత్యాది పదాలతో పేర్కొంటారు.

715

బ్రాహ్మీస్థితి కలిగినప్పుడు, నీవు పనిచేస్తున్నా, చేయక పోయినా, నిద్రించినా, మేల్కొంచినా, నడుస్తున్నా, కూర్చున్నా, అది నిన్ను వదలదు. సర్వకాల సర్వావస్థల లోనూ ఆ స్థితిలోనే ఉండగలుగుతావు. అయితే దీన్ని అతి సూక్ష్మంగా గమనించాలి.

716

లోకంలో మనకు తోచేవి రెండే రెండు. ఒకటి పదార్థం. రెండు ఆత్మ. పదార్థం యొక్క పరిణామమే జగ

మంటాము. దాన్ని తెలిసికొనేది, ప్రకాశింపచేసేదీ ఆత్మ. ఆ రెంటినిగూర్చే తత్త్వశాస్త్రం కొనసాగుతుంది.

717

జగద్విషయాలతో పొత్తు పెట్టుకొంటే వాటివల్ల నీకు బాధ తప్పదు. కనుక వీటితో అంటీ అంటకుండా ఉండి, నీ వల్ల ఇతరులకు భయోద్వేగాపకారాలు కలుగకుండ చూచుకోవాలి. అప్పుడే నీవు నిజమైన బ్రహ్మవేత్తవు. ఈ అంశాన్నే గీత- "యస్మాన్నోద్విజతే లోకో, లోకాన్నోద్విజతే చ యః" అన్నది (12-15).

718

"ఏషోఽణు రాత్మా చేతసా వేదిత వ్యో యస్మిన్ ప్రాణః పంచధాసం వివేశ" అన్న కఠవల్లి వాక్యం ఆత్మనాధారం చేసుకొంటూనే పంచ ప్రాణములు సంచరిస్తున్నవని అన్నప్పటికీ, ప్రాణాలతోనే ఆత్మకు నిత్యసంబంధం కలిగి ఉన్నది. కనుకనే ప్రాణాలు లేచిపోగానే, జీవాత్మ కూడ లేచిపోతున్నది. వాటితోపాటు ఇంద్రియాలున్నూ పోతాయి. కనుక ప్రాణవాయువుకున్న ప్రాధాన్యం అసాధారణమైనది, అందుకే "య దదో వాత తే గృహే, అమృతస్య నిధిర్హితః" ఓ వాయుదేవా "నీలో అమృతనిధి ఉన్నదని" ఋక్కు చెప్పినది. దాన్నే అథర్వవేదం ప్రాణసూక్తం ద్వారా విస్తరించినది. కనుక ప్రతి మానవుడూ మంత్రతంత్రాల మాట ఎలాఉన్నా, ప్రాణాయామాదుల ద్వారా ప్రాణశక్తిని వశీకరించుకొనడం ముఖ్యకార్యం. ఈ ప్రాణా

యోగానికి కుల, మత, వర్గ విశేషాలేవీ లేవు. అన్ని మతాల వారూ చేస్తారు. ఒకరి ప్రార్థనా పద్ధతిని, మరొక మతంవారు అనుసరించడానికి ఇష్టపడరు. కాని, ప్రాణాయామాన్ని మాత్రం మతభేదం లేకుండా అందరు అనుసరిస్తారు. అందు వల్ల అది సర్వజనీనమైన దివ్యయోగం.

719

వేదములోని ద్యావా-పృథువులు, మిత్రా-వరుణులు, అగ్ని-సోములు, సూర్యా-చంద్రమసులు, దివా-రాత్రులు, అశ్వినులు మొదలగు దేవతలు ప్రకృతి-పురుషులకు, ప్రాణాపానములకు మొదలైనవాటికి ప్రతీకలుగా అగపడుచున్నారు. వాటినిగూర్చి ఇంకను పరిశోధన కొనసాగింద వలసి యున్నది.

720

చంద్రుడు ఉదయించినందువల్ల రాత్రి రావటం లేదు. సూర్యుడు పోవడం వల్ల రాత్రి అగుచున్నది. సూర్యుడుండగా కూడా చంద్రుడు కూడా పగలు ఉంటాడు. అయినా ఆ సమయం రాత్రి కావడం లేదు. అలాగే ఆత్మ ఉన్నంత వరకు దేహం ఉంటున్నది. ఆత్మ లేకపోతే అది మృతమే అవుతున్నది. ఆత్మ ఉన్నప్పుడు దాని వెలుగుతో కాని దేహం పనిచేయదు. ఆత్మలేని దేహం రాత్రివంటిదయితే, అది ఉన్న దేహం పగటివంటిది.

721

తత్త్వశాస్త్రంకానీ, తత్త్వజ్ఞానం కానీ ఒక్క మతానికే

సంబంధించిన విశేషాలను చెప్పేది కాకూడదు. అది సృష్టిలో ఉన్న జగత్కారణమయిన, దాని కార్యాలయిన తత్త్వాలను గూర్చి చెప్పేది మాత్రమే కావాలి. అందుకనే బ్రహ్మంగారు "తనలోన నున్న తత్త్వమివ్వరు తెలిచి గన రన్న" తనలోను, విశ్వములోనూ ఉన్న తత్త్వమేమిటో తెలిసికొనడమే, తెలుపడమే తత్త్వశాస్త్రం యొక్క, తత్త్వ జ్ఞానము యొక్క లక్ష్యం కావాలి అన్నారు. ఏ మతంలో నైనా కొన్ని తత్త్వ జ్ఞానాంశాలు ఉంటే, వాటిని తత్త్వ జ్ఞానం విబోధించజాలదు. అప్పుడవి ఆ మతానికి చెందిన తత్త్వానికే చెందుతాయి.

722

"వెదికితే కనపడని వస్తువు ఎక్కడున్నదో చూడరా" అన్నాడు బ్రహ్మగురుడు. వెదికితే కనపడని వస్తువు వెదికేదే అవుతుంది. అది; అన్నిటినీ తాను వెదుకుతుందే కాని, తన్ను తాను వెదకడానికీ, తన్ను తాను చూడడానికీ ప్రయత్నించడం లేదు. అది; తాను సృష్టించిన దృశ్యాలను కాక, తన్ను తాను వెదకటానికి యత్నించుకోవడమే తత్త్వమన్నా, జ్ఞానమన్నా.

723

శ్లో॥ అన్యథా సంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే।
కింతేన నకృతం పాపం చోరేణాత్మా పహారిణా॥

ఆత్మస్వరూపుడైన తాను, తన్ను విషయేంద్రియ,

ప్రాణ, మనో, బుద్ధ్యాదిరూపునిగా నెంచువానికంటే మహా పాపి ఇంకొకడు లేడు. అతడు తన్ను తాను దొంగిలించు కొనెడి దొంగ కూడ అనవచ్చును.

724

అంతఃకరణం బహిర్ముఖమైతే మనస్సనీ, అంతర్ముఖమైతే 'బుద్ధి' అని అంటారు. చిత్తాహంకారములు, మనోబుద్ధులకు సహకారులుగా ఉంటాయి.

725

నీ శరీరానికి గాని అవయవాలకు గానీ ఏవైనా నొప్పులు, బాధలు కలిగితే అవి ఇతరుల కెవరికో కలిగినట్లుగా నీకు అనుభూతి కలగాలి. అలాగే నీవు నీ ఇంద్రియాలతో ఏ విషయాలనైనా అనుభవిస్తే అవి ఇతరు లనుభవించినట్లు నీకు అనుభూతి కలగాలి. అలాంటి అనుభవం కలిగినప్పుడే నీవు నీ శరీరేంద్రియాల కంటే వేఱైన బ్రహ్మస్వరూపుడవు అయినట్లు. అట్టి అనుభూతి కలగనంతవఱకూ నీకు శుద్ధ బ్రహ్మానుభవము కలుగనట్లే లెక్క.

726

శాస్త్రములుగాని, గురుబోధగాని, చింతనగాని, మంత్రములుగాని, నీ మనస్సునకు సమాధానమును, తృప్తిని చేకూర్చుటకు మాత్రమే. వాటివల్ల సత్యము బోధపడవలెననే నియమమేమీ లేదు. మనస్సు మాయమైనప్పుడు ఉండేదే నీ స్వరూపము. నీ స్వరూపములో నీ వున్నప్పుడే నీకు తృప్తిగాని ఆనందముగాని. మనస్సు ఆ యాయా

చింతవలను చేసేటప్పుడు దాని కార్యాలకు నీవు లోబడక తప్పదు.

727

అతిమానసము, అమనస్కమూ అయిన దశ ఎంతో చిత్రమయినది. అది ఊహలకు అందనట్టి స్వస్వరూప స్థితి. దాన్ని సాధించటానికే సాధకులు యత్నించాలి.

728

దేశమును (తావు), కాలమును, వస్తువులనూ, బ్రహ్మమయంగా చూడడం, అనుభూతి పొందడం, సాధకులకు అలవాటు కావాలి. అప్పుడే దేశ, కాల, వస్తువుల చేత పరిచ్ఛిన్నం కాని అఖండానంత బ్రహ్మమును వారు అనుభూతి పొందినట్లవుతుంది.

729

దేశాన్ని బ్రహ్మంగా చూడమన్నందువల్ల, సముద్ర ప్రదేశమును బ్రహ్మమే యని ఎంచి అందులో మునిగి పొమ్మని భావం కాదు. అఖండ బ్రహ్మము జగద్రూపాన్ని ధరించేటప్పటికి దానికి ద్వంద్వాలు అంటుకొంటవి. విధి నిషేధాలు ద్వంద్వములలోనివే కదా. సముద్రం బ్రహ్మమయినా, దానిని ఎందుకు ఉపయోగించుకోవలెనో అందుకే ఉపయోగించుకోవాలి కాని, అందులోపడి మునిగిపొమ్మని కాదు. అలాగే విషమనే వస్తువు బ్రహ్మస్వరూపమే అయినా దానిని తినడానికి పనికిరాని నిషిద్ధ పదార్థంగాను, వైద్యోపయోగకరంగాను వాడుకొమ్మనియే భావం కాని, భక్షించి ముప్పు

పెచ్చుకొమ్మని కాదు. ఈ విధంగా దేశ, కాల, వస్తువుల యందలి విధి నిషేధాల నెఱిగి వాటిని ఉపయోగించుకొనడమే బ్రహ్మజ్ఞానమన్నా, బ్రహ్మదర్శనమన్నా, బ్రహ్మ సాక్షాత్కారమన్నా!

730

“భక్త్యా మామభి జానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః” అనే గీతా శ్లోకం కూడా భక్తివల్ల కలిగేది జ్ఞానమనే చెప్పుతున్నది. “అభిజానాతి” అంటే తెలిసికొంటున్నాడని అర్థము. కనుక తెలుసుకొనడమనేదే చివరి లక్ష్యం. అందుకు భక్తి సాధనమన్నమాట. ఈ అంశాన్నే “భక్తిర్ జ్ఞానాయ కల్పతే” భక్తివల్ల జ్ఞానం కలుగుతున్నది అన్నారు. తేలిన సారాంశం పరమాత్మ జ్ఞానమొక్కటే మోక్షమని. “త మేవం విద్వా నమృత ఇహ భవతి” అన్నది కదా పురుష సూక్తం.

731

భగవంతుడు (బ్రహ్మము) క్రిందికి దిగితే మానవుడవుతాడు. మానవుడు పైకెక్కితే భగవంతుడౌతాడు. సహస్రారము నందలి పరమాత్మ, ఆజ్ఞాచక్రము నుండి ఆధారం దాకా దిగజారి జీవుడైనాడు. ఆధారంలోని జీవుడు (కుండలిని శక్తి) స్వాధిష్ఠానాదుల ద్వారా సహస్రారం దాకా ఊర్ధ్వ ప్రయాణం సాగిస్తే పరమాత్మ అవుతాడు.

732

ఆరోహణ అంటే ఎక్కడం. అవరోహణ అంటే

దిగడం. పరమాత్మ అవరోహణం చేసి జీవాత్మ అయినాడు. అలాంటి జీవాత్మ ఆరోహణం చేసి పరమాత్మ కావాలి. ఇదే సిద్ధి అంటే.

733

"సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ" (5-13) అన్న గీతా శ్లోకం మానసికమైన అంతస్సంన్యాసమే గొప్పదని చెప్పుతున్నది. మానసిక సంన్యాసం లేక, కేవల బాహ్య సంన్యాసం ప్రయోజనకారి కాదు. మానసిక సంన్యాసం ఉంటే, బాహ్య సంన్యాసం లేకపోయినా ఇబ్బంది లేదు. అయితే లోకులు మాత్రం బాహ్య సంన్యాసానికే పూజాగౌరవాలు ఇస్తారు.

734

"జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" (1-8) అన్న శ్వేతాశ్వతర మంత్రానికి తనను దేవునిగా- అనగా పరమాత్మునిగా తెలిసికొన్నట్లయితే, ఆత్ముడు ముక్తుడగు కాడని భావము. ఎందుకనంటే తన బొందిలో ప్రవేశించి విశ్వనాటకాన్ని నడిపేది సృష్టికర్త అయిన పరమాత్మనే. కాబట్టి, మనం చెప్పుకొన్న అర్థం సముచితం. జీవాత్మ, పరమాత్మలకు అభేదాన్ని "స ఏషా ఇవణ ఇచ్ఛమానః ప్రపద్యతోవర అవిశేశ" అ పరమాత్మే జీవుడుగా ప్రవేశించినాడని శ్రుతి చెప్పింది. కనుక శరీరంలోని చైతన్యం పరమాత్మయేకాని భిన్నంకాదు. ఇవి రెండూ సజాతీయ, విజాతీయ, స్వగతములు అనే మూడు భేదాలు లేనట్టితే.

735

తెల్లదనం ఒక్కటే తక్కిన ఆరు రంగులకు మూల మైనట్లు, సహస్రారస్థ పరమాత్మ ఒక్కడే- అవ్యక్త మహ దహంకారములకు మూలమయిన ప్రకృతికీ, దానియందు ప్రతిబింబించిన జీవునికీ, ఆత్మనుండి కలిగిన పంచభూతాలకూ కారణ మవుతున్నాడని గ్రహించాలి.

736

త్రివిక్రము డనగా మూడు తావులను మెట్టిన విష్ణు వని భావము. పృథివ్యంతరిక్ష ద్యులోకములను మెట్టిన భగ వంతుడని బ్రహ్మాండ పక్షార్థం కాగా; స్థూల, సూక్ష్మ, కారణ, శరీరాల యందు ప్రవేశించిన జీవుడని పిండాండ పక్షార్థం. ఈ రెండర్థాలు జీవేశ్వరుల యొక్క అద్వైత స్థితికే నిదర్శనాలు.

737

"ఏకం సద్విప్రా బహుధా వదంతి" అన్న వేద వాక్యానికి అర్థం- ఉన్న తత్త్వం ఒక్కటే అని. దానిని బుద్ధి మంతులు అవ్యక్త, మహదహంకార, పంచతన్మాత్రలుగాను, వాటి వికారములు గానూ, అనేక రీతులుగా చెపుతూ ఉంటారు. ఈ నానాత్వము నందు ఏకైక సద్వస్తువును దర్శించ టమే పరమార్థమన్నా, పరమార్థ దృష్టి అన్నా.

738

ఏకానికి అనేకంగా తోచే శక్తి సహజసిద్ధమేనని ఉప నిషత్తే చెపుతున్నది.

"ఏకం రూపం బహుధాయః కరోతి తమాత్మస్థం యేను పశ్యంతి ధరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం" ఒక రూపాన్ని అనేక రూపాలుగా చేసే శక్తి ఆ వస్తువుకే ఉన్నది. ఆ వస్తువు అందరి హృదయాల్లోనూ ఉన్న విశ్వకర్మ (రూప పరమాత్మ)యే. దానిని, దాని తత్త్వమును చూడగలిగిన ధీరులకే శాశ్వతానందం. తక్కినవారికది లేదని కూడా శ్రుతి అన్నది.

739

శరీర రక్షణ కోసం స్త్రీలు చీర, రవికలను; పురుషులు ధోవతి, చొక్కాలను ధరించటం అవసరమే. అవి లేకపోతే దేహం శీతాతపవర్షవాతాలకు తట్టుకోలేదు. అంతమాత్రాన ఆ దుస్తులే తాము అని, స్త్రీ పురుషులెవ్వరూ భావించరు. అలాగే జీవాత్మకూడా తాను వ్యక్తం కావడానికై స్థూల, సూక్ష్మ, కారణ దేహాలను ధరించక తప్పదు. అంతమాత్రంచేత ఆ దేహాలే తమ స్వరూపం, తాము అనుకొనగూడదు. అవి ఆత్మాభివ్యక్తికి, ఆత్మ సాక్షాత్కారానికి సాధనములు మాత్రమే. ఆ మూటిలో స్థూల దేహాలు వస్తూపోతూ ఉంటాయి. సూక్ష్మ, కారణ దేహాలేమో మోక్షసమయంలో తామూ నశిస్తాయి. ఈ మూటినుండీ విడివడడమే ముక్తి అంటే.

740

సదసదతీత తత్త్వము నుండి వచ్చిన జీవికి మరల ఆ తత్త్వములో చేరిననే కాని సార్థకత్వము, ముక్తి లేదు. సద

పదలీతము, సచ్చిదానందాత్మ అనేవి రెండే తురీయాతీత, తురీయములు. అవలి. సుషుప్తి మాయతో సంసర్గము, సూక్ష్మ, స్థూల దేహముల సృష్టి. అదే సంసారమంటే. అక్కడనుండి మగల సూక్ష్మ తత్త్వ ప్రవేశము, దానినుండి కారణ శరీరరూప సమాధి లోనికి, అటనుండి పరమ కారణ రూప తురీయాతీతానికి ప్రయాణం సాగాలి. దాంతో సమాప్తి.

741

"సమూఢమస్య పాంసురే" అన్నమాట, విష్ణువు పృథివియందు కుండలినీ రూపముగా ఉన్నాడని సూచించు చున్నది.

742

"అహం బ్రహ్మాస్మి" అనగా ఆజ్ఞాచక్రము నందలి ప్రత్యగాత్మయు, సహస్రారము నందలి పరమాత్మయు ఒక్కటే అని అనుభూతి పొందడం. దీనినే జీవేశ్వర ఐక్య మని గూడా అనవచ్చును.

743

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అనగా పరమాత్మ భిన్నంగా తోచి, జగద్రూపంగా ఉన్న ప్రకృతికూడా బ్రహ్మమే కాని ఇతరము కాదు (ప్రకృతి కాదు) అనే అను భూతిని పొందడం. దీనితో ప్రకృతి పురుషైక్యం సిద్ధిస్తుంది. అయినా సాధకుని కిలాంటి బ్రహ్మజ్ఞానం కలిగినప్పటికీ, ప్రకృతి యొక్క జ్ఞానమూ, అది అగపడడం వలన దాని

యొక్క ప్రతీతి, పోలేదు కాబట్టి దాని దృఢత్వం కోసమై "బ్రహ్మైవేదం విశ్వం" అని భావించవలసి వచ్చింది. నాయనా నీకు ప్రతీతమగుతున్నదంతా బ్రహ్మమే కాని, జగము కాని, విశ్వముకాని కాదని ఇందలి పరమార్థం.

744

కొంతకాలం జీవించేటప్పటికి సంసార సుఖాల మీద, లోకం మీద రోతపుట్టి, అనుభవించినవాటినే మళ్ళీ, మళ్ళీ అనుభవించలేక చచ్చిపోదామనే భావం కలుగుతుంది కొందరికి. ఆ భావం కొద్దిపాటి జ్ఞానం ఉన్నవారికి కలిగినట్లయితే వారు జన్మరాహిత్యం చేసుకుందామనే కోరికగా మారుతుంది. అప్పుడలాంటివారు సాధన చేసి ముక్తులు కావచ్చు.

745

జగత్కారణమైన పరమేశ్వరుడికి, మనః ప్రాణ శరీరాది సాధనాలతో నిమిత్తం లేదు. ఏ సాధనాలు లేకుండా కార్యాన్ని సాధించకలిగేదే భగవచ్ఛక్తి. అందుకే అతనిని "అప్రాణో హ్యమనాః శుభ్రః" అనీ, "దివ్యోహ్యమూర్తః పురుషః" అనీ ఉపనిషత్తులు వర్ణించాయి. ఆ సర్వశక్తి నుండే మనః ప్రాణ శరీరాదులు కలుగుతున్నప్పుడు, అతనికి వాటితో పనేముంటుంది. అందుకే "ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణిచ ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ" అతని నుండే మనః ప్రాణా

ద్రులున్ను పృథివ్యాదులు, కలుగుతున్నాయని మంత్రాలు చెవు తున్నాయి కదా! అయితే కొన్ని మంత్రాలు "విశ్వకర్మా మనసా యద్విహాయా ధాతా విధాతా" అని ఆ విశ్వకర్మ మనస్సంకల్ప మాత్రంచేత జగత్తులను సృష్టించాడని చెప్ప టం సాధకుల సులభావగాహన కోసమే కాని, ఆయనకు మనస్సనే ద్రోకటుండి, దానితో సంకల్పం చేసి సృష్టించాడని కాదు. అందుకు తార్కాణంగా "అపాణిపాదో జవనో గ్రహీతా, పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా, తమాహు రగ్ర్యం పురుషం మహాన్తం" అనే మంత్రం ఆయన మనః ప్రాణ, శరీరేంద్రి యాలు లేకుండానే అన్ని పనులు చేయగల సర్వశక్తి అని చెప్పుతున్నాయి. కనుక "విశ్వకర్మా మనసా" అన్నప్పుడు మనం మనస్సుతో సంకల్పిస్తాము గనుక భగవంతుని కూడా ఆ ఋషి అలాగే భావించి చెప్పినాడని అర్థం చేసుకోవాలి. ఇందుకు నాసదీయ సూక్తమే చక్కని నిదర్శనం. అందలి షడసదలీత మూలతత్త్వం నుండి తమస్సు, మనస్సు, రేతస్సు, కామం మొదలైనవి కలుగక పూర్వం దానికేవీ లేవుకదా! "సర్వా రూపాణ్యై విశ్వకర్మా స్వయంభూ రభవత్తదా" అని మూలస్తంభం చెప్పినది కదా. కనుక విభిన్నార్థాలు కల శ్రుతులను మనం అవిరుద్ధంగా సమన్వయించుకొని, తత్త్వార్థ సిద్ధిని పొందవలసి యున్నది.

**740**

బాహ్య విషయాల నుండి ఉపరతిని పొందని (విర

మించని) యోగియొక్క బ్రహ్మజ్ఞానమూ, మనస్సుకు శాంతిని కూర్చని తపోయోగములూ నిష్ఫలాలు.

747

చిత్తము, ఇంద్రియ విషయాల నుండి విరమిస్తే, అది బ్రహ్మమయము అయినట్లే. వానిని మించిన వాడెవడూ ఉండడు.

748

నిజమైన సన్యాసి బూడిద వంటివాడు. బూడిద మండనూ మండదు, ఆరనూ ఆరదు. అలాగే ఈ సన్యాసి కోరేదీ, చేసేదీ, పొందేదీ ఏమీ ఉండదు.

749

ప్రత్యగాత్మ స్వరూపుడవైన నీయందు సంసారమనేది (దేహాదులు) లేనే లేదు. అయినప్పటికీ నిర్మలాకాశమున మలినత, మబ్బు, మంచు మొదలైనవి తోచినట్లు అజ్ఞానం వల్ల నీయందు సంసారం కల్పింపబడి తోస్తున్నది. అయినా అది నీకు అంటదు.

750

“అహం” (నేను) అనే అంతఃకరణ వృత్తిలో చిదంశ, జడాంశ రెండూ ఉన్నవి. జడాంశ “నేను” అంటుంది. చిదంశ దాన్ని ప్రకాశింపచేస్తుంది. ఆ రెంటికీ తాదాత్మ్యం ఏర్పడుతుంది. దాన్నే చిజ్జడ గ్రంథి, హృదయ గ్రంథి అంటారు. తత్త్వవేత్త అయిన గురువు “తత్త్వమసి” అనే మహావాక్యాన్ని బోధించి త్వం పదంలోని చిదాంశ, జడాంశ

లను వేరుచేసి చూపుతాడు. అప్పుడు అహంకారమనే జడాంశకు చిదంశ ప్రకాశకమై సాక్షి, ప్రత్యగాత్మ, కూటస్థుడు ఇత్యాది పదాలచేత పేర్కొనబడుతుంది.

751

"భిద్యతే హృదయ గ్రంధి శ్ఛిద్యన్తే సర్వసంశయాః,
క్షీయన్తే చాస్యపాపాని తస్మిన్ దృష్టే పరావరే."

పరావర పురుషులకు అవ్వలిదైన ఆ పరమాత్మ సాక్షాత్కారం అయినప్పుడు, హృదయ గ్రంధి (ముడి) విడిపోతుంది. అప్పుడాత్మునికి పంచ కోశములే తాననే భ్రాంతి, సందేహాలు విడిపోతాయి. దానితో అన్ని పాపములు-ఆగామి, సంచిత కర్మలు నశిస్తాయి. అతడు జీవన్ముక్తుడూ, బ్రహ్మీభూతుడూ అవుతాడు.

752

ఆత్మయొక్క వెలుగుపడి మొదటిగా తోచేది అహంకారమే. అది జడమైనా చిత్తు యొక్క సంపర్కం చేత, చేతనంగానే భాసిస్తుంది. ఆ అహంకారానికి పిమ్మటనే మనో బుద్ధి వృత్తులు, సంకల్ప వికల్పాలు, ఇంద్రియ వ్యాపారాలు, విషయాలు తోస్తాయి. కనుక ఆత్మకు తర్వాతిదైన ప్రత్యక్తత్త్వం అహంకారమే. అది ఆత్మలో లీనమవుతుంది సమాధి సమయంలో. అందలి సంసార బీజమనేది ఆత్మ సాక్షాత్కారంతో నశిస్తుంది. "భిద్యతే" అనే మంత్రం ఈ రహస్యాన్నే మనకు చాటుచున్నది.

753

నీకు ఆత్మజ్ఞానం కలగాలంటే గురువు ఉపదేశించే "తత్త్వమసి" మహావాక్యం వల్లనే కలుగుతుంది. అటుపిమ్మట ఆత్మానుభూతి కలగాలంటే నీవు మననం చేసే "అహం బ్రహ్మాస్మి" అనే మహా వాక్యం వల్లనే కలగాలి. కనుక నే వేదాంతంలో త్వం, అహం, అనే రెండు పదాలు ఆత్మను లక్షించేవి అయినాయి. "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి" అనే వాక్యాలు మహావాక్యాలు అయినాయి.

754

ఆత్మ (చిదంశ)కు అతి సమీపంగా ఉండేది అహంకారమే. దానిమీద చిత్ప్రకాశము పడి రెంటికీ తాదాత్మ్యం ఏర్పడుతుంది. తర్వాత మనోబుద్ధులు, చిత్తం అనేవి. వీటి తర్వాత ఇంద్రియాలూ, ప్రాణమూ, స్థూలమైన దేహమూ ఏర్పడతాయి. ఈ మొత్తాన్నే అజ్ఞానులు నేను అంటున్నారు. తత్త్వవేత్త స్థూల శరీరం నుండి, ఆత్మ వరకు గల తత్త్వాలను విభజించి తెలుసుకొంటూపోయి, పరాగ్రూపాలయిన బాహ్య సాధనాలను విడిచి, ప్రత్యగ్రూపమయిన ఆత్మతత్త్వ స్వరూపుడై ఆనందిస్తాడు. పరాగ్వస్తువులు దుఃఖప్రదాలు కాగా, ఆత్మ వస్తువు ఆనంద స్వరూపమయి ఉన్నది. అందుకే "ఆత్మయే ద్రష్టవ్యం, శ్రోతవ్యం, మన్తవ్యం, నిధిధ్యాసితవ్యం అన్నారు పెద్దలు.

755

ప్రపంచంలోని సర్వ పదార్థాలకూ జాతి, గుణ,

క్రియలు ఉంటాయి. అవి దేవ, మనుష్య, క్రిమి, కీటాది జాతులకు చెందినాని; ఎఱుపు, నలుపు, తెలుపు, మంచి, చెడు- ఇత్యాది గుణాలు కలిగిగాని; నడవడం, కూర్చుండడం, చేయడం, చేయకపోవడమనే క్రియలు జరుపుతూ కాని ఉంటాయి. ఆత్మ మాత్రం జాతి, గుణ క్రియలు లేక నిర్వి శేష చిన్మాత్రమై ప్రకాశిస్తుంది.

756

ఆత్మ లేక బ్రహ్మము- అనునది వాచ్యము కాదు; అందుకే దానిని అవాచ్యమన్నారు. ఒక విషయము- వాచ్యము కావలెనన్నచో అయిదు నియమములు ఉండవలె. వాటినే 1) సంబంధ, 2) గుణ, 3) జాతి, 4) క్రియా 5) రూఢులు అన్నారు. "ఈ చొక్కా రామునిది" అన్నప్పుడు చొక్కాతో రామునకు సంబంధమున్నది. ఆ విధముగా ఆత్మకు దేనితోను సంబంధము లేదు. ఆత్మ నీలత్వ, శ్వేత త్వాది గుణములు లేనందున, అది ఆ పదములచే చెప్ప బడదు. అట్లే దానికి దేవ, మనుష్య, తిర్యగాది జాతులు లేవు. ఆత్మ నిష్క్రియము కాన, దానిని క్రియాబోధకముల చేత చెప్పరాదు. ఆకాశ, చంద్ర, సూర్యాది శబ్దములు ఆ యా వస్తువుల యందు రూఢములైనవి కాన, వాచ్యమును చెప్పును. కాన, త్వం (నీవు) అహం (నేను) అనెడి పదముల చేత అది లక్షింపబడునే కాని, వచింపబడుట లేదన్నారు.

757

... మిథ్య అంటే శూన్యమని భావిస్తారు. శూన్యమంటే

వంధ్యా పుత్రాదుల వలె అసలు లేకపోవడం కావాలి. మిథ్య అలా శూన్యం కాదు. ఒకప్పుడు కనబడి (తోచి) ఇంకొకప్పుడు తోచకపోవడమే మిథ్య అంటే, అంటే అనిర్వచనీయమని అర్థం. మిథ్యా శబ్దానికున్న ఈ అపార్థాన్ని పోగొట్టడానికే మేము "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అనకుండ, "బ్రహ్మసత్యం, జగద్బ్రహ్మ" అన్నాము.

768

మిథ్యాజ్ఞానం వల్ల సత్యజ్ఞానం కలగడం మన అనుభవంలో చూస్తున్నాము. ప్రతిబింబం మిథ్య అయినా, దాని వల్ల బింబం యొక్క సత్యజ్ఞానం కలుగుతుంది కదా! అలాగే స్వప్నంలో వ్యాఘ్ర దర్శనం వల్ల, దొంగలు కొట్టినందువల్ల మెలకువ అనే సత్యకార్యం జరుగుతున్నది కదా! అలాగే మిథ్యా భూతాలయిన వేదాంత యొక్క శ్రవణాదుల వల్లనూ సత్యమైన పరబ్రహ్మ జ్ఞానం కలుగుతుంది.

769

అవిద్య కాని, మిథ్యాజ్ఞానం కాని, ముక్కుకొనపై ఉన్న గోలికాయ వంటిది. అవి ఎక్కువసేపు నిలువవు. క్రిందపడిపోతవి. అలాగే ఎవనియొక్క గాని, అజ్ఞానం శాశ్వతంగా నిలవదు.

760

మనకు సత్త, ప్రతీతి అని రెండు అనుభవాలున్నాయి. సత్త అంటే శాశ్వతంగా ఉండేది. ప్రతీతి అంటే తోచి మాయమయ్యేది. ఆకాశం శాశ్వతమైనది. కానిమేఘ

తోచే చీకటి, వెలుగు, మబ్బులు మొదలైనవి ప్రతీతము లయ్యేవి. అలాగే బ్రహ్మపదార్థం శాశ్వతం. దానిమీద తోచే జగత్తు ఒకప్పుడుంది ఇంకొకప్పుడు నశించేది. కావ బ్రహ్మ సత్యమనీ, జగత్తు ప్రతీతిమాత్ర సత్యమనీ అను కోవాలి. ప్రతీతి సత్యాన్ని మిధ్య అని కొందఱు అన్నారు. సత్తను పారమార్థిక సత్యమనీ, ప్రతీతిని మిధ్య అనీ కూడ అన్నారు.

761

తన శరీరావయవములలో ఒకదానిచేత ఇంకొకదానికి బాధ కలిగినను ఆ అవయవమును, మనమెట్లు ద్వేషింపమో, అట్లే సర్వభూతముల యందును, చిదాత్మ దర్శనము చేయగలిగిన ఆత్మయోగి శత్రు, మిత్ర, బంధు ఉపకారి, అపకారుల యందు ద్వేషమును గాని, రాగమునుగాని చూపక సమభావము కలవాడయ్యే నడచుచుండును. ఈ అంశమునే గీత :-

> "సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు
> సాధుష్వ పిచ పాలేషు సమవృత్తి ర్విశిష్యతే॥

అంతరంగిక మిత్రుడు, సామాన్య మిత్రుడు, మధ్యస్థుడు, విరోధి, బంధువు, సాధువు, పాపులు, పుణ్యులు మొదలగువారియందు సమ ప్రవర్తన కలవాడు తత్త్వవేత్త అని చెప్పబడును. యోగార్హులలో ఇట్టివాడు శ్రేష్ఠుడన్న మాట. అరి అనగా సామాన్య శత్రువు. సుహృత్ ప్రత్యుప

కారాపేక్ష లేక ఉపకారము చేయువాడు. ఉదాసీనుడు ఏదీ పట్టించుకొనని వాడు. మధ్యస్థుడు పరస్పర విరోధము కల ఇరువురికీ సమానుడు. ద్వేష్యుడు తనకు అప్రియుడు.

762

పొట్టి, పొడుగు, లావు, సన్నము అనేవి శరీరాదులైన వాటి ధర్మములు. వాటిని ఆత్మ గ్రహించుచున్నది. అట్లే అహంకారం, మమకారం, ప్రయత్నం, కోరిక, సంకల్ప వికల్పాలు, ద్వేషాదులను కూడ ఆత్మ గ్రహిస్తున్నది. అవి అంతఃకరణం యొక్క ధర్మాలు. అంతఃకరణమంటే సూక్ష్మ, కారణ శరీరాలే. కాన, అవి వాటి ధర్మాలే కాబట్టి, వాటిని కలిగిఉన్న సూక్ష్మశరీరం నీవుకావు కదా!

763

అంతఃకరణము ఆత్మకు దృశ్యమవుతున్నది. ఆ అంతః కరణం లోనే అహం (కారం) పుట్టుతున్నది. కనుక అహ మనేది కూడ అంతఃకరణం లాగ ఆత్మకు దృశ్యమే అవు తుంది. కాన అహమనేది దృశ్యమే కాని, దృక్కు కాదు. దృక్కే గనుక అయితే దానికి దృశ్యత్వం ఉండదు. నేను అనగానే అది మనకు (ఆత్మకు) విషయమవుతుంది కదా! కనుక కేవలాత్మ దృక్కే కాని, దృశ్యం కానేరదు. మనం అహం అనుకొనే దానిలో అంతఃకరణమూ, దాని అహం, వృత్తి, చిచ్ఛాయ ఉండి దానికి దృశ్యత్వాన్ని సంపాదిస్తు న్నాయి. కాన అహంకారం అంటే చిదాభాసుడు లేదా

ప్రమాత కేవలాత్మకు దృశ్యమే అవుతున్నది. ఇకపోతే ఆ అహంకార సాక్షినే మనం కేవలాత్మ అనవలె. ఆ కేవలాత్మయే నీవు కాని, అంతఃకరణోపాధిక చిచ్ఛాయ నీవు కాదన్నమాట. తత్త్వమసి మహావాక్య లక్ష్యార్థంతో బోధించే కేవలాత్మ ఇదే.

764

జడమైన అంతఃకరణమూ, స్వయంప్రకాశమైన ఆత్మ రెండూ చేరి అహం అని వ్యవహరింపబడుతున్నవి. అంటే అహంలో జడాంశ కొంత, చైతన్యాంశ కొంత ఉన్నవన్నమాట. జడాంశమయిన అంతఃకరణాన్ని నిరాకరించి, చైతన్యాంశను స్వీకరించడమే సాధకులకు కర్తవ్యం. అదే యదార్థ స్వరూపమని తెలియడమే తత్త్వ జ్ఞానం.

765

అహంలో (అంతఃకరణంలో) నిజజాంశమైన దృశ్యము, అందు ప్రతిఫలించిన ఆత్మాంశ కూడా, జడంతో చేరినందు వలన దృశ్యమే అయి, అహంగా లెక్కింపబడుతున్నది. ఈ మొత్తమైన అహమనే దృశ్యాన్ని చూచే, కేవలాత్మయే సాక్షి, దృక్కూను. తత్త్వమసి మహా వాక్యం లక్ష్యార్థంతో బోధించేది దీన్నే. దీన్నే సాధకుడు, అహం బ్రహ్మాస్మి అనే మహావాక్యం ద్వారా అనుభవిస్తున్నాడు.

766

ఇదివరకు అహమని అనుకొన్న నేను, బ్రహ్మమును గాని, అహంకారమును కాను- అని "అహం బ్రహ్మాస్మి"

వాక్యము యొక్క భావము. దీనిని బాధా సమానాధికరణ వాక్యమని అంటారు. ఇంతవరకు అహంకార వాచ్యుడుగా నున్న నేను సత్య జ్ఞానానంత బ్రహ్మమునే కాని, అంతః కరణోపాధి విశిష్ట జీవుడను కానని భావము.

767

అహం శబ్దానికి ముఖ్యార్థ మొకటి, అముఖ్యార్థం ఒకటి ఉంటుంది. వీటినే వాచ్యార్థ, లక్ష్యార్థము లంటారు. నేను పోతున్నాను, చేస్తున్నాను ఇత్యాదిగా పామరులు వాడేది ముఖ్యార్థం. అంటే ఇక్కడ కూటస్థ చిదాభాసు లిద్దరూ తాదాత్మ్యాన్ని పొంది వ్యవహరింపబడుతున్నారు. జ్ఞానుల వాడుకలో కూటస్థునీ, చిదాభాసునీ వేరుచేసి నేనసంగుడను, బ్రహ్మమును అనీ, నేను చేస్తున్నాను అని ఇత్యాదిగా వాడుతారు. ఇక్కడ కూటస్థ, చిదాభాసులకు వేర్పాటుకాని, ఐక్యం లేదు. ఇవి రెండూ అముఖ్యార్థాలు. అంటే లక్ష్యార్థా లన్నమాట.

768

ఇది నాకు తెలిసింది అనే జ్ఞానంకాని, తెలియదు అనే అజ్ఞానం కాని, చిదాభాసునికేగాని, కూటస్థునికి లేదు.

769

ఆవరణ మనేది అసత్వావరణమనీ, అభానావరణ మనీ రెండు రకాలు. ఒక వస్తువును అసలు లేదనుకోవడం అసత్వా వరణం. ఉన్నా కనబడడంలేదను కోవడం అభానావరణం.

ఆత్మ లేదనుకొనే కారిది అసత్త్వావరణం కాగా, తోచడం లేదనుకోవడం అభానావరణం.

770

బుద్ధిచేత, శ్రవణ మననాదులచేత నెఱుంగుట బ్రహ్మము యొక్క పరోక్ష జ్ఞానం. తన్ను స్వయంప్రకాశ బ్రహ్మంగా అనుభూతి పొందుట అపరోక్ష జ్ఞానం.

771

బ్రహ్మపదార్థ మొక్కటి దేహేంద్రియ, ప్రాణ, మనో, బుద్ధ్యహంకారముల కంటె భిన్నముగా కలదని తెలిసికొవడం పరోక్ష జ్ఞానం. దానియొక్క (స్వయంప్రకాశ స్వరూప) అనుభూతిని పొందడం అపరోక్ష జ్ఞానం.

772

జగత్కారణ బ్రహ్మము లేదనుకొనడం, అసత్త్వాంశం ఉన్నా అది ప్రకాశించడం లేదనుకొనడం అభానాంశం. ఇవి రెంటిలో మొదటిది పరోక్ష జ్ఞానం చేత, రెండోది అపరోక్ష జ్ఞానంచేత నివర్తిస్తవి.

773

కూటస్థ చైతన్యంతోను, చిదాభాసునితోను కూడు కొన్న స్థూల, సూక్ష్మ దేహాలెప్పుడు తన స్వరూపమని జీవుడనుకొంటాడో అప్పుడే వాడు సుఖ, దుఃఖాలు గల సంసారి అవుతాడు. అలాగే భ్రమాంశాన్ని తిరస్కరించి అధిష్ఠానమే నా రూపమని భావిస్తాడో, అప్పుడే తాను అసంగ చిద్రూపుడై ప్రకాశిస్తాడు.

774

జీవునికి 1) అజ్ఞానము, 2) ఆవరణం, 3) విక్షేపము, 4) పరోక్ష బుద్ధి, 5) అపరోక్ష బుద్ధి, 6) శోక నివృత్తి, 7) నిరతిశయ తృప్తి అని ఏడు దశలుంటాయి. వీటిలోనివే బంధ మోక్షములు కూడ. ఈ ఏడింటిలో మొదటి మూడూ- అంటే, అజ్ఞానావరణ, విక్షేపములు మూడూ బంధకములు కాగా; తరువాతి రెండూ మోక్ష హేతువులు, దుఃఖనివృత్తి నిరతిశయ తృప్తులు; ఫలములు.

775

ఏది బాధింపబడుతుందో అది మిథ్యా జ్ఞానం. ఏది సర్వకాల సర్వావస్థల యందు బాధింపబడదో అది పరమార్థ జ్ఞానం. జగత్తు- సుషుప్తి, సమాధులలో బాధింపబడుతుంది. అంటే కనబడదు. కనుక దాన్ని మిథ్యాజ్ఞాన స్వరూప మన్నారు. ఆ జగత్తును చూచే ఆత్మవస్తువు జాగ్రత్స్వప్న సుషుప్తి, సమాధి, దశలలో బాధింపబడక ఏకరూపంగా భాసిస్తుంది కనుక దాన్ని పరమార్థ జ్ఞానమనీ, పరబ్రహ్మ మనీ అన్నారు.

776

నామరూప జగత్తు బ్రహ్మ స్వరూపమే. దానికి పరమై ఉండే నామ, రూపరహిత బ్రహ్మాన్ని పరబ్రహ్మమని అన్నారు. జగత్తుకు, పరబ్రహ్మకు ఇదే తేడా. బంగారం నగగా రూపొందినా, బంగారమే అయినట్లు; పరబ్రహ్మం జగ ద్రూప బ్రహ్మంగా అగపడినా అది పరబ్రహ్మం కాకపోదు.

777

దేహేంద్రియ, ప్రాణ, మనో బుద్ధులకు భిన్నుడై స్వయం ప్రకాశాసంగ చిన్మాత్రుడైన కూటస్థునికి (ప్రత్యగాత్మకు) శారీరకములైన త్రివిధ తాపములు లేనట్లు, అతని ప్రతిబింబమే అయిన చిదాభాసునికీ లేవు. అయినా చిదాభాసుడు శరీరత్రయంతో తాదాత్మ్యమును పొందినవాడు కావున, అవి వానికున్నట్లు భావించుచున్నాడు. కూటస్థుని నిత్యత్వమును తనయందారోపించుకొని తానునూ నిత్యుడననుకొనుచున్నందున, ఆ బాధలునూ నిత్యములనుకొనుచున్నాడు. ఈ అనర్థమంతయు తాదాత్మ్యము (ఆరోపము) వలన కలిగినది. కావున సర్వానర్థములు తాదాత్మ్యమును పొందిన చిదాభాసునకే గాని కూటస్థునికి బాధలు, వికారములు లేవు అట్టి కూటస్థుడవే నీవు.

778

జీవన్ముక్తి నందినవాడు ప్రారబ్ధ దుఃఖము ననుభవించుచున్నా, అతని జీవన్ముక్తానందమునకు లోటు ఉండదు. ప్రారబ్ధమున కంటె అధికమైన మోక్షానందము కలిగినందున అది అతనికి బాధాకరము కాదన్నమాట. కన్ను లొట్టపడినను చావు తప్పినది కదా!

779

జీవునికి (చిదాభాసునికి) మోక్షం కలిగినా, వాడు ప్రారబ్ధం తీరేటంతటి వరకు, శరీరాన్ని ధరించి ఉండక తప్పదు. అతని వివేక జ్ఞానమనేది దుఃఖ నివృత్తికీ, నిరతి

కలయ తృప్తికి ఉపయోగపడుతుందే కాని ప్రారబ్ధాను భవాన్ని తప్పించుకోవడానికి పనికిరాదు. అయితే అతని అనుభవం దగ్ధ పటం (తగులబడిన గుడ్డ) లాగ ఉంటుంది.

780

జ్ఞానికి లోక వ్యవహారము బాధకము కానిచో దాని నాచరించినను నష్టము లేదు. దానివలన బాధ కలుగుచో దానినుండి విరమించి ధ్యాన, సమాధి, బ్రహ్మ చింతనాదుల నాచరింపవచ్చును. ఇది వారి వారి పరిపక్వ స్థితిని బట్టి ఉంటుంది.

781

సమాధి, విక్షేపము లనేవి వికారవంతమైన మనో ధర్మములు కాని, ఆత్మ ధర్మములు కావు. కావున, సాక్షాత్తూ చిద్రూపుడైన వానికి సమాధితో పనిలేదు. అతడెల్లప్పుడు నిర్వికార బ్రహ్మస్వరూపుడే.

782

నీకు ఆత్మజ్ఞానం కలిగేటంతవరకూ నిన్ను మాయ తిప్పలు పెడుతూనే ఉంటుంది. ఆత్మ సాక్షాత్కారం అయితే అది నీ జోలికి రాలేదు. దూరంగా తొలిగి ఊరు కుంటుంది.

783

నీవు నీ స్వరూపంతో (సచ్చిదానందాలతో) రెండో వస్తువు యొక్క సంబంధం లేకుండా ఉండడమే ముక్తి. నీకు

ప్రకృతి తోను, దాని కార్యాలతోను తాదాత్మ్యం కలగడమే బంధం.

784

ఏకైకమైన సత్య జ్ఞానానందాత్మక పరబ్రహ్మమే మాయ వల్ల విష్ణ్వాది శరీరాలలో ప్రవేశించి దేవుడయినాడు. ఆ బ్రహ్మమే అవిద్య వల్ల (పంచకోశ సంబంధం వల్ల) జీవులలో ప్రవేశించి పై దేవతలకు భక్తుడయినాడు.

785

మాయా విద్యల ప్రభావాన్ని విచారించినందువల్ల బంధ స్వరూపమూ, వాటిని విచారించి జీవేశ్వరుల తత్త్వాన్ని తెలిసికొనడం వల్ల మోక్షమూ కలుగుతాయి.

786

అంతర్ముఖమైన నీ అంతఃకరణ వృత్తి, అహంకారమై కర్తృత్వాన్ని పొందుతున్నది. బహిర్ముఖమై ఇదమనే (ఇది అనే) పేరుతో బాహ్య వస్తురూపాన్ని పొందుతున్నది.

787

అహంవృత్తినీ, ఇదంవృత్తినీ ప్రకాశింపచేసే చైతన్యమే (ఆత్మయే) నీవంటే. అందులోనూ వృత్తిప్రతిఫలిత చైతన్యం చిదాభాసుడూ, దానియొక్క బింబం కూటస్థుడూ అవుతారు. ఆ కూటస్థ బ్రహ్మమే నీ స్వరూపం.

788

జాగ్రత్స్వప్న దశలలో పేరుకొన్న నేతివలె ఉండే విజ్ఞానమయుడు, సుషుప్తివేళ కరగబెట్టిన నేతివలే ద్రవీ

భూతుడై యుంటాడు. అప్పుడాతనికి, ఆనందమయుడని పేరు. కాగా ఆనందమయ, విజ్ఞానమయులు వేరుకారనియు, అవస్థలను బట్టియే ఆనందమయ, విజ్ఞానమయ నామములు కలిగినవనియును, అందువల్లనే ఆనందమయుడు కానుభవించిన అజ్ఞానానందములను జాగ్రత్తలో స్మరింప గలుగు తున్నాడనియు తెలియవలె.

789

విజ్ఞానమయుడే కరిగిన నేతివలె ఆనందమయుడై అజ్ఞాన వృత్తులలో ప్రతిబింబించిన బ్రహ్మానందమును అనుభవించు చుండును. కావున సుషుప్తిలో బ్రహ్మానందమే తోచు చున్నది.

790

బుద్ధి వృత్తుల కంటె అజ్ఞాన వృత్తులు మిక్కిల సూక్ష్మములు. కాన అవి బ్రహ్మవేత్తలకు మాత్రమే గోచరించును గాని సామాన్యులకు గోచరించవు.

791

ఆత్మ మూడు విధములు. 1) గౌణాత్మ, 2) మిథ్యాత్మ, 3) ముఖ్యాత్మ. "ఆత్మా వై పుత్ర నామాసి" అన్నందువలన పుత్రుడాత్మయ డన్నారు. ఇతడే గౌణాత్మ. "ఈ పిల్లవాడు నిప్పురా" అన్నప్పుడు, నిప్పులో ఉన్న గుణాలు ఇతనిలో ఉన్నవని భావముకాని, నిప్పూ-పిల్లవాడూ ఒకటి అని అర్థం కాదు. అలాగే పుత్రుడు, ఆత్మ అన్న

ప్పుడు వాడు గౌణాత్మ అని అర్థం. తండ్రి బాధ్యతలు వహించవలసినవాడని భావం. పంచకోశాలు దానికంటె లోపలివి. వీటినన్నింటినీ ఆత్మ అనే భావిస్తున్నారు. అవి మిథ్యాత్మలు కాని, ముఖ్యాత్మలు కావు. ఈ పంచకోశాలకు అవ్వలగా ఉండి వీటిని ప్రకాశింపచేసే సాక్షియే అంతరాత్మ, ముఖ్యాత్మ. వేదాంతమంతా దాని బోధకే కొనసాగుతుంది.

792

అనుకూల్య, ప్రాతికూల్యములు లేనట్టిదే వస్తుగతమైన నిజ సుఖము. బ్రహ్మమునకు గాని, ఆత్మకు గాని, అనుకూల్య ప్రాతికూల్యములు లేవు. కాన అది ఆనందరూపము. లౌకిక వస్తువు లన్నియు అనుకూలములో, ప్రతికూలములో అయి యుండును. కాన అవి రాగ, ద్వేషములను కలిగించు చున్నవి.

793

అనుకూల ప్రాప్తి యందు ఆనందము, ప్రతికూల ప్రాప్తి యందు దుఃఖము కలుగును. అవి రెండూ లేనప్పుడు జ్ఞానానందము వ్యక్తమగును.

794

అనుకూల్య, ప్రాతికూల్యములు మనస్సుకు బాహ్య వస్తు సంపర్కము కలిగినప్పుడు సంభవించునవి. ఆ మనస్సేమో క్షణికము. కాన అవి శాశ్వతములు కావు. నిజానందము, మనస్సంపర్కములు లేని ఆత్మకు సంబంధించినది. అది ఎప్పుడును నశింపదు.

795

బ్రహ్మచింతనము లేక ధ్యానము రెండు విధములు. అవి సోపాధిక చింతనము, అఖండ బ్రహ్మ చింతనము అనునవి. ఆకాశాదులయిన ఉపాధుల యందు గల బ్రహ్మమును ధ్యానించుట సోపాధిక బ్రహ్మచింతనము. నిరుపాధికమయిన అఖండైకరస బ్రహ్మమును ధ్యానించుట అఖండ బ్రహ్మ చింతనము.

796

"విద్యాయాం సచ్చిదానందా, అఖండైక రసాత్మతాం, ప్రాప్య భాంతి నభేదేన, భేదకోపాధి వర్జనాత్". నిర్మల జ్ఞాన దశలో బ్రహ్మస్వరూపమైన సచ్చిదానందములు; సజాతీయ, విజాతీయ, స్వగత భేద శూన్యమైన, అపరిచ్ఛిన్నమైన కేవల వస్తు మాత్రముగా ప్రకాశించును. భేదాన్ని కలిగించే ఉపాధులు లేవు కనుక, అది నిరుపాధిక బ్రహ్మస్వరూప స్థితిగా ఎరుంగవలెను.

797

శాంత, ఘోర, మూఢములనే మువ్విధములైన ఉపాధులను వీడిన స్వయంప్రకాశ బ్రహ్మతత్త్వము భాసించెని అద్వైత దశయందు త్రిపుటికి తావు లేదు. కావున దానిని భూమానందమని అందురు. (పంచదశి 11 ప్రకరణం)

798

పరమాత్మ అన్నిటికంటె విలక్షణంగా ఉండి, దేన్నీ అంటకపోయినా, అన్నిటి రూపమూ తానే అయి, అన్నిటినీ

ప్రేరేపించేది ఆ శక్తే. అన్నిటికీ లోపలా, వెలుపలా ఉన్నదీ అదే.

799

బ్రహ్మము యొక్క స్వభావమే (స్వరూపమే) ప్రపంచమంటే. అంతేకాని ప్రపంచం యొక్క స్వభావం మాత్రం బ్రహ్మం కాదు. దాని స్వభావం నామరూపాత్మకం, అసజ్జడ దుఃఖ రూపం. కనుక నీవు బ్రహ్మ స్వరూపుడవు కావాలంటే నామ రూపాతీతుడవు, అసజ్జడ దుఃఖదూరుడవు కావాలి.

800

ప్రపంచం లేకుండా పోవడం కాదు సాధకుడు సాధించవలసినది. ప్రపంచం తోచడానికి హేతువైన అవిద్య నశించేట్లు చూడడం మాత్రమే. ప్రపంచానికి మూలం అవిద్య కనుక అది నశిస్తే ప్రపంచం లేనట్లే లెక్క. ఉన్నా అది నిన్నేమీ చేయలేదు. కొమ్మల నెన్నిసార్లు నరికినా చెట్టు నశించదు. కూకటి వేరును నరికితే ఇక చెట్టే నశిస్తుంది.

801

జగత్తు బ్రహ్మంలాగ నిత్య సత్యం కాదు. అది మాయ. అంటే కనిపిస్తుంది, మళ్ళీ పోతుంది. జగత్తును (ఖు) చూచేవాడు (ద్రష్ట) వేరే ఉన్నాడు. బ్రహ్మానికి వేరుగా చూచేవాడు లేడు. వాడే సర్వద్రష్ట. అందుకే అతని ఛాయను బింబం చూస్తుంది. కాని, బింబాన్ని ఛాయ చూడలేదు. అంతేకాదు. బింబం లేకుండా ఛాయ ఉండదు.

ఛాయకు ఉనికిని కల్పించేది బింబమే. అలాంటి బింబ స్వరూపుడవే నీవంటే.

802

జగత్తే లేకపోతే నీకు బ్రహ్మన్ని తెలుసుకొనే సాధనమే లేకపోయేది. కనుక బ్రహ్మజ్ఞానానికి జగత్తును సాధనంగా చేసుకోవలసి ఉన్నది. అంతేకాని, ఆ జగత్తులోనే సాంతం మునిగిపోతే దుఃఖరూప సంసారమే నీకు గతి!

803

ఆత్మ దర్శనాన్ని పొంది ఆ ఆత్మకు ప్రతిబింబమైన విశ్వాన్నంతటినీ, నీలో దర్శించడమే విశ్వరూప దర్శనమంటే. దాన్ని గీతాకారుడు కవితా చమత్కారంతో వర్ణించినాడు.

804

పరమాత్మ జగద్రూపాన్ని తాల్చితే 'విశ్వకర్మ' అవుతాడు. తాల్చకుండా ఉంటే విశ్వబ్రహ్మ మవుతాడు. ఆ ఇద్దరిలో ఎవ్వరిని ఉపాసించినా పరమాత్మారాధనమే.

805

జగద్రూపమూ, బ్రహ్మరూపమూ రెండూ నీలోనే ఉన్నాయి. ఆ రెంటినీ రెండుగా గాక, ఏకంగా చూడడమే అద్వైత స్థితి.

806

నీవు బాహ్యాభ్యంతర కర్మలకు పూనుకుంటే,

జగత్తువునూ, పూనకుండా సమాధిగతుడవై తే నిష్క్రియాత్మ్మడవునూ అవుతావు. జ్ఞాని ఈ రెండూ కాగలడు.

807

## పాశుపత మతము లోని పంచ తత్త్వములు

1) కారణము : జగము యొక్క సృష్టి, స్థితి, లయాదులకు కారకుడు ప్రభువు. అనగా భగవంతుడు. 2) కార్యము :- ఆ కారణముచే గలిగిన కార్యమనగా అవిద్య. కళలు లేక ఇంద్రియములు, జీవులు లేక పశువులు, పంచ భూతములు, పంచ గుణములు, సర్గ; స్థితి; జ్ఞానములు, జ్ఞాన కర్మేంద్రియములు, మనో; బుద్ధి; చిత్తాహంకారములు- ఇట్టివన్నియూ కారణుడైన పశుపతి నుండి కలిగినవే. ఇదే సంసారము. 3) యోగము :- మానవుడు మనశ్శుద్ధిచేత భగవంతుని చేరు మార్గము. 4) విధి లేక నియములు :- ధర్మానుష్ఠాన మార్గములు. 5) మోక్షము :- ఇది దుఃఖాంతమగు స్థితి. పూర్ణ క్రియా జ్ఞాన శక్తులు గల స్థితి. మోక్షము నందినను, జీవుని వ్యక్తిత్వము పోదు. అతడు ఏ పనినైనను చేయజాలిన శక్తిమంతుడగును.

808

పరమాత్మకాని వస్తువంటూ ఏదీ లేదు. బ్రహ్మ, విష్ణ్వాది దేవతలూ, జగత్తు; జగత్తు లోని పదార్థాలూ అన్నీ, అంతా కూడా ఆయన వివర్తమే. అంటే మారు రూపాలే. అణువు నుండి, అణువు లోని కోట్యంశం వరకూ అన్నింటి యొక్క రూపాలూ, ఆయన ధరించే ప్రకాశిస్తున్నాడు.

కనుకనే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని వేదం చెప్పింది. నీవు చేయవలసిందెల్లా విశ్వాన్ని బ్రహ్మమయంగా భావించి అనుభూతికి తెచ్చుకోవడమే.

809

విశ్వమంతా బ్రహ్మమే కాన, దాన్ని విశ్వబ్రహ్మమన్నారు.

810

బ్రహ్మమూ, బ్రహ్మశక్తీ అంటూ ఒకటి లేదనేవారు కూడా ఆ బ్రహ్మము యొక్క స్వరూపులే. సందేహం లేదు.

811

బ్రహ్మ, విష్ణు, రుద్రులు ఎక్కడో లేరు. వారు నీలోనే ఉన్నారు. నీలో సంకల్పాన్ని పుట్టించేదే బ్రహ్మశక్తి. దాన్ని కార్యరూపాన పోషించేదే విష్ణుశక్తి. దాన్ని చివరకు తనలో లీనం చేసుకొనేదే రుద్రశక్తి. అవతల నీకు కలిగే శాంత్యానందాలే పరబ్రహ్మ స్వరూపం. నీకు బ్రహ్మ, విష్ణు, రుద్రులు చేసే ఉపకారాలు ఇవే. సంకల్పం కలగక ముందూ, కలిగి అంతరించినాక నీవు పరబ్రహ్మ స్వరూపుడవే. మధ్యలోనే సృష్టి, స్థితి, ప్రళయాలు.

812

మనుష్యులందరూ ఒకసారి పుట్టిన ఏకజన్ములే. కాని తత్త్వజ్ఞాన సంపన్నులు మాత్రము భగవంతుని నిజంగి ఇంకొక జన్మము నెత్తురురు కాన వారిని ద్విజన్ము లనవలెను. అంతేకాని ఉపనయన మాత్రముచే ద్విజన్ముడగుట విశేష మేమీ కాదు. ద్విజన్ముడనగా ఆత్మసిద్ధిని పొందినవాడే.

813

మంత్రజపానికంటెనూ, రూప ధ్యానాదులకంటెనూ, మనస్సును బ్రహ్మమయం చేసి జరిపే ఆత్మనిష్ఠ సర్వశ్రేష్ఠమయినది. దీనినే బ్రాహ్మీ స్థితి లేక బ్రహ్మానుసంధానం అనవచ్చు. ఇది పదపదలీత పరబ్రహ్మ స్థితికూడా.

814

ఆత్మ సాక్షాత్కారం కానీ, భగవత్సాక్షాత్కారం కానీ పొందిన వ్యక్తికి లోకంలో జీవించి ఉండవలసిన అవసరం ఏమీ ఉండదు. అయినా అతడు ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ, లోక సంగ్రహార్థం కాలక్షేపం చేస్తూ ఉంటాడు. ప్రారబ్ధం తీరగానే శరీరం పతనమైపోయి, బ్రహ్మంలో లీనమౌతాడు. అంతేకాని బలవంతాన శరీరాన్ని వదలడు.

815

"ఇది నా మతం, ఇందులో మీరు చేరండి" అని మతంలో ఇతరులను చేర్చుకోనేకంటే - నీ మతంలో ఉన్న సత్య సూత్రాల చేత ఆకర్షింపబడి, వారు అందులో చేరినట్లయితే అది చాలా గొప్ప మతమూ, గొప్ప సిద్ధాంతమూ అవుతుంది. నీ సిద్ధాంతంలో అలాంటి గుణాలు ఉన్నప్పుడు అందులో చేరమని ఎవరినీ కోరనక్కరలేదు. దాని గుణాలే వారిని ఆహ్వానిసాయి.

816

మేనకలో సంగమమే జరగకపోతే విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయ్యేవాడు కాదు. దానితో ఆయనలోని కామ

వాసన దగ్ధమైపోయింది. బ్రహ్మర్షి కావడానికి ప్రతిబంధకం తీరిపోయింది. అతడు తరువాతి సాధనతో బ్రహ్మర్షిత్వాన్ని పొందాడు. మేనక దేవ వేశ్య అవునో కాదో నాకు తెలియదు కాని, విశ్వామిత్రుడి పాలిట ఒక దేవత అని మాత్రం నాకు తెలుసు. అయితే ఇలాంటి సంఘటనలను అపార్థం చేసుకొని ఎవరూ భ్రష్టులు కారాదని ఈ హెచ్చరిక. బ్రహ్మర్షి అయ్యే ప్రతివాడికీ ఇలాంటి సంఘటన అవసరమని అనుకోరాదు.

817

మనసులోని సంస్కారాలను అణచివేయడం వేరు, వాటిని పెళ్ళగించి వేయడం వేరు. అణచివేసినవి మళ్ళీ అంకురిస్తాయి. మొక్కలను గిల్లివేస్తే మళ్ళీ చిగురించినట్లు. కాని వేరుతో కూడ కుళ్ళగించివేస్తే ఇక అంకురించలేవు. దాన్నే సమూలం (వేరుతో)గా నాశనం చేయడమంటారు. వేరు లేనిదే మొక్క చిగురించదు కదా!

818

మనఃప్రాణము లనేవి ఆత్మ యొక్క ఛాయ (నీడ)ల వంటివి. నీడలు లేకపోయినా దానికి మూలమైన వస్తువు ఉండగలుగుతుంది కాని, మూల వస్తువు లేకుండా మాత్రం నీడ ఉండలేదు. ఇది మన అనుభవంలో ఉన్న సత్యమే. కనుక నీవు అయిన ఆత్మ నీ మనఃప్రాణములు పోయినా శాశ్వతమై నీ స్వరూపంగా ఉండనే ఉంటుంది. అందుకే

"ఆత్మాత్వం గిరిజామతిః పరిజానాః ప్రాణాశ్శరీరం గృహం" అని అన్నారు. నీకు నీ గురువు బోధించే తత్త్వమసి మహావాక్యంతో నీవంటే ఆత్మ అనే భావం, బ్రహ్మమనే భావం ఇమిడి ఉన్నది కాని, శరీర మనః ప్రాణాలు నీవనే భావం లేదు. అవి స్థూలములైన వాచ్యార్థాలు, ఆత్మ, బ్రహ్మమనేదే లక్ష్యార్థం.

819

"సాంఖ్య యోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి, న పండితాః, ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభయోర్విందతే ఫలమ్" (గీత 5-4) ఇందు చెప్పబడిన సాంఖ్యము జ్ఞానయోగ మనియు, యోగము అనగా అష్టాంగ, కుండలినీ యోగము లనియు, కర్మయోగ మనియు గ్రహించవలసి యున్నది. బ్రహ్మంగారు ఈ సాంఖ్య యోగములను రెంటినీ అనుస రించినారు. సాంఖ్యమని చెప్పబడిన జ్ఞానమునకు ఆయన జీవితమున అడుగడుగునను ఉదాహరణలు అగపడుచున్నవి. అట్లే ఆయన కర్మ సన్యాసి కాలేదు. జీవితమంతయు నిష్కామ కర్మయోగిగానే గడపినాడు. ఇక అష్టాంగ కుండలినీ యోగములను గూర్చి చెప్పవలెనన్నచో ఇవి రెండును ఆయన జీవితమున పెనవేసికొనియే యున్నవి. అందుకనియే ఆ మహనీయుడు పూర్ణయోగియై జగదుద్ధ రణ కార్యములను చేయజాలినారు. ఇది గీతా శ్లోకమునకు గూడ సమన్వయించునట్టిదే కాని భిన్నము కాదు.

820

ఆత్మలో కొంత ఆత్మశక్తి (మాయ లేక ప్రకృతి) కలిస్తేనేగాని భూతములు పుట్టవు. కేవలాత్మగాని, ఆత్మశక్తి గాని జగత్తుల సృష్టికి సమర్థములు కావు. రెంటి సమ్మేళనము జరిగిననే జగమేర్పడును. కనుక నీలో సగమై ఉన్న మాయను నీవు జయించవలెనేకాని, దానికి లోబడరాదు. దానిని జయించుటకు మార్గము ద్వేషము కాదు. లోకమున ఏ శత్రువును జయింపవలెనన్నను, విరోధము, పగ, ద్వేషము వహించెదరు. కాని "మాయా శక్తి" విజయము పగ చేత కాదు. ప్రేమానురాగముల చేతను, భక్తి విశ్వాసముల చేతనే అది సాధ్యము. అందుకే మాయా శక్తిని, జగన్మాతనుగా ఎన్ని మనవారు ఆరాధించుట.

821

నీ శరీరము నందలి మాయాశక్తిని, దాని కార్యమును గుర్తించి తిరస్కరింపక, ఆరాధించుచు, వశము చేసి కొన్నచో నిన్నా శక్తి ఇబ్బంది పెట్టక మార్గదర్శిని కాగలదు. ఆమెను ద్వేషింతువేని నీకు పతనము తప్పదు. ఈ రహస్యమును మఱువక నడుచుకొనుము.

822

ఆత్మ అంటే తాను అని భావం. తన్ను పరమాత్మ అని గురువు చెప్పినా, శిష్యుడు విశ్వసించలేడు. కారణం ఇంతవరకూ తానంటే కించిజ్ఞత్వాది గుణాలు గల జీవునిగా భావిస్తున్నాడు కదా. అలాంటి ప్రకృతి గుణాలకు అతీతమైన

పరమాత్మవు నీవని గురువు చెప్పినా, శిష్యుడు నమ్మలేక పోవడంలో ఆశ్చర్యం లేదు. తనలోని దుర్గుణాలను, అవ గుణాలనూ, అసలు గుణాలనే లేకుండా చేసుకొన్నప్పుడూ గుణాతీతుడు అయినప్పుడు మాత్రమే తాను పరమాత్మ అయ్యేది.

823

అద్వైత భావం బోధపడడము తెలిసినా, నిలబడి స్థిరం కావడము చాల కష్టం. ఎందుకంటే, నిరంతర వ్యవహారమంతా ప్రకృతితోనే కనుక, దాన్ని నడిపించే దృక్కు తాననే భావం స్థిరం కావడం చాల కష్టం. నిరంతర సాధన, మనన, నిధి ధ్యాసలుంటేనేకాని అది స్థిరపడదు.

824

భక్తి చాలా సులభం. ఎందుకంటే, తన కర్తృత్వం అంతా వదలుకొని, భగవంతుడి మీద ఆధారపడుతున్నాడు కనుక, తానై చేయవలసినదేమీ ఉండదు. అంతా భగవంతుడే చూచుకొంటాడని భక్తుని విశ్వాసం.

825

జ్ఞాన మార్గానికి తానే నిర్ణేత కనుక, అది చాలా కష్ట సాధ్యం. అందుకే గీత అన్నది "క్లేశోధిక తరస్తేషా మవ్యక్తా సక్త చేతసాం, అవ్యక్తాహి గతిర్దుః ఖం దేహ వద్భి రవాప్యతే" అవ్యక్తోపాసకులకు కష్టమెక్కువ అనీ, అది దేహధారి అయినవాడికి అంత తేలికేమీ కాదనీ భావం.

826

భక్తుని గూర్చి భగవానుడిలా అన్నాడు. "సర్వ ధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహంత్వా సర్వ పాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః" నీవు ధర్మా ధర్మాల గొడవలేమీ పెట్టుకోనకుండా నన్నొక్కనినే శరణు పొందు. నేనే నిన్ను అన్ని పాపాల నుండి ముక్తుణ్ణి చేస్తాను అని.

827

ఇక జ్ఞానిని గూర్చి చెపుతూ భగవానుడు, "తేషాం జ్ఞానీ నిత్యయుక్తః, జ్ఞానీత్వాత్మైవమే మతం" అందరి లోనూ జ్ఞాని నిత్యయోగి అనీ, జ్ఞానికీ నాకూ భేదం లేదనీ జ్ఞానిని నేనే అనీ అన్నారు.

828

నీవు ఇతరులు చేసే పొగడ్తలకు పొంగిపోకుండా ఉండడమే కాదు వారి నిందలకూ, దూషణలకూ క్రుంగి పోకుండా ఉన్నప్పుడే నిజమైన జ్ఞానివి అయినట్లు.

829

నీ ఎదుట ఎవరైనా ఇతరులను పొగుడుతూ ఉంటే నీకు అసూయ కలుగరాదు. వారి గొప్పదనాన్ని నీవుకూడా పొగడేటట్లు తయారుకావాలి.

830

వెలుపలి విషయాలనూ, సంఘటనలనూ చూస్తున్న

ప్పుడు నీలో ఏవేవో వికారాలు కలుగుతూ ఉండడం సహ
జం. కాని నిజమైన జ్ఞానికి అలాంటి వికారాలేమీ కలగవు.

831

నేను ద్రష్టను, దృశ్యాన్ని కాను అనే విషయాన్ని ఏ సమయంలోనూ మఱువకుండా ఉంటే నీకు ముక్తి కర తలామలకమే.

832

సాధకులను అధోలోకాలకు లాగేవి, లోపలవి, వెలుపలివి అయిన నానావిధ దృశ్యాలే. ఆ దృశ్యాలకు నేను ద్రష్టనే కాని, వాటిచేత ఆకర్షింపబడేవాడను కాను అనే నిశ్చయం నీకు ఉండాలి.

833

ఈ దృశ్య భ్రాంతి అనేది జ్ఞానికి కూడా అణపరాని కొండ అసురం. అలాంటిదాన్ని జయిస్తేనే నీకు విజయం.

834

లోకులు వేషాన్ని, భాషను చూచి మోహపడతారే కాని, లోపల నున్న జ్ఞానసారాన్ని గుర్తించలేరు. అందుకని నీవు వేషభాషల ద్వారా లోకాన్ని లోబరుచుకోవాలని చూడవద్దు.

835

వేషభాషల ఆడంబరం ముక్తిదాయకం గాదు. లోపలి జ్ఞానమే నీకు మోక్ష సంసిద్ధిని కూర్చేది.

836

విన్నన్న చెప్పిందే వేదం కాదు. నీవు తత్త్వ దర్శ

నాన్ని పొంది ఆలోచించిన కొద్దీ వేద మంత్రాలకు నూతనార్థాలు లోతైన భావాలు గోచరిస్తాయి. అందువల్ల వ్యాఖ్యానాలు చదివి ధన్యోస్మి అనుకోబోకు.

837

నాసదీయ, విశ్వకర్మ, పురుష సూక్తాల యొక్క వివరణే భగవద్గీతగా అగపడుతుంది. ఆలోచించి చూస్తే, ఇంకా ఎన్నో ఉపనిషత్తులు కూడ పై మూడు సూక్తాల ననుసరించే రూపుదిద్దుకొన్నవి అని గ్రహించగలం.

838

నీవు ఆత్మక్రీడ, ఆత్మరతి పరాయణుడవు అయినంత మాత్రాన, జగత్క్రీడను చిన్నచూపు చూడవద్దు. జగత్తే లేకపోతే నీవు ఆత్మవైపు తిరగనే తిరగవు. జగత్తు నిన్ను తన నుండి ఆత్మ వైపునకు నడిపిస్తుంది.

839

ఆత్మక్రీడ నేర్చిన తరువాత జగత్తు కూడా నీకు ఆత్మగానే పొడకట్టుతుంది. సాధించవలసినది రెంటికీ అభేద సిద్ధినే. అందుకే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నారు.

840

సాధువు అంటే ఆత్మ సాక్షాత్కారం పొందిన మహనీయుడు. అలాంటి సాధు సాంగత్యం నీకు అనేక లాభాలను చేకూరుస్తుంది.

841

సాధు శబ్దం స్త్రీ లింగంలోకి మారినప్పుడు, సాధ్వి

అవుతుంది. ఎంతోమంది సాధువులు, వాగ్దేవి మొదలయిన వారు వేద తంత్రాలను వ్రాసి తనకు వెలుగు బాటలను చూపినారు.

842

సాధు స్తుతి లాభకారి అయినట్లు, సాధునింద కూడా అనర్థకారియే. కనుక ఏ పరిస్థితులలోనూ సాధు దూషణ చేయకు.

843

ఏవీ చదువకపోయినా, ఒక్క సాధు సాంగత్యం వల్లనే ముక్తి పొందవచ్చు.

844

ఆకాశానికి శూన్యమని పేరు కూడా ఉన్నది. శూన్యమంటే ఏమీ లేనిదని మన మనుకొంటాము. మనం చూడ గలిగినవి ఏవీ అక్కడ లేనిమాట నిజమే. కాని, మనం చూడలేని గొప్ప శక్తులెన్నో ఆ శూన్యంలో నిండి ఉన్నాయి. ఈ విషయాన్ని వేదకులూ, బుద్ధాదులు చెప్పి ఉన్నారు.

845

మనం "వాక్యూం (Vacuum)" అనుకొనే శూన్యం ఎంత శక్తి కలదో ఆలోచించి చూడవచ్చు. శూన్యం ఏ శక్తి లేనిదయితే భగవంతుడికి సర్వశక్తి అనే పేరే పొసగదు. కనుక శూన్యం శూన్యం కాదు. అన్నిటికీ అది మూలమనుకోవాలి.

846

నీవు ఏ వస్తువునైతే ద్వేషిస్తావో, ఒకనాడు ఆ వస్తువుకే లోబడవలసి వస్తుంది. విశ్వామిత్రాదులు స్త్రీని ద్వేషించారు. చివరకు ఆ స్త్రీకే లోబడి సంసారం చేయక తప్పలేదు కదా! కనుక ప్రాపంచిక వస్తువుల మీద నీవు చూపవలసినది ద్వేషమూ, విరక్తీ కాదు, ఉపేక్ష-బ్రహ్మభావము. అప్పుడవి నీకు ఏ అపకారమూ చేయవు.

847

జనకుడు, అశ్వపతి, బ్రహ్మంగారు మొదలయిన రాజయోగులు స్త్రీని ద్వేషించలేదు. ఆమెను ప్రకృతిస్వరూపిణి అయిన దేవతగా భావించి ఆరాధించారు. అందువల్ల వారి పట్ల స్త్రీ మోక్షదాత్రియే అయినది.

848

మన ప్రాచీన తత్త్వశాస్త్రం చేసిన పొరపాట్లలో ఒకటి స్త్రీనింద. స్త్రీద్వేషం అనేదే. అలాంటి వారంతా చివరకు స్త్రీకి లోబడక తప్పలేదు. కనుక ఎవరుగాని ప్రకృతి ధర్మాన్ని తృణీకరించరాదు.

849

తత్త్వజ్ఞులు చేయవలసినది స్త్రీని ద్వేషించడం, తిరస్కరించడం కాదు. ఆమెను మాయాస్వరూపిణిగా భావించి ఆరాధించడం. అపుడు ఆమె నీకు మోక్షప్రతిబంధకం కాకపోగా, ముక్తి సహకారిణియే అవుతుంది.

850

శత్రువునే ద్వేషించరాదు అని చెప్పిన శాస్త్రకులు స్త్రీని ద్వేషించమని చెప్పరు. అలా చెప్పినట్లయితే వారు శాస్త్రకులే కాదు.

851

నీవు ఆత్మస్వరూపుడవే అయితే, ఆ ఆత్మను అభివ్యక్తం చేసినది ప్రకృతి స్వరూప మాయాశక్తియే. కనుక, ఆమెను నీవు ఎలా తిరస్కరిస్తావు ఆమెను తిరస్కరించడం నిన్ను నీవు తిరస్కరించుకొనడమే అవుతుంది.

852

ప్రకృతి పురుషుల, లేక జడచైతన్యముల, లేక శివశక్తుల సామరస్యం ఎఱిగి నడచుకొనే వానికి లోకంలో ఏ ఇబ్బందులు రావు. పారమార్థికంగా కూడ అతడు ప్రగాఢ శాంత్యానందాలనే పొంది అమృతుడు కాగలడు.

853

పూర్వజన్మలలో చేయబడి ఇప్పుడు అనుభవానికి వచ్చేదాన్ని ప్రారబ్ధ కర్మ అంటారు. సాధకుడు ఎంత జ్ఞాని అయినా ఆగామిసంచితాలను తప్పించుకొనగలుగుతాడే కాని ప్రారబ్ధాన్ని అనుభవించకుండా తప్పించుకోలేడు. అందుకే "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధం అనుభవిస్తే కాని తీరదు అన్నది శాస్త్రం. ఈ సంగతి అనేక శాస్త్రకుల విషయంలో మనం చూస్తూనే ఉంటాము. కొందఱు జ్ఞానులు, సిద్ధులు అయినా కొన్ని కొన్ని వ్యాధులలో బాధపడడం ప్రారబ్ధ దోషమే.

854

నిందాస్తుతులు, ఉన్నతి, అవనతులు, కీర్తి-అపకీర్తులు పేరు-ప్రతిష్ఠలు ఇలాంటివన్నీ కూడా ప్రారబ్ధాన్నిబట్టి కలుగుతుంటాయి.

855

జ్ఞానికి ఏది ప్రారబ్ధమో, అది ఎందువల్ల తప్పించుకొవడానికి వీలుకాలేదో తెలుసు. అందుకే అతడు ప్రారబ్ధానుభవానికి తన శరీరాన్ని సమర్పించి నిశ్చింతగా సంచరిస్తాడు. అజ్ఞానులు ఆ సంగతి నెఱుగక అతనిని అసమర్థుడుగాను, శక్తిహీనుడుగాను భావిస్తారు.

856

రాజుపాలెం అమ్మను చూడండి. ఆమె 15 ఏండ్ల వయస్సు వచ్చేవరకు కొన్ని సాధనలవంటివాటిని చేసింది. ప్రారబ్ధం తీరి పరిపక్వస్థితి కలిగిన తరువాత మనకు దర్శనం ఇవ్వడంకూడా మానివేసింది.

857

రెండువందల ఏండ్లనాడు వెంగుపూరులో నిర్వాణమ్మ గారని ఒక మహాత్మురాలు ఉండేది. ఆమెకూడ కొన్నాళ్లు భర్తతో సంసారంచేసి 40 ఏండ్ల ప్రాయంలో బ్రహ్మసాక్షాత్కారమయి సంసార పరిత్యాగంచేసి సిద్ధురాలయింది. అలాంటివారి సమాధులను చూచినా మనం ధన్యులమే. వెంగుపూరు వెళ్లితే ఆమె సమాధిని చూచి మరీ రండి.

858

జ్ఞానికి ఏ ప్రారబ్ధ కర్మ ఏదో రూపంగా, ఎప్పుడు

అనుభవానికి వస్తుందో తెలియదు. అందుకని అతడేమీ తబ్బిబ్బుకాడు. ఆ స్థితిని సామాన్యులు అర్థం చేసుకోలేక అతడు ప్రకృతికి లొంగిపోయినాడను కొంటారు.

859

జ్ఞాని ప్రకృతికి లొంగడంకాని, లోబడడంకాని లేనే లేదు. ఎందుకనంటే ఆ ప్రకృతికి జనకుడైన పరమాత్ముడే తానయినాడు కనుక, తన బిడ్డకు తాను లొంగడమేమిటి! అదంతా ప్రకృతి లీలమాత్రమే. అది అతనిని బాధించదు.

860

జ్ఞాని మర్మం జ్ఞానికే ఎఱుకపడుతుంది. అజ్ఞానులు అతనిని అర్థం చేసుకోలేరు.

861

ప్రారబ్ధాన్ని అనుభవిస్తూనే, జీవుడు ఆగామిని సృష్టి చేసుకొంటాడు. జ్ఞానులు ప్రారబ్ధాన్ని అనుభవిస్తారేకాని, ఆగామిని సృష్టించుకోరు.

862

అసలు ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మల రహస్యం, మాయ, మర్మం తెలుసుకోవడం చాలా కష్టం. ఎంతో మానసిక పరిశ్రమ, తపస్సు చేస్తేనేకాని అది అంతు పట్టదు. అందుకే "గహనా కర్మణోగతిః" కర్మ నడక అగమ్య గోచరం అన్నది గీత.

863

నీవు అనుభవించేది అంతా ప్రారబ్ధమే కాదు. ప్రార బ్ధాన్ని అనుభవిస్తూ, మరికొంత కర్మను ఆ సమయంలోనే

సృష్టించుకొంటూ ఉంటాడు జీవుడు. ప్రారబ్ధం ప్రతికూలమూ, అనుకూలమూ అవుతున్నప్పుడు కూడ కర్తృత్వం పూని కొంత కర్మను కల్పించుకొంటాడు. ఇది అతి రహస్య విషయము.

864

ఇంత ఎందుకు! నీవు కర్మప్రభుడవని తెలిసికొని కర్మను శాసించే శక్తి కలిగేవరకూ, ఆ కర్మ నిన్ను ముప్పుతిప్పల పాలు చేసి సంసార చక్రంలో పడవేసి త్రిప్పుతూనే ఉంటుందనుకో.

865

"జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః" అన్నట్లుగా పరమాత్మ తెలియబడితేనే కాని, కర్మపాశాలు తొలిపోవు. అంతవరకు నిన్ను కర్మ, సంసారంలో త్రిప్పుతూనే ఉంటుంది.

866

ఇంతకూ తేలిందేమంటే, ఆత్మజ్ఞానం కలగడమే కర్మముక్తి అంటే. అది కలుగనంతవరకు కర్మబంధం తప్పదు. ఆత్మనే కొన్ని గ్రంథాలు దేవుడని పేర్కొన్నవి.

867

ఇప్పుడు అనుభవించే కర్మకు ఇప్పటి నీవు కర్తవు కావు. పూర్వజన్మల లోని నీవు కర్తవు. కనుక ఇది నీ కర్తృత్వం లేకుండానే జరుగుతుంది. దాన్ని అనుభవిస్తూ, ముందు ఎలా ఉండాలో నీవు సంకల్ప, వికల్పాలు చేస్తున్నావు. కనుక

దానికి నీవు కర్తవు. కాబట్టి ఇలాంటి ఆగామిని సృష్టించబోకు.

868

నీవు పగలు సంకల్పించిన, అభిమానించిన, ఆసక్తి చూపిన విషయాలే రాత్రి కలలోకి వస్తాయి. అలాగే ఈ జన్మలో నీవు కోరుకొన్నవే తరువాతి జన్మలలో అనుభవానికి వస్తాయి. సంకల్పాలే రాగలిగినప్పుడు వాక్కుతోనూ, శరీరంతోనూ చేసినవి ఎలా తరువాత జన్మలలో అనుభవానికి రాకుండా ఉంటాయి!

869

కర్మ విచారణ వల్ల తేలేదేమంటే, నీవు దేన్ని సంకల్పించినా, దేన్ని పలికినా, దేన్ని చేసినా, వాటిని మిక్కిలి మెలకువతో ఆలోచించి, బాగోగులు తెలుసుకొని మరీ ప్రవర్తించమని. అందుకే సాధకులకు మౌనం అత్యవసరమని వేదాంతం చెప్పుతున్నది.

870

"జ్ఞానే మౌనం" అన్నాడు కాళిదాసు. వస్తు పరిజ్ఞానం కలిగినవాడు బడబడా వాగడు. మౌనధారియై అవసరమయినప్పుడు నోరు విప్పుతాడు.

871

నిన్ను, నీ శక్తిని ఇతరులు గుర్తించలేదని బాధపడకు. అలాంటిది జరగడానికి దేశ, కాల పాత్రల తోడ్పాటు చేకూరాలి. హెచ్చు తగ్గులతో కూడిన మానవ సమాజంలో

అలాంటిది మరీ కష్టమని మన అనుభవం చాటుతూనే ఉన్నది.

872

నీవు నీ భార్యా, పుత్ర, మిత్ర, బంధు జనానికి చేయ వలసిన సేవలు చేస్తున్నప్పటికీ, కర్తవ్యాల వంటివి నిర్వర్తించినప్పటికీ వాటితో సంగం లేనట్లు నిస్సంగత్వంతో ప్రవర్తించవచ్చు. అయితే ఇది ఒక అద్భుతమైన సాధన. అంటించుకోకుండా అంటించుకొన్నట్లు నటించటమే ఇది. అంటనట్లు ఉంటేనేకాని వారికి తృప్తి కలుగదు. ఇలాంటి నిస్సంగత్వం వల్ల నీకు నిర్మోహత్వం కలుగుతుంది.

873

వెన్నకు నీరు అంటనట్లు, ఇంకొకనికి మట్టి అంటనట్లు, నడచుకొనే పద్ధతి ఒకటి ఉన్నది. జ్ఞానులు ఆ పద్ధతినే అవ లంబించి సంచరిస్తారు. ఇలా అయితే నిస్సంగుడనే పేరు ఎలా వస్తుంది అని అనుకోకు. నీకు రావలసినది నిస్సంగుడనే పేరు కాదు. నిజమయిన నస్సంగత్వమే.

874

కర్తృత్వం లేకుండా కర్మను చేసేవాడు జ్ఞాని. కర్తృత్వంతో చేసేవాడు అజ్ఞాని, మొదటివానికి ముక్తి ఫలమయితే, రెండవవానికి బంధము ఫలము.

875

ఇంద్రియాలు విషయాలను అనుభవిస్తుంటే కానీ

అనుభవిస్తున్నా ననుకొంటాడు అజ్ఞాని. ఆ అనుభవించేవి ఇంద్రియాలే కాని తాను కాదనుకొంటాడు జ్ఞాని.

876

ఆకాశంలాగా నిర్మలమైనట్టి ఆత్మకు కర్తృత్వ, భోక్తృత్వాలు లేనేలేవు. అవి ఉన్నవనుకొని చిక్కుపాలు కావడమే బంధమంటే.

877

“నేను ప్రకృతి సంగం లేని నిర్మలుడను” అనుకొనే వాడికి సంసార మాలిన్యాలు అంటవు.

878

దృక్కు అయిన తనను, దృశ్యాలయిన తక్కినవాటిని వేరు, వేరుగా చూడనేర్చిన వాడే పరమ జ్ఞాని.

879

దృశ్యాలు కూడా ద్రష్ట అయిన తన నుండే వెలువడినాయని అనుభూతి పొందనేర్చినవానికి సమస్తమూ బ్రహ్మమయంగానే భాసిస్తుంది.

880

మనస్సు కల్పించే మంచి, చెడులను తనమీద ఆరోపించుకొని తాను చెడ్డవాడు, మంచివాడు, అనుకొంటాడు జీవుడు. నిజానికి ఆ రెంటికీ వాడు అతీతుడు.

881

నీ మనస్సే నీకు “నీవు సంసారివనీ, ముక్తుడవనీ” బోధిస్తుంది. ఆ మనస్సును దాటగలిగి నిన్ను నీవు చూచుకో గలిగినప్పుడు నీకు బంధ, ముక్తులనేవి లేనేలేవు.

882

బాగా గాలి వీచేటప్పుడు, విసనకఱ్ఱతో పని లేదు. ఆత్మవేత్తలతో మైత్రి కలిగితే నీకు చిల్లర మల్లర సాధనల తోనూ పనిలేదు.

883

సృష్టికర్త సాక్షాత్తు చిత్స్వరూపుడే అయినా, అతనికి అచిత్తుగా కూడ తోచడమనేది స్వభావం. కనుక నీవు అచిత్తును చూచి భయపడకు.

884

నీ దృష్టి పారమార్థికమైనా, వ్యవహారిక ధర్మాలను ఉల్లంఘించబోకు. వాటిని ఆచరించినా, ఆచరించకపోయినా నీకు ఏ లోటూ వాటిల్లదు. అయినా, ఆచరించటమే మంచిది.

885

పాములోను, పండితుడిలోనూ పరమాత్మయే ఉంటాడు అయినా వ్యవహార ధర్మంలో పామును పరిహరించాలి. పండితుణ్ణి పరిచరించి అనుసరించాలి.

886

పారమార్థిక వ్యావహారికాలు ద్వంద్వమయ ప్రపంచ ధర్మాలు. ఆ జగత్తులో ఉన్నంతవరకూ వాటిని అనుసరించక తప్పదు.

887

నీవు ద్వంద్వాతీతుడవైతే లోక వ్యవహారాన్ని, పాటించకపోయినా ఇబ్బంది లేదు. అప్పుడు నీవు అజ్ఞాన

పారికుడ వవుతావు. అదే త్రిగుణాతీత స్థితి. నిస్త్రైగుణ్య మార్గం.

888

మనస్సును, మాటలను కట్టివేసి ఆత్మ యందే రమించ నేర్చితే, దాన్నే స్వభావసిద్ధ అచల పరిపూర్ణ యోగ మంటారు.

889

ఏ కర్మబంధకమో, ఏది ముక్తిప్రదమో జ్ఞానికి తెలుసు. అందుకని అతను బంధకము లయిన కర్మల జోలికి పోడు. తన ఆశ్రితులను (శిష్యులను) పోనీడు.

890

త్రిగుణాతీతులై ప్రవర్తించేవారి సంఖ్య ఎప్పుడూ మిక్కిలి తక్కువగానే ఉంటుంది.

891

సత్యమైనట్టి ఆత్మ దర్శనమయితే ప్రాపంచిక వాంఛలు తలయెత్త నేరవు.

892

ఆత్మవేత్త అద్దాల మేడలో నివసించే మనిషి లాంటి వాడు. అద్దాల మేడలో ఉన్నవాడికి అన్నివైపుల తానే కనబడతాడు కదా. అలాగే ఆత్మవేత్త అన్నింటిలోనూ తననే చూచుకొంటాడు.

893

పాలు లేకపోతే వెన్న చిక్కదు. అలాగే ప్రకృతి

లేనపోతే పరమాత్మ చిక్కడు. నీవు ప్రకృతిలో నుండే పరబ్రహ్మ దర్శనం పొందాలి.

894

ప్రకృతి నిన్ను బంధించే మాట నిజమే కాని, నీకు ముక్తినిచ్చేది కూడా ఆ ప్రకృతే అని మరచిపోకు. దాన్ని సరిగా ఉపయోగించుకొంటే అది మోక్షప్రదమే అవుతుంది.

895

నటుడు అంటే నాలకాలంలో అనేక వేషాలు వేసే వ్యక్తి. అతడు అన్ని వేషాలు వేయగలడు. భగవంతుడికి నటరాజు అని పేరు. అంటే ఎన్నో వేషాలు మహా సమర్థతతో వేయగలవాడని అర్థం. ఆ వేషాలను బట్టి పేర్లు కూడా మారుతాయి. భగవంతుడు ఒక్కడే అయినా, ఆయన నానా రూపాలు దాల్చి, నానా నామాలు ధరిస్తాడు. కనుక అతడు ఇంద్ర, యమ, వరుణ, అగ్ని, బ్రహ్మ, విష్ణు, శివ, విశ్వకర్మ, పార్వతి, లలితాదులైన ఏ రూపాలలో ఉన్నా, ఆ నామ రూపాల చేత తెలియదగిన శక్తి ఒక్కటే అని గుర్తించాలి. ఇన్ని రూప, నామాలచేత ఆయన నటరాజు కదా!

896

జ్ఞానం అంటే ప్రతి వస్తువును "ఇది ఫలానిది" అని తెలిసికొనే తెలివి. లోకంలోని సమస్త వస్తువులను తెలుసుకొనే తెలివే జ్ఞానమంటే. ఇలాంటి జ్ఞానం సర్వ వస్తువులకూ సంబంధించే దయ్యేటప్పటికి, అది విశ్వజ్ఞానం అవుతుంది.

అన్నిటినీ తెలుసుకొన్నాక మిగిలే శూన్యాన్ని తెలుసుకొనే జ్ఞానం కూడ ఒక జ్ఞానమే. అదే సర్వజ్ఞానం "సర్వం ఖల్విదం బ్రహ్మ".

897

ఏ వేదాంతి అయినా కోరుకొనవలసినది జగన్నాశాన్ని కానీ, జగత్తు పోవాలని కానే కాదు. మరేమన ఆ జగత్తు వల్ల వేదాంతికి, వేదాంతి వల్ల జగత్తుకూ బాధ కలుగకుండ ఉండే స్థితి సాధించదగినది. జగత్తూ, నీవు-ఉభయులూ బ్రహ్మమే అనే భావం, అనుభూతి దృఢపడితే ఎవరివల్ల ఎవరికీ బాధ ఉండదు.

898

ఆస్తిక వాతమనేది సైన్సు తాకిడికి నిలబడ గలిగేదిగా ఉండాలి. అలా ఉండగలిగేది ఒక్క అద్వైత సిద్ధాంతం మాత్రమే.

899

ఒక బంగారం నుండి అనేక ఆభరణాలు వచ్చినా బంగారం యొక్క ఏకత్వానికి భంగం లేదు. అలాగే ఏకైక బ్రహ్మము నుండి అవ్యక్త, మహదంకార, తన్మాత్రాదులు, వాటి వికారాలు కలిగినా ఆ బ్రహ్మము యొక్క ఏకత్వానికి భంగంరాదు. అవి రెండూ ఒకటే. ఇదే అద్వైత పరమార్థం

900

మనం ఆచరించే నిత్య కృత్యాలకు, ప్రపంచ సంబంధ

మైన పనులకు ఆధ్యాత్మిక పరిమళాన్ని అద్దినట్లయితే అవి జన్మతారకాలు అవుతాయి. ఆధ్యాత్మిక పరిమళాన్ని అద్దుట అంటే ఆత్మలో ఎడతెగని సంబంధం వీటికి కలదని భావించడమే శ్రేయస్కరము. గంగాజలం ఉన్నదనుకోండి. దాన్ని దేవతా సంబంధ జలంగా భావించడమే ఆధ్యాత్మిక పరిమళాన్ని అద్దడమంటే. నీ నిత్యకృత్యాలను ఆత్మ సాక్షాత్కారం కోసమూ, ఈశ్వర ప్రీతికోసమూ చేస్తున్నానను కోవడమే! ఇందువల్ల ఆత్మ సంస్కారమూ, లోకక్షేమమూ రెండు కలిగే అవకాశంఉన్నది.

901

ప్రతి మానవుడికీ, జన్మతోనే కొన్ని సంస్కారములు ఉంటాయి. ఆ సంస్కారములనుబట్టి కొందరికి ద్వైతమూ; ఇంకాకొందరికి విశిష్టాద్వైతమూ, అజాతవాదమూ, పూర్ణ వాదమూ, శూన్యవాదమూ, నాస్తికమూ ఇత్యాదులు నచ్చుతూ ఉంటాయి. అంతమాత్రంచేత వారిలో ఎవరూ నిందార్హులు కారు.

902

తత్త్వవేత్త ఏ తరగతి జనులకు సేవచేయదలచుకుంటే తాను వారిస్థాయికి దిగి వారితో కలిసిపోయి వారికి అవసరమైన సేవలందించాలి. తన బ్రహ్మజ్ఞతను పాటించి ఆకాశ విహారం చేయరాదు.

903

నిర్వికల్ప సమాధిలో బ్రహ్మభావనకూడా ఉండదు.

అలాంటిది ఉంటే నిర్వికల్ప, నిష్కళంక సమాధి కానేకాదు. అది నాసదీయ సూక్తము చెప్పిన అతీతస్థితి.

904

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" కర్మలను చేస్తూనే నూరేండ్లు బ్రతకాలి అనేమాట నిజమే అయినప్పటికీ, ఒకానొక తత్త్వజ్ఞునికి కర్మలు చేయలేని దశకూడా రావచ్చు. అలాంటి వాని విషయంలో "నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన" అతనికి చేసినా చేయకపోయినా, ఆ రెంటివల్ల కలిగే ప్రయోజనంకాని, నష్టం కాని లేదు; అన్న గీతార్థాన్ని అన్వయించుకోవాలి.

905

"కర్మజ్యాయోహ్య కర్మణః" కర్మలు చేయకుండ మానేకంటే కర్మలు చేయడమే ఉత్తమం. ఇత్యాది సూక్తులు దిగువ మెట్టుకు సంబంధించినవే కాని, అతీత స్థితికి సంబంధించినవి కావు.

906

ఆడంబరాలులేని తత్త్వవేత్తలను లోకం గుర్తించలేదు. ఆడంబర ప్రధానులలో అంతస్సారం ఉంటుందో, ఉండదో గ్రహించనూ వీలుకాదు. అందుకే ఒక కవి "వేషధారులు లోకుల వేచువారు" అన్నాడు.

907

జగత్తుగాని, బ్రహ్మాంకానీ, సాపేక్ష సత్యాలేకాని, నిత్యసత్యాలు కావు. జగత్తు కనబడుతున్నది గనుకనే,

నరుడు దానికి భిన్నమైన బ్రహ్మపదార్థం కోసం వెతుకుతున్నాడు. తాను బ్రహ్మం కనుకనే తన దృష్టిలో తనకు భిన్నం అనుకునేదాన్ని జగత్తుగా ఎంచుతున్నాడు. కనుక తానుంటేనేకాని జగత్తు ఉండదు. జగత్తు ఉంటేనేకాని తాననేవాడు ఏర్పడడు. ఈ రెంటికీ మూలమైనదేదో అదే నిత్యసత్యం. ఆ నిత్యసత్యాన్ని నాసదీయ సూక్తం చెప్పుతున్నది.

908

జగత్తు లేకపోతే నీవే లేవు. నీవు లేకపోతే జగత్తూ లేదు. సాపేక్షవాదమంటే ఇదే. కనుక మీరిద్దరూ ఒకటైపోతే ఇక ప్రశ్న ఉండదుకదా! అదే వేదాంత సారమంతా. దీన్నే "రిలెటివిటీ (Theory of Relativity)" అన్నాడు ఐన్‌స్టీన్.

909

ఆత్మ, మనస్సు, ప్రాణము, పదార్థము అనుట పై నుండి క్రిందికి దిగుట. పదార్థము, ప్రాణము, మనస్సు, ఆత్మ అనుట క్రిందనుండి పైకి ఎదుగుట. ఈ మనస్సులోనివే బుద్ధి, చిత్తాహంకారములుకూడ. ఈ ఆరోహణావరోహణాలను (ఎక్కుట-దిగుట) అర్థము చేసికొని, అనుభూతి పొందుటే వేదాంత సర్వస్వము.

910

జగత్తు తనకంటే భిన్నమని, దాన్ని వదలివేసేగాని ఆత్మశాంతికాని, ఆత్మసాక్షాత్కారంకాని, కాదనుకోవడం ఒకదశలో ఉన్నవారు చేసేపని. ఇంకో దశలో ఉన్నవారికి

జగదాత్మలు రెండూ అభేదంగానే గోచరించినందువల్ల వారు జగత్త్యాగమంటూ చేయవలసిన పనిలేదు. కాని ఈ రెండో తరగతివారు ఎక్కడైనా తక్కువ సంఖ్యలోనే ఉంటారు.

911

దేశం అంతా అరాజకంగాను, అన్యాయాల సందిరిగాను సమాజమేమో దురాచారాలతోమా కళ్లు కంపు కొడుతూ ఉంటే ఏ తత్త్వవేత్త "అహం బ్రహ్మాస్మి" అని జపం చేస్తూ కూర్చోలేడు. ఆ సమాజాన్ని సంస్కరించే పనిలోనే బ్రహ్మ భావాన్ని చవిచూస్తారు.

912

ప్రపంచాన్ని వదలి దూరంగా ఉండడమే వేదాంత మని కొందఱి అపోహ. అది పూర్తిగా తప్పు. లోక శ్రేయోదాయకమైన పనులను చేస్తూ బ్రాహ్మీస్థితిని పొంద డమే నిజమైన వేదాంతి చేసే పని.

913

జీవుడు సుషుప్తిలోనికి పోయి కొంతసేపు ఆత్మ సుఖాన్ని పొంది మరలా జాగ్రత్తుకు వచ్చినట్లే, జగత్తు కూడా జగత్కారణమైన అతీత స్థితిలో లీనమై మరలా ఆ జగద్రూపాన్ని తాల్చుతూ ఉంటుంది. ఈ రెంటిలో ఒకటి పిండాండ చక్రంకాగా, రెండవది బ్రహ్మాండ చక్రం. పిండాండ మును ఆధారము చేసికొని బ్రహ్మాండ లక్షణాన్ని తెలిసికొని సత్యసాక్షాత్కారం పొందడమే జీవిత లక్ష్యం. కాబట్టి నీస్థితి నీకు అర్థమయితే విశ్వస్థితి, విశ్వముయొక్క కర్మల స్థితి, తత్త్వము అర్థమవుతాయి.

914

గృహస్థుడుగా ఉండికూడా, సన్యాసిగా మెలగవచ్చు. అప్పుడాతడు గృహస్థ సన్యాసి అనిపించుకొంటాడు. అట్టి వానికి శరీర పతనా (మరణ) నంతరం అంత్యకర్మ జరప నక్కరలేదు. బ్రహ్మీభూతునిగా భావించి ఆరాధనాదులు చేయడం మన శ్రేయస్సు కోసమే.

915

పంచబ్రహ్మ సిద్ధాంతానికి పంచ భూతాలు, పంచ కోశాలు, పంచ ఋషులు, పంచేంద్రియాలు, పంచావస్థలు మొదలైన పంచకాలు కారణం కాగా, త్రిమూర్తి సిద్ధాంతానికి త్రిగుణాలయిన తేజస్సు, జలం, అన్నము అనే త్రివృత్కరణ హేతువైనది. ఈ రెండు సిద్ధాంతాలు హేతుబద్ధాలే.

916

మెదడులో ఏడు రకాల భావాలను కలిగించే భాగా లుంటాయని సైంటిస్టులు చెప్తున్నారు. ఇవే కామ, క్రోధాదులను కలిగించే భాగాలంటారు. వీటిని ఆధారాది సప్త చక్రాలను అనుసరించి ఉండే భాగాలని కూడా యోగశాస్త్రానుసారం మాధీవరచవచ్చు.

917

"ఇంద్రియాణాంచ మనస ఏకాగ్ర్యం పరమం తపః" పది ఇంద్రియాలను, మనస్సును, ధ్యేయ వస్తువు (ఆత్మ)

మీద నిలపడమే శ్రేష్ఠమైన తపస్సని భావము. చింతింప దగిన పరమాత్మ మీద, జ్ఞాన కర్మేంద్రియాలను, మనస్సును లయం చేయడమే ఈ తపస్సులోని విశేషం. అంటే ఇంద్రియ వృత్తులను బంధించి బ్రహ్మాకార వృత్తిని లేదా బ్రాహ్మీ స్థితిని అలవరచుకోవడం అన్నమాట!

918

ఆత్మ ఆత్మశక్తి (మాయ లేక matter) రెండూ కలిస్తేనే కాని చరాచరములు పుట్టవు. కనుక ఏ మానవుడు కాని తనలోని మాయాశక్తిని తిరస్కరించి కృతార్థుడు కాలేడు. ఆ మాయాశక్తిని శ్రద్ధా, భక్తి, ప్రేమానురాగాలతో ఆరాధించితేనే కాని విజయం పొందలేడు. పూర్వం విశ్వామిత్రాదులు మాయాశక్తిని తిరస్కరించినందువల్లనే చివరకు దానికి లోబడవలసి వచ్చినది. ఈ రహస్యాన్ని ప్రతి సాధకుడు తెలుసుకొని మరీ ప్రవర్తించాలి.

919

మేనకా సంగమం జరగకపోతే విశ్వామిత్రుడు బ్రహ్మ ఋషి అయ్యేవాడు కాడు. ఆమెతోడి కలయికతో ఆయన లోని కామ (ధిక్కార) వాసన దగ్ధమై తరువాతి సాధనకు ప్రతిబంధకం తీరిపోయింది. ఆయన ఆ వాసనను అణచివేస్తే అది మళ్ళీ మళ్ళీ అంకురిస్తూనే ఉండి అతని పురోగమనాన్ని సాగనిచ్చేది కాదు. ఇలాంటి సంఘటనల అంతరార్థాన్ని మనం జాగ్రత్తగా భావించి గ్రహించాలి. ఇట్టివి అనర్థాలకు దారితీసేవి కాకుండా చూచుకోవాలి.

920

మానవ సమాజంలో అష్టాంగ యోగ ప్రచారం చేయడం మన కర్తవ్యం. దానివల్ల ప్రజల మనో, వాక్కాయ కర్మలు, పవిత్రాలు, బలిష్ఠాలు అయి వారు బ్రహ్మనిష్ఠకు అర్హులవుతారు.

921

మానవుడు తప్పులుచేసి వాటిని సమర్థించుకొనటానికి చూస్తూ ఉంటాడు. అది మంచి పద్ధతి కాదు. చేసిన తప్పులకు పశ్చాత్తాపపడి మరలా వాటిని చేయకపోవడమే ఉత్తమ లక్షణం.

922

"ప్రాణ అయూంపి కారిషత్" ప్రాణము, అంటే ప్రాణాయామ మనేది ఆయుస్సును పెంచుతుంది కనుక దాన్ని విడిచిపెట్టకు.

923

సిద్ధ పురుషుడు నిర్వికల్ప సమాధిలో, (తురీయాతీత స్థితిలో) పొందిన అనుభూతిని, జాగ్రదవస్థకు వచ్చిన పిదప తన భాషతో వర్ణించి చెప్పలేడు. ఆ స్థితి అమనస్కం కనుక దానిని మానవుడు సృష్టించిన భాష ఎలా వర్ణించ గలుగుతుంది. మూగవాడు తిని రుచిని అనుభవిస్తాడే కాని ఎదుటివారికి దాన్ని గూర్చి చెప్పలేకపోవటం ఇందుకు దృష్టాంతంగా తీసుకోవచ్చు. అందుకే ఆ స్థితిని "మదికి మాట కందనిది గదా తత్త్వంబు" అన్నారు.

924

దేశ, కాల, వస్తువుల యందు బ్రహ్మభావన అనేది ఒక విచిత్రమయిన రోగం. దీనిని అనుష్ఠించి తేనే కాని రోగి యొక్క సాధన పూర్తి కాదు. అయితే దీని పర మార్గాన్ని ఎఱిగి మరీ ఆచరణకు పూనుకోవాలి. బ్రహ్మము దేశ, కాల, వస్తు రూపములను అందినప్పుడు దానికి విధి, నిషేధములు అనే ద్వంద్వాలు తప్పవు. కనుక విధియోగ్య వస్తువులను విధులకే; నిషిద్ధములను, నిషేధములకే వాడు కోవాలి. అన్నమును భుజించడం ద్వారానే బ్రహ్మారాధన చేయాలి. అలాగే విషాన్ని వర్జించడం ద్వారానే ఆరా ధించాలి. ఈ రహస్యం తెలియనివాడు మూర్ఖుడు క్రిందనే లెక్క.

925

బ్రహ్మంగారు సన్యాసాశ్రమాని కంటే గృహస్థాశ్ర మానికే ప్రాధాన్యం ఇచ్చి ఆదర్శాన్ని చాటినారు. తమి ళంలో 'తిరుక్కురల్' అనే తత్త్వవేత్త కూడా గృహస్థాశ్ర మానికే ప్రాధాన్య మిచ్చినాడు.

926

విష్ణువు సప్త లోకాలను పుట్టినాడన్నప్పుడు ఆధారం మొదలుకొని సహస్రారం వరకూ గల సప్త కమలాలనే కాకుండా- రక్త, మాంస, చర్మ, మేధో-ఽస్థి, మజ్జ, శుక్రము లనే సప్త ధాతువులతో కూడిన శరీరమును శివ రూపముగా

పరమాత్మ పెట్టినాడని కూడా గ్రహించవచ్చును. ఈ భావం అద్వైత సూచకం.

927

నీకు తెలియని విషయాలు తెలియవని ఒప్పుకొన్నందు వల్ల, అర్థం కానివి అర్థం కాలేదన్నందువల్ల నీకు కలిగే నష్ట మేమీ లేదు. అలాంటివాటిని తెలుసుననీ, అర్థం కాక పోయినా అర్థమయినవనీ అన్నందువల్లనే చిక్కు వస్తుంది.

928

ఆధ్యాత్మికంగా అనేక విషయాలు యోగులకు కూడా తెలియనివి ఉండవచ్చు. అంతమాత్రం చేత వారి గొప్పదనా నికే, భంగం రాదు. మోక్షమూ సిద్ధించకపోదు. ఉదాహర ణకు పూర్వోత్తర జన్మలను గూర్చి ఎందరు చెప్పకలుగు తున్నారు! అవి బ్రహ్మంగారి వంటి ఒకానొక అవతార పురుషునికే గోచరిస్తాయి.

929

తత్త్వవేత్త నటుడు లాగ సంచరించాలంటే అర్థం కపటంగా ప్రవర్తించాలని కాదు. ఏ విషయాలతోను సంగం లేకుండా తామరాకు మీద నీటిబొట్టులాగ నడుచుకోవాలని మాత్రమే. తామరాకు మీది నీటిచుక్క ఉన్నట్లే ఉంటుంది కాని ఆకుకు అంటుకోదు. అలాగే నీవు కూడా అన్ని పనులు చేస్తున్నప్పటికీ వాటితో సంగం (ఆసక్తి) లేకుండా చేయమని భావం. అప్పుడు నీకు సుఖ, దుఃఖాలు కూడా కలుగవు.

930

ప్రాపంచిక విషయాలను ప్రకృతి రహస్య అన్వేషణను పరిహరించాలని ఎక్కడా లేదు. వాటిని అర్థం చేసుకొని లోకోపకారం కోసం తీర్చిదిద్దాలి. కొత్త విషయాలను వెదక టం, కొత్త సంగతులను కనిపెట్టటం శాస్త్రీకులు చేయరాని పని ఏమీగాదు.

931

ఇంతవరకు కనిపెట్టిన రహస్యాల కంటే కొత్తవి లేవనుకొనడం మూర్ఖత్వం. ప్రకృతిలోనూ, పరతత్త్వం లోనూ ఎన్నో పరమ రహస్యాలు దాగుకొని ఉన్నాయి. వాటిని వెదకి బయలుపరచి లోకోపకారం చెయ్యాలి జ్ఞానులు.

932

నీవు ఎంత దూరం ప్రయాణం చేసినా, ఇంకా అవతల పయనించవలసిన త్రోవ మిగిలే ఉంటుంది. ఆ మార్గం నిన్ను తన వద్దకు రమ్మని పిలుస్తూనే ఉంటుంది.

933

గమ్యం అనేది ఎక్కడో లేదు. అది నీలోనే దాగి ఉన్నది. వెదకి పట్టుకో. అందుకు సాధన చేయి.

934

"వెదకితే కనపడని వస్తువు ఎక్కడున్నదో చూడరా" అన్నారు బ్రహ్మంగారు. వెదకితే కనపడని ఆ వస్తువు వెదకు

లాడే కర్త కంటే భిన్నమేమీ కాదు. కనుక నిన్ను నీవు వెదకి పట్టుకోవాలి.

935

ప్రతి మనుష్యుడు తనకు వెలుపల ఉన్నవాటిని వెదకుతాడే గాని తనవైపు చూపు త్రిప్పి తన్ను తాను వెదుక పూనుకొనడు.

936

ఇంకొక వేత్త అన్నాడు. "తనలోన నున్న తత్త్వ మెవ్వరు తెరచి కనరన్న" అని. ప్రతివాడూ తనకు వెలుపల నున్నదాన్ని చూస్తాడే కాని తన్ను తాను చూచుకొనడు గదా! తన్ను తాను చూచి తెలిసికోగలిగితే అన్నీ 'తానే' అని తెలుస్తుంది.

937

వ్యవహార భాషలో వ్రాసిన తత్త్వాలు, ఏలలు, గేయాలు, పద్యాలు మొదలైనవాటిలో అద్భుత శాస్త్రీయ రహస్యాలు దాగిఉన్నాయి. వాటిని చిన్నచూపు చూడకు. పరిశోధించి తెలిసికో.

938

వేయి ఉపన్యాసాలు చేసేకంటే ఒక నిముసం నీవు మౌన ధ్యానం చేయడం నీకు లాభకారి.

939

వంద పుస్తకాలు చదివేకంటే ఒక సాధు పురుషుని మహా వాక్యాన్ని విని ఆచరించటం మేలు.

940

ఎన్నో తీర్థక్షేత్రాలకు తిరిగేకంటే తుణకాలంపాటు సాధు సంగమం జరపటం ముక్తిహేతువు.

941

సాధు సాంగత్య మనేది నీకు కలిగించే లాభాలు ఇన్నీ అన్నీ కావు అందుకే అన్నారు- "సాధు సంగంబు సకలార్థ సాధకంబు" అని.

942

డబ్బు కావలసినవారు బ్యాంకు వద్దకు వచ్చి, ఎవరికి కావలసిన డబ్బు వారు తీసుకొనిపోవునట్లు తత్త్వవేత్త వద్దకు పలు తరగతుల సాధకులు వచ్చి ఎవరికి కావలసిన విష యాన్ని వారు గ్రహించి పోతూఉంటారు. అతడొక తత్త్వనిధి అన్నమాట.

943

దాత (ధనవంతుడు) యాచకుల కోరికలను తీర్చలేక పోవచ్చును కాని, తత్త్వవేత్త జిజ్ఞాసువులకు తత్త్వబోధ చేసి తృప్తి కూర్చలేకపోవటమంటూ ఉండదు. తత్త్వధనం తరుగ నట్టిది కదా!

944

జిజ్ఞాసువు కాని, సాధకుడు కాని గృహస్థుడైతే ఆలు బిడ్డలు తన మార్గానికి అడ్డంకులైనారని నిందించరాదు. వారిని తన మార్గానికి అనుకూలంగా మలచుకొని వారికి తాను ఉపకరించాలి.

945

పూర్వజన్మ ఉన్నదా లేదా అని తెలిసికొనటానికి తల బ్రద్దలు కొట్టుకోకు. అదే కనుక లేకపోతే నీవు ముక్తిని మోక్షాన్ని పొందేది దేనినుండి! జనన మరణ చక్రము నుండి విడిపడడమే ముక్తి అన్నా, మోక్షమన్నా, నిర్వాణ మన్నా, బ్రహ్మైక్యమన్నా!

946

పునర్జన్మను ఒప్పుకోనివారు పొందేవి స్వర్గ, నరకాలే. పుణ్యాత్ములు స్వర్గానికి పోగా, పాపులు నరకానికి పోతారని వారి నమ్మకం. అంటే ఆ సిద్ధాంతం ప్రకారం పాపులకు నిష్కృతి (ముక్తి) లేదన్న మాట.

947

యోగ్యుడైన శిష్యునికి యోగ్య గురువు దొరకటం ఎంత కష్టమో, సద్గురువుకు సచ్ఛిష్యుడు దొరకడం కూడా అంతే దుర్లభం.

948

యోగ్యులైన గురు శిష్యుల కలయిక బంగారం పరిమళించడము, రత్న కాంచన సంయోగము వంటిది.

949

ప్రశ్నించినంత మాత్రాన శిష్యుడు గురు ధిక్కారం చేసినట్లు గాదు. అది జిజ్ఞాస (తెలుసుకోవలెనని కోరిక)యే అవుతుంది.

950

అర్హత లేని శిష్యునికి అతీత విషయాలు బోధించ పూనడం అపహాస్యానికే మూలం.

951

శిష్యుని అర్హత పెరుగుతున్నకొలదీ కాని, గురు వాతనికి ఉన్నతోన్నతాంశాలను బోధించడు.

952

బ్రహ్మాంగారంతటి గురువు, సిద్ధప్ప అంతటి శిష్యుడు లేరనే సామెత ఊరకే పుట్టలేదు. వారి అర్హతలు అలాం టివి. అలాంటి గురుశిష్యులు కఠోపనిషత్తులో వర్ణించబడిన యముడు, నచికేతుడు మాత్రమే.

953

గురుశిష్య సంబంధంతో పోల్చదగ్గది ఒక్క భార్యా, భర్తల సంబంధం మాత్రమే. అందుకే అన్నారు. "దంపత్యోః గురు శిష్యయోః" దంపతుల మధ్యగాను, గురు శిష్యుల మధ్యగాను పోరాదని.

954

తన అర్హతను బట్టి గురువు శిష్యునికి తత్త్వమార్గాన్ని బోధిస్తాడే కాని, తొందరపడి అలవికానివి చెప్పి ఉద్దు కుడుచుకొనేట్లు చేయడు.

955

శిష్యుడు సైతం తన స్థాయికి మించిన బోధకాని,

అభ్యాసం కాని (సాధన కాని) కావాలని గురువును తొందర పెట్టరాదు.

956

ఋగ్వేదం లోని నాసదీయ సూక్తం వర్ణించిన సదసద తీత స్థితి తురీయాతీతం వంటిది. 1) తరువాతిదైన సచ్చిదా నంద స్థితి సమాధి వంటిది 2) మూడవదైన తమస్సు తోచిన దశ సుషుప్తి వంటిది. 3) నాల్గవదైన మనస్సు కలిగిన దశ స్వప్నము వంటిది. 4) కామము, రేతస్సులు కలిగిన జగత్పరి ణామ రూప దశ జాగ్రత్తు వంటిది. 5) దీనితో సృష్టికర్మ పూర్తి అయినది. ఈ దశల మీదుగా మరల తురీయాతీతము నకు చేయు ఆరోహణమే (ఎక్కుట) నాసదీయ సూక్తస్థితికి చేరుకొనుట.

957

అర్ధ నారీశ్వరుడంటే సగం ఆడదిగాను, సగం మగ వాడి గాను ఉండటం కాదు. అయితే శిల్పంలోను, చిత్రాల లోను అంతకంటే భావాత్మకంగా చూపడానికి వీలులేదు. అసలు రహస్యమేమంటే, సగం పాలు, సగం నీరులాగ కలిసి పోయి ఉండడమే అర్ధ నారీశ్వరత్వం. వారి సంబంధం నీళ్లు పాలవలెను, వాగర్థముల వలెను ఉంటుంది. ఇది దైహికస్థితిని దాటిన మానసిక దశ. ఇది ఆత్మీయమైనప్పుడు మాత్రమే కుదురుతుంది. సృష్టిలో ప్రకృతి, పురుషులు ఇద్దరు ఇలాగే కలిసి ఉంటారు.

958

“అహం బ్రహ్మాస్మి” అనగా ఆజ్ఞా చక్రస్థ ప్రత్య

గాత్మను, సహస్రారము నందలి పరమాత్మను ఐక్యం చేసి ఒకటిగా అనుభూతి పొందడమే. ఇది బింబ, ప్రతిబింబముల ఐక్యము వంటిది.

959

శివునికి త్రిశూలమనే ఆయుధం ఉన్నదని చెప్పటం లోని రహస్యం అది భక్తుల యొక్క ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక దుఃఖాలను పోగొట్టుతుందని చెప్పటానికే.

960

ఆకాశం, గాలి, అగ్ని, నీరు, నేల అనే పంచ భూతా లను సరిగా ఉపయోగించుకో నేర్చితే ఆ పంచభూతాల పరి ణామంగా పుట్టిన శరీరం ఆరోగ్యవంతమై ఉంటుంది. దీన్ని మించిన ఆరోగ్య సూత్రం లేదు.

961

ఎవ్వరినీ బాధించకపోవటమే కాదు. ఎవ్వరికీ హాని కలగాలని సంకల్పించటం కూడా చేయరాదు. పైపెచ్చు నీవు ఉపకారం చేయడమే, నిజమైన జ్ఞానివైనందుకు నిదర్శనం.

962

ధ్యాన సమయంలో వెలుపలి విషయాలను మరచి పోయి నీలో కలిగే సంకల్ప, వికల్పాలాలను కూడా దాటి; నిన్ను నీవే చూచుకొనే దశ రావాలి.

963

నీవుకాని వాటినే కాక, నిన్ను కూడా నీవు మరచి

పోవటమే ధ్యానానికి తదపటి మెట్టు. నిర్వికల్ప సమాధి అన్నా అదే.

964

ఇలాంటి ధ్యానావస్థ సమాధి దశ అయినా పనులు చేసేటప్పుడు కూడా సాధింప కలిగినవాడు నిత్యానంద యోగి.

965

మహిమలను సంపాదించటం తేలికైన పనేమీ కాదు. అందుకు పతంజలి యోగము చెప్పిన సంయమాన్ని చిర కాలం అభ్యాసం చేయాలి.

966

మహిమల వల్ల నీకు లోకం వశమయ్యే మాట నిజమే కాని, వాటివల్ల నీవు పతితుడవు కావటానికి కూడ వీలు లేక పోలేదు. వాటిని సాధించి, గెలుపొందిన వారిలో బ్రహ్మంగారి వంటి వారు చెప్పదగినవారు.

967

మాయాశక్తి నిన్ను అనేక మార్గాల ద్వారా ఆకర్షించి తనవాణ్ణి చేసుకో చూస్తుంది. అంటే పరమాత్మకు నిన్ను దూరం చేస్తుందన్నమాట. అట్టివాటిలో మహిమలు కూడా ఒక మార్గం.

968

మాయ అనేది పరమాత్మ శక్తియే అయినా, అది తన కుటుంబాన్నే వృద్ధి చేసుకోవాలని చూస్తుంది. కాని పరమాత్మ కుటుంబంలో కలియాలని అనుకోదు.

969

ఇద్దరు వ్యక్తులు ఒకడిని ఆకర్షించాలని యత్నిస్తే బలం కలవాడికే ఆ వ్యక్తి వశంకాక తప్పదు. కనుక నీవు మాయను దుర్బలపరచ గలిగితే పరమాత్మ వైపు వెళ్ళ తావు. పరమాత్మను బలహీనపరిస్తే మాయకు లోబడతావు.

970

నిజం ఆలోచిస్తే పరమాత్మను వదలితే మాయకు స్వరూపమే ఉండదు. తెరను వదలితే బొమ్మలకు ఉనికే లేనట్లు. ఈవిధంగా బొమ్మలు తెరను కనబడకుండా చేసినట్లు, మాయ పరమాత్మను అగపడకుండా చేస్తున్నది.

971

నీకు బొమ్మలు కనబడినంతసేపూ తెర కనబడదు. తెర కనబడితే బొమ్మలూ అగపడవు. ఇందుకు సినిమా తెర దృష్టాంతము. ఇది నిజమే అయినా బొమ్మలకు ఆధారం తెరయే అని తెలుసుకొని; తెరను, బొమ్మలనూ ఒకేసారి ఒకటిగా దర్శించ గలిగినవాడే ప్రజ్ఞాశాలి, వేదాంతి.

972

అజ్ఞాని ఏ ఇబ్బందీ లేకుండా లోక వ్యవహారాలను నిర్వహించుకొంటాడు. కాని జ్ఞానికి లోక వ్యవహార నిర్వ హణలో ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుంది. ఇది అనుభవైక వేద్యం.

973

ఎంత గొప్ప జ్ఞాని అయినా కీర్తి కోసం ప్రాకులాడ

కూడా ఉండలేదు. నలుగురూ తన చుట్టూ చేరి పొగడాలని చూస్తూనే ఉంటారు. కనుక 'కీర్తి త్యాగం' అనేదే గొప్ప త్యాగం. అలాంటి కీర్తిని కూడా త్యాగం చేస్తేనేకాని జగద్విముక్తి కలుగదు.

974

నీకు విన్నదానిమీద, వినవలసినదానిమీద వైరాగ్యం కలిగితే అంతకంటె కావలసినదేమీ లేదు. పరమసిద్ధి కలిగినట్లే.

975

ఏది ఏది నిన్ను ఆకర్షిస్తుందో అదల్లా నీవద్ద లేనట్లే కదా! అంటె దాని విషయంలో నీవు దరిద్రుడవన్న మాట. ఏ దారిద్ర్యాలు లేని సర్వసంపదలు కలవాడవు నీవు కావటమే నీ పరిపూర్ణతకు నిదర్శనం.

976

పూర్ణసిద్ధిని పొందిన యోగిని ఏవీ ఆకర్షించలేవు. అతను అన్నీ లేకపోయినా కలవాడే.

977

కలిమిలేములు మనో వ్యాపారములే కాని, వేఱు కాదు. నీ మనస్సే నీకు కలిమిలేములను కల్పిస్తుంది. అందుకే అన్నారు. "మనసిచ పరితుష్టే కోర్థవాన్ కోదరిద్రః" మనస్సు సంతృప్తి చెందితే ఎవ్వడూ దరిద్రుడు కాని, ధనవంతుడు కాని లేడు.

978

ఆత్మరతి, ఆత్మ తృప్తి, ఆత్మ సంతుష్టి అనేవి సాటి లేని భాగ్యాలు. అవి కలవాడికి దేనితోనూ ప్రసక్తి ఉండదు.

979

బుద్ధిని పరిశుద్ధం చేసుకోవడం, ధీరత్వాన్ని అవలంబించి కామ, క్రోధాదులను అవలకు నెట్టివేసి, ఇంద్రియాలకు లోబడకుండా నడచుకొనడమనేది సర్వ సాధకులకూ అవశ్యాచరణీయమైన యోగమనుకోండి.

980

వెలుపలి సాధనాలతో చేసే పనికంటే, నీ లోపలివైన మనో, బుద్ధ్యాది సాధనలతో చేసే పనే చాల కష్టమైనది. అది నిన్నూ, నీ వెలుపలి జగత్తునూ నీకు సాక్షాత్కరింప చేస్తుంది. అందుకే ఆ పని చాలా కష్టమవుతుంది.

981

వెలుపలి జగత్తును సంస్కరించటానికి ముందు, నీ లోపలి జగత్తును సంస్కరించుకొని లోకంలో మెలగటానికి పూనుకోవాలి.

982

అతీత, వ్యస్త, సమస్త శక్తులు నీలో ఉన్నాయి. నిగూఢంగా వాటిని ఆవిష్కరించగల యోగాన్నే నీవు ఆచరించడం లేదు. ఆత్మనిగ్రహంతో ఆ పని చేస్తే నీవు సాక్షాత్తూ ఈశ్వరుడవే అవుతావు.

983

శాస్త్రాలు సవికల్ప, నిర్వికల్పాది సమాధులకు కొన్ని

లక్షణాలు చెప్పినవి. కాని ఆ లక్షణాలు నీకు సమాధి స్థితిలో కలిగి తీరాలనే నియమమేమీ లేదు. ఆ యా సాధకుల సంస్కారాలను బట్టి వారి వారికి అయా సమాధులు కుదురుతూ ఉంటాయి. ఆ లక్షణాలు లేనందున అవి తప్పేమో అని ఎవరూ భావించనక్కర లేదు.

984

ఆత్మశక్తి ఆవిష్కరణ అనేది నీకు దైవత్వాన్ని చేకూర్చి లోక వశీకరణను కలిగిస్తుంది.

985

వేదాంతికీ, భక్తునికీ, గుణాతీతునికీ, స్థితప్రజ్ఞునికీ కూడా భగవద్గీతాదులు కొన్ని లక్షణాలు చెప్పినవి. అవి అన్నీ కలవాడే సిద్ధ పురుషుడు అనుకోరాదు. వాటిలో కొన్ని లక్షణాలు లేకపోనూ వచ్చు. గ్రంథాలు చెప్పని విశేష లక్షణాలు కొన్ని ఉండనూవచ్చు. అవి ఆ యా సిద్ధ పురుషుల పూర్వజన్మ సంస్కారాలను బట్టీ, వారి దేశ, కాల పాత్రలను బట్టీ మారుతూ ఉంటాయి.

986

శాస్త్రమనేది ఏనాడూ సమగ్రం కాదు. అది అనుభవాన్ని బట్టి, లక్ష్యాలను (ఉదాహరణ విషయాలు) బట్టీ, పెరుగుతూ ఉంటుంది. క్రొత్త క్రొత్త లక్ష్యాలు (సిద్ధ పురుషులు కాని, లోక విషయాలు కాని) వెలికివప్పుడు శాస్త్రం కూడా పెరుగుతూ క్రొత్తను ప్రకటించేదిగా ఉంటుంది.

ప్రాతదే మాకు ప్రమాణం, క్రొత్త పనికిరాదనుకొనే వారికి మనం చెప్పగలిగిందేమీ లేదనుకోండి.

987

మానవుడు వైజ్ఞానికంగా ఒక స్థాయిని చేరేటప్పటికి అతని పరిశోధనాదుల వలన శాస్త్ర నిర్మాణ శక్తి, లక్ష్య సిద్ధి, లక్ష్య శుద్ధి మొదలైనవి కూడా అతనితో పాటు పెరుగుతూనే ఉంటాయి.

988

వేదం జగత్కారణ తత్త్వాన్ని సదసదతీతం అని చెప్పగా, బుద్ధుడు అంతేకాదు అది "చతుష్కోటి వినిర్ముక్తం" అన్నాడు. అంటే సత్తు కాని, అసత్తు కాని కాకపోవటమే కాదు. ఆ ఉభయము కాని, అనుభయము కాని కానిదే తత్త్వమన్నాడు. దాన్ని ఆధారం చేసుకొని గౌడపాదుడు అద్వైతాన్ని వెలయించాడు. ఇటీవల అరవిందుడు భగవద్గీత నాధారం చేసుకొని శంకరుని కాదని త్రి పురుష సిద్ధాంతాన్ని వెలయించినాడు. అందుకనే మిత్రసాహస్రిలో ఇలా అనవలసి వచ్చింది.

"వేద ఋషులు మొదటి విజ్ఞానవేత్తలు
అవల బుద్ధదేవు డగును చెప్ప
మలువదగినవారు మాండూక్యకారుండు
శంకరారవిందు లింక మిత్ర".

అయితే వారితోనే శాస్త్ర ప్రగతి, ఆలోచనా ఆగిపోలేదు. ఇంకా కొనసాగుతుంది.

989

అసలు ఈ పై వాదాలన్నీ మేధావుల (సూక్ష్మ బుద్ధుల) ఊహా విలాసాలే కాని, వేరు కాదు. తత్త్వమనేది ఆచరణ ద్వారా పరిశీలించితేనే కాని బోధపడదు. అందుకే మిత్రసాహస్రిలో-

"బుద్ధి విలసనములె పో! వాదఘోరణు
లున్న తత్త్వమున్న దున్నయట్లు
గోచరించు యోగ మాచరించెదవేని
విశ్వహిత చరిత్ర వినర మిత్ర".

కనుక అనుభవ జ్ఞానాన్ని (practical knowledge) మించిన దేదీ లేదు.

990

యోగమంటే నీలోని తత్త్వాలను ఆధారం చేసికొని వాటి మూలాలను, పరిణామాలను పరిశోధించి, దర్శించి నిగ్గు తేల్చుకొని ఆనందించటమన్న మాట. అలాంటి వానిని ఆధ్యాత్మిక యోగి అనవచ్చు. అతనిది అధ్యాత్మ యోగమన్న మాట. ఈ సంగతిని ఉపనిషత్తు "అధ్యాత్మ యోగాధిగమేన దేవం మత్వాధీరో హర్ష శోకౌ జహాతి" అన్నది.

991

నే చెప్పేదేమిటంటే, ఇంతవరకూ వేదోపనిషదాదుల మీద వచ్చిన భాష్య వ్యాఖ్యానాలు మాత్రమే ప్రమాణాలు అనుకోవద్దని.

992

ఆలోచనాపరులు, యోగులు, తమ తపశ్శక్తితో ఇంకా ఎన్నో రహస్యాలను ఆవిష్కరించే వీలున్నదని. అలాంటివారిని ఆధునికులని చిన్నచూపు చూడవద్దని.

993

"తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" తపస్సు చేసి వేదార్థాన్ని తెలిసికొమ్మని ఉపనిషత్తు ఊరకే అనలేదు. వేదార్థం కోసం, వేదాంతార్థం కోసం మీరు యోగాభ్యాసపూర్వక తపస్సు చేయమనేదే నా అనుభూతిలో తేలిన సత్యం.

994

తపస్సు వల్ల, యోగం వల్ల మీకు పూర్వోత్తర జన్మ విషయాలే కాదు జగజ్జాతకమే తెలుస్తుంది. జగత్కారణం, జగత్పరిణామం, మీ స్థితి, ఇతరుల స్థితి, అన్నీ బోధపడతాయి.

995

నీకు తెలిసిన భూత, భవిష్యత్తులను లోకానికి చాటే యత్నం చేయవద్దు. ఒకానొకప్పుడా పని నిన్ను అపహాస్యం పాలు చేయవచ్చు.

నీవు చౌకబారు పేరు ప్రతిష్ఠలకు, కీర్తి గౌరవాలకు ఆసించినావా అంటే నీకు తత్త్వమనేది మూలమట్టుగా గోచరించదు. గట్టి దీక్షతో సత్య సాక్షాత్కారానికి కృషి చేస్తేనే కాని నీకు తత్త్వ దర్శనం కాదు. అప్పుడే నీవు నిజమైన ద్రష్టవు కాగలిగేది.

997

బ్రహ్మవేత్త సామాన్యులతో కలసి ఆ యా పనులు చేయవలసి వచ్చినప్పుడు తన స్థాయి తగ్గినట్లు చింతించ కూడదు సాక్షాత్తు పరబ్రహ్మమే మాంసపిండమైన శరీరములో చిక్కుపడి, దానితో తాదాత్మ్యం చెందగా, (అదే తానని భ్రాంతిపాలు కాగా) దాని నుండి తప్పించుకొన్న నీకు సామాన్య విశేషాలనే చింత ఎందుకు !

998

ద్వైత భక్తిలో సాధకుడు తన మనో, వాక్కాయలను భగవంతుని కర్పించి పనిచేస్తూ మోక్షం కోసం యత్నిస్తాడు. అద్వైత భక్తిలో త్రికరణాలను బ్రహ్మమయంగానే భావించి వాటితో సేవచేస్తూ సంసిద్ధిని పొందుతాడు.

999

ఒక జ్ఞాని ఏమన్నాడో విన్నారా! భగవంతుని విషయంలో నాకు "దాసోహం" అనే భావముండేది. ఆ "దా" కారాన్ని కాస్తా గోపీ వస్త్రాపహారుడైన ఆ భగవంతుడు హరించేశాడు. కాగా ఇక "సోహం" మాత్రమే మిగిలింది. దాసోహం అంటే ద్వైతం స్ఫురిస్తుంది. "సోహం" అంటే అద్వైతం ప్రకాశిస్తుంది.

1000

భగవంతుని గూర్చి మూడు విధాలైన భావాలున్నాయి. ఒకటి "తస్యైవాహం" అంటే నేను ఆ భగవంతునికి చెందినవాడనే అని భావం. ఈ దశలో భగవం

తుడు భక్తునికి అగపడకుండా ఎక్కడో దూరాన (పరోక్షంగా) ఉంటాడు. ఇక రెండవ దశలో "తవైవాహం" నేను నీవాడనే అని భావం. ఈ దశలో భగవంతుడు ఎదుటకు వచ్చి ప్రత్యక్షమైనాడన్న మాట. ఇక మూడవ స్థితి "త్వమేవాహం" నీవే నేనని దీని భావం. ఇది పరమాద్వైత స్థితికి నిదర్శనం. ప్రతి సాధకుడు ఇలా ఎదుగడానికి ప్రయత్నించాలి.

1001

అద్వైతికి ఆత్మభిన్నమైన దేవుడంటూ ఉండడు. గురువే సర్వదేవతా స్వరూపుడై కడకు ఆ గురువునకు తనకు సైతం సమరసత్వమే చేకూరుతుంది. అంటే సర్వం గురు స్వరూపమే అవుతుందన్నమాట. ఈ రహస్యాన్నే "గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః, గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః" అనే శ్లోకం చాటుచున్నది.

1002

పూర్ణజ్ఞానికి నానా మతాలకు చెందిన జనుల వడవడులు, విశ్వాసాలూ, సిద్ధాంతాలు విపరీతాలుగాను, స్వార్థపరాలుగాను కనబడుతాయి. అయినా అతడు వారిని అది తప్పనికాని, సత్యం కాదని కాని అనడు. అతడొకవేళ అన్నా వినేవారూ ఉండరు. అసలాతడు ఉదాసీనుడు. వేటినీ పట్టించుకోడు.

1003

జ్ఞాని వినేవారికి మాత్రమే బోధ చేస్తాడు. మార్గం చూపుతాడు. ఇతరుల జోలికిపోయి అవమానంపాలు కాడు.

1004

భగవంతుడంటే సమస్త ప్రపంచ ఐశ్వర్యం కల సర్వ పరిపూర్ణుడని మాత్రమే అర్థం కాదు. ఏమీలేని సర్వ శూన్యుడని కూడా అర్థమే. ఇవి రెండూ ఆయనకు రెండు పార్శ్వాలు (ప్రక్కలు).

1005

వేదాలలోని విశ్వకర్మ నారాయణునుగాను, త్వష్ట బ్రహ్మగాను రూపొంది పురాణాలలో దర్శనమిస్తారు. ఈ అంశం వేద పురాణ పరిశోధన వల్ల తెలుస్తుంది.

1006

ప్రకృతిని వదలి పరమాత్మ యందు రమించట మనేది రాజుపాలెం అమ్మ వంటివారికి తప్ప అందరికీ సాధ్యం కాదు. కనుక అనేకులు ప్రకృతి యందే పరమాత్మ భావన చేస్తూ నడచుకోవడం నేర్చుకోవాలి.

1007

నీవెంత జ్ఞాన సిద్ధిని పొందినా, అభ్యంతర సంబంధా లనేవి ఆ యా వ్యక్తులకు నీచేత ఉపకారాలను చేయిస్తూనే ఉంటాయి. అలాంటి సంబంధం లేనివారు నీ విషయంలో తటస్థంగా ఉండి, నీ సంగతిని పట్టించుకోకపోతే పోవచ్చు.

1008

జ్ఞాని తన అండను చేరినవారిని, ఉద్ధరించే విషయంలో ఎంత మాత్రం వెనుకబడడు. వారికోసం ఎంతటి శ్రమనైనా చేస్తాడు కూడా. ఆ స్థితిని పామరులు పక్షపాతమని భావిస్తారు కూడాను.

1009

జ్ఞానిని ఎవరు ఎలా ఉపయోగించుకొని లాభాలు పొందుతారో అతనికి తెలుసు. అయినా అతడందుకు ఏ మాత్రం చలించడు.

1010

మానవుడు ప్రాపంచిక వస్తువులను సంపాదించటానికి ఎంత మూల్యాన్ని అయినా (డబ్బునైనా) చెల్లిస్తాడు కాని, వేదాంతాన్ని సంపాదించటానికి డబ్బు ఖర్చు చేయటమంటే బాధ పడతాడు.

1011

భక్తులను చూడండి. ఒక కొబ్బరికాయను దేవుని ముఖాన వేసి, ఎంతో విలువైన ప్రాపంచిక వస్తువులను కోరుతూ ఉంటారు. వారి దృష్టిలో దేవుడొక పిచ్చివాడన్న మాట.

1012

గురువు విషయంలోను, శిష్యుల వరవడి చాలావరకు ఇలాగే ఉంటుంది. ఆయనకు అర్పించేది ఒక్క నమస్కారము మాత్రమే. కాని ఆయన నుండి పొందేది వెలకట్టలేని జ్ఞాన నిధి.

1013

నీవు వేదాంతివి అయిన పిమ్మట నీ దృష్టి మారుతుంది కాని, ప్రపంచమూ, అందులోని వస్తువులూ మారవు. ఇంత వరకు జగత్తుగా తోచినదంతా నీకు బ్రహ్మంగా గోచరిస్తుంది. కార్యమంతా కారణమే అనే భావం కలిగి అభేద దృష్టి పట్టుపడుతుంది. దానితో నీ నడవడిలోనూ మార్పు వస్తుంది.

1014

భగవంతుడు స్వయంగా వచ్చి నీ భక్తికి మెచ్చి నీకు కార్యసిద్ధిని కలిగించడు. ఆయన మానవ రూపంలోనే వచ్చి నీ వాంఛలను నెరవేరుస్తూ ఉంటాడు. ఆ రహస్యాన్ని నీవు గుర్తించాలి. అందుకే అన్నారు "దైవం మానుష రూపేణ" అని. అంటే దైవం మనుష్య రూపంలో వచ్చి సాయపడతాడని భావం. ఇక్కడ దైవం అంటే, పూర్వజన్మ కర్మ అని కూడా భావమే. ఈ సందర్భంలో మంచినే కాకుండా చెడును కూడా మనుష్య రూపంలోనే భగవంతుడు చేస్తాడని మరువరాదు.

1015

శిష్యుల విషయంలో కూడా భగవంతుడు గురు స్వరూపంగానే వచ్చి వారికి జ్ఞానాన్ని అనుగ్రహిస్తాడు. అందుకే అన్నారు "శివుడు గురు రూపమున వచ్చి చెప్పును" అని. అట్టి గురుని యందు భగవద్భావము చూపుటయే శిష్యుని కర్తవ్యం.

1016

పరమాత్మకు సాధనాలు లేకుండా లోకాలను సృష్టించే స్థితి ఒకటి. సాధనాలతో సాధ్యాలను పొందే స్థితి ఒకటీ ఈ రెండూ ఉంటాయి. మొదటిది అతీంద్రియ (ఇంద్రియాతీత) స్థితీ, రెండవది సాధీభూతం లేక సేంద్రియ స్థితి. సేంద్రియ స్థితి మర్త్యం కాగా, అతీంద్రియ స్థితి అమరము లేక అమృతము. దీన్నే "అమృత ఇహ భవతి" "అమృతత్వ స్యతునా శాస్తి వి త్తేన" అనే మంత్రాలు వాకొన్నవి.

1017

"స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః" "విశ్వకర్మా మనసా యద్విహాయా" అనే వేద వాక్యాలు భగవంతుడు సంకల్పం చేసుకొని జగత్తులను సృష్టించినాడంటున్నవి. వాటి ననుసరించిన ఉపనిషత్తు కూడా "సోఽకామయత, బహు స్యాం ప్రజాయేయేతి" అన్నది. ఇవి రెండూ సహజమైన సృష్టి విధానాన్ని లోక దృష్టితో బోధించినవే కాని భగవంతునికి సంకల్పం అవసరమేమీ కాదు.

1018

తపశ్శక్తి, యోగశక్తి అనేవి మనము సంపాదించు కొన్న ధనం వంటివి. నీవద్ద ఏబది రూపాయలున్నవనుకో. వాటికి సరిపడేటంత దూరపు టిక్కెట్టే రైల్వేవారు నీకిస్తారు. ఆ ఏబదికి మించిన దూరపు టిక్కెట్టు నీకు దొరకదు. అలాగే నీవు వ్యయం చేసిన (ఖర్చుపెట్టే) తపశ్శక్తికి తగిన ఫలితమే నీకు లభిస్తుంది కాని, గొప్ప ఫలితం రమ్మంటే

రాదు. నీవు గొప్ప తపోనిధివైనవాడు గొప్ప ఫలితమే లభించవచ్చు. తపశ్శక్తి, యోగశక్తుల వలె ఆత్మశక్తి మాత్రం తరుగదు, పెరగదు. అది అవ్యయ నిధి.

1019

జగత్తునూ, బ్రహ్మమునూ ఏకంగా చూడడమే అద్వైతమంటే. ఆ రెంటినీ రెండుగా చూడడమే ద్వైతం.

1020

ప్రకృతికి వేదాంతమనేది కూకటివేరైతే, పైనున్న కొమ్మలు, ఆకులు, రెమ్మలు, పూలు, పండ్లును.

1021

నీవు నీ శరీరమాత్ర పరిమాణుడవే అయినప్పటికీ దాన్ని మించి విశాల విశ్వమయుడవుగా ఎదగడమే వేదాంతి కావటమంటే.

1022

మానవుడు తాను చూసినదానిని నమ్మడమే కాదు చేయవలసిన పని; నమ్మినదానిని కూడా చూడగలగాలి.

1023

చేసినదానిని చెప్పటమే కాదు; చేయవలసినదాన్ని, చెప్పినదాన్ని కూడా చేయగలగాలి.

1024

కొందరు సాధకులు ప్రాపంచిక విషయాలను వదలి పెట్టటానికి ప్రయత్నం చేస్తారు. కాని వాటియొక్క స్థితి చేరు

కొన్నవారిని బాహ్య విషయాలే వదలిపెట్టి దూరంగా తొలగిపోతాయి. అది ఒక విచిత్రమైన దశ.

1025

దేహేంద్రియ, ప్రాణ, మనో, బుద్ధులే నేననే భావము తగ్గి కేవలాత్మనే నేననే భావం బలపడుతున్న కొలదీ సాధకుని నడవడిలో మార్పులు వస్తాయి. అట్టివాడు దేహేంద్రియ, ప్రాణ, మనో వ్యాపారాలకు అవసరమయినంతవరకే ప్రాధాన్యము ఇస్తాడు.

1026

శరీరంతో సత్కార్యాలు చేసి వాటిమీద అహంకారం లేకుండా ఉండవచ్చు. కాని ప్రారబ్ధాన్ని బట్టి అకార్యాలు జరిగినా వాటిమీద అహంకారం లేకపోవట మనేది పరిపక్వ స్థితికి దగ్గరైనప్పుడుగాని సంభవించదు.

1027

అకార్యాల మీద, సుకార్యాల మీద కూడ అహంకార రాహిత్యమనేది ఒక ఉన్నతోన్నత దశ. అది రెంటినీ సమానంగా చూచుకొనే సమస్థితి. అంటే ద్వంద్వాతీతమైన అద్వైత దశ అన్నమాట.

1028

నీ శరీరం పుట్టడానికి నీ తండ్రి శుక్రం కారణం. ఆ శుక్రం ఏర్పడటానికి అన్నం హేతువు. దానికేమో ధాన్యం, ధాన్యానికేమో భూమి, కారణాలు గనుక ఇక భూమిమీదే

తల్లి. నీ శరీరం నిలవటానికి ప్రాణం పోతువు కాబట్టి గాలియే నీకు తండ్రి (వంటివాడు). ఆ శరీరం పెంపొంద టానికి నీరే కారణం గనుక, (నీరే ప్రాణాధారం) జలం నీకు బంధువు. చివరకు నీ దేహాన్ని దహించే అగ్నియే నీకు మిత్రుడు. నీవు తిరగడానికి వీలు కలిగించిన ఆకాశమే నీకు సోదరుడు. ఈవిధంగా పంచ భూతముల బాంధవ్య సంబం ధాల చేత నీవు ఈపాటి జ్ఞానాన్ని సంపాదించగలిగావు కాబట్టి అంత్యకాలాన ఆ భూతాలకు కృతజ్ఞతా నమస్కా రాలు చెల్లించి వీడ్కోలు చెప్పి అఖండ బ్రహ్మములో లీనమైపో (భర్తృహరి భావం, వైరాగ్య శతకం 100).

1029

నీవు నీ భార్యా, పుత్ర, మిత్ర, బంధు జనానికి చేయ వలసిన సేవలు చేస్తున్నా, కర్తవ్యాలను నిర్వర్తించినా వాటితో సంగం లేనట్లు నిస్సంగత్వంతో ప్రవర్తించవచ్చు. అయితే ఇది ఒక అద్భుతమైన నడవడి. అంటించుకోకుండా అంటినట్లు నటించటమే ఇది. అంటినట్లు ఉండేటే కాని, అవతలివారికి తృప్తి కలుగదు. ఇలాంటి నిస్సంగత్వం వల్ల నీకు నిర్మోహత్వం కలుగుతుంది.

1030

వెన్నకు నీరు అంటనట్లు, మట్టి పురుగుకు మట్టి అంట నట్లు నడమకొనే పద్ధతి ఒకటి ఉన్నది. జ్ఞానులు ఆ పద్ధతినే అవలంబించి మెలగుతారు. ఇలా అయితే నిస్సంగుడు అని

పేరు ఎలా వస్తుంది అని అడుగకు. నీవు కాదలచినది నిస్సంగుడనే పేరు కాదు. నిజమైన నిస్సంగత్వమే.

1031

కర్తృత్వం లేకుండా కర్మలు చేసేవాడు జ్ఞాని. కర్తృత్వంతో చేసేవాడు అజ్ఞాని. మొదటివానికి మోక్షం ఫలమైతే, రెండవవాడికి బంధం ఫలం.

1032

ఇంద్రియాలు విషయాలను అనుభవిస్తుంటే తానే అనుభవిస్తున్నాననుకుంటాడు అజ్ఞాని. ఆ అనుభవించేవి ఇంద్రియాలే కాని తాను కాదనుకొంటాడు జ్ఞాని.

1033

ఆకాశంలాగా నిర్మలమైన ఆత్మకు కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మాలు ఏవీ లేవు. అవి ఉన్నవనుకొని చిక్కుల పాలు కావడమే బంధానికి లక్షణం.

1034

తాను ప్రకృతి సంగం లేని నిర్మలుడను అనుకొనే వాడికి సంసార మాలిన్యాలు అంటవు.

1035

దృక్కు అయిన తనను, దృశ్యాలయిన తక్కినవాటిని వేరువేరుగా చూడనేర్చినవాడే పరమ జ్ఞాని.

1036

దృశ్యాలు కూడా ద్రష్ట అయిన తన నుండే కలిగి

వాయుని అనుభూతి పొందన్పైక వానికి సర్వం బ్రహ్మ మయం గానే భాసిస్తుంది.

1037

మనస్సు కల్పించే మంచి చెడులను, విషయాలను తన మీద ఆరోపించుకొని జీవు మంచివాడను, చెడ్డవాడను, విషయాసక్తుడను అనుకొంటాడు జీవుడు. నిజానికి వాటన్నిటికి అతడు అతీతుడు.

1038

నీ మనస్సే నీకు "నీవు సంసారివనీ, ముక్తుడవని" బోధిస్తుంది. నిన్ను నీవు చూచుకోగలిగినప్పుడు నీకు బంధ ముక్తులనేవి లేనేలేవు.

1039

బాగా గాలి వీచేటప్పుడు విసనకర్రను చేబూననక్కర లేదు. అలాగే ఆత్మవేత్తలతో మైత్రి కలిగినప్పుడు నీకు ఏ బాహ్య సాధనల తోడు పని లేదు.

1040

సృష్టికర్త సాక్షాత్తు చిత్స్వరూపుడే అయినా అతనికి అచిత్తుగా కూడా తోచటమనేది స్వభావం. కనుక నీవు అచిత్తును చూచి భయపడనక్కర లేదు.

1041

ఏ వ్యక్తి పారమార్థికమైనా, వ్యావహారిక ధర్మాలను ఉల్లంఘించబోకు. వాటిని ఆచరించినా, ఆచరించు

పోయినా నీకు ఏ లోటూ వాటిల్లదు. అయినా ఆచరించడమే మంచిది.

1042

పాములోను, పండితుడిలోనూ పరమాత్మయే ఉంటాడు. అయినా వ్యవహార ధర్మంలో పాము పరిహరించ దగినది. పండితుడు పరిచరింప (సేవింప) దగినవాడు.

1043

పారమార్థిక వ్యావహారికాలు ద్వంద్వమయ ప్రపంచ ధర్మాలు. ఆ జగత్తులో ఉన్నంతవరకు వాటిని అనుసరించక తప్పదు.

1044

నీవు ద్వంద్వాతీతుడవయితే, జగద్వ్యవహారాన్ని పాటించకపోయినా పరవాలేదు. అప్పుడు నీవు అవ్యావహారికుడ వవుతావు. అదే త్రిగుణాతీత స్థితి. నిస్త్రైగుణ్య మార్గం.

1045

మనస్సును, మాటలను కట్టివేసి, ఆత్మ యందే రమింప నేర్చితే దానినే స్వభావసిద్ధ అచల పరిపూర్ణ దివ్య యోగ మంటారు.

1046

ఏ కర్మ బంధకమో, ఏ కర్మ ముక్తిప్రదమో జ్ఞానికి తెలుసు. కనుక అతడు బంధకములైన కర్మల జోలికి పోడు. తన ఆశ్రితులను పోనీడు.

1047

త్రిగుణాతీతులై ప్రవర్తించేవారి సంఖ్య ఎప్పుడూ మిక్కిలి తక్కువగానే ఉంటుంది.

1048

నిజమయిన ఆత్మ దర్శనమైతే ప్రాపంచిక వాంఛలు తలెత్తనేరవు. అరచేతిలో వెంట్రుకలు పుడతాయా!

1049

పాలు లేకపోతే వెన్న చిక్కదు. అలాగే ప్రకృతి లేకపోయినా పరబ్రహ్మం చిక్కదు. నీవు ప్రకృతిలో ఉండే పరబ్రహ్మ దర్శనం పొందాలి.

1050

ఆత్మవేత్త అద్దాల మేడలో నివసించే మనిషి వంటి వాడు. అద్దాల మేడలో ఉన్నవానికి అన్నివైపులా తానే కనబడతాడు. ఆత్మవేత్త అన్నింటిలోనూ తననే చూచుకొంటాడు.

1051

ప్రకృతి నిన్ను బంధించే మాట నిజమే. అయినా నీకు ముక్తినిచ్చేది కూడా ప్రకృతియే అని మరువబోకు. దానిని సరిగా ఉపయోగించుకొంటే మోక్షప్రదమే అవుతుంది.

1052

జీవుడు సుషుప్తిలోనికి పోయి కొంతసేపు ఆత్మ

సుఖాన్ని పొంది మరలా జాగ్రజ్జగత్తు లోనికి వచ్చినట్లే జగజ్జాలము కూడా జగత్కారణమయిన అతీత స్థితిలో లీనమై మరల జగద్రూపాన్ని తాల్చుతూ ఉంటుంది. ఈ రెంటిలో ఒకటి పిండాండ చక్రం కాగా, ఇంకొకటి బ్రహ్మాండ చక్రం. పిండాండమును ఆధారము చేసికొని బ్రహ్మాండ లక్షణాన్ని తెలిసికొని సత్యసాక్షాత్కారం పొందటమే జీవిత లక్ష్యం. కనుక ఈ స్థితి అర్థమయితే విశ్వస్థితి, విశ్వకర్మ తత్త్వము అర్థమయినట్లే.



# లభించే ఇతర గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. ఋగ్వేద దిగ్దర్శనము (2, 3 భాగములు) | .... | రు. 60 00 |
| 2. ఋగ్వేద రహస్యాలు | .... | .. 30 00 |
| 3. యజుర్వేద దర్శనము | .... | .. 30·00 |
| 4. అథర్వవేద దర్శనము | .... | .. 30·00 |
| 5. ఆత్మదర్శనము | ... | ,, 20-00 |
| 6. శిల్ప దర్శనము (దేవాలయ తత్త్వదర్శ) | .... | ,, 25-00 |
| 7. యోగ దర్శనము | .... | ,, 26 00 |
| 8. తత్త్వ సాధన | .... | ,, 25-00 |
| 9. తత్త్వసూక్తి సాహస్రి | .... | ,, 40-00 |
| 10. నాగరఖండము | .... | ,, 15-00 |
| 11. అమరావతి (పద్యకావ్యము) | .... | ,, 5-00 |
| 12. శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతము | .... | ,, 6-00 |
| 13. మాఘమాహాత్మ్యము | .... | ,, 15-00 |
| 14. అనర్ఘ రాఘవము | .... | ,, 15-00 |
| 15. మోహనాంగి | .... | ,, 10-00 |
| 16. శ్రీశ్రీ రాజావెం బాలయోగిని సంపూర్ణ చరిత్ర | .... | ,, 30-00 |

# పునర్ముద్రణము కావలసినవి

1) మూడు కావ్యాలు [రామాయణ, భారత, భాగవతముల పరీక్ష] 2) నిరంజన విజయము 3) సిద్ధప్ప చరిత్ర 4) మన గురుదేవుడు 5) ఆసియా జ్యోతులు [కవి జీవిత చరిత్రలు] 6) తోరణము [ఖండకావ్య సంపుటి] 7) తత్త్వసూక్తులు [1వ భాగము] 8) ప్రజ్ఞానంద తత్త్వ సూక్తులు 9) ఋగ్వేద దిగ్దర్శనము [ప్రథమ భాగము] 10) సాహిత్య వ్యాసములు 11) శిల్పకళా క్షేత్రాలు [2 భాగములు] 12) శ్రీ వీరరాఘవ వ్యాసావళి (2 భాగములు) 13) గాయత్రీ-పితృకర్మలు 14) కళారాధన [నవల] 15) దేవకి [నవల] 16) చిత్రసాహస్రి [1, 2 భాగములు] 17) విశ్వకర్మ పురాణము.

---

చిరునామా : కళాప్రపూర్ణ, దర్శనాచార్య
డా॥ కొండూరు వీరరాఘవాచార్య (ప్రజ్ఞానంద)
గాంధీనగర్, తెనాలి-522 201.



1984 మార్చి 4వ తేదీన

రాష్ట్ర గవర్నరు డా॥ శంకర్‌దయాళ్ శర్మగారు

ఋగ్వేద దిగ్దర్శనం ప్రథమ భాగాన్ని

రాజభవన్‌లో ఆవిష్కరించి గ్రంథకర్తకు అందిస్తున్న దృశ్యం